# కాశీమజిలీ కథలు

| | | |
|---|---|---|
| 1 వ భాగము | వర్రప్రసాదుల కథ | 20-00 |
| 2 వ భాగము | అదృష్టదీపుని కథ | 20-00 |
| 3 వ భాగము | మందారవల్లి కథ | 20-00 |
| 4 వ భాగము | విజయభాస్కరుని కథ | 20-00 |
| 5 వ భాగము | శంకరుని కథ<br>కాదంబరీ మహాశ్వేతల కథ | 20-00 |
| 6 వ భాగము | భోజుని కథ | 20-00 |
| 7 వ భాగము | విభీషణుని కథ | 20-00 |
| 8 వ భాగము | దత్తకాదుల కథ | 20-00 |
| 9 వ భాగము | విక్రమార్కుని కథ | 20-00 |
| 10 వ భాగము | నారదుని కథ | 20-00 |
| 11 వ భాగము | ప్రహ్లాదుని కథ | 20-00 |
| 12 వ భాగము | పుండరీకుని కథ | 20-00 |



శ్రీరస్తు
శ్రీ విశ్వేశ్వరాయనమః

# కాశీమజిలీకథలు

## సప్తమ భాగము


ఇది గోదావరీ తీరస్థితంబగు
రాజమహేంద్రవరంబున నివసించియున్న
బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవిచే
రచింపబడినది



పుట్టగుంట వీరయ్యా చౌదరి
అరండల్ పేట : : విజయవాడ - 2
చే ప్రచురింపబడినది


 1983 [వెల : రూ. 20-00



# కాశీమజిలీ కథలు
## సప్తమ బాగము
విభీషణుని కథ


రచన :

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవి



ముఖచిత్రం :

బాపు

ప్రచురణ :

జనవరి : 1983

ముద్రణ :

శ్రీ రాఘవేంద్రా ప్రింటింగ్ వర్క్సు,

విజయవాడ - 1.

ప్రతులకు :

డీలక్స్ పబ్లికేషన్స్

విజయవాడ-౨

వెల : రూ. 20-00

# ప్రముఖుల అభిప్రాయాలు

నా సహాధ్యాయి మధిర సుబ్బన్న దీక్షితకవి సర్వవిధముల ధన్యుఁడని వ్రాయుటకు మిగుల సంతసించుచున్నాను. అతఁడు నాతో మును మున్ను కొన్ని గ్రంథములు గౌతమీ మాహాత్మ్యము లోనగునవి. వ్రాసియుండియు నిపుడు కాలానుసారముగాఁ గథలు వ్రాయుటకుఁ బ్రారంభించినాఁడు. చిన్నతనములో నుబుసుపోకకుఁ జెప్పుకొను కథలను బుచ్చుకొని "కాశీమజిలీలు" అను పేరుతోఁ జమత్కరించి కథా సంవిధానముం జతపఱచి మొదటి భాగమచ్చొత్తించి ప్రకటించినాడు. అది ప్రజల మదులనాకర్షించినది. ద్వితీయ తృతీయాది భాగములు వ్రాయుటకు బ్రోత్సాహము గలిగించినది. ఇప్పటికి పన్నెండు భాగములైనవి. నేనీ కథలను పూర్ణముగఁ జదువ లేదు గాని యే భాగములోనో యొకటి రెండు కథలు మాత్రము చదివితిని. అది చదివినప్పుడు నాలో నాకే పరమాశ్చర్యము గలిగినది. నా సహాధ్యాయి విషయము నేను జెప్పుట కొంతవరకు దగదేమోకాని పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ కథకుం బోలె మనోహరత్వముం గలిగించినది. ఇట్లు నాబోట్లు వ్రాయుటకుం బూని కృతకృత్యులు గాలేరనియే నా నిశ్చయాభిప్రాయము. ఒక్కొక్క పురుషున కొక్కొక్క దానిలోఁ బ్రావీణ్యము గలుగుననుట నిశ్చయము. వాని కథ లుపకథలతోఁగూడి యొక పెద్దగొలుసువలె మనోహరములై యుండును. ఆ కథలలో ననేక నీతులు, ధర్మములు, ఆచారములు, శృంగారాదిరసములు, అధ్యాత్మావబోధక ప్రదర్శనములెన్నో యుండును. ఇవి సర్వజనాదర పాత్రములగుటయే నా చెప్పిన మాటలు సత్యములనుటకుఁ దార్కాణమగుచున్నవి. గద్యశైలియు సుబోధమై పండితపామర హృద్యంబగుచున్నయది. ఈ కథలు బృహత్కథాదులవలె జగద్విఖ్యాతి గాంచుగాకయని కోరుచున్నాను.

ఇట్లు,

**శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి**

కొలఁది దినములనాఁడు దయాపూర్వకముగ నొసంగిన కాశీమజిలీలు అను పేరుగల భవద్విరచిత గ్రంథము నాకొసఁగుచు వీనిని జదివి యభిప్రాయమును దెలుపవలసినదియని సెలవిచ్చియున్నారు. తదేకదృష్టితో దద్గ్రంథము నందలి కొన్ని కథలను జదివితిని. అవి కేవలము కథలవంటివేకాక వ్యాకరణాదిశాస్త్ర సాంప్రదాయము నందేమి యలంకారాదుల యందేమి మన ప్రాచీనకావ్యముల కించుకయుఁ దీసిపోక పాఠకులకు మంచి సాహిత్యజ్ఞాన మలవఱచుటకుఁగడుంగడుఁ దగియున్నట్లు గ్రహింపఁగల్గితిని.

ఇట్లు,

**శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి**

బ్రహ్మశ్రీ పండిత మధిర సుబ్బన్న దీక్షిత కవిగారిచే రచియింపబడిన కాశీమజిలీ కథలు చదివి యానందించితిని. మృదుమధుర శైలిగలిగి నీతిబోధకములగు పద్యములతో నొప్పుచు బండితపామరజన మనోహరమై తగు నీ కథల విషయమై యభిప్రాయమీయ మె మసర్థులమయ్యు దత్కథాపఠన సంజాత హర్షాతిశయమే యిట్లు వ్రాయుటకుఁ బ్రోత్సాహపరచినది.

ఈ కథలు ప్రారంభించిన తరువాత నెంత పనిలోనున్నను చివరవరకు చదివినంగాని విడువకపోవుటయే యిందలి రసాధిక్యము ప్రఖ్యాతమగు చున్నది. ఇందులకు లోకమే ప్రమాణము. వీని కథలని సామాన్యముగాఁ దలంపరాదు. శంకరాచార్యాది మహాపురుషుల చరిత్రములిందు వర్ణింపబడుటచే నిదియొక పురాణగాథా కోశమని చెప్పుట సమంజసము. ఈ కథ లాంధ్రయోషకు నూత్నభూషా విశేషములై యొప్పుచున్నవని రూఢిగా చెప్పుచున్నాను. ఇట్లు,

**కావ్యనిధి శ్రీ చెలికాని లచ్చారావు**

"కథావినోదమేయని మహర్షులు దాని జతుష్షష్టి విద్యలలో బరిగణించి యనుశాసించి అభివృద్ధి పరచిరి. ఇట్టి కథావినోదము వినోదమాత్ర ఫలజనకముగాఁ ధర్మాదిసాధనోపాయ మహత్తరంబగుట సర్వజనవేద్యమే.

కాశీమజిలీకథా నిబంధనము సర్వజన చిత్తాకర్షకంబనుటకును సందియము లేదు. దీనిలో రసాభావ పుష్టియు గధాసంధాన కౌశల మట్లుండ జతుర్విధ పురుషార్థ తంబులగు మహాకవి వాఙ్మయములోని నవరత్నములు సాధారణ కథా కథనధోరణిలో వెదజల్లబడి యుండుటచే నివి పండితులకును, గావ్యకర్తలకును గూడ బ్రతిభోన్వేషణ క్షమంబులని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇందు పారమార్థికులకు దప్ప సామాన్యులకు రుచింపని శంకరాచార్య చరిత్రము లతిరవంతములుగా బరమార్థబోధకంబులుగ కథాధోరణిగా గూర్పబడినవి."

విశ్రాంతి చింతావినోదులకు జన్మజీవన తరుణోపాయంబగు తీయనియౌషధంబువలె నుండు నీ గ్రంథరాజమెంత పెద్దదిగానున్నను విసుగులేక యుత్తరోత్తర సంపుటముల కెల్లరును వేచియుందురని నిశ్శంసయముగా జెప్పవచ్చును.

ఇట్లు,

**మానవల్లి రామకృష్ణకవి** *M.A.*

"శ్రీమత్పండిత మధిర సుబ్బన్న దీక్షితులు గారిచే రచింపఁబడిన "కాశీ మజిలీకథ" లను పేర నొప్పు కథాసమూహ మింత కాంధ్రదేశమంతయుఁ జక్కఁగా నెఱింగినదే కావున నేను ప్రశంసింపవలసిన యావశ్యకత లేదు. ఆ గ్రంథముల కిడిన కేవలనామము సహితము మనకుఁ బవిత్రమైన భావమును హృదయమున నుత్పాదింపఁ జేయుటయేకాక పూర్వకాలమున రాకపోకలకు మనకువలె సౌలభ్యములు లేకుండియుఁ గ్లేశపడియైన మన పెద్దలు కాలినడకతో పుణ్యపట్టణమైన కాశిని దర్శించి బాగలంత భక్తిశ్రద్ధలు వహించి యుండిరను నాశ్చర్యము గలిగించుచున్నవి. జనసమూహముల నాహ్లాదింపఁజేయుటకుఁ గథాకథనము మన హిందూదేశములో నతిప్రాచీన విద్యయే. దానికి రెండువిధముల ప్రయోజనము గలదు. ఈ కథలు ధర్మపరాక్రమముల తత్త్వ ప్రభావముల నుపదేశించుటయేకాక అప్పటి దీర్ఘకాల మార్గాయాసమును యాత్రికసంక్లేశమును దొలఁగించుచుండును. మతవిషయమునను ఆధ్యాత్మిక విషయమునను విశ్వాసములేక శంకాకళంకితమగు నేటికాలమున స్వభాషలో సుందశైలి వ్రాయఁబడిన యీ కథలు హిందూదేశమున నాదియగు వేదశాస్త్ర పురాణాది విద్యాప్రపంచమున నేదియేది శ్రేష్ఠమో శాశ్వత స్మరణీయమో దానినెల్లఁ దప్పక పునరుజ్జీవనము చేయుచున్నవి. ఇవి యవనసాహితీ వినోదకథలలోని చమత్కృతి ప్రభావము చూపుచున్నను కల్పితవస్తువులందును, భావముల యందును అశ్లీలధర్మసాంకర్యాది దోషములు లేక భాసిల్లుచున్నవి. కథాశిల్పము పేరును, సంవిధాన ధోరణియు సమస్తవిషయ సంగ్రాహకమగుటచే యద్దే కొనసాగుచుండిన యెడల నిది తప్పక హిందూపురాణ గాథాకోశమై సర్వవాఙ్మయమున కాదర్శమై యొప్పుననుట యసాధ్యముగాదు.

ఇట్లు,

బ్రహ్మశ్రీ శ్రీమాన్ **యమ్. కృష్ణమాచారి**

*M. A. M. L. P. H. D.*

# విషయసూచిక
## 100 వ మజిలీనుండి 141 వ మజిలీవరకు వచ్చు కథలు

శ్రీరస్తు

శుభమస్తు అవిఘ్నమస్తు

# కాశీమజిలీకథలు

## సప్తమభాగము

---

## నూఱవ మజిలీ

క. శ్రీకాశీనగరాధీశా!
కారుణ్యాంబుధీ! నిశాకరవర
రేఖాకల్ప భక్తకల్ప
శుభాకర! గౌరీశ! పాపహర! విశ్వేశా!

మహాత్మా! అవధరింపుమట్లు మణిసిద్ధ యతీంద్రుండు ప్రబుద్ధ స్వాంతుండగు వంశేవాసితో గూడ నూఱవ మజిలీ చేరి విహితక్రియా కలాపములం దీర్చికొని గ్రామ విశేషములం జూడనరిగిన శిష్యునిజాడ నరయుచున్నంత నగ్గోపకుమారుం ధూర్పుం దర నొకదెసనుండి పరుగిడి కొనివచ్చి యమ్మహాత్ము నడుగుదమ్ములం బడి గురువర్యా! అల్లనాఁడు పండితరాయలు లవంగితోఁగూడ గంగాతరంగిణి యందైక్యమై పూర్వ దేహము ధరించెనని చెప్పితిరి. వారి పూర్వవృత్తాంత మెట్టిదని నేనడుగ "ఇప్పుడు చెప్పుటకు వీలులేదు. ముందెందైనఁ గరచరణ విశిష్టుండగు నిందుధరుమూర్తి గల శివాలయము గనంబడిన చోట జ్ఞాపకము సేయుము. దానికట్టి కారణమున్న" దని యానతిచ్చిరి గదా! అట్టిశివాలయ మీపీఁటం బొడఁగంటిని. పంచముఖుండైన యాదేవు నారాధించి వచ్చితి. పండితరాయల పూర్వవృత్తాంత మిప్పుడు చెప్పక తప్పదని గట్టిగా నిర్బంధించుటయు నయ్యతిపతి మందహాసము గావింపుచు నాత్మీయదివ్య మణిప్రభావ విదితోదంతుండై యుత్సుకత్వముతో వత్సా! కృతజ్ఞతా గుణవిశేషంబునం గలుగు సుకృతంబును భీష్ముని పూర్వోత్తర జన్మ వృత్తాంతము నిందు దెల్లంబుగాఁ గలవు. అవహితుండవై యాకర్ణింపుము.

---

# జితవతికథ

ధరాతలంబున సుప్రసిద్ధమగు విశాలాపురంబున సుశీలుండను మహారాజు ప్రజలం బాలింపుచుండును. ఆ నృపతికి జితవతియను కూఁతురుగలదు. అయ్యువతీమతల్లి, సౌందర్య ఖనిగా, సుగుణరాశిగా, లావణ్యపుంజముగా, కళాకలాపముగా, భూలోక లలనా లలామముగా నుండనెంచి వివరించి యతిప్రయత్నమున సృష్టించెనని చేయి యెత్తి శపథముచేసి చెప్పవచ్చును. విద్యారూప గుణగణంబుల భూలోకకాంతల నెల్ల జయించినదగుట నయ్యువతికి జితవతియని పేరిడిరని తలంచెదను.

ఆ బాలామణి యొకనాఁడు రాత్రి పండు వెన్నెలలు గాయుచుండ నిజప్రాసాదోపరిభాగంబున మణికుట్టిమంబున జ్యోత్స్నావితానంబులు ప్రతిఫలించి వింతకాంతులీన ననూనగానకళా ప్రవీణలగు అలివేణులతోఁ గూడికొని వినోదముగా సంగీత ప్రసంగంబునఁ గాలము గడుపుచున్నంత రోహిణియను నేకాంత సఖురాలు జితవతిం జూచి యిట్లనియె.

భర్తృదారికా! ఇపు డర్ధరాత్రమైనది. ఈ శీతకరుని కిరణజాలంబు హృదయాహ్లాదము గావింపఁ గానామృతము శ్రవణంబులఁ గ్రోలుచున్న మనకు కాలపరిణామ మించుకయుం దెలిసినది కాదు. ఇఁక విపంచిం గట్టి నిదురింపం బోదమే అనుటయు జితవతి జవ్వనీ! భగవంతుండగు రోహిణీవల్లభుని చల్లని కిరణంబుల వెదచి వెన్నెట కల్లం బొల్లకున్నదికదా? అహా! అమృత కిరణుండన కతనికే చెల్లుంటో. ఈ యోషధీశుని ఘృణిగణంబులు సోకినంగాని పంటలు పండవట సకల లోకాహ్లాదకరుం డగు నీ హిమకరుని మహిమాతిశయం బించుక స్తుతి యించిపోవుటమంచిదని యాజ్ఞాపించినది. అందఱునిందు బింబాముఖులై

స్రగ్విణీ వృత్తము

రోహిణీనాథ! కారుణ్యవార్ధీ!సుధా
వాహినీశాత్మజా భర్గచూడామణీ!
రాహువైరీ! నిశారమ్య సౌమ్యాకృతీ!
పాహిమాం పాహిమాం పాహిజైవాతృకా॥

భక్తిపరవశమై కన్నులు మూసికొని స్తుతియించుచున్న జితవతి దోసిటఁ బటుకాంతి స్ఫుటమణి ప్రభా భగద్ధగితమై యొక మండనం బంతరిక్షంబునందుండి తటాలున జారిపడినది. అప్పుడమ్మదవతి అదరిపడి మృదుకరపుటం బమ్మణిభూషాపతన తాడనంబున కోపమి నేలబడ వదలినది. అయ్యాదరుపాటుంజూచి యందున్న బోఁటు

ల్లెల్ల నేమియేమని బిదరు గదుర నడుగుటయుఁ దన్మణిఘాత వేదన నించుక సూచించుచు అమ్మించుబోఁడి సఖులారా! అదిగో చూడుఁ డాకసంబునుండి నా చేఁత నేడియో పడినది. అని యంతికమున వింతకాంతుల మెఱయుచున్న యమ్మణిభూషం జూపినది.

రోహిణి దానింగైకొని విమర్శించి యమ్మన చెల్లా! ఇది దివ్య మణిమండనము. తారావల్లభుండు స్తుతిగీతంబుల కలరి యీ యోషా మణికిఁ బారితోషికముగా దీనిం దిగవిడచెనని తలంచెదను ఆహా! ఈ దివ్యరత్నంబు లెంత వింతగానున్నవి! అని పొగడుచుండ నందున్న సుభరాంగులెల్ల నేది యేది యని మూఁగి దాని లాగికొనఁ బొడంగిరి.

రాజపుత్రికయుఁ గరపుటవేదనం బించుక యడంగిన పిమ్మట నిటుతెమ్మని యత్తొడవందుకొని వెరగుపాటుతోఁ జూచుచు అయ్యారే! ఇది శిరంబున ధరింపఁదగిన నగయగును దీనిం జైవాతృకుండు మనకుఁ బ్రసాదించెనని తలంచుచుంటిరా? భక్త పరతంత్రుండగుటఁ దట్లు చేసినంజేయవచ్చును. మఱియు దేవతా మిథునములు విమానము లెక్కి యంతరిక్షమున సంచరించుచుందురు. ఏవేలు జవరాలి శిరోభూషణమిందు జారి పడినదో తెలియరాదు. ఎట్లయినను దీనిం దేవసమానముగా నెంచి పూజింపవలయును. అని పల్కుచు అక్కలికి యంతరిక్షమువంక వీక్షణంబులఁ బ్రసరింపఁజేసినది

అప్పుడాకసమునుండి బలమైన మెఱపుతీగ క్రిందకు వచ్చుచున్నట్లు గనంబడుటయు అక్కుటిలాలక సఖులతో "అటు చూడుఁడు మనకు వింతలపై వింతలు గనంబడుచున్నవి. ఆ తేజోరాశి యెద్దియో వివరింపుఁడు. అదిమనదెస వచ్చుచున్నట్లున్నది. అనుటయు నక్కాంత లక్కజపాటుతోఁ జూచుచు దేవకాంత దేవకాంత. ఒరుల కంతరిక్ష సంచారము కలుగనేరదు. భగవతీ రక్షింపుము. రక్షింపుమని కేకలువేయుచుండ నారాజపుత్రిక సఖులతో చేతులెత్తి మ్రొక్కుచుఁ బొడంగినది. అంతలో అంతరిక్షము నుండి యొక కాంతారత్నము వారి మేడమీఁదకి దిగి కలయంజూచుచు నవ్వుచుఁ బ్రగల్భవతు లతిసంభ్రమముతో

సీ. చెలియోత్తమణి ధర్మసింహాసన మొసంగె
నర్ఘ మర్పించెఁ బొయ్యాలియొకర్తు
పాద్యమిచ్చె సరోజ పత్రనేత్ర యొకర్తు
వింజామరంబూని విసరె నొకతె

గంధమాల్యాద్యలంకారంబు లర్పించి
పూజించె వెసనొక్క. పూవుఁబోణి
పాదంబులొత్తె సద్భక్తి నొక్కవధూటి
తాంబూలమిచ్చెఁ బైదలి యొకర్తు
గీ. జితవతీసతి గనుసన్న జేసినంత
చెలులు సకలోపచారముల్ జేసిరట్టు
లమర కాంతకు నంతరంగమునఁ బెంగి
వారిభక్తికి నామె దీవనలొసంగ.

సింహాసనాసీనయైయున్న యన్ని లింపాగనయెదుర నంజలి పు టంబు శిరంబునంజేర్చి వినయంబు దీపింప జితవతియల్లన నిట్లనియె.

శా. దేవీ! నీవు సమస్తలోకముల రక్షిన్ బ్రోచు శర్వాణివో?
శ్రీవో? పద్మజురాణివో, సురపతిస్త్రీవో? మరుత్కాంతవో
దేవరాతి వధూటివో? పసుపురంధ్రీమౌళివో? కావలెన్
భావింపన్నవదీయరూప విభవప్రాగల్భ్యముల్ దివ్యము
ల్గానే? మామక పూర్వపుణ్య పరిపాక ప్రాప్తిచేఁగాక మా
కీ రీతిఁ బ్రసన్న వౌదువె? కృపాదృష్టిన్ బ్రసాదింపుచున్
బ్రోవంగాఁదగుదమ్మ మమ్మిఁకను బ్రాపుంజేర్చి సద్భక్తితోఁ
గావింతుం గొనవమ్మ నీకిదె నమస్కారంబు లోకేశ్వరీ.

అని అనేకవిధంబులం బొగడుటయు నవ్వేలుపుఁజవరాలు తదుపాసన కెంతేని సంతసించి యమ్మించుఁబోణి కర్తాసనంబిడి యక్కనం జేర్చుకొని గార వించుచు వసారగౌరవంబేసారఁదరుణిమణీ! నీప్రియోక్తులం గడుపిన్నవయ్యుఁ బ్రోచవలె నాకపూర్వసత్కారములు గావించితివి. నీయుపచార పరిగ్రహంబు నాకెందము నీయందు వెంకొల్పఁ జేయుచున్నది. నీపేరేమి? యెవ్వనిరూఁతురవు? భర్తయెవ్వఁడు? ఇది యేపురము అని అడిగిన జితవతి రుతుమతియై యిట్లనియె.

భగవతీ! నాపేరు జితవతియండ్రు. ఇది భోజనగరము. ఉశీనరుండను మహా రాజీ పురము పాలించుచుండెను. నే నాతేని పుత్రికను నాకింకను వివాహముకాలేదు. వీండ్రందఱు నా సఖురాండ్రు. వీండ్రు పరిచారికలు, వీరు చుట్టములు. మేమీరేయి వెన్నెలసేవింపుచు నమృతకరు నారాధింపుచుండ నీ మండనము నాటోసిటంబడినది. దీని దేవతా ప్రసాదముగా స్వీకరించి మఱియుచుంద నింతలో నీవు సాక్షాత్కరించి

తివి. ఇదియే మావృత్తాంతము. దేవీ! యకారణ బంధురాలవై మాకుదర్శన మొసంగిన నీయుదంతమువిన మేము జాతుర్థింమేని శ్రోత్రానందము గావింపుమని వేడికొనుచున్నదాన నని పలికిన విని అక్కలికి లేనగవు మొగమున మొలకలెత్త నత్తన్వి కి ట్లనియె.

## యోగసక్తకథ

సఖీ! వినుము. దేవలోకములో వసువులని యొకజాతి వేల్పులు గలరు. వారెనమండ్రన్నదమ్ములు దేవసభాసామాజికులై విమానము లెక్కి స్వేచ్ఛావిహారంబులు సేయుచుందురు. మహేంద్రుఁడు గురువాక్యసమానముగా వారిమంత్రంబుల మన్నించుచుండును. నేనువారిలో గడపటి వసువు ప్రభాసుని భార్యను. నాపేరు యోగసక్తయండ్రు. వినుము ఇక్ష్వాకుకులసంభూతుఁడగు మహాభిషుండను నృపతి క్షితినపరిమితసహస్రాశ్వమేధములు గావించి స్వర్గలోకమున కరుదెంచి సకల దేవతా మునిపూజ్యుండై యొప్పుచుండెను.

అమ్మహాభిషుం డొకనాఁడు ఇంద్రాది బృందారక సందోహముతోఁగూడ బ్రహ్మసభకుఁబోయి కూర్చుండెను. సిద్ధవిద్యాధర గంధర్వ కింపురుషాది దేవతా విశేషులును నారదాదిమహర్షులు దిక్పతులు నిండియున్న యక్కొలువుకూటంబునకు గంగామహాదేవి దివ్యాంగనారూపముదాల్చి విచ్చేసినది. ఆమెవచ్చుచుండ గాలిచేఁ గట్టినపుట్ట మించుక తొలఁగినదఁట అందున్న సమాజికులెల్లఁ బాపభీతిచేఁ దలలు వంచికొనిరి. మహాభిషుండు తలవాల్పక కదళీకాండ గర్భంబునుంబోలి యారంభోరు నూరుభాగంబు సాభిలాషతో నీక్షించుటయు నాదుష్టచేష్టంగాంచి కాంచనగర్భుం డలుగుచు రాజా! నీవు కడుపుణ్యాత్ముండవై యుత్తమలోకంబులం బడసియు మాయెదుటనే దుష్కృత్యంబులం గావించితివి. నీవిందుండఁదగవు. మనుష్యలోకంబున జనింపుమని శాపమిచ్చెను. అందులకు వగచుచున్న యన్నపపురంధరుని చిత్తశాంతికై త్రివిష్టపంబునవెల్లి యమరవల్లభుం డొకసభ జేయుచున్నవాడఁట. వసువు లయ్యోలగంబున కాహూతులై యరుగుచు నీదివసంబున విభావసు వసువిసరములచే నాకసమంతయు దప్తమగుటయు నవ్వేడిమికోడి గగన గమనంబు మాని తమ విమానముల మానవలోక నికటభాగములకు డింపి శీతల శీకర తరంగ మాలికాడోలికల నూగునట్లు జలధిమీదుగా నడపింపఁదొడంగిరి. అప్పుడు కాలకళామందు బ్రహ్మాండహసంతికలో రవిబింబమును పైడికమ్మింగాంచి కదలియను నీతాపైలో ముంచెనోయన రవి యపరసాగరజలంబున మునింగెను. తత్తాపంబునకు జలంబు లుడికి త్రుళ్ళుచున్నవియో యన మకరాకరమున భీకరములగు శీకరములు వీచికా

వికరములతో నెగురుచుండెను. అంతలోఁ జంద్రోదయమైనది. కౌముదీసమయంబు వెండిపూసినట్లు చదల నాక్రమించినది. అప్పుడు తరగలం బొదమిన తుంపరల నెగరఁజిమ్ముచుఁ బిల్లవాయువులు మాటిమాటికి హాయిగా వీచినవి. పీటికల రాచికొని యోడలవలె జలధి మీఁదుగా నరుగుచున్న విమానముపైఁ గూర్చుండి చల్లగాలి సేవింపుచు మేమయ్యంబునిధి విశేషంబులు విలోకింపుచుంటిమి. మఱియును

సీ. క్రిందిభాగము మహోర్మికలు పొంగుచునుండ
నలరి నంబు క్రీడ లాడియాడి
త్రుళ్ళి చిం(త్రాంబుజంతువులు యానముపై
బడిన జేతులునాచిపట్టిపట్టి
మించువీచుల గ్రుమ్మరించిన వృధుశుక్తి
రాసిలో ముత్తెముల్ దీసితీసి
పవడంబుకీవ గన్పడినయప్పుడ యాఁగి
గ్రుచ్చి యందములుగాఁ గోసి కోసి

గీ. మ్రోలఁజారిన లుంతసంఘముల గనుచు
జలవిహంగమరుత విశేషములు వినుచు
నతులితానంద మనుభవించితిమి మేము
కదలిమీఁదుగ నేగునప్పుడు లతాంగి.

అనేకవినోదములఁజూచుచు మేమాసముద్రము మీఁదుగాఁబోవు చుండఁ గొంతసేపటికి దక్షిణంబున సమున్నతసౌధాగ్ర సముల్లిఖితగోపురంబగు నీ పురంబు గన్నుల పండువు గావించినది. ఇన్నగర ప్రాసాదవిశేషంబు లింద్రదయమునరుణ కుబేరపట్టణ సౌధప్రభల మించియున్నట్లు తోచుచున్నవి. దశ్యవస్తు సమానవేగముగం ... గగనమునుండు రివ్వున నెగరఁజేసి తదుపరిభాగంబునం నిలచి.

మ. అదేశృంగాటకమందు నాల్గుయుగలన్ హర్మ్యోత్తమంబుల్ ప్రభా
స్పదముల్ రాజిలు రాజమార్గమదె భాస్వత్స్ఫటరాజియుతం
బదె సాలంబదె రాజమందిరము కల్యాణోత్సవోపేత మ
య్యదియే తోరణమౌర! వీథివీథి పెంపొందఁగౌముదీవ్యాప్తి చెన్.

అని అనేకప్రకారంబుల నిప్పుటభేదన విశేషంబులం గొనియాడు చుండి రట్టిశరీనాథల్లభుండు మదనుని భాగంబు గరతలంబునం గొట్టుచు బోఁడి! అటు

చూడుము! చూడుము. అప్పటిసింగారంబు హృదయంగమంబును సుమీ అనిపలికిన విని నేను తమకంబేపారఁ గడిచేతఁ బ్రియుని కంఠంబు బిగియఁ గౌఁగలించుకొని యించుక తలవంచి యుండలి విశేషములరయుచుంటిని, అప్పుడు దైవికముగా మదీయ శిరోరత్నము కదలి పట్టువదలి క్రిందజారి పడినది. తద్వియోగమునకు వగచుచు నధోభాగ మీక్షించుచున్న నన్నుఁజూచి కొమ్మా! పోనిమ్ము. ఈ మండనమంత లెస్సయాయేమి! వగచెద వేమిటికని నాపతి యడిగిన నిట్లంటిని.

మనోహరా! ఈ శిరోమణి వివాహావసరమున నా జనకుండు నాకిచ్చె ఈ మంగళమండనంబు నాఁటఁగోలె విడువక సంతతంబు ధరింతు నిది పోవుట యశుభసూచిక మని వెరచుచుంటి నెట్లయిన వెదకి తేవలెనని బ్రతిమాలితిని. అప్పుడు విమానమందు నిలువంబెట్టి నా పతి యతి జవంబునఁ గ్రిందికి బోయివచ్చి తెచ్చెకంటి! నీ శిరోరత్న మొకమేడపై గుమిగూడియున్న చేడియల నడుమఁ బడినది. దానింగూర్చి యాబోఁటులు మాటలాడు కొనుచుండిరి. ఆడువాండ్రనడుమ కెట్లు పోవుదునని శంకగదుర మరలివచ్చితి. నీవుపోయి వారి నడిగి యాతొడవుం దెచ్చుకొనుము. అంతదనుక నేనింద యుండెద నని యుపదేశించిన సంతసించుచు నేనిత్తఱి వియద్గమన పాటవంబున విమానంబు దిగి మీదండ కరుదెంచితి నదియే నావృత్తాంతము నీభక్తి విశ్వాసములు నాకు మిగుల సంతసం గూర్చుచున్నవి. నీకెద్దియేని గామితంబున్న నెఱింగింపుము. ఓపుదునేని తీర్చి యరిగెదనని ప్రీతిపూర్వకముగాఁ బలికిన విని యాజితవతి యిట్లనియెను.

దేవీ! వసువులు త్రిలోక పూజ్యులని మేము పురాణముల వినియుంటిమి. అట్టి వసుపత్నియైన నీదర్శనము పురాకృత సుకృత విశేషంబున మాకు లభించినది. మేమెల్లం గృతార్థులమైతిమి. నీవు నన్ను సఖియని పిలుచుటచేతనే నేను మనుష్యాంగనలలో నధికురాలనని గర్వపడుచుంటిని. నన్ను నీదాసురాలిగా నెంచుకొని నీ వెంటఁ దీసికొనిపొమ్ము నీ పాదసేవఁ జేయుచుండెదను. జరామరణ రోగభూయిష్ఠంబగు నీమనుష్యలోకంబున నుండుటకన్నఁ గష్టమున్నదియా? వేల్పులకట్టి యిక్కట్టు లేమియును లేవుగదా? నాకు దేవత్వము గలుగ ననుగ్రహింపుము. ఇదియే నాయభీష్టమని వేడిన నచ్చేడియంజూచి యోగసక్త యిట్లనియె.

జితవతీ! జరామరణ రోగములను నెట్లుండును? వాని వలనంగలిగెడి బాధ యెట్టిది? మా లోకములో వానిపేరులు మాత్రము విని యుంటిమి. ప్రచారమెట్టిదో తెలియదు. వివరింతువే అని అడుగుటయు రాజపుత్రిక నవ్వుచు నోహో! మీ యదృష్ట మేమని కొనియాడఁదగి యున్నది. చింతయనునది యెఱుంగక సంతతము సంతసము జెంది తిరుగుచుందురు. ఇదిగో మదిమి తెలుపఁగరయుము.

సీ. పలపలగా బట్టతలపైనఁ బండిన
కుంతలంబులఁ జేర్చి కొప్పువెట్టి
రదములెల్ల నురాలఁ బెదవులతో టొక్కి-
నోరప్పళింపుచు సారెసారె
చర్మావశిష్ట కుచద్వయం బురమున
చర్మ భస్త్రికలట్లు జారి వ్రేలఁ
గరచరణాద్యంగకములెల్ల జీర్ణించి
కాష్ఠముల్ పగిది వికారమొంద

గీ. పండివాడిన పణిలతాపర్ణమట్లు
దేహలత యొంది ముడుతలుదేరి యుండఁ
దలఁ దల్పుచుఁ జేత వేత్రంబుబూని
యందుఁగూర్చున్న యొక్క జీర్ణాంగిఁజూపె.

దేవీ ! ఈమె నాకు తల్లి తల్లి. యౌవనదశ యందట్టి సుందరి యందును లేదను వాడుకఁ బడసినది. ఇప్పుడెట్లున్నదో చూడుము. ఇదియే జరావికారమని చూపినఁ గాంచి యోగసక్త విస్మయ సాధ్వస వివశహృదయయై యేమీ! ఈమె మనుష్య కాంతయే ? కొంతకాలము సుందరి యని పేరు వొందినదా! నెచ్చెలీ ! నీవుగూడ ముందిట్లగుదువా యేమి ? అక్కటా ! ముదిమి కడుచెడ్డదియే ! అనియూరక వింతగా నా వృద్ధకాంతం జూడ దొడంగినది.

అప్పుడు జీవవతి తల్లీ ! ఇఁకఁ దెవుళ్ళ తెఱఁగరసిన నీగుండె పగిలిపోవును. మృత్యుదేవత బ్రహ్మయొద్దకువచ్చి జీవజాలంబులనే సమయింపఁజాలనని దుఃఖించిన దఁట. అపుడు పరమేష్ఠి యామె కన్నీళ్లు దోసిటం బట్టి విరజిమ్ముటయు నాయశ్రుకణంబులు నలుమూలలుఁగోట్లకొలఁది వ్యాపించినవి. అవియే మహావ్యాధులగుననియు నవినీకు దూతికాకృత్యముఁ గావింపఁ గలవనియుఁజెప్పి స్రష్టయద్దేవినూరడించి యంపెనఁట.ఆబిందుకణము లసంఖ్యాకములైన రోగములై మనుష్యులం బాధించుచున్నవి. అని రోగిప్రవృత్తులం దెలుపు కొన్ని శ్లోకములం జదివినది.

యోగసక్త యా వృత్తాంతమువిని ఛీ ఛీ ! నీ విట్టి యసహ్యపు లోకమున నేమిటికిజనించితివి ? మహాఋషులందు పుడమిజన్మించుటకు దుఃఖించిన నేమియో యనుకొంటి. నిరయమన నరలోకమని చెప్పవచ్చును. నీవునన్నిట్లు వరంబడుగుట యుక్తమే. కానీ యింద్రుని అనుమతి లేక నాకంబునకు నిన్నుఁ దీసికొనిపోయితినేని నపరాధిని నగుదును. నీవిందుండంగనే నిన్నీ యిక్కట్టు లేవియుం జెందకుండునట్లు ప్రయత్నిం

చెద. నూరడిల్లుము ఇది మొదలు నీవు నాకుఁ బ్రాణసఖురాల వైతివి. దూరమందున్నను దాపున నున్నట్లే నీక్షేమ మరయుచుండెదను. నాయాజ్ఞలేక నీవు వరుని వరింపవద్దు. అని యుపన్యసించినవిని సంతసించుచు జితవతి యిట్లనియె.

దేవీ ! నీవచనంబులన్నియు వరంబులుగాఁ దలంచుచుంటి. ఇఁక నాకేకొదవయునులేదు. నీవు మఱలవచ్చి యనుజ్ఞిచ్చు దనుకఁ బెండ్లి యాడను. నీవాలసించివేని జరారోగములచే నేనునుం బీడింపఁబడుదుం జూమీయని సాభిప్రాయముగాఁ బలికిన విని యయ్యోగసక్త నవ్వుచుఁ దత్సమయోచితముగా ముచ్చటించి దీవించి తన మందనంబు గైకొని తదనుజ్ఞంబడసి యంతరిక్షగమనంబునఁ బతియొద్ద కరిగినది.

అని యెఱింగించి మణిసిద్ధుం డవ్వలివృత్తాంతంబు తదనంతరావసథంబున నిట్లని చెప్పందొడగెను.

# 101 వ మజిలీ

## వసువులకథ

౧ ధరుఁడు—తమ్ములారా ! నిన్నటి సభలో మహాభిషుని సంతోషమునకై మహేంద్రుం డెన్ని యుత్సవములఁ గావించినను నతని మనసు వికసించినట్లు కానిపించలేదు. విచారగ్రస్తమై యున్నది సుండీ !

౨ ధ్రువుఁడు—స్వకృత సుకృత విశేషంబున నత్యంత దుర్లభంబైన యమరలోక నివాససౌఖ్య మనుభవించుచు స్వల్పాపరాధమూలంబున ననల్ప దుఃఖభూయిష్ఠంబగు మనుష్యలోకంబున జనింపబోవు చున్నవాఁడు. అమ్మహారాజునకు దుఃఖముగాక సంతోషమెట్లు గల్గెడిని.

౩ సోముఁడు—దేవమహర్షి సేవితంబగు బ్రహ్మ సభలో నాఁడుదాని వలువ తొలంగిన సాభిలాషుఁడై చూచె నిది స్వల్పాపరాధ మెట్లగును ?

౪ అహ్నుఁడు—స్వల్పాపరాధము కాదు. జలజోదరుఁడు దయా హృదయుండగుట నామాత్రపు శాపముతో విడిచిపెట్టెను.

౫ అనలుఁడు—అంబుజ గర్భుండు గంగాదేవి కేమైన శాపమిచ్చెనా ?

౬ అనిలుఁడు—అందామె తప్పేమి యున్నది ?

౭ ప్రత్యూషుఁడు—తప్పున్నదని యెంచియే విరించి యామెం గూడ మనుష్యజన్మ మెత్తుమని శపించెను.

౮ ప్రభాసుఁడు—అక్కటా ! మనుష్య లోకమం దాధి వ్యాధులు బాధింప నెట్టివారికిని సుఖలేశమైన లేదని యచ్చటి చరిత్ర మంతయు యోగసక్తవలన వింటిని. పాపము, పరమేష్ఠివారికి కఠిన శిక్షయే విధించెను.

ప్రత్యూ—మహాభిషుండు పుడమి నెవ్వఁడై పుట్టునో ? పెండియు నాతంబుతు వచ్చునా ?

ధరుఁడు—అతఁడు ప్రతీపుఁడను మహారాజునకు నందనుండై శంతనుండను పేరుతో బుడమిఁ బెద్దకాలము పాలించి పెండియు స్వర్గమునకు రాఁగలఁడని నారదుని వలనఁ దెలిసినది.

అహ్నుఁడు—పోనిండు. వారికడియు నొక వినోదముగా నుండును. కొంత కాలములోకాంతర విశేషములం దెలిసికొని రాఁగలరు.

అనిలుఁడు—ఆహా! మన విమానము లెంతలో నెంతదూరము వచ్చినవో చూచితిరా? మనయెదురఁ గన్నులను మిరుమిట్లు గొల్పుచున్న పర్వతంబు మేరువుసుఁడీ?

సీ. పవలు రేల్గాఁగనే యవిరాజు నవిరాజు
లలయక పలఁగొందు రనుదినంబు
గరిమ దీపించునే గిరికోటి శతకోటి
గిరికోటి గముల( జెక్కి-నవిభుండు
సాధింపనే మహాబలముతోఁ జలముతోఁ
గలహించి వింధ్యాద్రి ఘనతఁబాసె
హరియించెఁ ద్రిపురకర్బురగోత్రమే గోత్ర
మునఁ జాపముగఁజేసి మును శివుండు

గీ. దేవతాద్వంద్వసంచార దీప్తభూరి
కందర భ్రాజితంబేనగ ప్రధాన
మట్టి మేరుగిరీంద్ర మీయడితనర్చు
సకలవిష్టపధూర్వహ స్తంభమగుచు.

ధ్రువుఁడు—మన మనోరథముల ననుసరింపఁదగు నీ రథము మేరు పార్శ్వమున కరుదెంచినదేమి?

ధరుఁడు—నేనట్లు తలంచితిని. మేరుపాద భూభాగము లతి మనోహరములని విందుము, చూడంబోవలదే?

సోముఁడు—ఇది యేలోకము?

ధరుఁడు—భూలోకమనియే చెప్పవలయును.

ప్రభాసుఁడు—ఆహా! సౌరభేయి భూలోక విహారము సేయుచున్నదాయేమి. ఆ తోట మధ్యంబున అటుచూడుఁడు.

ఉ. ముద్దులుమూటగట్టు పెనుమూపు సమానములైన శృంగముల్
దిద్దినయట్టులొప్పెఁ బ్రభదేరెడు కన్గవ చారువాలమున్
బెద్ద నిగారపుంబొదుగు పేరురము న్నెఱపైన పాదముల్
తద్దయుఁ గ్రాలఁగా నిది శతక్రతుధేనువుగాఁ గనంబడున్.

అనలుఁడు—అన్నన మొకానొక మహర్షి యాశ్రమం బని తోచుచున్నది. అందు సంచరించు నామొదవు హోమధేనువుగావచ్చును. చూడుఁడు.

శా. గోవుల్ గంతములెత్తి హాయిఁగొన నాకున్ గంగడోలు ల్బులున్
గ్రీవాభంగముగాఁగ సింగములు లంఘించు న్గకల్వెంటరా
ట్రోపల్లూపుచు నాడు భాగములతోఁ దోడేలు సారంగముల్
ట్రోవుల్గా నదె యాటలాడుశరభంబుల్ మ్రోలసీక్షింపఁగా.

ప్రత్యూ—అవును. తపోధన ప్రభావంబునం గాని జాతివైరంబుల విడచి మృగంబు లిట్లు మైత్రిమై సంచరించునా? ఇది యేమహర్షి యాశ్రమమో?

ప్రభా—ఏదియైన మనకేమి. స్వాదుమూలఫలోదకం బగు నివ్వనమందుఁ గొంతసేపు విహరించి పోవుదము రండు.

ధ్రువు—మేరుగిరి పరిసరమునుండి ప్రవహించు సెల యేరుల కాలువలు కనక సైకత మిశ్రితములై తరుమూలములనుండి ప్రవహింప నెంతేని దర్శనీయంబై యొప్పుచున్న నీయుపవన విశేషంబులు తప్పక జూడఁదగినవే.

ధరుఁడు—తమ్ములారా! యిది మహర్షి యాశ్రమంబని తెలిసికొనియు నిందు విహరింపఁ బ్రయత్నించు చున్నారేమి? తాపసుల కోపమునకుఁ బ్రతిహతము గలదా?

ప్రభా—సర్వభోగత్యాగం బొనరించిన యోగులిట్టి వినోద స్థానముల వసించుట దాంభికముగాక వైరాగ్య ప్రవృత్తియే? మన విహారములు వారికిఁ బ్రసాదకారణములు గాక యహంకార హేతువులగునా?

ప్రత్యూ—అనిమిషకృపాకాంక్షులైన పారికాంక్షులు మనల నాశ్రయింతురు గాని యాగ్రహింపరు. ఇందు విహరింతము రండు.

ధరుఁడు—పుష్పాపచయాది క్రీడలు గావింపక యూరక యాతోట చూచి రావలయు నట్లైనఁ బదుఁడు.

అని యొండొరు లాలోచించుకొని యవ్వసువులు విమానము లాకసమున నిలిపి భార్యలతోఁ గూడ నయ్యాశ్రమమునఁ బ్రవేశించిరి.

సీ. వంచి కొమ్మలకు నెక్కించి కొమ్మలమంచి
మంచిపండులను గోయించి మేపి

తీవలందిగలాగి పూవుఁగుత్తుల మూఁగి
మ్రోగు తేఁటులు రేఁగఁ బూలురాల్చి
బోదెలఁ ద్రొచ్చి యంబువులుజారఁ బారి
కేరుచు శంబర క్రీడలాడి
పొదలమాటున డాగి పొంతు ల్బెదరంగ
వింతజంతువుల రొద ల్వెలయఁజేసి
గీ. వసువు లసమానకేళి విలసితులగుచు
సతు లతులితప్రహర్ష రసప్రవాహ
మున మునుంగఁగఁ గ్రీడించి రసయమందు
వలసి వలదని ధరుఁడు వేఁడుఁగు వేకలుకఁబలుక.

వసువు లిట్లు క్రీడాపరతంత్రులై య తపోవనంబుద్యానవనంబుగా నెంచుకొని సరసులఁ గలచియు విరిగొమ్మలవిఱచియు తీగెల లాగియుఁ బండ్లు రాల్చియుఁ బలు తెఱంగు లగు క్రీడావినోదంబులఁ బెద్దతడ వందు విహరించి యలుఁగఁటోవు సమయంబున నాప్రాంతమందు

సీ. వాలవిక్షేపోద్భవ ప్రభంజన వేగ
మున క్రాంతపాదపంబులు జలింప
పృథుఖురకోటిప్ర విన్యాసమున ధరా
ధరవహుం డహిరాజు శిరము వంప
వప్రకేళ్యగ్ర శృంగప్రదారితములై
గురు శిలాప్రకరముల్ ధరణి బెదర
వత్సమున్ జీరు సంభారవంబున మేరు
ధర గుహావళిఁ బ్రతిధ్వనులు వొడమ
గీ. నేల్ప్రవేలాడు పెనుగంగడోలు గలిగి
దుగ్ధపూరితపావనోధ్ధరమున
తిరుగుచుండెను నందినీధేనువందు
వసువులకు నేత్రపర్వమై యొసఁగెనపుడు.

ఔరా! దీనిం గామధేనువని భ్రమపడితిమి? కాదుకాదు దీని యాకృతింజూడ భయప్రహర్షంబులు గలుగుచున్నవి. ఇది యెవ్వరిదియో యని వితర్కింపుచున్న తమ్ములం జూచి నవ్వుచు ధరుండిట్లనియె.

ఉ. మానిత రూపలక్షణ సముచిత మీమొదవెన్న నందినీ
ధేనువు దీనిదుగ్ధముల దృష్టవశంబునఁ గ్రోలిరేని బ్ర

జ్ఞానిధులై జరామరణజవ్యథలాధులు క్షుత్పిపాసలున్
బూనక దేవభావమునుబొంది సుఖింతురనేకవత్సరముల్.

తమ్ములారా! ఇది యరుంధతీ మనోహరుండైన వసిష్ఠమునీంద్రుని హోమధేనువు కశ్యపుని వలన సురభియను భార్య యందు జనించినది. దీనిపాలం గ్రోలినవారు క్షుత్పిపాసలు జరావ్యాధులు లేక యనేక వత్సరంబులు జీవింతురు. దీనికతంబున నీయాశ్రమంబు వసిష్ఠ మహర్షి దని దెలిసికొంటిమి. అమ్మహాత్ముం దలిగిన మూడులోకములు దృటిలో భస్మీభూతములై పోఁగలవు. మనమింత నిందు మసలరాదు. పోవుదము రండని పలికిన విని వారెల్ల ప్రయాణోన్ముఖులైరి.

అట్టితరి యోగసక్త యప్పలుకులాలించి ప్రభాసుని పాదంబులకెరగి యిట్లనియె ప్రాణేశ్వరా! నా ప్రాణసఖి జితవతి యుదంతంబింతకు ముందు మీకెఱిగించితినిగదా!

అన్నరనాథకన్యకకు మానవదుర్లభమగు దేవభావము గలుగఁజేయుదు నని వరంబిచ్చి వచ్చినమాట మీరును నెఱుఁగుదురు. అయ్యువతీమణి కామితంబీడేర సౌరభట రక్షితంబగు నమృతంబెట్లో మీచే సంగ్రహింపఁజేసి యవ్వాల్గందికియ సంకల్పించుకొని యుంటి. దుర్ఘటకార్యంబు సులభక్రియా సాధ్యంబగుచుండ నుపేక్షింపరాదు గదా! ఈగోదుగ్ధము లమృతతుల్యంబులని తెలియఁబడినది. ఇప్పుడీ మొదవును మన సదనమునకుఁ దీసుకొనిరావలయును. పాలను దానికి జితవతి కంపెదను. ఇదియే మదీయవాంఛితము ఇక్కార్యంబుదీర్పక తీరదని మిక్కిలి వినయముతో ధరుఁడు వినమనోహరునిఁ బ్రార్థించినది.

అప్పుడు ప్రభాసుండు అన్నా! ఈయోగసక్తపలుకులు వింటివి గదా. ఇమ్మత్తకాశిని యెన్నఁడును రిత్తమాట లాడునదికాదు. పరమార్థమెఱింగిన ప్రౌఢ పరోపకారతంత్ర. దీనికోరికఁ దీరుపక తప్పదు కావున నీగోవుం బట్టుఁడు తీసికొనిపోవుదమనుఁడు ధరుం డిట్లనియె.

తమ్ముఁడా! బ్రహ్మర్షివరేణ్యుండైన వసిష్ఠుని హోమధేనువని యెఱింగియు దీనిం బట్టుమనుచుంటివేమి? బ్రాహ్మణవిత్తంబులు హరింపఁ బాతకంబుగాదా? అది యట్లుండ నయ్యతివరి ప్రభావంబు త్రిలోక విదితము, ఇంతదనుకఁ జేసినపనియే తప్పు వనభగంబునకేమి మూడునో యని వెఱచుచుంటిని పైపెచ్చు చివ్వమాటఁ గట్టుకొనినట్లి ధేనువుం దీసికొనిపోతిమేని ప్రమాదము రాకమానదు. అమ్ముని వరుచే యాగ్రహంబునకుఁ బాత్రులమైతిమేని రక్షించువా రెవ్వరు? వలదు వలదు పోవుదము రమ్ము అని మందలించిన విని ప్రభాసుండిట్లనియె.

చాలుచాలు పిరికిమాటలు విడువుము వేల్పులఁ బ్రసన్నులఁ జేసికొనుటకే కాదా!

ఋషులు తపంబులం గావింతురు. మనరాక వారికి ప్రమోదకారణంబుగాక కోపహేతు వెట్లగును? మన మీ గోవుం గ్రహించిన వసిష్ఠుండు తన్నుం గృతార్థుంగాం దలంచు కొనును. లెండు. లెండు. పట్టుఁడు అతండలిగిన నేమద్దు పడెదరు లెండు. ఈయోగ సత్తపలుకులు హేతుశూన్యములుగావు. తానిచ్చినవరము నిలుపుకొనుటకై కోరినదిగాని యాత్మార్థముగాదు. పిన్నతమ్మునిమాటఁ బాటించి యిక్కార్యంబు సాధింపవలయునని మిక్కిలి దైన్యముతో బ్రతిమాలుకొనియెను.

వానియందుఁగల మక్కువచే ధరుండేమియుఁ బలుక కూరకుండెను. అట్టితరి వసువులెల్లరు నలుమూలలు గాచికొని యుండఁ బ్రభాసుండు నందినీధేనువును సమీపించి గంగడోలు దువ్వుచు మచ్చికఁ గలుగఁజేసి శృంగంబులం గుచ్చుబిగించియు నగ్గోవరంబు కదలక యాత్మీయబంధుత్వము దలంచి కాఁబోలు వారికిఁ దృటిలో వశమైనది అట్టిసమయంబున వసిష్ఠశిష్యుండొక డద్దనువచ్చి.

శిష్యుఁడు—అ॥ అ॥ మా హోమధేనువును దీసికొని పోవుచున్నారేమి! మీ రెవ్వరు? నిలుఁడు. నిలుఁడు. ఇది వసిష్ఠమహర్షికి బ్రాణసమంబని యెఱుంగరా యేమి.

ప్రభా—బాలకా! నీవు వసిష్ఠుని శిష్యుఁడవాయేమి? దీనిం బనిగలిగియే తీసికొని పోవుచున్నారము. అమ్మహర్షితో వసువులు తీసికొనిపోయిరని చెప్పుము.

శిష్యుఁడు—వసువులన నెవ్వరు? చోరులాయేమి?

ప్రభా—చోరులుగారు దేవసభాసామాజికులు. మీయాచార్యుండు సంతతము మమ్ముఁగూర్చియే జపము చేసికొనుచుండును. మమ్మే యుపాసించును. మేము దీనిం బరిగ్రహించుటచేఁ గృతార్థుండగును.

శిష్య—మీరు వసువులయినచో వారువచ్చుదనుక నిలిచి పూజింపఁబడి యడిగి యీమొదవుం దీసికొనిపోవుఁడు మాయావుల వలెవచ్చి మాయావుం గొనిపోవుచు మేము వేల్పులమనిన నెవ్వఁడు గౌరవించును?

వసు—బాలకా! దేవప్రభావము నీవెఱింగిన నిట్లనవు. మనుష్యులకిట్టి పనులు దూష్యము. వేల్పులకులేదు. అదియునుంగాక నీమొదవు గశ్యపసంతతిలోనిదగుట దీనిం గ్రహింప మాకధికారమున్నది.

శిష్య—శా. దీనిం జూచి హరింపఁబూనుటకుఁ గాదే కౌశికుండాత్మశౌ
ర్యానూనోరుబలంబులున్నతఁగ నీక్షాలోలచేతస్కుఁడై
స్థానభ్రంశము రాజ్యనాశనముగా సన్న్యాసియైపోయె మున్
మానుఁడీపని వేల్పులార వలదీమార్గంబు కీడౌఁజుఁడీ.

ప్రభా—శా. ఏమీబాలిక! మామకప్రథిత దివ్యైశ్వర్యప్రభావంబు వి
శ్వామిత్ర త్రిణేత్ర నీచబలసామ్యప్రక్రియన్ బల్కెదా
హా! మత్ప్రజ్ఞ వెఱుంగవీవకయ బ్రహ్మర్షుల్ మముంగూర్చికా
దే! మోక్షాప్తపంబు సేయుదురు ధాత్రీశావ్యక్తసర్వార్థులై.

శిష్య—గీ. అనిమిషప్రజ్ఞ మేమెఱుంగనిది కాదు
పుడమి జడదారి కపటారవముగఁ జరించి
కాదె తెరఁగంటి యెకిమీఁడు సిరాయమల్ల
గన్నరై పోవ శప్తుఁడౌ చెప్పరొక్కొ.

అని పలుకుచుండ నమ్మునిబాలకుని మాటలఁ బాటింపక వసువుల సదృశ వేగంబున నాసొంభేయిం దీసికొని తమలోకంబున కేగిరి.

అని యెఱింగించి మణిసిద్ధుం దవ్వలికథ పైమజిలీయం దిట్లు చెప్పందొడంగెను.

## 102 వ మజిలీకథ.

సఖీ! జితవతీ! నీపుణ్యము ఫలించినది. అనుకూల దాంపత్యంబు సంప్రాప్తించెనని యెల్లరుఁ జెప్పుకొనుచున్నారు. దివ్యరూపసంపన్నుఁడైన వరుండు లభింప నాకిప్పుడు వివాహ మక్కరలేదంటివఁట యేమిటికి? రహస్య మేమైనంగలదా యని యొకనాఁడు రోహిణి జితవతి నడిగిన నప్పుడఁతి యిట్లనియె. రోహిణీ! అల్లనాఁడు మేడ మీఁద మనము సంగీతము పాడుకొనుచున్నప్పుడు యోగసక్తయను దేవకాంతవచ్చి ముచ్చటించినమాట నీవు మఱచితివి కాఁబోలును. ఆవసువతి పెద్దతడవు నాతో నేకాంతముగా మాట్లాడునప్పుడు మనుష్యయోషల యస్థిరయౌవనత్వము దెలిసికొని నాకు దేవత్వము బ్రసాదింతునని వరమిచ్చి తాను వచ్చుదనుకఁ బెండ్లి యాడవలదని చెప్పి పోయినది. ఆ సుందరి నామాట మరువదు. ఎప్పుడో వచ్చి తానిచ్చిన వరము సఫలము జేయక మానదు. నాకట్టి విశ్వాసము గలిగియున్నది. ఆమె యాజ్ఞలేక నేను వివాహమాడను. మాతల్లితోఁ జెప్పి యిప్పుడా సన్నాహము మానిపింపుము. నామాట పరిహాసముగా నెంచి లక్ష్యపెట్టకున్నదని పలికినది.

అంతలో జితవతితల్లి అక్కడకువచ్చి రోహిణీ! అమ్మాయితో బెండ్లిమాట జెప్పితివా! ఏమన్నది వరుని చిత్రఫలముం జూచితివా? ఈతని పేరు ప్రభాకరుఁడఁట. ఈనామ మీతనికి సార్థకముగా నున్నది. ఇంతకంటె సుందరుఁ డీపుడమిలో లేఁడని చెప్పుదురు. అని పలికిన నారోహిణి అమ్మా! భర్తృదారికతోఁ జెప్పితిని. ఆమె సంకల్పము వేరుగా నున్నది. యోగసక్తకథ మీకునుం జెప్పియున్నదిగదా? ఆమె వచ్చి

యాజ్ఞ నిచ్చుదనుకఁ బెండ్లియాడదట. పెక్కులేటికి జితవతి సంకల్పము మేము త్రిప్పఁజాలమని చెప్పినది.

ఆమాటవిని జితవతి రోహిణీ! అంతరిక్షమునుండి యోగసక్తి వచ్చినది. నీవు చూడలేదా? మే మిద్దరము మిద్దెపయిం గూర్చుండి పెద్దతడవు సంభాషింపలేదా! ఏమియు నెఱుఁగనట్లు చెప్పుచుంటివేమి? నిజ మెఱింగించి మాతల్లి యుల్లము మఱలింపుమనుటయు నప్పడఁతి యిట్లనియె.

జితవతీ! నీమాట కాదనిన నీకుఁ గోపము వచ్చును. నిజముగా యోగసక్తి నీ యొద్దకు వచ్చినదనుకొంటివా? నాఁటి చర్యలన్నియు స్వప్నగతములని సఖురాండ్రందఱు నిశ్చయించిరి. మఱి మందరము భ్రాంతిపడి యట్లనుకొంటిమి. ఆపలుకు నమ్మి యిప్పుడు సిద్ధమైన వివాహమునకు భంగంబు గలిగింపరాదు. మనుష్యులు దేవతలెప్పుడును కాఁజాలరు. ఈదేహము విడచి దేవతాదేహముం దాల్తురు. ఇదియే నిక్కువమని పెద్దగా నుపన్యసించినది.

అప్పుడు జితవతి నుదుపై వ్రేలిడుకొని ఔరా! నీవెంత భ్రాంతిపడుచుంటివి. స్వప్నమో సత్యమో తెలియక నేనిట్లు చెప్పుచుంటిననుకొంటివా? నాఁడు మనము నిద్రబోయితిమా! జాగ్రదవస్థయందు స్వప్నము వచ్చునా? ముదితా? అది కలకాదు సత్యము సత్యము. ముమ్మాటికిని సత్యము. అట్లు జరిగితీరును నాకిప్పుడు పెండ్లి యక్కరలేదని కచ్చితముగా నుత్తరము చెప్పిన విని రాజపత్ని నవ్వుచు నిట్లనియె.

బిడ్డా! కొన్నికలలు నిజముగా జరిగినట్లే యుండును. మొన్నటి రేయి నాకొక కలవచ్చినది వినుము. నేను దేవలోకమున కరిగితినట శచీదేవి కాంతలు సేవింపఁ గొల్వుండి నారాకఁ గాంచి గద్దెదిగ్గి నాకెదురువచ్చి నాచేయి పట్టుకొని ముద్దుఁ బెట్టుకొనుచు దీసికొనిపోయి తన యర్ధాసనముపైం గూర్చుండఁ బెట్టుకొనినది. ఇరువురు తరుణులు వింజామరల విసరుచుండిరి దేవకన్యలు నాట్యము సేయుచుండిరి. కొందరు సుందరులు వీణాగానము వెలయింపుచుండిరి. అట్టితరి యింద్రాణి ముత్యాల దామ మొకటి నామెడలోవైచి విడిమిచ్చి కర్పూరసదృష్టుల సాపైఁ బరగింపుచు మించుఁబోడి! నీవు ప్రతిదినము వచ్చుచుం బోవుచుండుము. నిన్ను సఖురాలిగా నెంచితినని పలుకుచు నన్ను సాగనంపినది. అంతలో మేల్కొంటి. నావైభవమంతయుఁ దలంచికొనిన నిక్కముగా జరిగినట్లే తోచుచున్నది. పుత్రీ! నాకిపుడు స్వర్గ గమనాలాభ మెట్టిదో నీకోరికయు నట్టిదే. నీవు చిన్నదానవగుటఁ గలలు సత్యములని నమ్ముచుంటివి. మేము వానిలక్ష్యము పెట్టము. నీవు చక్కగా విచారించి భ్రాంతి వదలుము. అని చెప్పినవిని తల్లికి బుత్రిక యిట్లనియె.

అమ్మా! కల లెట్టివో నేనెఱుంగ నిఁకయా? ఇంత జెప్పితివి; చాలు, చాలు. అంతయు మాధురైన నేమందును. ఆయోగసక్త తన శిరోమణి జారిపడిన, దానిం గ్రహించుటకు నా యొద్దకు వచ్చినది. ఆమంతనము నాటోసిటం బడినప్పుడు కలిగిన చిహ్నమిప్పుడును గనం బడుచున్నది చూడుము. అమె నీ తల్లి జరావికారముం జూచి మిక్కిలి యాశ్చర్యపడినది. దేవలోకములో మృతియును వ్యాధివ్యాధులును లేవట దేవలోకచరిత్ర మంతయుఁ జూపఁగన్పించినట్లు చెప్పినది తానాజ్ఞ నిచ్చుదనుకఁ బెండ్లియాడవద్దని నమ్మాటికిం జెప్పి పోయినది రోహిణీ! లెస్సగా విమర్శించి యా మాటలు కలలో సత్యములో చెప్పుమనటయు అయ్యువతి దృష్టులు పైకి నిగుడించుచు నౌను. కొంత జరిగినట్లే తోచుచున్నదని పలికినది.

అప్పుడు రాజపత్ని పుత్రీ! పోనిమ్ము. నీమాట సత్యమనియే నమ్మెదను నిశ్చయముగా నామెను నీయెడఁ గనికరము గలిగినచో నీభర్తకు మాత్రము దేహసౌఖ్య మపాదింపలేదా? నీవు బెండ్లి యాడినం దప్పేమి? అసంబంధము విగిరవేని అట్టి వీరుఁడు దొరకుట దుర్లభము. ఆకాశవచనముల నమ్మి ప్రస్తుత విషయముల విడ నాడుట తగదు ఆమె గడు వెత్తియేఁ జెప్పిపోయినదా? లేదుగదా? యెంత కాల మిట్లుందువు? శక్తియనాల వినుము. అను యోగసక్త, నీవు జితపతివి. మీయిద్దరి నామములకు సఖ్యము కుదిరినది వార్ధక్యంబున నామెతో గలసికొందువుగాక. ఇప్పుడు వలదని బోధించినవి. జితపతి యేదియో చెప్పఁబోవు సమయంబున నొక పరిచారిక పడిపడి జనుదెంచి సంతోష మభినయించుచు నిట్లనియె.

భర్తృదారిక! నీవు నన్నాయుప్పరిగపై సంకేతము వసియించి యాదేవకాంత రాక నరయుచుండు మని నియమించితివి గదా? నీయాజ్ఞ శిరంబునం బూని నేనందుఁ గాచికొనియుండ నేఁటి యుదయంబున నాఁడువచ్చిన కోడియ దుగ్ధపూరితమగు నీకనక కలశంబు జేకఁబూని ఘన మేడమీఁదకు వచ్చి యల్లంతదవ్వున నిలువంబడి జితవతీ! జితవతీ! యని పిలిచినది. అప్పుడు నే నెదురుపడి దేవీ! మా రాజపుత్రిక యిప్పుడే క్రిందకుఁ బోయినది. వేగఁబోయి తీసికొని వచ్చెద నంతదనుక నిందు నిలువుం డని ప్రార్థించితిని. అప్పు డామె యించుక యాలోచించి యోహో! నాకిందు మసలరాదు. పోనిమ్ము. ఈ దుగ్ధ కలశం బీచీటితోఁగూడ నారాజపుత్రిక కిమ్ము. దీన నంతయుం దెలియఁ గలదని పలుకుచు వీని నాకిచ్చి యప్పేటియ నాకమునకు నిర్గమించినది పిమ్మటఁ బదిలముగా వీనిని మీ యొద్దకుఁ దెచ్చితి నవిగో చూడుఁడని వానికి నర్పించి నది.

అప్పుడు జితవతి యపరిమితానందముతో ఆ! ఆ! ఏది! ఏది! అని వానిం గైకొని యాజాబు విప్పి యిట్లు చదివినది.

సఖీ! జితవతీ! నీకిచ్చిన వరము చెల్లింపకొనఁ జాలప్రయత్నము సేయవలసి వచ్చినది. నీకిప్పుడు పంపిన పాలు దివ్యమహిమోపేతంబులు. వీనిం ద్రాగినవారు జరామయములు లేక దివ్యరూపధారులై పెద్ద కాలము జీవింతురు. శుభముహూర్తంబుని నీవీ దుగ్ధంబులం ద్రావుము. నే నచిరకాలంబులో వచ్చి కర్తవ్యాంశములఁ దిమ్మట నుపదేశించెదను. పెద్దతడ వింత దాలసింప రామింజేసి నిన్నుఁ జూచుట తటస్థించినది కాదు.

ఇట్లు నీ ప్రాణసఖురాలు,
యోగనక్త.

అని యున్న యాలేఖం బనేకమారు చదివిచదివి జితవతి కన్నుల కద్దికొనుచు నమ్మకచెల్లా! ఆద్దేవికి నాయందెట్టి యనురాగము కలిగి యున్నది! నాఁటిమాట మరువక స్వయముగా నీ దుగ్ధంబులం దెచ్చియిచ్చినది? ఆమె దయకు మేరలేదు. అక్కటా నేనెంత పాపాత్మురాలను నిత్యము నచ్చటనే వసింపుచు నేఁడి క్రింద మేడకు రానేల? నా సఖురాలిం గ్రమ్మరఁ జూచు భాగ్యము లేకపోయినదిగదా యని పశ్చాత్తాపము జెందుచు తల్లీ! ఇప్పుడైన నా మాట నమ్ముదువా? స్వప్నమనియుఁ గల్ల యనియు భ్రాంతి యనియు నా కథకుఁ దలయొక పేరుం బెట్టితిరిగదా! ఆదయాశాలిని నానిమిత్తమై దివ్యౌషధమును బంపినది. నన్నీ పాలం ద్రాగుమని వ్రాసినది. కాని నా పరిణయము మాట యేమియుఁ దెలిపినదికాదు. కర్తవ్యాంశములన భర్తృవిషయములనియే తలంపవచ్చును. ఆమె వచ్చి యనుజ్ఞ యిచ్చుదనుక నేను గూడ నీక్షీరంబులం ద్రావను. వీనిం భద్రముగాఁ గాపాడుచుండుమని రోహిణి చేతి కిచ్చినది.

రాజపత్నియు నాజాబుఁ గన్నులారాఁ జూచుటచే నేమియుం బలుకనేరక కుమారిక మది ననుసరించియే కావించుటకు నిశ్చయించుకొని లోపలకుం బోయినది.

అని యెఱింగించి మణిసిద్ధుండు తదనంతర వృత్తాంతంబు పై మజిలీయం దిట్లని చెప్పదొడంగెను.

## 103వ మజిలీ.

## నారదముని కథ

అయో! యీ చెడువార్త నాచెవి నేమిటికిఁ బడవలయును? నేనా భూలోకమున కేమిటికిఁ బోయితిని! వారి కీవార్త జెప్పనేల? మణియొకచోటినిఁ బోవుద మను

కొన్నను నామన సచే లాగుచున్నది. దేవసభాపిభూషణములైన వసువులు తమ మానిసి పుట్టుకతెరం గెఱింగిన నెంతవగతురో! పోనిమ్ము. చెప్పుటయే మంచిది. ఎప్పుడైన శాప మనుభవించి తీరవలసినదేకదా ? ముందుగా( దెలిపినచో( బ్రతీకార మేదియైన( జేసి కొందురేమో ? తప్పక వేగ(బోయి చెప్పవలసినదే. అని నారదమహర్షి యొకనా(డు పెక్కు తెరంగుల వితర్కించి దివ్యమార్గంబున వసులోకమున కరిగెను.

వసువు లమ్మహర్షి రాకవిని దూరముగా నెదురువోయి యర్ఘ్య పాద్యాదివిధుల నిర్వర్తించి తోడితెచ్చి యుచితాసనాసీనుం గావించిరి. అప్పుడిద్దరు వింజామరల విస రిరి. ఇరువురు పాదము లొత్తిరి. మఱి యిరువురు పుష్పముల( బూజించిరి. యొక( డాతపత్రము పట్టెను. ధరుండెదుర నిలువంబడి వినయవినమితోత్తమాంగు(డై యల్లన నిట్లనియె.

ఉ. పావనమయ్యె మాకులము పండె( బురాకృతపుణ్యముల్ యశ
శ్శ్రీ విలసిల్లె( గామ్యఫలసిద్ధి ఘటిల్లె( దపంబునింతె నో
దేవమునీంద్ర ! నీ వరుగుదెంచుటచే నిటకుం ద్వదంఘ్రిసం
సేవయొనర్చి యేమిఁక విశేష మదేమి భజించువారమో ?

మహాత్మా ! మీరిప్పు డెందుండి వచ్చితిరి ? మూడులోకములలో మీకు( దెలి యని రహస్యము లుండవుగదా ? ఎందేని విశేషములున్న వక్కాణింపు(డు. అని అడి గిన నారదుండు వసుప్రవరా! నే నిప్పుడు భూలోకమునుండి వచ్చుచుంటిని. విశేషము లన్నిచోట్లం గల్గవని పలుకుచుండ(గనే ధరుండు వెండియు నిట్లనియె

మునీంద్రా ! మర్త్యలోకము కడు శోకాకులమని మా ప్రభాసుని భార్య చెప్పి నది. అక్కడి కష్టము లెట్టివి? మృతిమియ(ట యెట్లుండును. ఎన్నియేండ్లకు వచ్చును. రోగముల ప్రవృత్తి యెట్టిది ? మనకును వారికిని( గల భేద మెయ్యది ? తెల్లముగ నెఱి గించెద రేయని యడిగిన నారదుం డాత్మగతంబున నయ్యా ! వీరు తమ మనుష్య లోక జననోదంత మెఱుంగక నన్నడుగుచున్నారు. ఉపశ్రుతివలె నాలోకప్రస్తావమే లేవలయునా? కొంత ప్రసంగ మైనవెనుక( జల్లగా నెఱింగింతు. తొందర పడరాదని తలంచుచు ని ట్లనియె.

మనుష్యులకు దుఃఖాధిక్యమున్నమాట నిజమే వారిభోగములు క్షణభంగుర ములు. జరా మరణ రోగములు సంతతము బాధించుచుండును. కాని మనకన్న వారి కొక్కవిశేషము గలదు. మనుష్యులు తపంబుచేసి మనకును బొందశక్యముగాని యుత్తమలోకంబుల నంద( గలరు. అనుటయు ధరుండు స్వామీ! వాండ్రు త్తమలోకం

బుం బొందియు మనవలె స్థిరులై యుందురు. ఇందులకు మహాభిషుండే సాక్షి. అని ప్రత్యుత్తర మిచ్చెను.

అప్పుడు నారదుఁడు అక్కటా! వీరు తమకు రాఁబోవు నిక్కట్లు తెలిసికొన లేక మానవులకై చింతించుచున్నారు. అయ్యో! ఆకథ వినినంతనెంత పరితపింతురో, ఏమిచేయుదును? ఆ మాట నా నాలుకను నిలువ కున్నది. ఇఁక దాచలేను. చెప్పద నని యాలోచించుచున్నతరి ధరుండు స్వామీ! మీ మానసమం దేదియో ధ్యానించు చున్నారు. ఎవ్వరి విషయము. నామాటకు సదుత్తరం బీయరైరి. అని అడిగిన నార దుం డిట్లనియె.

వసూత్తమా? మీరు దేవతలమని గర్వించి బ్రహ్మర్షివరేణ్యుండైన వసిష్ఠ మహాముని యాశ్రమమున కరిగి యచ్చట నుద్యాన వనముగాఁ దలంచి పుష్పాపచయాది క్రీడలఁ గావించి విచ్ఛిన్నము జేసితిరఁట నిజమేనా!

అంతటితో విడువక యమ్మునిసత్తముని ప్రాణ సమమగు హోమధేనువును శిష్యుఁడు వలదనుచుండ బలాత్కారముగాఁ దీసికొని పోయితిరఁట. ఇది యేమి యాగడము! మీ బుద్ధులు సుడిగిపోయి నవియా యేమి! మీ దేవభావము బుద్ధులకుఁ జూపఁదగినదియా? అయ్యో! హాయిగా విమానము లెక్కి సంచారముచేయు సుఖ మంతయు పాడుజేసి కొంటిరే అని పలికిన విని సురలోకసన్ముఁడు ధరుఁడు స్వామీ! ఆయనకు మాపైఁగోపము వచ్చినదా యేమి. నేను మంచిని చెప్పుచునేయుంటిని. భావ్యాలోచనుండైన ప్రభాసుని మాటవిని నావని చేసితిమి ఇప్పుడు ఆ యమ్మొదవు నాముని సదనంబునకుఁ దీసికొనిపోయి యప్పింతుమా? మీ మాటలు విని మా హృదయములు బేదల్లుచున్నవి? అక్కడ నేమి జరిగినదియో వివరింపఁగోరెదము. నారదుం డిట్లనియె.

ఏమని చెప్పుదును. చేయు గాలిన వెనుక నాకుపట్టిన లాభమేమి! వినుండు. ఇంతదనుక మీరు దురంత దుఃఖభాజనమని నిందించిన మనుష్యలోకములో జనించు నట్లు వసిష్ఠుండు మిమ్ము నందఱ శపించె తెలిసికొంటిరా? అని చెప్పినంత హాహాకారముతో నందఱు మూర్ఛ నొందిరి.

అప్పుడు నారదమహర్షి వారినెల్ల నోదార్చుచు వసువులారా! మీరెన్నఁడు నిడుమలం గుడిచి యెఱుంగరు కావున కూర్చుండి యీ యాపద దెచ్చుకొంటిరి. హరిహర బ్రహ్మలకైనఁ దాపసశాప మనుభవింపక తీఱదు. తొల్లి విష్ణుండు మునిశాపతప్తుం డగుట వినలేదా? పెక్కులేల మీ యేలికయింద్రుఁడు గౌతమశాపగ్రస్తుండై సహస్రాక్షుండగుట త్రిలోక విదితముకాదా? చేసిన కర్మకు ఫలం బెంత వారికిని గుడువక విడువదు.

తప్పక మీరు శాపఫలం బనుభవింపవలసినదే యని యుపన్యసించిన పిమ్మట ధర్ముడు కన్నీరు గార్చుచు నారదున కిట్లనియె.

సీ. పరమదుర్భరగర్భ నరకవాసము పున
ర్భవభేద మనుభవింపగ వలెనె
మలమూత్రమిశ్రిత శయ్యల బొర్లి బొర్లి బా
ల్యదశఁ గుందఁగఁ దగునయ్య మాకు
వాతపైత్యాది ప్రభూతరోగములు బా
ధింపఁదాల్తుమె తుచ్ఛ దేహములను
పితృమాతృజాయావిహిత వియోగక్లేశ
మోహాంబునిధి మునుంగుదుమె యింక

గీ. మిక్కుటంబగు జర తలకెక్క దేహ
ధారణము జేసి మనియెదు వారమయ్య
అక్కటా! మమ్ము రాయిగానైనఁ జేయ
కవనిఁ బుట్టఁగఁ దిటెనేమయ్య శపసి.

మునీంద్రా! భూలోకవాసుల క్లేశములఁ దలంచికొనిన గుండెలు పగిలిపోవుచుండును. అట్టి జగమున మే మెట్లు పుట్టువారము. ఈ యిక్కట్టు దాటు తెరవెద్ది? అయ్యో! వసిష్ఠమహర్షి యెంత కఠినాత్ముడయ్యెను. మేము వేల్పులమని యించుకయు విచారింపక పోయెనే? మా ప్రభాసుని మూఢమున నింత మూడినది. అతండు భార్యాలోలుండై యిప్పటికిఁ బుకికొల్పెను. తలంచికొన మా తప్పు ప్రత్యక్షముగాఁ గనంబడుచునే యున్నది. బ్రహ్మస్వహరణ మూరక పోవునా మహాత్మా! ఇప్పుడు మేమేమి జేయఁదగినది. కర్తవ్య ముపదేశింపుము. మా కేమియుఁ దెలియకున్నదిఁ నీపాలఁ బడితిమని యమ్మునిపతి యడుగులఁ బడి గోలుగోలున నేడువ దొడంగెను.

నారదుం డతని లేవనెత్తి వసూత్తమా! ఊఱడిల్లుము. అందుఁ ప్రభాసుని యపరాధ మధికముగాఁ గనంబడుచున్నది. మహేంద్రాదులన్నని శాపము త్రిమ్మరింప జాలరు. మీరిప్పుడు చని యా యసంశతి మనోహరుని పాపంబులంబడి ప్రార్థింపుఁడు ఆ దయాహృదయుఁ డేదేని సదుపాయము చేయక మానడు. శాప ప్రతిగ్రహణకాలము సమీపించుచున్నది. పో పొందని యుపదేశించి నారదుం డెందేనింటోయెను.

పిమ్మట వసువు లయ్యంగిపతి హితోపదేశముకుఁ గొంత శోకోపశమనము గావించుకొని యా క్షణము నొకఁడే వసువుకోఁ గూడ వశిష్ఠమహర్షి యాశ్రమమున కరిగిరి. అని యెఱింగించి.

# 104వ మజిలీ

## జితవతీ ప్రవాసము కథ

రోహిణీ! నిన్న విరిగి మీఁదఁబడినట్లిప్పుడు వచ్చినవార్త వింటివా? పాప మా వసుపత్ని నా నిమిత్తము వశిష్ఠమహర్షి హోమధేనువుఁ దీసికొని రమ్మని భర్తను బ్రోత్సాహపరచిన దఁట. అతం డన్నలతోఁగూడ నా మొదవుం బట్టికొని పాలు పితికించెనఁట. అదియే నాయొద్ద కనిపించినది. వశిష్ఠమహర్షి యలిగి యా యపహార మూలమున వసువుల నెల్ల నేడియో శాపమిచ్చెనఁట. వసువు లందరు దుఃఖించుచు నాఁడదారి యాశ్రమమున కరుగుచున్నారఁట. యిప్పుడే యోగాసక్త పరిచారిక యా కథగల పత్రిక మేడమీఁదికి విసరి పోయినది. క్షేమ సమాచారము లేమియు వ్రాయక పోవుటచే యోగాసక్తయు దుఃఖించుచున్నట్లే తోచుచున్నది. అయ్యో! నే నెంత పాపాత్మురాల నైతిని నాకతంబున దేవతా శ్రేష్ఠులు శప్తులై పోయిరే. భర్తచేఁ జేయఁగూడని పని నా నిమిత్తము చేయించిన యోగాసక్తవంటి సఖురా లెందైనం గలదా! ఆమె ఋణ మెట్లు తీర్చుకొందును? ఏమని శపింపఁబడిరో వ్రాసినదికాదు. పుడమి వశిష్ఠమహర్షి యాశ్రమ మెందున్నదియో తెలిసికొనిరమ్ము నే నక్కడికి బోయి యమ్మునివరేణ్యుని పాదంబులంబడి వసువుల కిచ్చిన శాపము నాపై న్యాపింపఁజేయుమని ప్రార్థించెదను. మరియొక తెరవున నాకు నిష్కృతి గలుగదు. మారుమాట పలికితివేని నీ మొగము జూడను. ఈ పయిన మెవ్వరికిఁ దెలియనీయరాదు. ఇఁక నేను భోగములొల్లను. కాషాయాంబరములు దాల్చి యోగినీ వేషముతో సతాపసత్తము నాశ్రయించి వారి శాపము గ్రమ్మరించెదను. లేదా, నేను ధరించెదను. ఇది నిశ్చితము. అని యాఁడనాఁడు సాయంకాలము జితవతి రోహిణితోఁ బలికినది.

ఆ మాటలు విని రోహిణి యొక్కింతతడవు విచారపై యేమియుం బలుకక తొట్రుపాటుతో జితవతీ! నీ కృతజ్ఞత కొనియాడఁదగి యున్నది. ఇట్లు పలుకుట నీకే చెల్లును. కాని యందలి ప్రయోజన మించుక విచారింపవలసి యున్నది. వసిష్ఠ మహర్షిఁ బ్రసన్నుఁజేయుటకై వసువులు తదాశ్రమమున కరిగిరిగదా? ప్రసన్నుఁడయ్యెనేని వారు శాపముక్తు లగుదురు. కానిచో శాపఫలం బనుభవించి యుందురు. ఈ సరి కేదియో యొకటి జరిగియే యుండును. భూమిలో వశిష్ఠాశ్రమమెందున్నదో తెలిసికొని కష్టనిష్ఠురముల కోర్చి మనమచ్చటికి వెళ్ళిన లాభమేమి యున్నది? లెస్సగా విచారించి చెప్పుమని పలికిన జితవతి యిట్లనియె

రోహిణీ! నిన్ను నేనీ పయనముగురించి యడిగినప్పుడు యిందలి గుణదోష

ముల నిరూపింపవలయు. ఆ మాట అడుగనిదే యేల చెప్పెదవు. వసిష్ఠముని యాశ్రమ మేదిక్కున నున్నది ? మార్గమెట్లు ? ఇది నీవు తెలిసికొనవలసిన పని. అందుల కిష్టపడియెదవా ? చెప్పు. లేకున్న జెప్పుము, నాకుఁ దోఁచినట్లు కావించుకొనియెద నని పలికిన పిని యక్కలికి యులికిపడి సఖీ! నీ వింత నిరూఢముగాఁ జెప్పినఁ గాదందునా? నీవు కుసుమ కోమలి వగుటఁ బయనమందలి కష్టములు గ్రహించి యామాటాడితి. పోనిమ్ము నీ యిచ్చవచ్చినట్లే కావించెద నిప్పుడేపోయి దెలిసికొని వచ్చెదనని చెప్పి రోహిణి యటఁ గదలి నాలుగుదినము లా గ్రామమంతయు విమర్శించి క్రమ్మర జితవతి యెద్దకు వచ్చి యిట్లనియె.

రాజపుత్రి ! అమ్మహర్షి యాశ్రమము హిమగిరి పరిసరమున నున్నదని కొందఱు, వేరుపాదప్రాంతమం దున్నదని కొందఱు, నయోధ్యానగర సమీపమున నున్నదని కొందఱుం జెప్పిరి. యెట్లైన నుత్తర దేశమునకుఁ బోవలయును. ఆ దేశ మంతయు నరణ్యభూయిష్ఠమై యున్నదట. యేమి జేయవలయునో చెప్పుము నీయాజ్ఞ వడువునఁ గావించెదనని పలికినది. అప్పుడు జితవతి రోహిణీ ! వసిష్ఠాశ్రమమునకుఁ బోవుటతప్ప నొండుపనికి నామానసం బొల్లకున్నది. కాషాయాంబరములు రుద్రాక్ష మాలికలు లోనగు యోగినీవేషసంభారము లన్నియుఁ దేసికొనిరమ్ము. నేఁపురాత్రియే పోవలయును. గుఱ్ఱమెక్కి కొంతదూరము పోవుదము తరవాత సమయానుకూలముగాఁ జేయుదము. ఇంతకన్నఁ జెప్పనదిలేదు. వేరొక యాలోచనము గావింపవలదు. అని నిరూపించుటయు నందులకా సఖి యొడఁబడినది. ఆ దివసంబంతయు నా కాంత పయనమునకుఁ గావలసిన వస్తువు లన్నియు సంగ్రహించుకొనినది.

మఱునా డర్ధరాత్రంబున నయ్యంబుజాక్షు లిరువురు నశ్వారూఢులై యెవ్వరికిం దెలియకుండఁ బురంబు వెలువడి యుత్తరాభిముఖులై యరిగిరి. తన నిమిత్తము వసువులు శపింపఁబడిరని వినినది మొదలు అమ్మదవతి నిద్రాహారములు సేయక యేకరీతిఁ జింతింపుచు నెట్లయిన వసిష్ఠమహర్షి యాశ్రమమునకుంజని యక్కడ దారి యడుగు లంటడి వారి శాప విముక్తులం జేయ నిశ్చయించుకొని యున్నది. తానుఁ గన్యకననియు రాజపుత్రికననియు, నెల్లు గడలరాదనియు నించుకంతయుఁ దలపదయ్యెను. గృదజ్ఞురాలన నామెనే చెప్పవలయును.

జితవతి యాశ్వారోహణ శిక్షయం దారితేరినదగుట నా ఘోటకమును బాటవముతో నడిపించుటంజేసి తెల్లవారునప్పటికి వారు బెద్ద దూరము పోయిరి. నడచు నప్పుడు జితవతి రోహిణీ! మనము చాలదూరము వచ్చితిమి. వశిష్ఠమహర్షి యాశ్రమ మింక నెంతదూరమున్నదియో? యెన్ని దినములకుఁ బోవుదుమో ? యాయతిసత్త

ముందు నామాట మన్నించునా ? మహాత్ములకు దయయుండదా ? మనసుగలుగునట్లు పాదంబులంబడి ప్రార్థించెదను. కనికరించి వారిని విడిచిన ధన్యులమే యగుదుము. విడువకున్న నాశాపము నేను భరింతునన్నట్లు చేయకుందునా ? అత్తపని భార్య యరుంధతీ మహాదేవి కడుయిల్లాలని చెప్పుకొనియెదరు ఆ సాధ్వీమణియైన నన్నను గ్రహింపదా ? ఒక్క యుక్కిటికము లేక యొక్కిన సుగుణములెన్నియున్నను నిరర్థకములు. వసువులు పరోపకారమునకై చేసినపని తప్పని యెంచి శపించుట వశిష్ఠునిది తప్పు. మునులు ముక్కోపులు. చిన్న తప్పునకే పెద్దగా నలుగుదురు. అందలిగి శపించుచుండ దాపుననుండి వారింపక యూరక చూచుచుండిన యరుంధతీదేవిది రెండవ తప్పు సంతతము భర్త పాదంబులపై దృష్టులనిడి కూర్చుండినంతనే యుత్తమురాలై పోయినదాయేమి ? భూతదయ సర్వగుణ శ్రేష్ఠమని గ్రంథములు ఘోషింపుచున్నవి. ఒకవేళ నీవార్త యరుంధతి వినలేదేమో ? ఇందులకు వేరొద్ది యేదైన కారణ మున్నదేమో ? యని యనేక ప్రకారములఁ దలపోయుచు రోహిణితో సుపన్యసించుచు నడుచుచుండెను

**రోహిణి:**—సఖీ! జితవతీ! నీమాటలన్నియు సత్యములే. మహర్షులు శాంతులయ్యు నవమానితులైనప్పుడు క్రోధరూపమునఁ దాల్తురు. వసువులు చోరకృత్యమొనరించిరి. ఏదైన ప్రచ్ఛాదించుట తప్పుగాదా అది అట్లుండనిమ్ము, మనము గుమ్మడికాయలో నావగింజంత పయనము చేయలేదు. ఆయాశ్రమ మింతదూరమం దున్నదని యడుగుచుంటివి. హిమవత్పర్వతము దాటి పోవలయునట. ఇట్టి కష్టముల నీవెప్పుడైన బడియుంటివా? అప్పుడే నీమొగము సరసింబాసిన తమ్మివలె వాడఁజొచ్చినది మన యుద్యమము సముద్రమున కేలామెత్తినట్లున్నది. పరదేశవాసక్లేశము సామాన్యము కాదు. అని యేమేమో చెప్పుచుండ వినిపించుకొనక జితవతి మధ్యాహ్నముదనుక నేకదృష్టితో గుఱ్ఱమును నడిపించుచుండెను. గ్రామమేదియుఁ గనంబడినదికాదు. పోవంబోవ నయ్యరణ్యాంతరంబున నితాంతశీతల మధురసలిల విలసితంబగు కాసారంబు తీరభూరుహశాఖా సమాచ్ఛాదితంబై వారికి గన్నులపండువ గావించినది. తత్తటనికటవటవిటపిచ్ఛాయ నా యబలలు గుఱ్ఱము దిగి గమనాయాసము వాయ నాతటాక తోయమున నవగాహన స్నానము గావించిరి.

అప్పుడు జితవతి రోహిణితో, సఖీ! ఇంతవేళ మిగిలినను నాకు నాకలియు దప్పియుఁ గొంచమైనఁ బొడమినది కాదేమి! దేవతా శ్రేష్ఠులైన వసువుల వాత్సల్యముననేమో? అనుటయు రోహిణి నవ్వుచు పూవఁబోఁడీ! సందియమేలా! కాకున్న నీవింతసేపు నిలువఁగలవా? వినుము నిన్న నీవు త్రాగినవి వాడుకగాఁ బుచ్చుకొను పాలుగావు.

ప్రవాస క్లేశ మనుభవింపఁ జాలవని యాదివ్యదుగ్ధంబుల నీకుఁజెప్పకయే త్రాగనిచ్చితిని నీవు తొందరగా గ్రోలుచు రుచి గ్రహింప నేరవైతివి. మధురాధిక్యంబునఁ దృప్తివడసి కొన్ని డిగవిడిచితివి. జ్ఞాపకములేదా? అదిశర్కరాగుణంబని నీతోఁ బొంకితిని. ఈ తప్పు క్షమింపుమని పలికిన విని జితవతి యబ్బురపాటుతో నిట్లనియె.

ఆహా! ఆ క్షీరమహాత్మ్య మేమని కొనియాడఁదగినది? పంచ భక్ష్యపరమాన్న ములఁ దృప్తిగా భుజించినంత బలము గలిగియున్నది. యోగసఖా! నా నిమిత్తమై యెట్టి యమృతము దెచ్చియిచ్చితివి. ఓర్షీ! యిప్పు డెట్టి యిడుమలం గుందఁ జుంటివో! నాకు జెక్కులు లేక పోయినవి. దా. ఎప్పుడు మీశాపము గ్రమ్మరింతునో. అని యుచ్చ రింపుచు రోహిణి! మంచిప యే చే.రిని. ఇది మనసుఁ బ్రయాణోప కరణమైనది. కాని నీవుఁగూడఁ ద్రాగితివా లేదా? అనుటయు నది అమ్మా! నీవు డిగవిడచిన పాల నేను ద్రాగితిని. నీకుఁబోలె నాకును దృప్తిగా నున్నదని పలికినది.

అప్పుడు జితవతి రోహిణిం గౌఁగలించుకొని సఖీ! ఇప్పటికి వనము భవ్యం మైతిమి. ఇఁక మన యుద్యమము కొనసాగఁ గలదు. క్షుత్పిపాసలు బాధింప నిర్జరార ణ్యములు దాటిపోవుట కష్టము గాదా. ఆవెత వదల్చితివి. సంతోషమైనది. అని యుబ్బుచుఁ బలికినది. అందుఁ గొంతసేపు జలక్రీడలాడి త త్తీరంబుజేరి మఱియు—

సీ. అంగరాగంబెల్ల గంగపా ల్గావించి
మేనెల్ల బసుమంబు మెదురించి
యొదలి భూషలనూడ్చి యడఁచి రుద్రాక్షదా
మముల సర్వప్రతీకములఁదాల్చి
విరులు రాలించికురుల్ విరజిమ్మి వ జ్జిపా
ల్గగిలింత జడలు గట్టఁగవిగించి
చీనాంబరము విసర్జించి మించినవేడ్కఁ
గాషాయచేలము ల్గలియఁగట్టి

గీ. గురుతరవిర క్త రూపు గైకొని యొనసఁగ
విషయ విముఖత మూ ర్తీభవించెనన౯గ
యోగినీవేషములఁ బూని రుచిరరీతి
నాతలోదరులురు వివేకాభిరతిని.

అట్లాకాంతారత్నము లిద్దరు యోగినీవేషము దాల్చి వసిష్ఠాశ్రమ దర్శనవ్యగ్ర గమనలై యుత్తరముగాఁ బోయిపోయి కొన్ని దినంబులకు బ్రయాగనగరంబు జేరిరి.

అని యెఱింగించి మణిసిద్ధుండు—ఇట్లని చెప్పందొడంగె

# 105 వ మజిలీ.

## చిదానందరమానందులకథ

రమానందుఁడు—చిదానందా! ఆ యోగిని జన్నో [illegible]?
త్రివేణిలో స్నానము చేయుచుండఁ జూచితిని. దానిమేని [illegible]
మిట్లు కొల్పినది. అయ్యారే! నారచీరఁ గట్టినను భూతిబూసి [illegible]
కలు ధరించినను గ్రొత్తయందము గలుగుచున్నది. అట్టి [illegible]
గాఁదా? త్రిలోకాధిపత్యమేల?

చిదానందుఁడు—అవును. ఆ పూపుంటోడి [illegible]
నను మాఱె [illegible] కోష [illegible]? మనము [illegible]
[illegible] దే[illegible]పథ జూడఁగలిగితిమి. అమ్మకచెల్లా! [illegible]
లగు పచ్చవిల్తుని ఫిరంగి గుండ్లని తలంపవలయును

రమానందుఁడు—అందులకు సందేహమేల.

చ. సెలవుల నుప్పతిల్లి సరినిక్కి మొనల్ తలలెత్తి క్రొవ్వి లో
బలసి సమంబులై బిగిసి వట్టువలై మెఱుఁగెక్కి చక్కనై
తెలుకులఁ బిక్కటిల్లి చెలికిం గడునొప్పెఁ గుచంబు లొప్పు రు
ప్పులుగను మన్మథుండు సరివాలుఁగ దాసునఁదూపినోయనన్.

చిదా—ఆ రెండవ బాలయోగినియు నందకత్తెయగాని లోక సామాన్యముగా నున్నది. అది దాని సఖురాలని తలంపవచ్చును.

రమా—ఈ తరుణు లిరువురు నిట్టి ప్రథమప్రాయంబున విరక్తి బూనుటకుఁ గారణమేదియో దురవగాహమై యున్నది. వీరి కులశీల నామంబు లెట్టివో తెలిసికొన గలవా?

చిదా—వీరు కన్నులెత్తి యెవ్వరిం జూడరు. మాట్లాడరు. బల్కరించినను విని పించు కొనరు. వెనువెంటఁ దిరిగి యడి యంతయుం బరీక్షించితిని.

రమా—అట్లైననొండు వినుము. వీరు మనుష తంత్రమున వశులుగారు యక్షి తంత్రమునఁ బట్టఁబోయవలయు మనోహరదాసుని నీ వెఱుఁగుదువా?

చిదా—ఎఱుఁగకేమి. అతడు సకల మంత్ర తంత్రవేది యని ప్రసిద్ధి.

రమా—వానచేతిలోఁ బదిమాడలం బెట్టిన మంచికంత్ర మొకటి ప్రయోగింపును. దానిం బంపించినచోఁ గుక్కిలపలె నక్కలివిమిన్న లిరువురు మన [illegible] మ్రొగ్గదరు రాఁగలరు. ఇదియే నాకుఁదోచిన యూహ నీ వేమనియెదవు?

చిదానందుని యూహ సమంజసముగానే యున్నది. యిప్పుడే పోవుదము పద అని చిదానంద రామానందులను బాల సన్యాసులు ప్రయోగలో నాయోగినులం జూచి మోహించి వారి వశవర్తినులం జేసికొను తలంపుతో నొకనాఁడు మనోహరదాసు నింటికిం బోయిరి.

ఆ మనోహరదాసు ఏబదియేండ్ల ప్రాయములో నుండెను. జడలు పెంచికొని యుష్ణీషముగాఁ జుట్టికొనియెను. రుద్రాక్షమాలికి లొదలి నిండ ధరించెను కుంకుమ బొట్టు నొసటఁబెట్టి శక్తిపూజా పరతంత్రుఁడై యుండువాఁడు. అట్టి తంత్రజ్ఞునింజూచి యాయోగు లిరువురుం పాదంబులఁబడి నమస్కరించుచు స్వామీ! నీపాద సేవకులము ప్రసన్నులమై నీయొద్దకు వచ్చితిమి రక్షింపుము రక్షింపుమని ప్రార్థించిరి.

అతండు వారి లేవనెత్తి యోగులారా! మీరు నా వలనఁ గాఁదగిన కార్యమేదియో చెప్పుఁడు? ఓపుదునేని తప్పక కావించెదనని చెప్పుటయుఁ జిదానందుఁ డిట్లనియె. స్వామీ! మా మనోరథము జెప్పుటకు సిగ్గగుచున్నది. మీ వేషముల కిట్టికృత్యము దగదని నిందింతు రేమోయని వెరచుచుంటిమి. దోషమని యెఱింగియుఁ బూనికొంటిమి. ఈ పదిమాడలు దక్షిణగా స్వీకరించి మా కోరిక విని మమ్ముపేక్షింపక సఫలము జేయ గోరుచున్నామని పలికి యాదక్షిణ నిచ్చుటయు, నందుకొని యాయోగి యిట్లనియె.

కుమారయోగులారా! మీపని విత్తము గొనకయే చేయఁదగినది [illegible] [illegible]రమునఁ గైకొనవలసివచ్చినది. మీరు సంశయింపక కోరికఁ దెలుపుఁడు తృటిలోఁ గావింతును. దేవతలకే తప్పులుగలుగుచుండ మనుష్యులమాట జెప్పనేల? విశ్వామిత్రునియంతవాఁడు కామలోలుఁ డగుట వినరో? మిత్రభావమును వచియింపుఁడని యడిగిన నవ్వుచుఁ జిదానందుఁ డిట్లనియె.

స్వామీ! మీరు గ్రహించితిరి అందులకే మీయొద్దకు వచ్చితిమి యోగులకు యోగినులకు సంఘటనము జేయవలయును. త్రివేణీ తీరమున నిరువురు తరుణులు యోగినీవేషముతోఁ దిరుగుచున్నారు వారి కులశీలనామములు దెలియవు, ఒకరిఁ గన్నెత్తి చూడరు. వారు మావశ్యులగుటకు వచ్చునట్లు చేయవలయును మీ[illegible]ప్రభావ [illegible] ప్రార్థించెను.

అతఁ డొక్కింత ధ్యానించుచుఁ గానిండు మీకోరిక యసాధ్యమైనది. అయినను సాధించెద[illegible]. మహామంత్రసంపన్నతగలవానికి నసాధ్య మెందునాయని పలుకుచు శాస్త్రమంతయుఁ [illegible] శ్లోకమును జదివి మీయదృష్టమువల్ల స్త్రీగంధ [illegible] గనంబడినది. నేకొకమంత్ర ముపదేశించెదను ఆమంత్రమును [illegible] నిలిపికొని రెండులక్షలజపము జేయుచు గడపు[illegible]

పుష్పములచేత లక్ష హోమములు జేసినచో మహాపతివ్రతయైనను శీఘ్రముగా మీ యొద్దకు రాఁగలదు. అట్లుచేయుఁడు పోపొండని యామంత్ర ముపదేశించి యతండు వారినంపెను.

ఆయోగు లామంత్రము సాంగముగా గ్రహించి యమునానదిం గుంకి నియమముగా రెండులక్షలు జపించి హోమముజేసి మూడు రాత్రులలో వ్రతసమాప్తి గావించిరి. నాలుగవనాఁటి రేయి తప్పక యవ్వధూటి వచ్చునని నిశ్చయించి మూరు మూలనున్న నౌకపర్ణశాలలో మంచిశయ్య గల్పించి తగుతీరి నలంకరించి గుమ్మిందఁ టోఁజీరాక నిరీక్షించుచు వారిట్లు సంభాషించుకొనిరి.

రమానందుఁడు—చిదానందుఁ! ప్రొద్దెంతపోయినది?

చిదానందుఁడు—ఇంకను జాము ప్రొద్దయినను టోవలేదు. తొందరపడియెద వేమిటికి? అర్ధరాత్రమునగాని రాదని మనోహరదాసు చెప్పినమాట మరచితివా?

రమా—అబ్బా! యీప్రొద్దెంతసేపటికిఁ దరుగకున్న దేమి?

చిదా—సమయము కావచ్చినదికాని ముందు నీవా? నేనా?

రమా—ఆదిన్నది తొలుత నెవరిని పిలుచునోవాఁడు. మంత్ర మిద్దరము జపించితిమిగదా.

చిదా—సెబాసు లస్సగాఁ జెప్పితివి. అదియే బాగున్నది.

రమా—చూడు. చూడు. అనూల నెద్దియో సద్దగుచున్నది అర్ధరాత్రము దాటిపోయినది.

చిదా—గాఢాంధకారములో నేదియుం దెలియదు (నిదానించి) అవును యెవ్వరో వచ్చుచున్నట్లేయున్నది.

రమా—రాక గుండెలున్నవియా? మనముజేసిన జపముసామాన్యమా? మనోహరదాసుమాత్రము మంచి తంత్రవేత్తసుమీ?

చిదా—అది యెఱింగియేకాదా? నేనువానియొద్దకు రమ్మంటిని.

రమా—అవును ఈయుపాయము జెప్పినవాఁడవు నీవే.

చిదా—అదిగో వచ్చుచున్నది మాట్లాడకు టోటీ? ఇటురా ఇటురా. మాపర్ణ శాల యిక్కడనున్నది.

రమా—రమానందు డిక్కడ నున్నాడు. ఇటురా?

చిదా—నేను జిదానందుఁడ నిందున్నాను. ఈలాగున.

రమా—దాపునకు రానిదే తొందరపడియెద వేమిటికి?

చిదా—నీవు ముందుగాఁ బిలిచితివికాదా?

రమా—అందులకే దూరముగా బోవుచున్నది.

చిదా—ఇటురా ఇటురా. (అని బిగ్గరగాఁ బిలిచెను)

అప్పుడక్కడ కొక బ్రాహ్మణవిశ్వస్త దేహబాధకై చేతఁ జెంబుదీసికొని యా మూలకు వచ్చి వారిపిలుపు విని దాపునకుఁ బోయినది చీఁకటిలో నామె నాయోగినియే యనుకొని దాపునకు వచ్చినతోడనే తటాలున లేచి చెరియొకప్రక్కకుఁ జేరి చేయి పట్టుకొని నీకుఁ జిదానందుఁడా? రమానందుఁడా యని యడిగిరి. ఆమె భయకంపిత స్వాంతయై అయ్యో! మీరెవ్వరు? నే నెవ్వతె ననుకొంటిరి? మాది దక్షిణ దేశము. నేను విశ్వస్తను. కాశీయాత్రకువచ్చి యాత్రిశ్రేణిలో గంగ బట్టుటకై నిన్నరాత్రి యిక్కడికి వచ్చితిమి. ఆచావడిలోఁ బండుకొంటిమి. దేహబాధకై యావల బోవుచున్న దాన రక్షోదూషిత నన్నేలముట్టితిరి నేను మీరనుకొనినదానఁగాను, పో పొండని యదలించి యామె యవ్వలికిఁ బోయినది.

అప్పుడు వాండ్రిరువురు సిగ్గుపడి నవ్వుకొనుచు నోరీ! యిదియేమిరా? యిట్లు మోసపోయితిమి. నయమే అది భయపడి కేకలు వేసినదికాదు. చుట్టుపట్ల వాండ్రువచ్చి మనలఁ జోరులుగా నెంచి బద్ధులం జేయుదురు మరియుఁ బద్మినీజాతి స్త్రీకి నంత్యయామము ప్రియమైనదని గ్రంథములో నున్నది. దానంజేసి తెల్లవారు జామునఁ దప్పక వచ్చును అని నిశ్చయించి యారేయియెల్ల గనురెప్పవాల్పక హరిద్దసనాముద్దుఁగుమ్మకై యెదురుచూచుచుండిరి. ఇంతలోఁ దెల్లవారినది. దీపములవలె వాండ్రముఖములు వెలవెల బారఁజొచ్చెను.

అప్పు డాయోగులు కడువిచారముతో మనోహరదాసునొద్దకుఁబోయి స్వామీ! మీమంత్రమింత గొడ్డువోయినదేమి? అయ్యయ్యో! మూఁడురాత్రులశ్రమ యట్లుండ నిండు. నిన్నరాత్రి మేము పడిన యిడుములకు మేరయున్నదా? తుదకొక విశ్వస్తం బట్టుకొని పరిహాసాస్పదులమైతిమని యాకథ యంతయుఁజెప్పి దుఃఖింపఁదొడంగిరి.

వారిమాటలు విని మనోహరదాసు కొంచెముసేపు ధ్యానించి యెట్లైనను దాను కోరిన నారీమణి కులశీలనామంబులు తెలియక జపించినఁ బ్రయోజనములేదు. మీరారక యాతురులై యడుగుటచే నట్లుచెప్పితిని. పరిచయముగలవారితోఁగాని యట్టి తంత్రము జరుపరాదు. మీమొగమే వా రెఱుంగరని చెప్పుచున్నారు యట్లైన నాయోగినితోఁ బరిచయము గలుగఁజేసికొని వచ్చినచోఁ గార్యసాఫల్యము జేయఁ గలను. పో పొండు ఆపొన్న కొమ్మలను వెన్నంటి తిరుగుచుండుఁడని యుపదేశించెను.

వాండ్రు వానియొద్ద నేమియు మాటాడలేక యావలకు వచ్చిరి. చిదానందుఁడు

రమానందునితో నోరీ! ఈమోసకాఁడు మనసొమ్మూరక తినవలసినదేనా! అగుగాక యూరకవచ్చితివేల. రెంటికిం జెడుదుమా? యనుటయు నేమిచేయుదుము గట్టిగా నడిగినఁ బ్రయోగము జేసి మనలఁ జంపగలఁడు. వానిచేతిలో నెప్పుడు పెట్టితిమో యప్పుడే మనసొమ్ము పోయినది. పరిచయము గలుగఁజేసికొనివచ్చిన నేదియో చేయుదమనని చెప్పుచున్నాఁడుకాదా! అప్పుడే చూతము అని వాఁడు వానికి సమాధానము జెప్పెను. అప్పుడు చిదానందుఁడు యిఁక మనము నిత్యము నామత్త కాశినులు చేయు కృత్యములఁ బరీక్షించి పిమ్మటఁ జేయఁదగినపని యాలోచింతము. రహస్యముగా వారి వెనువెంటఁ దిరుగుచుండుమని బోధించిన రమానందుఁ డట్లుచేసి యొకనాఁడు చిదానందునితో నిట్లనియె.

మిత్రుఁడా! నిన్న నే నొక విశేషము దెలిసికొనివచ్చితిని వారిలో రెండవ యోగిని నిన్న బ్రహ్మానందయోగియొద్దకు వచ్చి వసిష్ఠమహర్షి యాశ్రమమునకు మార్గ మెట్లనియు నతని యాశ్రమమునకుఁ బోవలయుననియు నడుగుచున్నది. దాని చూపువారికిఁ గొంత ధనసహాయము చేయుదుమని సూచించినది. ఆ యోగి వృద్ధుఁడై నను గడు టక్కరియగుట నా ముని యిప్పు డెందున్నవాఁడో విచారించి తెలియఁ జేసెద రెండు మూఁడు దినములలో రమ్మని యుత్తరము జెప్పెను. ఇదే సమయము నే నొక వ్యూహము పన్నదలంచి యుంటి. కొంచెము సొమ్ము వ్యయ పెట్టవలసియున్నది నీ వంగీకరింతువేనిఁ గార్యసాఫల్యము గాఁగలదు అని పలుకుటయు చిదానందుఁ డిందుల కెంత సొమ్ము వ్యయమైనను సగపాలు భరింతు గార్యము నెరవేరు తెరవాలోచింపుమని యుత్తరము చెప్పెను. అప్పుడు రమానందుఁడు వాని చెవిలో నేదియో చెప్పెను. చిదానందుం డంగీకరించెను.

అని యెత్తింగించువరకు వేళ యతిక్రమించుటయు మణిసిద్ధుండు అవ్వలి [illegible] బై మజిలీయం దెప్పుఁబొడంగెను.

## 106 వ మజిలీ.

# బ్రహ్మానందయోగికథ

రోహిణీ: మన మీ ప్రయాగము వచ్చి పది దినము లైనది. తీర్థసేవ గావించి కృతార్థుల మైతిమి. పయనము మాట యేమి జేసితివి [illegible] [illegible] మంచి గలరు. వారు దేశసంచారము చేయుచుందురు. [illegible] వసిష్ఠా[illegible] మార్గ[illegible] దెలియకపోదు. ఎవ్వఁనైన యడిగితివా అని ప్రయో[illegible] రోహిణితో ముచ్చటించిన నది యిట్లనియె.

సఖీ! మన మీ పురము చేరినది మొదలు ప్రతి దినము తద్విషయమే విమర్శింపు చుంటిని. ఇందుండు సన్యాసులు బైరాగులు పరివ్రాజకులు కపటచిత్తులు గాని మంచివాండ్రుగాఁ దోఁపలేదు. శివరాత్రికి వచ్చుగల మతమునకు వేనవేలు జేరిరి. నే నా మతమువారికి నన్నఁబోయితిని. నన్నుఁజూచి పెక్కండ్రు కామాకుల చిత్తులైనట్లు నేను గ్రహించితిని. అట్టివారి నేనని యడుగుదును. ఆ మతమంతయు దిరుగనొక వృద్ధుఁడు నాకుఁ గామవికారము లేనివాఁడుగాఁ దోఁచెను. ఆ బైరాగి చుట్టును పాప మును ప్రజ్వలిల్ల గోపీనము ధరించి యొడలెల్ల విభూతియు రుద్రాక్షలు నిండియుండఁ గెంపుకొంగ యుండుటలేఁ బ్రకాశించుచుండెను. వేషమునకుఁ దగిన చిత్త నైర్మల్య మున్నదియో లేదో తెలిసికొనుట దుర్ఘటము. నేనా యోగి పాదములకు నమస్కరించి స్వామీ! మాది దక్షిణదేశము. మా దేశములో వసిష్ఠమతమని యొక మతము కలదు. అది మాకులమతము కాదు. మీ మహర్షి యాశ్రమము జూడ వేడుక పడి వచ్చితిని. మార్గమధ్యమున చెప్పఁగా రా? మీకుఁగృతజ్ఞులమై యుందుమని పలుకుటయు నతండు కన్నులం దెరచి నన్నుఁజూచి విచారించి చెప్పెద రేపురమ్మని యానతిచ్చెను. అతని మాటలు కపట శూన్యములుగాఁ దోఁచినవి. రేపుపోయి తెలిసికొని వచ్చెదనని చెప్పుటయు శివపతి నీకెవ్వరును నచ్చరు. అందఱిని గపటాత్ములందువు వారిలో మహానుభావు లుండరా? వినయ విధేయతలు గనపరచి యడుగవలయుంగాని నీరాజసభావము జూపింపకుము. వేగఁబోయి యావార్త దెలిసికొని రమ్మని నియమించినది.

రోహిణి యమ్మరునాఁడు ప్రాతఃకాలమునఁ ద్రివేణిలో స్నానముజేసి విభూతి బూసికొని యా వృద్ధయోగి యొద్దకుఁబోయి నమస్కరింపుచు నతండు గన్నుల మూసికొని యుండుటచే సమయ మరయుచు నోరగా నిలువం బడినది. ఇంతలో రమానందుఁడు తెల్లని భస్మంబు మేనెల్లెడలం బూసికొని పులితోలు వెనుకవ్రేలాడుచుండ రుద్రాక్షమాలికాలంకృత సర్వప్రతీకుండై కౌపీనము ధరించి మూర్తీభవించిన వైరాగ్య ప్రతిపత్తియో యన నొప్పుచు నా వృద్ధసన్యాసి కడకు వచ్చి స్వామీ! నేను రమానందుఁడ మీ ప్రియశిష్యుఁడఁ బెద్దకాలమునకు మిమ్ముఁ జూడగంటి నిదే మీకు నమస్కారము లిప్పించు చుంటినని పలుకుచు సాష్టాంగముగాఁ బండుకొనయెను.

అప్పుడా యోగి కన్నులం దెరచిచూచి లెమ్ములెమ్మని పలుకుచు రమానందుఁ డనఁగా నాకు గురుతు తెలియలేదు నీ విప్పుడెక్కడనుంటివి? ఎందుండి వచ్చితివి. చెప్పుమని యడిగిన నతం డిట్లనియె.

స్వామీ! నన్ను మఱచితిరా? నేను మీ మిత్రులగు బ్రహ్మానందయోగి శిష్యుఁడను గానా? మా గురువుగారితో వచ్చి వెనుకఁ గొన్ని దినము లిందుండి పోలేదా?

అద్వైత తత్త్వమును గురించి మీకును వారికిని బ్రసంగము జరుగలేదా? యని చెప్పిన విని అతండు ఆ! జ్ఞాపకమువచ్చినది. జ్ఞాపకమువచ్చినది. నీవా! బాబూ! నీవుగడు బుద్ధిమంతుఁడవు నీకు శీఘ్రకాలములో నాత్మజ్ఞానము పూర్ణమగునని యప్పుడను కొంటిని నిన్నుఁ జూచుటచే సంతోషమైనది. మీ గురువు బ్రహ్మానందయోగి యిప్పు డెక్కడనున్నాఁడు? బదరికారణ్యమునకో యింక నెక్కడికో వెళ్ళెనని వింటినిప్పుడు కుశలియై యుండెనా అని అడిగిన వాఁడిట్లనియె.

స్వామీ! మీ దయవల్ల మా యాచార్యుండు భద్రముగా నున్నాఁడు. నే నాయనతోనే తిరుగుచుంటిని. మేముడు బదరికారణ్యమున కరిగి యందుఁ గొన్ని నాళ్ళుండి యందుండి వసిష్ఠాశ్రమమున కరుగఁ బ్రయత్నించు చుండగనే వసిష్ఠ మహర్షి బదరీవనమునకు విచ్చేసెను. అప్పుడు మిగుల సంతసించుచు వారితోఁగూడ మా దేశికుండు ఆత్మజ్ఞానాత్మతత్త్వమును గూర్చి ముచ్చటించుచుఁ గొన్నిదినములుండిరి. తరువాత వారిరువురుంగలసి చంపకారణ్యమునకు వచ్చి యందుఁ గొన్ని మాసములు వసించిరి. మొన్నటి మహాశివరాత్రి కీ పుణ్యక్షేత్రమునకు రావలయునని పయనము గావించిరి. కాని వసిష్ఠ మహర్షి యిందు జనసంబాధ మధికముగా నుండునని తలంచి యా ప్రయాణము మానివేసి యచటనే యుండెను మా యొజ్జలు బ్రహ్మానంద యోగియు నేనుమాత్ర మీ శివరాత్రి కీ క్షేత్రమునకు వచ్చితిమి. మా గురువుగా పశ్చిమభాగమున యమునానదీతీరమున నున్నవారు. ఒకటి రెండు దినములలో మరల జంపకారణ్యమున కరుగుదు రిదియే మా వృత్తాంతమని యాకథలో చెప్పెను.

అప్పు డావృద్ధయోగి యేమీ! వసిష్ఠులవారు చంపకారణ్యమునకు వచ్చిరా! ఆ యరణ్య మిచ్చట కనతి దూరములోనే యున్నది కదా? అయ్యో! పాపము నిన్న నెవ్వరో నా యొద్దకువచ్చి వసిష్ఠ మహర్షి యాశ్రమమునకు మార్గ మెఱింగింపుఁడని యడిగిరి. వారక్కడికిఁ బోవుదురు కాఁబోలు. తొందరలో వారికేమి చెప్పితినో జ్ఞాపకములేదు. వారి కాసంగతి దెలిసినఁ జాల సంతసింతురుగదా? అని యాలో చించుచుండ వెనుక నిలువం బడియున్న రోహిణి యెదురకువచ్చి స్వామీ! నేనే మిమ్మా మార్గ మడిగినదాన. నిందేయుంటి మీసంవాదము వింటిని. మీ దర్శనమున మా కార్యసిద్ధియైనదని తలంచుచుంటి. సాధుసాంగత్య మూరకపోవునా యని స్తుతియించి నది. అప్పుడు రమానందుడు స్వామీ! ఈ బాలయోగిని యెవ్వతె. వసిష్ఠాశ్రమమున కేమిటికై యడుగుచున్నది. అని యేమేమో యడుగఁ బోయినంత వారించుచు వృద్ధయోగి యిట్లనియె.

నీ యద్వైతతత్త్వవేదియైన బ్రహ్మానందయోగి శిష్యుఁడవయ్యు నిట్లడుగుచుంటి

వేమి? మన మెవ్వరమో ఆమెయు వారే. యంతయుఁ బరబ్రహ్మస్వరూపము ఆత్మకు స్త్రీపుం విపక్షతయుఁ గులశీలనామంబులుం గలిగియున్నవియా? ఆమె విరక్తురాలు. ఈశ్వరమహిమఁ దెలిసికొన నెవ్వరి శక్యము? ఏ జీవుల కే కాలమున నెక్కడ నేది కావింపవలయునో ఆ జీవుల కా కాలమున నక్కడ నది కావింపకతీరదు. వారికి వారియందు భక్తిగుదిరినది వారిం జూడఁబోవు చున్నారు. సాధువులకుఁ బరోపకారము కన్నఁ బుణ్యకార్యము లేదు. ఆశ్రితరక్షణము సహస్రయాగఫలదంబని శ్రుతులు ఘోషించుచున్నవి మీరు నామిత్త్రముగా వీరికొక యుపకారము చేయఁగోరుచున్నాను. మీ గురువుగారితో నామాటగాఁ జెప్పుము వీరిని జంపకారణ్యమునకుఁ దీసికొనిపోయి వసిష్ఠమహర్షి దర్శనము చేయింపుఁడు చెంతఁజేరిన వారి కోరిక తీరుపక నాచిత్తము సంతసింపదు. నేను వృద్ధురాలనగుట రాలేను. దైవికముగా నమ్మునిపతి ఈప్రాంతమునకు వచ్చుట వీరి యదృష్టమే. అమ్మా! యోగినీ! ఈతండు ప్రాయంబునఁ జిన్నవాఁడైనను సకల ధర్మములు దెలిసినవాఁడు వీరి గురువు వసిష్ఠుని మిత్రుఁడే కదా. కనుక నీవును నీబంధువులును వీనివెంట బ్రహ్మానందయోగియొద్దకుఁ బోవుఁడు ఆయన మిమ్ము దీసికొని పోఁగలడని చెప్పెను.

రోహిణి వృద్ధయోగిని స్తుతియించుచు బ్రహ్మానందయోగి యెంతదూరములో నున్నవాఁడని అడిగినఁ గ్రోశదూరములో నుండెనిప్పుడేపోయి చూడవచ్చునని రమానందుఁ డుత్తరము జెప్పెను.

అప్పుడు రోహిణి యించుక యాలోచించి ఆర్యా! మీదేశికుఁడు చంపకారణ్యమెప్పుడు పోవునో మాలాక ననుమతించునో తెలిసికొని వత్తురేని మీకు గృతజ్ఞురాలనై యుండెద నిప్పటినుండియు నందువచ్చి యేమిచేయఁగలము. అని యడిగిన రమానందుఁడు అబలా! మీకా సందియము వలదు. మాగురువుగారు సహజముగా నుపకారశీలురు వీరియాజ్ఞ యయ్యెనేని చెప్పిన మాటను సాహసింతురు. మీరెప్పుడు వచ్చిన అప్పుడే బయలుదేరుదురు మీబంధువులం దీసికొనిరండు పోవుదమనుటయు రోహిణి జితవతియొద్ద కరిగి యిట్లనియె.

సఖీ! జితవతీ! ఇప్పుడు వసిష్ఠమహర్షి చంపకారణ్యమునకు వచ్చియుండెనని శుభవార్త యొకటి వింటి. అది సత్యమేయైనచో మనము కృతార్థులమే. అని తాను బోయి విన్నకథ అంతయుం జెప్పినది అప్పుడు జితవతి నూపు లెగరవైచుచు, రోహిణీ! నియమితచిత్తులగు దైవము సహాయము చేయకపోవునా? ఆత్మజ్ఞాన వేదియగు అత్తపసి మనకొక విధి యెదురువచ్చుచున్నాఁడని నమ్మము ఇది యంతయు వీరు కల్పించిరని సిగ్గుమాన మున్నట్లు తోచుచున్నది. అట్టి కల్పన

లతో వారి కేమి ప్రయోజనము ? మనయొద్దఁ బొదవులైన లేవుగదా ? బూడిద బూసి కొని తిరిగెడి మన చక్కఁదనము వలచు వారెవ్వరు ? ఆ మాట సత్యమని ముమ్మాటికి నమ్మదగినది. బోవుదము లెమ్ము బ్రహ్మానందయోగిపాదంబులం బడి వేగ దీసి కొనిపొమ్మని ప్రార్థింతమని తొందర పెట్టినది.

రోహిణియు నంగీకరించినది. అప్పుడే యిరువురు బయలుదేరి వృద్ధయోగి కరిగిరి. నిరీక్షించుకొని రమానందుఁ డందేయుండెను. వృద్ధయోగి వారింజూచి సుమతులారా ! మీ రిద్దరేనా వారియొద్దకుఁబోవ నిశ్చయించుకొంటిరి శుభము శుభము. శీఘ్రముగా వీనివెంటఁ బొండు బ్రహ్మానందయోగియొద్దకుఁ దీసికొనిపోవును. తరువాత అతండన్నియుం జెప్పగలండని పలికి వారి మ్రొక్కులు గైకొని దీవించుచు సాగనంపెను.

రమానందుఁడు ముందు నడుచుచుండ ఆయ్యంగనాజనము లిరువురు కొంచె మెడముగా నడువఁదొడంగిరి. రెండుగడియలలో నా బ్రహ్మానందయోగియొద్ద కరిగిరి.

యమున యొడ్డుననున్న యొక తోటలో మఱ్ఱిచెట్టు క్రింద వ్యాఘ్రాజినముపై గూర్చుండి కన్నులు మూసికొని యా బ్రహ్మానందస్వామి జపము జేసికొనుచుం డెను. అతని ప్రాయము ఏబదియేండ్లకు మించియున్నట్లు సగము సగముగాఁ దెల్లబడుచున్న జడలచేఁ దెలియబడుచున్నది. దేహము దృఢముగా నున్నది విభూతి రుద్రాక్షలు నిబ్బడిగా ధరింపబడియున్నవి. చూచువారి కతండు మహానుభావుండని తోచక మానదు. ఆయోగి ప్రక్క నొక శిష్యుఁడు గూర్చుండి జపమాల ద్రిప్పుచుం డెను. కాటిపటములు కొన్ని శాఖలకు నారవేయఁబడియున్నవి. ఈతఁడే మా యాచార్యుఁడని రమానందుఁడు చెప్పినంత నక్కాంత లిరువురు భయభక్తి విశ్వాసములతోఁ బ్రదక్షిణ నమస్కారములు గావించి యోరగా నిలువంబడిరి.

అప్పుడు రమానందుంజూచి అందున్న శిష్యుఁడు మిత్రమా ! ఈ యాఁడువాం డెవ్వరు ! ఇక్కడి కేమిటికి వచ్చిరి. స్త్రీ ప్రసంగమువ మండిపడియెదు మన జడదారి దారియెఱింగియు నీ నారీమణుల నేమిటికి వెంటఁబెట్టుకొని వచ్చితివి ? ఇది ౨౮
కడు ప్రమాదముసుమీ ? అని పలికిన విని రమానందుఁడు చిదానందా ! వీరు లోకసామాన్య యోషలుగారు మహాయోగినులు దృఢవ్రతలు. క్రియాశూరులు. వీరిప్పుడు వసిష్ఠమహర్షి యాశ్రమమున కరుగ నిశ్చయించుకొనిరి. మనగురుని కటాక్షముండినంగాని అట్టిపని కొనసాగదని తలంచి వీరి నాశ్రయింపవచ్చిరి వృద్ధయోగియు వీరికిట్టి యుపకారము చేయుమని మన యాచార్యునితో జెప్పుమనియెను. నీ విందులకు సహాయము చేయవలయునని చెప్పెను.

చిదానందుఁడు సంధియమేలా ? అట్లే చేయుదము. సుందరులారా! యిందుఁ గూర్చుండుడు యోగి కన్నులం దెరచు సమయమైనదని చెప్పుచుండఁగనే అతండు కన్నులఁ విప్పి జపమాల జెవులకుఁ దగిల్చికొని కమండలూదకమున నేత్రములఁ దుడిచికొనుచు శిష్యుని వంకజూచి రమానందా! త్రివేణి కరిగి యింత యాలస్యము చేసితివేమి ? నామిత్రుఁడు ప్రద్యుమ్నయోగి కనంబడెనా ? యని అడిగిన వాఁడు వినయ మభినయించుచు స్వామీ! చూచితిని. మాట్లాడితిని. గురుకటాక్షము గలిగినది. మీ చంపకారణ్య గమనవృత్తాంతము విని ఈ యోగినుల మీయొద్ద కనిపిరి. అందునను వసిష్ఠమహర్షి యొద్దకు వీరిం బదిలముగాఁ దీసికొని పొమ్మని మఱియు మఱియుం జెప్పుమనిరి. వీరి కతంబున నించుక యాలస్యమైనదని చెప్పినవిని బ్రహ్మానందయోగి యాయోగినులపై చూడ్కులు వ్యాపింపజేసెను.

అప్పుడమ్ముద్దుగుమ్మ తద్దయు భయభక్తి వినయవిశ్వాసములతో నయ్యోగి పాదమూలమున వ్రాలి మహాత్మా! రక్షింపుము రక్షింపుము. నీకు శిష్యురాండ్రమైతిమి వసిష్ఠమహర్షి దర్శనము జేయింపుమని ప్రార్థించిరి. ఆసమయమున నాశిష్యు లిద్దరు నెద్దియో పని కల్పించుకొని దూరముగాఁ బోయిరి.

అప్పుడు బ్రహ్మానందస్వామి తరుణులారా! లెండు లెండు. కుసుమకోమలమైన యీ ప్రాయమున మీరిట్టి యోగినీవేషము ధరించుటచే మీవ్రతపటుత్వము వేర యిట్టిదని పొగడ నవసరము లేదు. విరక్తిచే యోగినులై తిరిగెడు మీ పూర్వ వృత్తాంతమడుగుటకు తప్పుగదా? మీ నియమప్రచారములు స్తోత్రపాత్రములై యున్నవి. మీ రిప్పుడు తత్త్వశ్రవణేచ్ఛచే వసిష్ఠుం జూడఁబోవుచున్నారా యేమి? వేఱెద్దియేనిఁ గారణమున్నదియా? ఆ యతిపతి యిప్పుడు చంపకారణ్యములో నున్నవాఁడు. అయ్యడవి యిక్కడికి రెండు పూటలు పయనములో నున్నది. పోవచ్చును. మీ అభిలాష యేమి అని అడిగిన ఆతపతి రోహిణి మొగము జూచుటయు నా చంద్రవదన యిట్లనియె.

స్వామీ! యిప్పుడు మీతో యదార్థము చెప్పక తీరదు. యోగసక్త యను వసుపత్ని ఈమెతో మైత్రిజేసినది. ఆమె ఈమె నిమిత్తమై వసిష్ఠమహర్షిచే శపింపఁబడినదఁట. ఆకథవిని ఈ వనిత వారి శాపము గ్రమ్మరింప అమ్మునిపతిం బ్రార్థింప నరుగుచున్నది. తత్త్వశ్రవణేచ్ఛగాదు. మాకు వారి దర్శనము జేయించి పుణ్యము గట్టి కొనుఁడు అని ప్రార్థించినది.

ఆ కథవిని బ్రహ్మానందయోగి శిరఃకంపము జేయుచు నయ్యారే నీ కృతజ్ఞత మిక్కిలి కొనియాడఁ దగియున్నది. అప్పారికాంక్ష దయా హృదయుఁడగుట నీ కాంక్ష నెరవేర్పవచ్చును. ఇప్పుడే పోవుదము. అందుకు నన్నంతగాఁ బొగడ

నవసరములేదు. తత్వవేత్తలగు సాధువులకుఁ బరోపకృతికన్న ముక్తిసాధన మేమి యున్నది. కూర్చుండుఁడు, అని యాదరించుటయు నాతని మాటలు విని శివపతి యుప్పొంగుచు నిట్లనియె.

స్వామీ! అమ్మహర్షితో మీరు కొంతకాలము సహవాసము చేసితిరఁట కాదా ? చంపకారణ్యమున మనము పోవుదనుక నుందురా? అపుండతఁడు మహాదేవికడ వచ్చి నదా? వారి హృదయ మెట్టిది? మమ్ము గనికరించునా? వసువుల విడుచుట యెంతెత తచ్ఛాపము నాపై వ్యాపింపఁజేయ వసువుల విముక్తులఁజేయుట యెంతెత గావింప వలయును. అని యేమేమో యడుగఁబోవుచుండ వారించుచు రోహిణి యిట్లనియె.

జితవతీ! నీవేటికి వీరి నిట్లు ప్రశ్న ప్రశంసాయాన పాతుకం గావించెదవు? వారి యొద్దకుఁ బోయిన వెనుక మనకే దెలియనగు. విచారింపకుమని బోధించినది. అప్పుడు బ్రహ్మానందయోగి అబలలారా! వినుండు మీరు మిక్కిలి శ్రమపడి యడవులఁబాటి నిద్రాహారములు విడచి తనకడ కరుదెంచిన మిమ్ము కనికరింప వసిష్ఠమహర్షి లోక నింద పాలుపడునా యేమి అడియును గాక.

శ్లో॥ అతిథిర్యస్యభగ్నాశో గృహాత్ప్రతి నివర్తతేఁ
సదత్వా దుష్కృతం తస్మై పుణ్యమాయుశ్చగచ్ఛతి॥

అతిథి యెవని యింటికివచ్చి కామ్యమును బొందక విచారముతోఁ గ్రమరునో యా గృహపతికిఁ దన పాపమిచ్చి వాని పుణ్యమును గైకొని పోవునని శాస్త్రములు చెప్పుచున్నవి. కావున వసిష్ఠుండు మీ వాంఛితమును దీర్పఁగలఁడు. మనము పోవు దనుక నదే యుండును. మీరు చింతింపవలదని బోధించుచు శిష్యులతో నప్పుడే పయనము గావింపుమని నియమించెను.

అప్పుడా శిష్యులిరువురు కాటీపటములు కమండలువులు నాగ నేత్రములు లోనగు వస్తువులన్నియు మూటగట్టుకొని స్వామీ! లెండు లెండు. సమయమైనది. అని చెప్పిన నయ్యోగి యోగదండంబూతగా బూని యుత్తరాభిముఖుండై యప్పుత్త కాశినులు వెంటరా మెల్లగా నడువఁజొచ్చెను.

అట్టితరి రోహిణి మనంబున నిట్లు తలంచెను. ఆహా! విధి పరిపాకము కడు చోద్యమయినదిగదా? పెక్కండ్రు చేడియ లాడిగము సేయ పోతుటీగ కైనఁ బ్రవేశింప శక్యముగాని శుద్ధాంత సౌధాంతరంబుల వసించు నీ మించుబోఁడి యిట్లు పాదచారిణియై మహారణ్యములోఁ గంటక ప్రదేశముల నెరుగని సన్యాసులవెంట నడుగుచున్నది. ఇంత కంటె విపరీతమేదియైనఁ గలదా? ఔరా తలంప మాయశక్తిము చిత్రము గాక యేమి యిది? ఇప్పుడీ పడుచు బైరాగు లిద్దరు సుక్షేపము జేసి యెక్కడికో లాగికొని

పోవుచున్నారు. చిదానందుని వేషమున్నను హావభావ గర్వితములై యున్నవి. ఈ బ్రహ్మానందయోగి నాశ్రయించి యిట్టి కల్పనజేసి యుందురు. యేమి చేయుదును? పోవలదని చెప్పినను జితపతి వినిపించుకొనదు. నా బుద్ధిబలంబంతయు నేటిపాలుజేసి వీరి వెంటఁ బోవుచుంటిని. వసిష్ఠుడీ యడవిలో నుండుట కల్ల. మోహాంధులై వీరిట్టి సన్నాహము గావించి యుందురు. కానిమ్ము ఏమి జరుగునో చూడవలసినదే కాని దైవమును మీరగలమా అని అనేక ప్రకారములఁ దలంచుచు వారివెంటఁ గొంచె మెదముగా నడచుచుండెను. బ్రహ్మానందయోగి నడచుచున్నప్పుడే వేని తత్త్వవిశేషము లెఱింగింపుఁడని శిష్యు లడిగిన నిట్లుపన్యసించెను.

వత్సలారా! ఈ ప్రపంచకము మాయాకల్పితము. దృశ్యమంతయు నశ్యమే సుఁడీ! ఈశ్వరుఁడొక్కఁడే నిత్యుఁడు. ఈశ్వరుఁడు ప్రకృతియందుఁ బ్రతిఫలించి జగంబుల రచించుచున్నట్లు తోచుచుండును కాని కర్తృత్వ భోక్తృత్వము లేవియు లేవు. అదియు నింద్రజాలము వంటిది. అరూఢులకుగాని యీ రహస్యము దెలియదు. ప్రపంచకమే యసత్యమనుచుండ దేహముమాట జెప్పనేల? స్వప్నంబునఁ దోచిన వస్తువులన్నియు మేల్కాంచినఁ గనంబడనియట్లు ఆత్మవేత్తయగు జ్ఞానికి లోకమేలేనట్లు తోచును. ఇంద్రియ సంమోహము వలననే యీ యజ్ఞానము గలుగుచున్నది. (వెనుక జూచి మెల్లగా, వారి మాటలు వినుచున్నారా) అని మరియు.

శ్లో॥ శారీరై ర్మానసైర్దుఃఖైః సుఖై ర్వాప్య సుఖోదయైః।
లోకసృష్టిం ప్రపశ్యంతో నముహ్యంతి విచక్షణాః॥
తత్రదుఃఖ విమోక్షార్థం ప్రయతేత విచక్షణః।
సుఖంహ్యనిత్యం భూతానా మిహలోకె పరత్రచ।
రాహుగ్రస్తస్య సోమస్య యథాజ్యోత్స్నా నభాసతే।
తదా తమోభి భూతానాంనస్యతే సుఖం॥

శరీర సంబంధములు మనస్సంబంధములగు సుఖదుఃఖములచే లోకసృష్టి ప్రకారమంతయుం జూచుచుండిన విద్వాంసు లెప్పుడును మోహమును బొందరు. రెండును ననిత్యములని యెఱింగి తజ్జన్యంబులైన సంతోషశోకముల జెందరు. రెండు లోకములందు సుఖమనిత్యమని తెలిసికొని దుఃఖవిమోచనార్థమే ప్రవర్తింతురు. రాహుగ్రస్తుండగు చంద్రునియొక్క వెన్నెలవలెనే యజ్ఞానాభిభూతములగు భూతములకు ధనము నశించును. కావున లోక ప్రవృత్తి దెలిసికొని దుర్గుణముల విడిచి శమదమాది సంపత్తిచే నొప్పుచుండువాఁడు ముక్తుండగునని యెఱింగించుచుండ నాలించి జితపతి రోహిణి కిట్లనియె.

సఖీ! యా మహాత్ముని యుపన్యాసము వినంబడుచున్నదా? చెవి కమృతబిందు వులవలె సోకుచున్నది గదా! బ్రహ్మానందయోగిని బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యుఁడని చెప్పఁదగినది. అట్టివాఁడు వారి మాటలు విని మనలఁ గపటముజేసి దీసికొని పోవు చున్నాఁడని చెప్పుదువు. నీమాట కెంతవ నమ్మఁదగినదో చెప్పుము. ఇఁక సంశయివిడిచి నిర్భయముగా వారివెంట నడువుము. మన కార్యసిద్ధి శీఘ్రముగాఁ గాగలదని పలికిన విని రోహిణి యేమాటయుం బలుక కూరకుండెను. అట్లు వారు పోయిపోయి రెండు మూడుపయనంబులకుఁ బంపకారణ్యము జేరిరి.

అని యెఱింగించి——యిట్లనియె.

# 107 వ మజిలీ

## మాయావసిష్ఠుని కథ

డెబ్బదియేండ్లు మించినవి. నల్లని దేహము. పండ్లూడినవి. చప్పిదవదలు. కన్నులు లోతునకు బోయినవి. ఒడలంతయు ముడుతలు వారినది. మేనంతయు భూతిబూసి రుద్రాక్ష మాలికలు బట్టి మహర్షి వేషము వేసినను దర్శనీయముగా లేదు. బట్టతంపై నంటగట్టిన జడలు చుట్టు కృత్రిమమని చూచువారికిఁ దెలియక మానదు. అట్టి యోగి యొకఁ డొక యరణ్యమధ్యంబున నొక చెట్టుక్రింద వ్యాఘ్ర జినముపై గూర్చుండి జపము జేసికొనుచుండెను. దండము కుండిక లాదిపటములు గొన్ని యా ప్రాంతమం దున్నవి. ఆ యోగి కన్నులు మూయుచుఁ దెరచుచు నలు దెసలం జూచుచు జపము జేయుచున్న సమయంబున జితవతియు రోహిణియు వెంటరా నిరువురు శిష్యులతో బ్రహ్మానందయోగి యచ్చోట కరుదెంచెను. ఆ యోగి యంతలోఁ గన్నులందెరచి యోహో! బ్రహ్మానందుఁడా? ప్రయోగమున నింత జాగు జేసితి వేమిటికి? నీ కొరకు నిరీక్షించు చున్నానని యడుగుటయు నతం డిట్లనియె.

మహాత్మా! పోయినది పుణ్యతీర్థముగదా? చదివినది వేదాంతము తపశ్చర ణమే కృత్యము ఇట్టి మన కెందుండిన నేమి? ఒకచో నొక ప్రయోజనముగఁదా యేమి? మీరిందుదాక నేరింకన్న కొంతకాలమందే యుండువాఁడను, అది అట్టుండ నిండు. ఇప్పుడు వేరొకకార్యము మీతోఁ జెప్పవలసియున్నది. ఈ బాలయోగినులు సకలభోగముల విడిచి పెద్దదూరమునుండి మీ దర్శనమునకై యరుదెంచిరి మీరున్న నెల వెఱింగింప నన్నాశ్రయించుటచే వెంటఁ దీసికొని వచ్చితిని. మీకోరిక యెద్దియో తెలిసికొని సఫలము గావింపవలయు. ఇదియే నా హెచ్చరిక యని చెప్పుచు నా జవ రాండ్ర నిరువుర వారి యెదుటకు రప్పించెను.

అప్పుడు లీలావతి నిరతిశయభక్తి విశ్వాసములతో అతని పాదంబులం బడి మహాత్మా! కరుణించి నా విన్నపమాలింపవలయును. మీరు సర్వజ్ఞులు. దివ్యదృష్టిసంపన్నులు. దయాహృదయులు. తేజోనిధులు. మీరెఱుంగని ధర్మంబులు మర్మంబు లుండవు. వసుపత్నియగు యోగసక్త సత్యవతియు విద్యావతియు జ్ఞానవతియు అని చేయెత్తి శపథముచేసి చెప్పఁగలను ఆ సాధ్వీతిలకముతో దైవవశంబున మశక శిశువునకు మాతంగముతోడంబోలె నాకు మైత్రి గలిగినది. నేనామెను మానవదుర్లభమగు వరం బడిగితిని. నాకోరిక నీడేర్పు తలంపుతో నా పుణ్యాత్మురాలు మీయావుం గట్టి తెమ్మని వసువుల నియమించినది. ఆమె స్వార్థపరురాలై అప్పని చేయింపలేదు. అప్పని తప్పని యెఱుంగదు. చౌర్యము జేసియైనఁ బరోపకారము చేయుట పుణ్యమని పెద్దలు చెప్పుదురుగదా? పరోపకారపారీణు లగునట్టి వసువుల మీరు శపించినట్లు వింటిని. అశాప మెట్టిదో తెలుపుఁడు. వారిం గనికరించి శాపవిముక్తులఁ జేయుట యుచితము. అదియు నా యభిమతము. కాదంటిరేని అందులకు మూలహేతువునగు నాపైనా శాపము వ్యాపింపఁజేయుఁడు. నే నది యెట్టిదైన భరించుదాన. నిరపరాధులగు వసువులు దండింపఁబడిరని వినినదిమొదలు నాహృదయము భేదిల్లుచున్నది. నాకేపాయముం దోచదు నేను వట్టి పాపాత్మురాల మఱియొకటి కోరక అట్టివరం బడుగ నేలఁ నే నడుగకున్న నాటికీయిక్కట్టు రాదుగదా? అక్కటా! నేను మనుష్యులలోఁ గడు హీనురాలనైతి. నా బ్రతుకు నిరర్థకమైనది. మిమ్ము శరణుజొచ్చితిని. వారి శాపవిముక్తులం జేయుదు ననుదనుక మీ పాదములనుండి లేవను మీ పాదమూలమునఁ బ్రాణముల బాపికొందునని పలుకుచు నుచ్చస్వరంబున గోలుగోలన నేడువ దొడఁగినది.

అప్పు డాయోగి యబలా! వసువులుజేసిన అపరాధము కనికరింపఁదగినది కాదు. వారిపేరు దలంపెట్టినంత నాకిపుడు క్రోధము ప్రబలుచున్నది నీవిప్పుడేమియు వారివిషయ మడుగవలదు. కొన్నిదినము లిందుండుము. చిత్తము విశ్రాంతి వడిన పిమ్మట అంతయుం జెప్పెదను. నీవు విచారింపవలదు. లేలెమ్ము. నీయెడ మా కనుగ్రహము గలిగినది. అని పలికిన విని అక్కలికి వెండియు స్వామీ! వారిప్పు డెక్కడ నున్నారు వారితో యోగసక్త వచ్చినదా? ఏమని శపించితిరి. యోగసక్త నాకన్నులం బడునా? అని యడిగిన నా బడుగు సన్యాసి యేమియు మాటాడక కన్నులు మూసికొనియెను.

అప్పుడు బ్రహ్మానందయోగి నళినాక్షీ! నీవిప్పు డతి ప్రసంగము గావింపకుము. వారికీ కోపము బోఁగలేదు. వసువులవృత్తాంత మిప్పుడేమియుఁ నడుగవలదని

చెప్పలేదా ! క్రమ్మర నా ప్రసంగమే తెచ్చెదవేమి? కొన్నిదినము లిందుండి శుశ్రూష గావింపుము. వారికే దయవచ్చి నీవు చెప్పినట్లు చేయఁగలరు. తాపసు లల్పసంతోషు లని విని యుండలేదా ? పాదముల విడువుమని యుపదేశించిన విని యవ్వనితామణి యట్లు చేసినది. రోహిణి యాబడుగుజడదాని మొగము జూచుచు నట్లే నిలువంబడి యుండెను. బ్రహ్మానందుఁడు వారిం గూర్చుండ నియమించెను. అందరుగూర్చుండిరి. అప్పుడు జితవతి మెల్లగా యోగీంద్రా యరుంధతీమహాదేవికూడ రాలేదాయేమి యని అడిగిన బ్రహ్మానందుఁడు యువతీ ! ఆదేవి వారి యాశ్రమములోనే యున్నది. ఇందు రాలేదు. వీరు విలాసముగాఁ దీర్థాటనము సేయ బయలు వెడలిరి. కొంది తరిలో వీరింటికిఁ బోవుదురు. మీ పుణ్యమువలన నిచ్చటికి వచ్చిరి. కాని యిది వీరి నెలవు కాదని యేమేమో చెప్పెను కాని యమ్మానినుల కనుమానము తీరినది కాదు.

అప్పుడు బ్రహ్మానందయోగి అల్లంతదూరమున నొకపర్ణశాల వేయించి వారి నందుండ నియమించెను. అందుఁ బ్రవేశించి రోహిణి యేకాంతముగా జితవతీ ! యీతండు వసిష్ఠ మహర్షియని నీకు నమ్మకము దోఁచెనదా ? వాని మొగమందుఁ దేజమేమైనం గలదా ? బడుగు వాని నెవ్వనినో దీసికొనివచ్చి యిట్టి వేషము వైచి యీ పిన్న సన్యాసులీకల్పితమును చేయుచుండిరి. మనము వీరివలలోఁబడి యీ అరణ్యమునకు వచ్చితిమి. వీరి యభిలాషలు వేరుగా నున్నవి. ఇప్పు డేమిచేయఁ దగినదో వితర్కింపుమని పలికిన విని జితవతి యిట్లనియె.

సఖీ ! ఈ విషయము నాకును ననుమానము గలుగుచున్నది. వాని మొగమునఁ దేజము లేకపోవుట యొకటి యరుంధతీ మహాదేవి యెన్నఁడును భర్తను విడిచి యుండదని జగత్ప్రతీతికాదా ? కానిమ్ము ఏమి చేయుదుము. పరమేశ్వరుడు లేడా ? ఇట్టి కల్పితము చేసినంత వీరి కేమి లాభము వచ్చినది. మనము వీరికి వశుల మగుదుమా ! మునుపే చావఁ దెగించియుంటిమి. అయినను రహస్యముగా వారి చర్యలఁ బరీక్షించిరమ్ము ! అని బోధించినది.

మరియొకనాఁడు రాత్రి చీకటిలో నాపర్ణశాల దాపునకుఁబోయి గూఢముగా గూర్చుండి వారిమాట లాలించినది.

రమానందుఁడు—ఏమిరా బడుగ ! ఆపదతులలో దిట్టముగా మాట్లాడలేవేమి ? మే మే యని నోటిలో నేదియో గొణికికొనియెదవేమిటికి ? నీవు వసిష్ఠుడవు కావని యాపూవుబోఁడు లనుమానము జెందుచున్నట్లు తోచుచున్నది.

యోగి—నే నేమి చేయుదును. బోసినోరు మూలమున మాట స్పష్టముగా

రాదు. వాండ్రు మిగుల గండ్రలు. మాటాడిన దప్పులు బట్టుదురు. దానంజేసి, మౌనమే యవలంబించితిని.

చిదానందుఁడు—వీఁడి వేషమునకుఁ దగఁడు బ్రహ్మానందయోగి కీ వేషము వేయవలసినది, తప్పు జేసితిమి వీనిం జూడ మనకే యసహ్యముగా నున్నాఁడు వారి కెట్లుండును.

రమా—బ్రహ్మానందుఁడు మొదట నంత యభినయముఁజేయనిచో వారు నమ్మి యింతదూరము వత్తురా? ఇప్పుడా యెట్లయిన మనచేతిలోనివారే. యెక్కడికి బోఁగలరు ?

బ్రహ్మ—ఈ వేషమునకు వీఁడుతప్ప మఱియెవ్వరును దొరకలేదా? వీని వేషభాషలు బాగులేవు. నిజముగా వసిష్ఠుఁడు వచ్చి యచ్చట నిలుచున్నట్లు మాట్లాడవలదా ?

రమా—ఏమి చేయుదుము. మఱియెవ్వరును దొరకలేము. ఈ విధమకైనను నిరువదిమాడ లిచ్చుటకు నిశ్చయించితిమి. సగము సొమ్ము చేతిలో వైచినంగాని బయలుదేరనేలేదు.

బ్రహ్మ—నాతోఁ జెప్పినఁ బదుగురం గుదురుతునుగాదా ? వీఁడు చాల పెద్దవాఁడు కావున నేమియు మాట్లాడలేకున్నాడు.

రమా—వసిష్ఠ వేషమునకుఁ జిన్నవారలు పనికివత్తురా ? జడలు నెఱియ వలయుంగదా ?

చిదా—పోనిండు. ఇప్పుడేమి యనుకొన్నను లాభము లేదు. మాచేతి సొమ్ము వదలినది ఫలము గలుగలేదు. వాండ్రీ దివమున నిచ్చటికి రానేలేదు. మొదట నున్న భక్తి జితవతికిని లేదు.

రమా—బ్రహ్మానందా! మేమీ వేకువజామునలేచి ప్రయాగమున కరిగి మనోహరదాసుతో మాట్లాడి సాయంకాలమునకు వత్తుము. మీరీ లోపల నాచవలనేత్రల నిచ్చటికిఁ బిలిచి చెప్పవలసిన మాటలన్నియుం జెప్పుఁడు. ఒడంబడినసరే లేకున్న బలాత్కారమే కావింతుము.

చిదా—మేము లేకున్న వారిందువచ్చి నిర్భయముగా మాట్లాడుదురు.

బ్రహ్మ—మనోహరదాసుతో మాట్లాడవలసిన అగత్య మిప్పుడేమి వచ్చినది ?

రమా—వాఁడును మావలనఁ గొంత సొమ్ము తిని కపటము జేసెను. ఆఁడు వాండ్రతోఁ గలసి మెలసి తిరుగుచున్నప్పుడు వచ్చిన నేవియో తంత్రములు చెప్పెదనని చెప్పెను. మాకట్టి అవకాశ మిప్పుడు గలుగుచున్నది కావున వాని యొద్ద

కరిగి వశ్యౌషధములు గొన్ని సంగ్రహించుకొని వత్తుము. అని చెప్పి యాపిన్న యోగు లిరువురు నావేశవశమున లేచి ప్రయోగమున కరిగి మనోహరదాసుం గాంచి యిట్లనిరి.

అర్యా! కార్యావసరమిప్పటికి వెండియు మాకుఁ గలిగినది. ఆ కొమ్మల నెల్లో మాతోఁగూడ సంచరించునట్లు చేసితిమి. కాని వాండ్రు మాట్లాడరు. ఇప్పుడు వారినెట్లు వశము చేసుకొనవలయునో చెప్పవలయును మీ యొద్దనున్న తంత్రము లన్నియుఁ బరిశీలించి మాయభీష్టము తీర్పవలయును. మునుపటివలెనే కాక మీఁద జల్లి నంత మోహపరవశలై మీఁద బడునట్లు మందీయవలయునని మిక్కిలి వినయముతోఁ బ్రార్థించిరి.

ఆ మనోహరదాసు మరల వారివలనఁ గొంత సొమ్ము దీసికొని సుమతులారా! మీ యందలి ప్రేమచే నీసిద్ధౌషధం బిచ్చుచున్నవాఁడ నింతకుముం దీమం దెవ్వారికి నీయలేదు. దీని ప్రభావ మద్భుతము. ఈయాకు నీటిలో నుంచి పసరు వచ్చునట్లు తడిపి కోరిన నారీమణి యురోభాగంబున వైచి రుద్దవలయును. ఆ ద్రవమేమాత్రమైనను మేనిలో మిళితమయ్యెనేని నిఁక చెప్పనేల నా లలనకు మేను బరవశమై అతఁడే మన్మథుండుగాఁ దోఁచును. అతం డెక్కడికిఁబోయిన అక్కడికిఁ గుక్కలాగున వచ్చును. దీనిం గొనిపొండు మీ యభీష్టము దీర్చుకొండని పలికి యొక యాకిచ్చి వారినంపెను.

వాండ్రిద్దరు కడు సంతసముతోఁ జంపకారణ్యమునకుఁ బోవుచు దారిలో నిట్టి సంవాదము గావించిరి.

చిదా—ఓరీ! యామందు నాకిచ్చుచుండ అడ్డము వచ్చి నీవందుకొంటివేమి? నాయొద్ద నుండఁదగదా యేమి? నీ యభిప్రాయమేమి?

రమా—అట్లు కచ్చితముగా అడుగుచుంటివి. నే నందుకొననర్హుఁడఁగానా?

చిదా—ఇరువురము సమానులమే. ఇందు న్యూనాధిక్యములు లేవు. నా కర్థము రానేల అని అడిగితిని.

రమా—అడుగవచ్చును. మొగము చిట్లింపనేమిటికి?

చిదా—కానిమ్ము. ఆమెపై పసరుపిండువా రెవ్వరు?

రమా—నేను నీకంటెఁ జిన్నవాఁడను కావున నేను బిండెదను. వశవర్తినియైన పిమ్మట నీ కర్పించెదను. మన యిద్దరిమధ్యను పాండవులను ద్రౌపదివలె అయ్యండజగమన యుండఁగలదు.

చిదా—అబ్బో! ఈ కపటోక్తుల కేమిలే. నేనంత యెఱుంగని వాఁడను

కాను అమ్మదవతి పసరు పిండిన వానికే తగులమగును. రెండవ వానిం జూడదని మనోహరదాసు జెప్పలేదా.

రమా—నేను బలవంతము జేసి విసిపించనా ? నన్ను మిత్రద్రోహినిగాఁ దలంచుచుంటివా యేమి.

చిదా—నాకామాట లేమియుం జెవి కెక్కవు నీవు బిండిన నీకే. నేను బిండిన నాకే వశమగును. చెప్పిపెట్టిన ప్రీతియేమి నిలుచును ? అట్టి నమ్మకము నీకుండిన నన్నే పిండనిమ్ము.

రమా—నీమాత్రము తెలివితేటలు నాకును గలిగియున్నవి. నీవు నాకంటెఁ బలవంతుఁడవుగావు. నామాట నమ్మిన నమ్ముము. పసరు మాత్రము నీకియను.

చిదా—బాగు. బాగు. మంచినేర్పరివే బలముగల వాఁడవని నన్ను మోసము జేయుదువా?

రమా—నీకేమి మోసము జేసితిని. చేసిన పిమ్మట అడిగిన బాగుండును.

చిదా—చేతిలోఁ బడినదని పసరీయకపోవుట మోసముకాదా. కానిమ్ము. నామేనిలోఁ బ్రాణము లున్నంతసేపు నిన్నా పసరు పిండనీయను చూడుము.

రమా—రమ్ము. రమ్ము. నీబలమెట్టిదో చూతునుకాదా.

అని పలుకుచు రమానందుఁడు వడివడిగా ముందు పరుగిడఁ దొడంగెను. వాని వెంటఁ జిదానందుఁడు కేకలువేయుచుఁ బరుగెత్తుచుండెను. ఇరువురు కొంతసేపటికిఁ బర్ణశాలం జేరిరి. అందెవ్వరు గనంబడలేదు. కపట వసిష్ఠుని బ్రహ్మానందయోగిని యెలుగెత్తి పిలిచిరి. ప్రతివచనములేదు. యోగినుల పర్ణశాలం శూన్యమైయున్నది. ఆ ప్రాంతమార్గమంతయు వెదకిరి. ఏజాడయుం దెలియలేదు.

అప్పుడు చిదానందుఁడు దైవములేడా. మిత్రద్రోహము చేయువారికి విఘ్నములు గలుగఁజేయఁడా! నీ వేయాపసరురాచి యాచిగురుఁ దోడిం గూడుము. నేనూరాక విచారించుచుం బోయెదను ఎన్నడునను భవించినంగాని తెలియదు. అని వానిం దూఱుటయు రమానందుఁడు మిత్రమా! నేనూరాక యట్లంటినిగాని నిన్ను ద్రోహముచేయుదునా, మనస్నేహ మీనాఁటిదియా. నామాటలు నీవు మనసులో నుంచకుము పరిహాసమున కంటిని. ఇదిగో పసరు నీయొద్దనే యుంచుము. అయువతి కనంబడినతోడనే నీవే పిండుము అనిపలుకుచు వాని చేతం బెట్టెను. చిదానందుఁడు తలకంపించుచు బిచ్చుకల పోరు పిల్లి తీర్చినట్లు మనల మోసముజేసి బ్రహ్మానందయోగి యయ్యిందుముఖుల నెంటోతీసికొనిపోయెను. ఆపొలఁతుక కనంబడనినాఁడు నాకాపసరేపటికి అసవ యెఱింగియే నాకిచ్చితివి. నే నెఱుంగననుకొంటివా? కానిమ్ము ఎట్టైన లెస్సయే అని యాయాపు

మూటగట్టికొని రమానందునితోఁ గూడ నాయగనియంగయుఁ బెద్దాసవు వారిని వెద కెను. ఎవ్వరి జాడయుఁ గనంబడినదికాదు. బ్రహ్మానంద యోగియే యపుడు బేసి యాకాంతల దాటించెనని నిశ్చయించి వాండ్రిద్దరు మరునాఁడు ప్రొద్దు గ్రుంకక పూర్వము అడవి తెరువులన్నియు వెదకుచుఁ గ్రమ్మర బ్రయాగమున కరుదెంచి మాధవమఠంబునకుఁ జని యందు బ్రద్యుమ్నయోగిం జూచి మహాత్మా! బ్రహ్మానంద యోగి యెట్టిపని చేసెనో చూచితిరా మీ కేదియో ఋణము సొమ్మర్పించి మీమూంమున నాయోగినుల బ్రహ్మానందయోగి వశముగావించితిమి అతండు నమ్మకముగానే నాట కము నడిపించి నిన్న మేమీయూరు వచ్చినంత నా కాంతలం దీసికొని యెంటో పోయెను. బ్రహ్మానందునకు నేబడిమాదలిచ్చితిమి మాసొమ్మంతయు హరించి చివరకు మాకపకారము గావించెను. అని చెప్పినవిని ప్రద్యుమ్నయోగి అయ్యో! మీకార్యము సఫలము కాలేదా! బ్రహ్మానందయోగియు ముసలియోలయు బొద్దుటనాకు గనంబడిరే? నేనేమియు వారినడుగలేదు. బ్రహ్మానందయోగికట్లు చేసిన లాభమేమి? వృద్ధుఁడుకాఁడా అని పలుకుటయు.

వాండ్రు ఏమీ! బ్రహ్మానందయోగి యిందుజేరెనా. ఎందున్న వాఁడో వెదకి మీయొద్దకుఁ దీసికొని వచ్చెదము. న్యాయము విచారించి మాసొమ్ము మా కిప్పింప వల యును. వ్యర్థముగా ఋణము పాలైపోయితి మని పలుకును వాండ్రిద్దరు కదలి యా మఠమంతయు వెదకి యొకచోటఁ బండికొనియున్న బ్రహ్మానందయోగిని కపటవసి ష్ఠునిం జూచిరి.

బ్రహ్మానందుఁడు వారిఁ జూచి లేచి యోహో వత్సలారా! మీకొరకై యరయు చుంటిమి. మీరు వెళ్ళినవెంటనే నేనా నారిమణుల విలువుటకు వారి పర్ణశాల కరిగితిని. తెల్లవారక పూర్వమే యాయలి నేఁబు లెంటో పారిపోయిరి. ఆ యడవి యంతయుఁ వెద కితిమి. ఎందునుం గనఁబడలేదు. ఇఁక మేమందుండనేల నని యీ బడుగువాని వెంట నిడుకొని యాదారులన్నియుం జూచుచు నేఁటి మధ్యాహ్నము యిందు జేరితిమి. మీరందు బోయివచ్చితిరా? ఆ యాఁడువాండ్రు మన కపటము గ్రహించిరనుఁడీ ఈ బోసునోటి బడుగువాని మూలమున నీకుట్టు తెల్లమైనది. మంచి కల్పనయే చేసితిమి. ప్రయోజనము లేకపోయెనని యూరకఁబలికిన విని రమానందుఁ డిట్లనియె.

అదియంతయు నిజమే కావి మేము వచ్చుదనుక మీరందుండక యిందేల వచ్చి తిరి. ఈ తప్పు మీయందున్నది మేము వారి కప్పగించి వచ్చితిమి మీకుఁ దెలియ కుండఁ బారిపోవుటకు వారికి రెక్కలు వచ్చినవియా యేమి? చీఁకటిలోఁ బోలేసుగదా. తెల్లవారి పోయినచో మీరు వెంటఁబోయి పట్టుకొనఁజాలరా? మీరు తప్పక వారిందెలి

సియే దాటించిరి? కావున మీకు మేమిచ్చిన లంచపు సొమ్ము మాకీయుఁడు. లేకున్న వారి నప్పగింపుఁడు. ఈ రెంటిలో నేది కావింతురో చెప్పుఁడని యడిగిన బ్రహ్మానంద యోగి యిట్లనియె.

మీరు మాకు నియమించిన వేషములు వైచితిమి. చేయవలసిన పని యభినయించితిమి. వారిం గాచి తిరుగుటకు మేము పూటకాపులము కాము. వారు మీరు చేయు కపటము దెలిసికొని పారిపోయిరి? మేము పెద్దవాండ్రము అడవులలోఁ దిరుగఁజాలము. మిమ్ము దైవము తోడుగా మోసము చేయలేదు. మీకు సొమ్మియవలసిన యవసరము లేదని పలికిన విని చిదానందుఁ డిట్లనియె.

మా వలన మీరిద్దరు జాలి లంచము తీసికొంటిరి. ఫలముదక్క లేదు మా సొమ్మంతయు వృథయై పోవలసినదియే ఇట్టి యన్యాయ మెందైనం గలదా ప్రద్యుమ్న యోగి యొద్దకు బోవుదము రండు అతండు చెప్పినట్లు చేయుదము. అనుటయు బ్రహ్మానందయోగి అక్కడికే వత్తము పదుఁడు పదుఁడు అతఁడు మాత్రము మీ యొద్ద లంచము తీసికొనలేదా! అని పలుకుచుండ నందరు ప్రద్యుమ్నయోగి యొద్దకు బోయిరి.

## 109 వ మజిలీ.

యమునాతీరంబునఁ బ్రద్యోతన నగరము విరాజిల్లుచున్నది. అందలి ప్రజలు అకస్మాత్తుగాఁ బొంగిన యమునా వృత్తాంతమువిని యావింత జూచుటకై వేకువ జామున లేచి తీరమున కరుదెంచిరి. పాతాళము నుండి జలంబుపై కుబుకుచున్నదియో యన వలవైచినట్లు చుట్టును జేరి సుడిగుండములతో నంచుదేరిన నురగలం బడునై వట్రువట్రువుగా నీరు బొంగుచుండ నత్తరంగిణీ విశేషంబుల జనులు వీక్షింపుచుండిరి.

“భూధరసమితి” మగనికడ కరుగు మిత్రనందనకుఁ గానుక లొసంగఁ దీసికొని పోవుచున్నదియో యన మధురఫలపీతాయిత కుసుమకళ మనోహరములై సమూల పతితంబులగు మహావృక్షంబు లెన్నియేని ప్రవాహమునఁ గొట్టుకొని పోవుచుండెను. ఈతగాండ్రు పెక్కండ్రు పప్లవంబురాకుండఁ బ్లవంబుల నురంబుల నానుకొని యీడికొనిపోయి పెద్దపెద్ద మ్రానుల దీరంబునకుఁ ద్రోసికొని వచ్చుచుండిరి. మఱికొందఱు ద్రోణివిశేషంబులచేఁ గట్టెలం దీయుచుండిరి.

అట్టితరి, నదిగో పెద్ద దావవు గొట్టికొని వచ్చుచున్నది. వడిగా నీదుము. ఈదుము. దానికొఱకు కవ్వలనుండి యెవ్వడో తెప్పవాల్చుచున్నాఁడు. యొద్దునం గూర్చుండి స్నేహితులు ప్రేరేపింప నొక యీతగాఁడు తెప్పవాల్చి తెప్పున నౌక కఱ్ఱకొఱ కిడికొని పోవుచుండెను. దానికొఱకే అవ్వలి రేవునుండి మఱియొకఁ డీదు

చుండెను. తీరస్థులు వానికి హానిఁ గొరకునని పందెములు వైచికొనుచుండిరి. గాంగ్రిద్దరు నొక్కసారియే యద్దారువునొద్దకుఁ బోయి నాది నాదియని కేకలు వైచుచు దానిపై జేతులు వైచిరి.

అలయిక లుడీర నా దారువుపైఁ గాళులు మోసికొని యున్న యొక పులి వారి రొదవిని గాండ్రుమని అరచినది. ఆ ధ్వని విని యా యిరుగాండ్రు బాబో పులి పులి అని అరచుచు మరలి దరిదెస కీడికొని పోవుచుండిరి. అంతదనుక నా దారువు నూతగాఁ ప్రవాహవేగంబునం బోవ వ్యాఘ్రంబప్పుడా కాష్ఠంబు వదలి యా యొడ్డు వైపున కీద మొదలు పెట్టినది. అది వారిం దరిమికొని వచ్చుచున్నదని తలంచి తటస్థులు పులి పులి అని పెద్దకేకలు వైచుచు ధాసి ధాసి అని అందలించుచుఁ జప్పటులు గొట్టఁ బ్రారంభించిరి.

ఆ పులి మూవుపై శిరంబు మోపి పండుకొనియున్న యువతి యొక తె యా చప్పుడులు విని అదరిపడి లేచి తీరము వంక జూచుచుండెను. ఆ మృగంబు వారి అరపులకు బెదరక పదిలముగా నీదికొని పోయి వీపుపైనున్న మదవతి కదలకుండ నొకచో గట్టెక్కి నిలువంబడినది.

దానిం గాంచి యందున్న వారెల్ల పికాపికలై తలయొక్క దెసకుఁ బారిపోఁ దొడంగిరి. వివిక్తమైయున్న యా ప్రదేశమున నా యువతి పులింజిగి తడి పుట్టంబు బిండికొని పైట చెరఁగటచే నా పులిమేని తడి అద్దుచు నేదివంక జూచి యేదియో ధ్యానించుచుండెను.

మఱియు నా పెద్దపులిని ముద్దుపెట్టుకొనుచు మృగరాజమా! నీకు నే నేమి యుపకారము జేసితినని నన్నుఁ జంపక ముంపక యాదరి జేర్చితివి? నేను గృతఘ్నురాలనని యెఱుంగవు కాబోలును. అందఱి వలనం బనులఁగొనుటయే కాని యొక్కరికిం బ్రత్యుపకారము జేయఁజాలను. నీతోడి పులియు నాతోడి చెలియుం గొట్టికొని పోయిరి. వారింగలసికొందము పద పద అని పలుకుచు నా జవరాలు ఏటి తీరమున మెల్లగా నడువం దొడంగినది. ఆ పులియుఁ దోఁక యాడించుచు నామె మేను మూర్కొనుచు వెనువెంట దూడవలె నడచుచుండెను.

ఆ వింత దవ్వులనుండి చూచి పౌరులు వెరఁగుపాటుతో నోహో! యిది పెంపుడు పులి కాఁబోలు తెలియక భయపడితిమని పలుకుచు మెల్ల మెల్ల దాని దాపునకుఁ జేరికొని వెంట నడువఁ దొడంగిరి. పులి యేమియు బెదరక అమ్మదవతి వెనుక నడుచుచుండెను.

గ్రామంబునఁ బౌరులు భయము విడిచి పకతిని బులిని వింతగా జూచుచుఁ

జుట్లను మూఁగికొని నడుచుచుండిరి. వారిలో నెవ్వఁడో కొంటెతనమునకై పులిపై ఱాయిరువ్వెను. అప్పుడవ్వనచరంబుదురంత క్రోధంబున గాండ్రుమని అరచుచుఁ గొట్టిన వానిం దరిమికొని పట్టి పొట్టఁ జీల్పబోవుఁడు నానెలత అఁ అఁ వలదు వలదు. అని పలుకుచు బరుగునఁ బోయి యా యాపదఁ దప్పించినది.

అప్పుడు ప్రజలు భయోద్రేకంబునఁ బ్రోఁకఁదెంపిన పిట్టలవలె నూరుదెసలకుఁ బరుగిడఁదొడఁగిరి. అమ్మగువయు నా మృగముపైఁ జేయి వైచి మెల్లన నడుచు చుండెను. "కాళింది ప్రవాహంబున నొక యోగిని పులితోఁ గొట్టికొనివచ్చి గట్టెక్కినది. కనంబడిన వారినెల్ల నా పులి చంపుచున్నది. యమున కెవ్వరునుఁ బోఁగూడ"దని పట్టణ ప్రజలొకరితో నొకరు జెప్పుకొనుచుండిరి.

అక్కాంతయు గొంతదూరము నదీతీరమున దక్షిణముగాఁ బోయి పోయి యా మార్గంబు పడమరగానున్న వీటిలోనికి మఱలుటయు దానింబడి నడుచు చుండెను. ఆమె వెంటఁ గుక్కవలె వచ్చుచున్న పులింజూచి పశువులు పారిపోవు చుండెను. యెదురుపడిన జనులు సదనంబుల దూఱుచుండిరి. శకటంబులు లాగి కొనివచ్చు ఘోటకంబులు బాటసమ్మెటి మెకంబు గనంబడినతోడనే బెదరి సాదులు మేదిని కురుకబండ్లు తల్బిబ్బులుగాఁగఁ బగ్గంబులం ద్రెంచుకొని పెడత్రోవలం బారి పోవుచుండెను.

అప్పుడా అలజడివిని వీరభటులు పెక్కండ్రాయుధ పాణులై యద్దము వచ్చి మచ్చెకంటీ! నీ వెవ్వతెవు? క్రూరమృగము నీవిటు లేమిటికిఁ దీసికొని వచ్చితివి? దీనింజూచి పౌరులు బెదరుచున్నారు. నీవు నగరములోనికి రావలదు పోపొమ్ము దీని మేము జంపెదమని పలుకు చుండఁగనే యాసత్వంబు సత్వరమ వారి పయింబడి తొడలంగఱచి పిక్కలంబట్టిగొని మెడలఁ గోరలఁజొనిపి, దవడలఁ గోళ్ళఁగ్రుచ్చి వీపులఁగాళ్ళఁ జదిమి పీఁక నమ్ముకలఁ దృటిలోఁ జీకాకుపరచుటయు నాభటు లాయుధంబులఁ బారవైచి కేశపాశములు వీడ గట్టుపుట్టంబులు జార వేరుజూడక కాలి కొలఁది నలుదెసలకుం బారిపోయిరి.

అ తైజవయు నత్తెరఁగగని కరసరసిజంబున దాని మేను నిమురుచు మృగ శార్దూలమా? నీవట్లు ఘాతుక కృత్యంబులు గావించినఁ బ్రజలు నిన్ను బ్రతుక నిత్తురా? అయ్యో! నా ప్రాణ బంధువురాంనగు నీవు నమసిన నా బ్రతుకేమి కావలయు? తొలుత నన్నుఁ బరిమార్చుము. అక్కటా! నీవంక జూడకున్న నీవెవ్వరి జోలికిం బోవు కొట్టిన వారింబట్టుదువు అ వెక వెఱుంగక జనులూరక నిన్నుఁ జూచి వెఱచి పఱచుచున్నారు కౌరా? ఈ వీధి అంతయు నిర్జనంబైనది. ప్రజలు లోపల

దూరి తలుపులు వైచుకొనిరి. వీరి కందఱకు బాధలు గలుగఁజేయనేల ? మఱి యొక చోటికిం బోయెదంగాక అని తలంచుచు వెనుకకు మరలి మరియొక దారిం బోవుచుండ నొకదండ సమున్నతప్రాకార గోపుర మండితంబగు దేవాలయమొకటి యామెకుఁ గన్నుల పండువు గావించినది. అందున్న నెవ్వరికి బాధ గలుగదని తలంచి యా చెలి పులితోఁగూడ లోపలం బ్రవేశించినది.

## రాజయోగి కథ

రాజయోగియను సన్యాసి యొకఁడా దేవాలయములో నుత్తర దెస చావడిలో నివసించియుండెను. అతండు ప్రాయంబునఁ జిన్నవాఁడైననుఁ బ్రగల్భ వచనములచే మహానుభావుడని తోచునట్లు జనులు కథ లుపన్యాసము లిచ్చుచుండెను. మంత్రములకు గొందరు తంత్రములకుఁ గొందరుఁ సంతతికిఁ గొందరు, సంపదలకుఁ గొందరుఁ దన్నాశ్రయింప అందఱకు నాస జూపుచుఁ ద్రిప్పుచుండును.

పులివార్త విని పౌరులు కొందఱా యతి యొద్దకుఁ బోయి "మహాత్మా ! కాళిందీ ప్రవాహంబున నొక పులియుం జెలియుం గొట్టికొని వచ్చి మనయూరఁ గట్టెక్కిరి. అయ్యోష కాషాయాంబరధారిణియై జటాకలాపములతోఁ దపంబు జేయం బూనిన రెండవ పార్వతి వలెఁ బ్రకాశించుచున్నది. ఆ పులి యాచెలికడ దూడ వలె మెలంగుచు మృత్యువువలెఁ బ్రజలపైబడి కఱచుచున్నది. వీరభటులం బెక్కండ్రఁ జంపినది. దానికా యోగినీ ప్రభావంబున నెక్కుడులేని బలము వచ్చినది. వీరభటులు వెరచి పారిపోయిరి. మీరు వచ్చి యా పులి యుపద్రవము దప్పింపవలయును. మీ తంత్రము ప్రదర్శింప అవసరము వచ్చినది. క్రూర మృగముల దూడలవలె వశము జేసికొందుమని యింతకుముందు మీరీవీఁటఁ బ్రకటించి యున్నారు గదా ! రండు రండు అని పలికిన విని యా యోగి అబ్బురపాటుతో విని యేమీ ! యోగినియా ! పులితో వచ్చినదియా ! కానిండు అందులకు మీరింత వెరువనేల ? పులినిఁ జెలినింగూడ మంత్రబద్ధులం జేసి యిందు రప్పించెదఁ జూడుడు. అని పలుకుచుండగనే యాచిన్నది పులితో గుడికిఁ బ్రదక్షిణము చేయుచు నుత్తర దెసకుఁ బోయినంత నందున్న ప్రజలు బాబో బాబో పులి యిక్కడికే వచ్చినది అని కేకలు వైచుచు మూలమూల స్తంభములచాటున దలుపులవెనుక దాగఁదొడంగిరి. ఆయోగి అందఱికన్న ముందు యందున్నగదిలో దూరి తలుపువైచుకొని గవాక్షము నుండి చూచుచుండెను.

పులి యెవ్వరివంకం జూడక యా యువతి వెంట మెల్లన నవ్వలికిం బోయినది. అప్పుడు ప్రజలు తమ్ముఁ బునర్జీవితులుగాఁ దలంచుకొని స్వామీ ! మీరిన్నియుం జెప్పి

పులింజూచి లోపఁ దూఱితిరేం ? పులియావలఁ బోయినది తలుపులు తీయుఁడని పలుకుటయు నయ్యోగి కవాటములఁ దెరచి లోనికిరండు. అది క్రమ్మర నిటు రాఁగలదు భస్మము జల్లి నాఁపరచెదఁ జూడుఁడు నామహిమచేతనే యిందు వచ్చినది. క్షణమోర్వుఁడని పలికి వారినందఱ లోపలికి రమ్మని తలుపువైచి భస్మము మంత్రించుచుండెను.

అంతలో నాతలోదరి రెండవ ప్రదక్షిణము చేయుచుఁ బులితో సీదరిం బోయినది అప్పుడా మంత్రభస్మము పులిపైఁ జల్లుచు నాయోగినీ సౌందర్య మక్కజపెటులోఁ జూచిచూచి కందర్పభల్లములఁ దల్లము వశపరచి పరవశుండై యుండెను.

ప్రజలు స్వామీ ! మంత్రభస్మము జల్లితిరిగదా. ఇఁక మేము పోవచ్చునా యని యడిగిన పొండు పొండు ఆపులి నీజోలికి రాదని యుత్తరము జెప్పెను.

మూఁడవ ప్రదక్షిణములో నాపులి వారికన్నులం బడినతోడనే వారిలో నొకయొండివాఁడు చొరవజేసి దానివెంబడి నడువసాగెను. అది వాని నేమియుం జేయకుండుటఁజూచి మరికొందఱు మెల్ల మెల్ల వెనుక నడువఁజొచ్చిరి. ఆపులి యెవ్వరి వంక జూడక యాచేడియ వెనుక నడుచుచుండెను. క్రమంబు నందున్న వారందఱు రాజయోగి మంత్రబద్ధంజేసెనని నిశ్చయించి వెకవుడిపికొని యాపులి దాపునకుఁ బోయి చూచుచుండిరి.

అపూపఁబోణియు దేవుని మువ్వూరు వలఁగొని స్వామియెదుర నిలువంబడి కన్నులు మూసికొని ధ్యానించుచుండెను. అప్పుడాపులి యావెలిప్రమోల గద్దెపైచుకొని కూర్చుండెను. ప్రజలు వింతగాఁ జూచుచుండిరి.

కొందఱా రాజయోగియొద్దకుఁబోయి మహాత్మా ! నీమంత్రమహిమ మిగులఁ గొనియాడఁదగియున్నది ఆపులి చూచినంతనే మీఁదఁబడి చంపుచున్నదని చెప్పుకొనుచున్నారు అట్టిజంతు విప్పుడు దూడవలె నెవ్వరిజోలికిం బోక దేవునిమోల గద్దెపైచుకొని కూర్చున్నది. మీరువచ్చి చూడుఁడని చెప్పిన నుబ్బుచు నాసన్యాసి ఇసిరో! యిది యొక యబ్బురమా ! పులిమాటయేమి ! చెలింగూడ శిష్యురాలిం జేసికొనియెదఁ జూడుఁడు అని పలుకుచు నందుండిన ముఖమంటపము దాపునకువచ్చి యచ్చిగురుబోణి నెగాదిగఁ జూచి కనుబొమ్మ లెగరవైచుచు నిట్లనియె.

యోగినీ ! నన్నిటు చూచుము నీకంటెఁ బెద్దవాఁడగు యోగుం డిందుండ వచ్చి నమస్కరింపకుండుట తిరస్కారభావముగదా ! ఇది యోగినీధర్మమే ! నేనుత్తరదేశారణ్యములలోఁ బెద్దకాలము తపముజేసి ప్రస్తుతము లోకోపకారమునకై దేశాటనము చేయుచున్నవాఁడ. నాపేరు రాజయోగియంత్రుఁడు. నా నెలవునకురమ్ము.

మంత్రరహస్య విశేషము లుపదేశించెద నని పలికిన నాశలికి ఇంచుక కన్నులు తెరచి చూచి సన్యాసులందఱుం గపటాత్ములని నిశ్చయించుకొనియున్న కతంబున వాని మన్నింపనొల్లక మరల కన్నులు మూసికొని యేమియు మాట్లాడినదికాదు.

అప్పుడాసన్యాసి మోమున నలుకతోప సెబాసు ! మంచియోగినివే. నా మహిమ యెఱుంగక యవమానము జేయుచునదాన్నవు నీ పులి క్రౌర్య మడంచినట్లె నీగర్వ మడంచెదను చూడుము అబ్బా ! జేగురు కడ్డం గట్టినంతమాత్రమునం బెద్దలం దిరస్కరింపవలయునా ! యిప్పుడు నాపాదములంబట్టి శరణుజొచ్చిన మంచిది. లేకున్న నిన్నిప్పుడు కుక్కను జేయుదు చూడుము. అని పలుకుచు భస్మ మరచేతిలోం దోసికొని యేదియో యుచ్చరించుచు నాపైకఃమీది కూడెను. అప్పుడా చిన్నది మోము చిట్లించుటఁజూచి యాపులి విజయకాలవలాహకము భంగి బొబ్బఁబెట్టుచుఁ గొబ్బున నాసన్యాసితొడఁ బట్టికొని నేలం బడ్రదోసి యవ్వలి యావరణలోని కీడ్చుకొనిపోయినది.

అప్పు డప్పడఁతి అయ్యయో ! చంపకు చంపకు మృగరాజమా విడు విడు అని కేకలు వైచుచు వెంటఁబడినది అనన్న గ్రహించి యా సన్యాసి నాసన్నమరణుం జేసి యంతటితో విడిచి యప్పడఁతి యొద్దకు వచ్చినది అప్పు డందున్న వారందరు పెద్దపులి సన్యాసిం జంపినది చంపినది అని యరచుచుఁ దమ్ముఁగూడఁ జంపునను వెరపుతో గోడలెక్కియు ద్వారముల దూరియు నవ్వలకుఁ బారిపోయిరి.

అని యెఱింగించి — ఇట్లని చెప్పందొడంగెను.

# 110 వ మజిలీ.

## ప్రభాకరుని కథ

ప్రద్యోతనుఁడు—తరువాత తరువాత.

అర్చకులు—దేవా ! రాజయోగి పట్టి బంధించినది. అతని మంత్రముపలన బులి నిలిచిన దనుకొంటిమి. యేమియునులేదు. అ తాపసిపైఁ బూతి నూడినం జూచి గాండ్రుమని యరచి తొడఁగరచి యీడ్చుకొని పోయినది. అచిన్నది అడ్డ పడకున్న నీపాటి కాసన్యాసి సమాధిలో నుండును దేవా !

రాజు—రాజయోగి బ్రతికియున్నవాఁడా ?

అర్చకులు—చావుతప్పినదికాని గాయము లింతటిలో గుదరవు.

రాజు—అయ్యోపాపము వానికిఁ దగిన నుపచారములు జరుగు చున్నవియా? ఇప్పు డెందున్నవాఁడు ?

అర్చ—గోపురము వేదికపైఁబడి మూల్గుచున్నవాఁడు. అది యట్లుండె. నేఁడు స్వామికి నైవేద్యములేదు. గుడిలోనికిఁ బోవుటకు భయమగుచున్నది. ముఖ మంటపములో నాపులి గద్దైవెచుకొని కూర్చున్నది. యేమిచేయవలయునో చెప్పుడు అని నుడివిన విని యారాజు కుమారుని రప్పించి ప్రభాకరా! యోగినీచరిత్రము వింటివా? పులితో యమునలోఁ గొట్టిగొనివచ్చి మన శివాలయములోఁ బ్రవేసించిన దఁట యోగినీప్రభావమున నాపులి యజేయంబై చూచినవారినెల్ల జంపుచున్నదఁట. గుడిలోనున్న రాజయోగిం గరచి ప్రాణావశిష్టుం జేసినదఁట నీవుపోయి యా యుపద్రవమునాపి ప్రజలం గాపాడుము. పులి దాపునకుఁబోక వినయముతో నాయోగినిని ప్రార్థించి యవ్వలికిఁ బంపుము. నేఁడుస్వామికి నైవేద్య మాగిపోయినదని పలికిన విని ప్రభాకరుఁ డిట్లనియె.

ఏమీ! యీయూర నాఘాతుకమృగ మింతక్రౌర్యము జరుపుచుండ నాకేలఁ జెప్పితిరికారు అక్కటా! రాజయోగిం గరచినదియా? అయ్యయ్యో! అతండు బహుతంత్రవేదియని నాతోఁ జెప్పెనే ఆయోగిని వానికన్న నధికురాలు కాఁబోలు. పోయివచ్చెద ననుజ్ఞయిండు. అని పలికిన ప్రభాకరునితో బాబూ పదిలముసుమీ! మహాత్ముల ప్రభావమచింత్యము. శాంతమునఁబోయి ప్రజల యుపద్రవ ముడిపి రమ్మని చెప్పినంత నా రాజనందనుం డప్పుడ తగుపరివారముతో నర్చకులవెంట శివాలయమున కరిగెను.

గోపురము వేదికపై మూల్గుచున్న రాజయోగిం గాంచి ప్రభాకరుఁడు జాలి పడుచు మహాత్మా! మీరు పులివాత నేమిటికిఁ బడితిరి? ఆ యోగిని మహిమ తెలియక నిందించితిరఁట కాదా! ఇది యొక ప్రారబ్ధము చింతింపకుఁడు అని యూరడించి యుపచారములఁ జేయ గొందఱఁ బరిచారకుల నియమించి వేరొక మందిరమునకుఁ బంపెను.

తరువాత అతండు గుడిలోపలి యావరణలోనికిం బోవ ప్రయత్నించిన అర్చకులు వారించిరి. అప్పుడు గోడ యెక్కి లోపలి విశేషంబులఁ బరికింపుచుండెను.

అప్పుడా చిన్నది తన రెండు చేతులతో నాపులినోరు పెకలించి ఫలముల లోనికిఁ జొనుపుచు మృగేంద్రమా! నన్నేల వేపెదవు? ఆహారము దినక యెన్ని దినము లిట్లుపవాసము జేయుదువు? ఈ ఫలముల భక్షింపుము అయ్యో! నీ దౌక్కలు రెండు అంటుకొనిపోయినవిగదా నా కర్మము నీ సహవాసము నాకేల రావలయును యోగసక్తను శాపగ్రస్తం జేసితివి నీవునుం గుశువకగెదసితివేని నావెంబడి పొద్దుణ్ణ

మగును తినము తినుము. అని ప్రతిమాలికొనుచు నాఫలములను నోటియందిడి బెదిరించినది.

ఆ పులియు నాచెలి చేయి నోటిలో నున్నంతసేపు నోరు దెరచికొని చేయి తీసినతోడనే యా ఫలముల గ్రక్కివేసినది.

ఆ వింతయంతయుఁ బ్రాంతమునుండి చూచుచున్న ప్రభాకరుడు విస్మయము జెందుచు న్నౌరా! యిది యెక్కడి సౌందర్యము! యెక్కడి పులి? యోగిని యన నేమియో యనుకొంటిని ఇది యోగిని కాదు జగన్మోహిని. ఆమె పులినోటిలోఁ జేయి పెట్టినను గరువకున్నది. రాజయోగి నెట్లు కరచినదియో! తపఃప్రభావసంపన్నురాలగు నీ యోగినినిం జూచి నాడెందము కందర్పశరాయత్త మగుచున్న దేమి పాపము! ఈమగువ నెప్పుడో చూచినట్లున్నదే! యిట్టి శాంతుగాలు పులిచే బ్రజలం బాధింపఁజేయునా? పులి నన్నుఁ జంపినం జంపుఁగాక దాపునకుఁ బోయి యా యింతి వృత్తాంతమడిగి తెలిసికొనియెదం గాక అని తలంచి యా గోచ గుభాలున నురికి యా కలికి దాపునకుం బోయెను.

ఆమె యప్పుడాపులి మొగము తనతొడపై నిడుకొని లాలించుచుండెను. ప్రభాకరుం డామె యెదుటకుఁబోయి వినయవినమితోత్తమాంగుఁడై మ్రొక్కి దేవీ నీవు త్రిభువన పూజ్యురాలవు. నీ దర్శనముఁజేసి నేను గృతార్థుండనైతిని. నాకన్నులం కలిమి సార్థకమయ్యెను. నేను నగరాధీశ్వరుఁడగు ప్రద్యోతనుని కుమారుండను. నా పేరు ప్రభాకరుడందురు. ఈపులి ప్రజలం బాధింపుచున్నదనియు రాజయోగిం గరచినదనియుఁ జారు లెఱింగింప నన్నానృపతి నీ యొద్దకు బుత్తెంచెను. విన్నతెరంగు కల్లయని తలంచుచుంటిని. నీవంటి తపశ్శాలిని లోకములకు గీడు పాటించునా? మఱియు నీపులిని ఫలములం దినుమని బ్రతిమాలుచుంటివి. ఇది వేళాకోళము కాదా? మాంసము దినెడి పెద్దపులి పండ్లు తినునా? బాగు బాగు. నీవల నిది యు వ్రతము వహించినదియా యేమి? దీనికి మాంసముఁ జెప్పించి యిచ్చెదు. నీవు నిరాకరింపకుము. మఱియు నీ ప్రాయమా! మొదటిది. రూపమా! త్రిభువనానేచనరసము. వ్రతమా! అనన్య దుర్లభము. ఇట్టి నీ వృత్తాంతము విన నెవ్వరి కుతూహలమ్ముగాకుండును? నీ మొగ మెన్నఁడో చూచినట్లున్నది. నీ జన్మ దేశ మెయ్యది? తలిదండ్రు లెవ్వరు? ఏమిగోరి యిట్టి కర్కశవ్రతము బూనితివి. అయ్యయ్యో! ఈ నారచీరలేడ! ఈ దేహలత యేడ! ఈ జటాకలాపమేడ! పరిష్కారణోచితమగు నీమే నిట్లు కుష్మీకపవాసములచేఁ గృశింపఁ జేయుచుంటివేమి? నీ తేజము జూడ నుత్తమవంశ సంజాతురాలవని తోచుచున్నది. విన నేనర్హుండనేని నీ వృత్తాంత మెఱింగింపుమని వినయముతోఁ బ్రార్థించెను.

అప్పుడా చిన్నది వానిం జూచియుఁ జూడనట్లభినయించుచు మా తల్లిదండ్రులితనికే నన్ను, బరిణయముజేయ నిశ్చయించిరి. నా చిత్రఫలకము చూచియున్న కతంబున నిట్లనెను. ఔరా! దైవ నియోగము యిన్ని దేశములుండ నీ పురమే రావలయునా? అని తలంచుచు మేము సకల సంగత్యాగినులమగు యోగినులము. మా వృత్తాంతముతో మీకేమిపని? ఈపులి ఘాతుకమైనదికాదు. తన కపకృతి జేసిన వారిం గరచును. ఇతరులజోలికిఁబోవదు. అదియుంగాక రేపో నేడో చావనున్నది. దీనిబాధ మీకుండదు. పొండని పలికి యక్కలికి కన్నులు మూసికొన్నది.

ఆమాట లాబోటి నోటనుండి వెల్వడిన వీనుల కమృతము సోకినట్లు మురిసి యుచు నాహా! కట్టి మోహనాంగితో నిమిషము సంభాషించినం జాలదా? ఇంద్రలోక సౌఖ్యమేమిటికి? అయ్యో! యీమె తపశ్చారిణి అని యెఱింగియు నే నిట్లు మోహమందెద నేమిటికి? ఇది మహాపాతకము! పాతకము శమించుగాక. అని అతండు తలంచు చుండెను.

భటుడు వలదనుచుండఁ బ్రభాకరుడు గోడదుమికి గుడికోనికిం బోయెననియుఁ బులియాతనిం గరచినదియనియు నెవ్వరో పోయి పట్టికోత్తనున కెఱింగించిరి. ఆ వార్త విని యొడయఁడు కడునదలుచు నపరిమిత పరివారముతో నాయాలయము దాపునకు వచ్చెను. అంతకు పూర్వమే పులి యీవలకు వచ్చునని తలుపులు మూయబడి యున్నవి.

వీరభటులు పటుధైర్యముతో గోడలెక్కి నలుమూలలు చూచుచుఁ బ్రభాకరుని జాడ నరయుచుండిరి. వింట శరము సంధించి పులిం గురిజూచి వారిలో నొకఁడు వేయుటయు నాబాణ మాపులి కాలికిం దగిలి క్షతము గావించినది.

అప్పుడా వ్యాఘ్రం బద్రత విలయార్భటంబు పగిది నార్చుచుఁ బేర్చిన క్రోధంబున విచిత్ర లంఘనంబున నాతూపు వచ్చిన దావెనిపోయి యేసినవానిం బట్టికొని నేలం బడద్రోసినది. అప్పు డందున్న వీరు లందఱు దద్దరిల్లి భయకంపితగాత్రులై నేలం గురికి నాయుధంబులఁ జారవిడిచి యధాయధలై పారిపోయిరి.

అప్పుడు జితవతి లేచి యాపులిం జీరినది. అది తృటిలోవచ్చి అందు నిలువం బడినది. దానికాలి వ్రణము జూచి యాచిగురుఁబోణి దుఃఖించుచు వ్యాఘ్రరాజమా! నీకుఁ గౌర్యము సహజమగుట నీవు సాధువైయున్నను నసాధువుగానే తలంతురు. నీమీఁదికి రానిదే నీవెవ్వరికిని హానిసేయవు ప్రజయి నిన్నెట్లును బ్రతుకనీయరు. నీకర్మము నే నేమిసేయుదు నని పలుకుచు నాపుండునుండి రక్తము గారుచుండఁ దన పయ్యెదచే నద్దుచు గట్టుగట్టి మంట తగ్గుటకు నోటితో నూదుచుండెను.

అవింతయంతయు దాపుననుండి కన్నులార జూచుచుఁ బ్రభాకరుఁడు దేవీ! నీవింక విచారింపకుము. దీనికిఁ దగిన యాహారము పెట్టించెదను. ఎవ్వరు దీనిజోలికి రాకుండఁ జేసెదను. నీవూరడిల్లుము. దీని కొరకు నీవు గంటఁ దడిపెట్టుట ధర్మమా? సర్వసంగములు విడిచితివి. ఆశ్రితవత్సలతగాని నీకిది మమత్వముగాదు. నేఁబోయి వచ్చెద ననుజ్ఞ యిమ్ము అని పలుకుచు నతండటఁ గదలెను.

పులి లోపల నల్లరిజేయుచున్నదని విని కుమారున కేమి మోసము వచ్చెనో యని వెరచుచు దలుపులు తీయించి లోపలఁ బ్రవేశించి యెదురు వచ్చుచున్న ప్రభాకరుం జూచి యత్యంత సంతోషముతోఁ గౌఁగలించుకొని నాయనా! యీపులి నిన్ను గరచినదని చెప్పిరి. యెట్లు తప్పించుకొని వచ్చితివని యడిగిన రాజకుమారుం డిట్లనియె.

తండ్రీ! మనము వినినదంతయు నసత్యము. తప్పంతయు మనయందే యున్నది. ఆపులి సాధువులలో సాధువు. ఆయోగిని కడు మహానుభావురాలు అని యచ్చటఁ జరిగినకథయంతయుం జెప్పెను.

ప్రద్యోతనుఁడా యుదంతము విని మిక్కిలి యక్కజము జెందుచు నందెవ్వరిం బోవలదని యాజ్ఞాపించి కుమారునితో నామెకుఁ గావలసిన సంభారములు తీసికొని స్వయముగా నర్పింపుమని చెప్పుచు నందఱితో నింటికిం బోయెను.

ప్రభాకరుఁడు నాఁటి సాయంకాలమున మాంసము ఫలములు పాలు బట్టించుకొని యక్కడికిఁ బోయెను. పులి చచ్చినది. దానిపైఁబడి యోగిని యిట్లువిచారించుచున్నది.

ఉ. అక్కట! నీవు పన్విడిచి యవ్యయ సౌఖ్యము నొందఁ బోయితే
యక్కడ నీపరోపకృతి నాత్మలనెంచి నిలింపు లెల్ల స
న్మిక్కిలి గౌరవింతురుపుమీ! మృగరాజమ! దిక్కుమాలి నే
నొక్కతె నేమిసేయుదునయో యిటఁగుందుచు మిత్రఘాతినై.

సీ. తెరవుగానక కానఁ దిఱిగెడుతఱి దారిఁ
జూపి యధ్వశ్రమ బాపినావు
యమునానదీ ప్రవాహమునఁ గొట్టికొనిపో
వఁగఁ దెప్పవగుచుఁ గాపాడినావు
తలవరుల్ నిలిపి పోవలదన్న హుంకార
మొనరించి యాటంక మడిపినావు
దుష్టాత్ముఁడగు యోగి దూరి పీఁకకు నూఁదఁ
బొదబట్టి యన్నలఁ దోలినావు

గీ. దరికిరాకుండఁ గ్రూరుల దరిమినావు
కనిన కూఁతురువలె నన్నుఁ గాచినావు
పోయితివె నన్నువీడియా పుణ్యసీమ
సకలగుణధామ! యోమృగ సార్వభౌమ.

చ. విడచితి సర్వబంధువుల వివేకములేక పురంబుఁబాసి కా
ఱడవుల సంచరించితి మహావ్యథలందితిఁ గార్యసిద్ధి కో
ప్పడ దడిగాక ప్రాణములఁ బ్రాణముల రోహిణి గోలుపోయితిన్
గడసటిమిత్రుఁ నన్నును బోకార్చె విధాత యిఁకేమిజేసెదన్.

గీ. తండ్రి కరణి మేటిదాదియట్లు వినేయు
భాతి, బిడ్డవోలె మాత రీతి
నిన్నినాళ్ళు కాచితీవెన్న నెయ్యంపు
చెలివిగాక పెద్దపులివె నాకు.

గీ. త్యక్త మొనరించి తల యోగసక్త చెలిమి
పురము బాపితి రోహిణి బొలియఁజేసి
తాత్తమగు దీని గెరపితి వహహ కష్ట!
యేమి కావింపఁగలవు నన్నింకమీద.

అని అనేక ప్రకారముల నప్పులి కళేబరముపై దుఃఖింపుచుఁ గన్నీటిధారచే దానియొడలు దడుపుచుండెను.

అని యెఱింగించి—ఇట్లని చెప్పదొడంగెను.

# 111 మజిలీ

## పెద్దపులులకథ

తండ్రీ! వినుము పులి చచ్చినది. యా చిన్నది దాని మేనిపైఁబడి యూరక వగచుచున్నది అబ్బా! యెట్టి యుపద్రబంధువులకైనను నట్లు విచారింపరు దానిగుణంబులం దలఁచుకొని కన్నులం నశ్రుజలంబులు ప్రవాహముగాఁగార వెక్కి-వెక్కి- యేడ్చుచుండెను. ఆమె దుఃఖముజూచ నాకును శోక మాగినదికాదు. ఎన్నియో శోకోపశమము లగు మాటలు జెప్పితిని కాని యామె వినిపించుకొనలేదు.

అప్పుడు నే నాలోచించి దేవీ! నీకు దీనిచర్మము దీయించి యిచ్చెదఁ బరిధానముగా ధరింపుము. అని పలికిన నంగీకారము సూచించినది. అందే చర్మము దీయించి పరిశుభ్రము చేయించి యామె కర్పించితిని అమత్తకాశిని యాకృతి నాస్తరణగా నుపయోగింపక మడపపెట్టి దేవుని పెట్టివలెఁ బూజించుచుండెను. ఆమెకు దానియందు గట్టి

విశ్వాసము గలదు. సర్వసంగత్యాగిని యైనను నామెకా పులి యందుగల మమకారము పామరులకైన నుండదు.

తరువాత నేను రెండు మూడుతేపలు పాలును ఫలములు పూవులు పట్టించుకొని యందు బోయితిని. కాని నాతో నేమియు మాటలాడినదికాదు. నా రాకయు నిష్టము లేనట్లు గ్రహించి తరుచు పోవుట మానితిని.

నేఁడి యుదయమున బోయి చూడ నామెజాడ గనంబడలేదు. జనసంపర్క మొల్లక యెంటో పోయినది. ఇదియే యామె వృత్తాంతమని ప్రభాకరుఁ డెఱింగించిన విని ప్రద్యోతనుండు వత్సా! జడభరతుండను లేడిపిల్లకై మమకారము నొందినకథ నీవు వినలేదా? మహాత్ముల చరిత్రలు విచిత్రములు. ఆమె యుత్తర దేశాధ్యములలోఁ దపము జేసికొనుచుండ నకస్మాత్తుగ యమునానది పొంగుటచేఁ బులితోఁ గొట్టికొని వచ్చినది. అది ఆశ్రమమృగమై యుండవచ్చును. పోనిమ్ము ఎవ్వరినేమని శపించునో యని వెరచుచుంటిని. శాంతముగా నూరు దాటినదిగదా? అని పలుకుచున్న సమయం బున ద్వారపాలుఁడు వచ్చి దేవా! నమస్కారము. రాజభటులొక యోగినినిం బట్టి కట్టి తీసికొని వచ్చి ద్వారమున వేచియున్నారు. ప్రవేశమునకు సెల ? యని యడిగిన నా యొడయఁడు జడియుచు అక్కటా! యోగిని నేమిటికిఁ గట్టినారు, ఇది యనుచితము గాదా! సత్వరముగాఁ దీసికొని రమ్మని యాజ్ఞాపించెను.

చేతులకు సంకెళంబులం దగిలించి రాజభటులా యోగినిని రాజు ముందర నిలువంబెట్టిరి. ప్రభాకరుఁడామె యాకార మొగ్గడగఁ జూచి తల్లడిల్లి యీమె యామెకాదు అనుటయు రాజు వెరచుచుఁ జేతిగొలుసులు విడిపించి యీమె జేసిన తప్పేమియో యెఱిగింపుఁడని యడిగిన దండనాథుం డిట్లనియె.

దేవా! ఇది వేషమునకే యోగినిగాని క్రియలచే గజదొంగగా నుండునది. కొలఁది దినములక్రిందట. నొకతేయి మత్స్యపురిలో నొక భాగ్యవంతుని యింటిలోనికి జని పండుకొనుటకుఁ దావడిగినదట. సన్యాసిని యని పూజించి దీని నింటిలోనికిం దీసి కొనిపోయి పండుకొనఁ బెట్టిరి. ఈ రండ యింటి వారందఱు నిద్రించుచుండ నర్ధ రాత్రంబున దలుపులుదీసి జాడలచెప్పితోటిదొంగలచే నిల్లు కొల్ల బెట్టించినది.

తెల్లవారిన వెనుక నిల్లుజూచికొని యజమానులు గొల్లున నేడ్చుచుండ నీ గండ రగడం బారింకన్న నెక్కడుగా వగచినదట ఆ సమాచారము విని మేము పోయి జాడలుదీసి నిజము దెలిసికొని దీనింబట్టికొని తీసికొని వచ్చితిమి. ఎన్నిగొట్టినను మ టాడదు. ఇంత మొండిగరాను పుడమిలో లేదు. కుడువక త్రాగక యెన్ని దినము లైన నుపవాసములు చేయఁగలదు. ఈ వెడిపె యవ్వల నెక్కడనో దొంగతనము

జేసి యోగినీ వేషము వైచుకొని రాత్రికి రాత్రి యమునానది నీదికొని మత్స్యపురి జేరినదఁట. సాక్షులు విచారించి దీనికిఁ దగినశిక్ష విధింపవలయును. అని దండనాథుఁడు నివేదించుటయు రాజు ఇందుకు యాలోచించి సాక్షు లెవ్వరని అడిగెను.

మత్స్యముఖుడు జాలహస్తుడు అనువారల నెదర నిలువంబెట్టి వీరే ముఖ్య సాక్షులు. అని దండనాథుఁడు చెప్పినంత రాజు జాలహస్తు నవ్వలికిం బొమ్మని మత్స్యముఖునిం జూచి నీవేమిచూచితివో చెప్పుమని యడిగిన వాఁడు మ్రొక్కుచు నిట్లనియె.

స్వామీ! ఏటికి వరద వచ్చినదని విని యొకనాఁడు తెల్లవారుజామున నేనును జాలహస్తుండును దెప్పలెత్తుకొని యమునకు బోయితిమి. మిన్నంటఁ బొంగిన యా నదిలో నప్పుడు మ్రాకులు మ్రాకులు కొట్టుకొని పోవుచుండెను మే మొక దారువుం జూచి మంచిదని యెంచి దెప్పలు వాలిచి యిరువురము నీదికొనిపోయి దానిం బట్టి కొంటిమి. అదికర్రగాదు చచ్చినపులి ఆ పులిపై నీమె పండుకొని యున్నది. మొదట జడిసి పులి చచ్చినదని తెలిసికొని యీమెను మెల్లన మా తెప్పపై నెక్కించుకొని యొడ్డు జేర్చితిమి.

ఒడ్డున నిలుపంబడి యీమె కన్నులం దెరచి నలుమూలలు చూచుచు జితవతీ! జితవతీ! సఖీ! జితవతీ! యన యెవ్వరినో పిలిచినది. ఎవ్వరుం బలుకలేదు. మీ రెవ్వరని మే మడిగిన మా కేమియు సమాధానము జెప్పక చేతులతో నేదియో సంజ్ఞ జేసినది. మా కేమియుం దెలిసినదికాదు. ఆమెను గట్టెక్కించి యూరి దారిజూపి మే మింతకుం బోయితిమి. మరునాఁడు రాజభటులు మా యింటికివచ్చి మమ్ముం బట్టికొని యేమేమో చెప్పుమని మాకు బోధించిరి. కాని యా మాటలేమియు జ్ఞాపకములేవు. ఇదియే నే నెఱింగినకథ యని మత్స్యముఖుఁడు చెప్పెను. జాలహస్తునడుగ నా మాటలే చెప్పెను.

అప్పుడు దండనాథుఁడు దేవా! వీండ్రు దీనివలన లంచములు దిని తిరిగి పోయిరి. మరికొందఱు సాక్షులు గలరు. గడువిచ్చినఁ దీసికొని వత్తుమని పలుకుచుండ నదలింపుచు చాలు చాలు మీ కల్పనలు దెలిసినవి. సాధుజనులపై నసత్యములు పలికినఁ బుత్రమిత్ర కళత్రాదులతో నశింతురుసుమీ! ఈమె కాదు మీరు శిక్షార్హులు పిమ్మట మీ పని విమర్శింతుము. పొండు పొండు అని రాజు వారిని మందలించి కుమారుని వంక జూచెను.

ప్రభాకరుఁడు తండ్రితో జనాంతికముగా నీ యోగినికి మొన్న వచ్చిన యోగినికి నేదియో సంబంధమున్నది. రూపభేదమున్నను నిరువురు గట్టిన పుట్టము లొక్క-

టియే యిరువురు పెద్దపులులతో యమునానదిం గొట్టికొని వచ్చిరి. వీరియం దెద్దియో యమానుష ప్రభావమున్నది. ఈమె నడిగి తెలిసికొనియెదంగాక సభ మగింది యరుగఁడని చెప్పుటయు నతం డట్టుకావించెను.

తరువాతఁ బ్రభాకరు డా యోగినికి నమస్కరించుచు దేవీ! నీ విధం బెఱుఁగక మా కింకరులు నీ కపచారము గావించిరి. మా తప్పు సైరింపవలయును. మఱియు నీ వలెనే పెద్దపులితో మొన్ననాక యోగిని యమునలోఁ గొట్టికొనివచ్చి కొన్ని దినములు మాయూర నున్నది. పాప మాపులి నమసినది. విచారించుచు నమ్మించుఁబోఁడి మొన్ననే యెక్కడికో పోయినది. ఆ యోగిని వృత్తాంతము నీ వెఱింగియుందువు. మీ రెందలి వారలు. తొలిప్రాయములో నిట్టి వైరాగ్యప్రవృత్తి వహించుటకుఁ గతంబేమి? మీ వృత్తాంత మెఱింగించి మమ్ము గృతార్థుఁ గావింపుము.

నాఁడు గట్టెక్కినతోడనే జితవతీ! అని పిలిచితివఁట ఆ జితవతి యెవ్వతె? నీ కెట్టి సఖురాలు? నేను బ్రభాకరుఁడను వాఁడ ప్రద్యోతనుఁడను నరవరుండు నాకుఁ దండ్రి. మేమీ దేశాధిపతులము ఇదియే మా వృత్తాంతము ఇఁక నీ కథ యెఱింగింపక తీరదని మిక్కిలి వినయముతోఁ బ్రార్థించుటయు నా యోగిని మోహించుక యెత్తి యతని వంక జూచుచు నిట్లనియె.

రాజపుత్రా! నా చరిత్రము కడువిచిత్రమైనది పిమ్మట నెఱిగించెద మీ యూరు వచ్చిన యోగిని యెన్నియేండ్లది? ఎట్లున్నది? ఎన్నిదినము లిందున్నది? ఎందుబోయినది? పులితోవచ్చి గట్టెక్కినదా? అని యడిగిన నామె కాతఁడా యోగిని వృత్తాంతమంతయు వెండియు సవిస్తరముగా నెఱింగించెను.

ఆకథవిని యాయోగిని జితవతి కా నిశ్చయించి అహా! ఈ ప్రభాకరునికే నాసఖురాలి నిచ్చుటకు నిశ్చయించిరి. మే మిక్కడికే రావలయునా! ఆమె యోగినీత్వమునకు శంకించుచు నితండు దరువాత పెండ్లి యాడుమనిన నాక్షేపించునేమో కౌరా! దైవమహిమ కాసిమ్ము వీనికి మావృత్తాంత మెఱిగించి వీని సహాయమున నాసఖురాలికి వెదకి రప్పించి యింటికిఁ బోవు యత్నము గావించెదనని నిశ్చయించి రాజనందనా! మమ్ము నీవెఱుంగకున్నను నిన్ను మేమెఱుంగుదుము. మాయుదంతంబు మిక్కిలి హాస్యాస్పదముగా నున్నది. నీకంతయు నెఱింగించెద నాక్షేపింపక కర్తవ్య ముపదేశింపుము.

మీరిదివరకుఁ జూచిన యోగినియే జితవతి. యుశీనరునికూతురు నే నామె సఖురాలను నాపేరు రోహిణియందురు. ఆమెకు యోగసక్తయను వసుపత్నితో మైత్రి గలిసినది. తననిమిత్తమై పసువులు కష్టులైరని విని వసిష్ఠాశ్రమమునకుఁ బోవుటకై

యోగినీవేషము వైచినది. పురమువిడచి మేము ప్రయాగములోఁ గొన్నిదినము లాయన వృత్తాంతము విమర్శించుచు వసించితిమి. కొందఱు యోగులు మమ్ము మాయ జేసి వసిష్ఠుండు చంపకారణ్యములో నున్నవాఁడు తీసికొనిపోయెదమని చెప్పి యొక యరణ్యములోనికిం దీసికొనిపోయిరి. అందు వారి కపటము దెలిసికొని యొకనాఁడు వారికిఁ దెలియకుండ నుత్తరముగా నడవులం బడిపోయితిమి.

ఆమ్మహారణ్యమధ్యంబున నడుచుచు జితవతి, ఔరా! బైరాగులు యోగులు ఇంత కపటాత్ములని యెఱుఁగక పోయితిని. అయ్యో! ఆబ్రహ్మానందయోగి యెట్టి శ్లోకములు చదివెను? ఎటువంటి యుపన్యాసమిచ్చెను. అఖండబ్రహ్మవేత్తవలె నటినయించుచుఁ నెట్టి నీచవృత్తి నవలంబించెను. సీ. సీ. బూడిదబూసికొని తిరిగెడు మన రూపువంచి యెంతకల్పనలు జేసిరి. చాలుఁ జాలుఁ మనపయనము చక్కఁగనే యున్నది. అక్కటా! మంచుబాసిన యీ యిసుకనేల నడుచుటఁ గష్టముగా నున్నది. కాళ్ళు జివ్వుమనుచున్నవి. ఎట్లు నడుతును? మఱి యొకదారి జూపుమని పలికినఁ గన్నీరుగార్చుచు నే నిట్లంటిని.

తల్లీ! నీదురవస్థం జూచుచుండ నాగుండె పగిలిపోవుచున్నది. నిన్నేమని యూరడింతును. ఆపాపాత్ములు ఎదురుపడుదురేమోయని మారుత్రోవం దీసికొని వచ్చితిని. ఈదారి మహారణ్యములోఁ బ్రవేశ పెట్టినది. ముందుదారి తోపకున్నదిగదా మఱియును—

సీ. రమణీయమణి కుట్టిమముల నల్లన చరిం
పఁగనె కందుఁ ద్వదంఘ్రి పల్లవములు
పండువెన్నెలలు పైపై సోకినంతనే
వడ దాకుచుండు నీయొడలినిగ్గు
అనురక్తిఁ బూలఁగోసినమాత్ర శ్రమజలం
మ్ములు గ్రమ్మ వాడు నీముద్దుమోము
ఉపవనాంచితపథం గోచ్చ స్వనంబులా
లించిన నీమది సంచలించు

గీ. నట్టి నీవిప్పుడీ కంట కాటవులను
దిఱుగుచుంటి వయో! తల్లి దిక్కుమాలి
కటకటా! విధి యెటువంటి కఠినమతియొ
నీగృశత్వ మెచ్చ మన్నింపఁడయ్యె.

అని వగచుచు నే నామెను గొంతసేపందుఁ గూర్చుండఁబెట్టి పాదంబులొత్తి

తిని. కొంచెము విశ్రాంతిగలిగినతోడనే లేవదీసి చేయిపట్టుకొని మఱికొంతదూరము నడిపించితిని. పోయినకొలఁది యరణ్యము మూసికొనిపోయి దారి కనంబడలేదు అప్పు అమహారణ్యము తలంచికొనిన నిప్పుడు మేను ఝల్లుమనుచున్నది. యెందయేమియు గనఁబడదు. చలిబాధ చెప్పనలవిగాదు ఎటుపోవుటకు దారిదోపక యొకచెట్టుక్రిందఁ జతికిలఁబడి నేనామెం గౌఁగలించుకొని యధైర్యముదోపఁ సఖీ! మన చారిత్ర మింతటితో ముగిసినది. నీసుగుణపుంజములన్నియు నీయరణ్యము పాలైనవి. ప్రొద్దు గ్రుంకవచ్చినది. అక్కటా! చక్రవర్తి కడుపునఁబుట్టి సకలవిద్యలంజదివి రూపమున పేరుపొంది ఇంద్రభోగము లనుభవించెదు నీకి యడవినడుమ చావు విధింపఁబడినది. అహా! విధి యెత్తికోలం.

సీ. ధర్మమా! నీకేది? తావలంబిటమీఁద
  శీలమా! నీవెందుఁ జేరెదింక
శాంతి! నీవెందు విశ్రాంతి గైకొందువో
  సత్యమా! నీకు నికాంతమేది?
కనికరంబా? యెందుఁజని వసించెదవీవు
  త్యాగమా! యెందుఁ బోఁదలఁచినావు
వైరాగ్యమా! యేదిదారి నీకిటుపైన
  శౌచమా! యెటఁ దల దాచుకొందుఁ

గీ. వహహ మీకెల్ల నాటపట్టైన కొమ్మ
యార్యగుణముల ప్రోగు సౌందర్యరాశి
జితవతీ సతియైహికస్థితులఁ దరలిఁ
యఱుగుచున్నది పరలోక మరయఁ డింక.

అని నేను దుఃఖించుచుండ నామె లేచి నాకన్నీరు దుడుచుచు సఖీ! నావలంబున నీకీ వెత గలిగినది. నీవు సకలసుఖముల బంధువుల విడచి నాతోవచ్చి కష్టముల పాలైతివి. జన్మజన్మమునకు నీకు దాసురాలనై యుండునట్లు భగవంతునిఁ బ్రార్థించెద నింతకన్న నీకేమి యుపకారము చెప్పగలను. చావు వచ్చునని నాకేమియు వెరపు లేదు. కాని నీనిమిత్తమై వగచుచుంటిని. మనపూర్వకృత సుకృత మిట్లుండ మనకు మంచి యెట్లు జరుగును. పోనిమ్ము భోగములు అస్థిరములని మనము చదివితిమి గదా! యెప్పుడో వానికంతమున్నది మనకు మొదటనే వచ్చినవి గావున భగవంతుని ధ్యానము చేసికొందము. విచారింపకుము అని నాకు బోధించుచు చేతులుజోడించి కన్నులు మూసికొని——

౬. పరమేశ! యోవరద! యో జగదీశ్వర! నా నిమిత్తమై
శాపము జెందియున్న వసుసత్తములం గరుణించి పీనసం
తాపులజేసి తద్గతఘవ్యథలం ఘటియింపు నాకు న
య్యాపదలే భరింతు నిడియౌనని నా తుదికోర్కి దీర్పవే.

అని ప్రార్థించి సఖీ! చీకటి పడినది. క్రూరమృగముల యార్పులు వినంబడుచున్నవి. ఇక్కడనుండి పరలోకమున కరిగి సుఖింతము. అంత్య కాలస్మరణము జేసికొనుమని పలుకుచు నా తొడలపై శిరంబిడి చేతులు జోడించి ధ్యానించుచుండెను. నేనును జితవతి శిరంబు తొడలపై నిడుకొని నా శిరమందు మోపి అంత్యకాల స్మరణము చేయుచుంటిని.

## పెద్దపులుల కథ

కొంతసేపటికి యొక పులి దేనినో జంతువును నోట గఱచికొని పొదలెల్ల నదర రొదజేయుచు మేము గూర్చున్న పొదరింటిదరి కరుదెంచినది. అప్పుడు జితవతిపై నా శిరముగప్పి చేతులతో నాచిపట్టుచుమమ్మా జంతువు మ్రింగినట్లే తలంచియుంటిమి. ఆ వ్యాఘ్రంబు జూచియో చూడకయో మా మీదకి రాక యాదట దాను దెచ్చిన జంతువను సగము ప్రాణముతో గొట్టుకొనుచు వికృతస్వరముతో రొద జేయుచుండ నలిపి నలిపి దానిం జంపి తినుచుండెను. అంతలో వేరొక చారల మెకము గోళ్ళ నేలంగీరుచు నచ్చటికి వచ్చినది దానిం జూచి మొదటిపులి గాండ్రుమని అరచినది. ఆ యదపు విని మా ప్రాణములు పోయిననియే యనుకొంటిమి. రెండవపులి మొదటి పులిమీదఁ బడి రక్కుచు దాని నోటనున్న యాహారమును లాగికొనిపోయినది. అప్పుడా రెండు పులులకుఁ బెద్ద యుద్ధము జరిగినది పొదలదరు నట్లొంటొంటిని గెంటివైచుచుఁ గాలూతదొరకిన నిలిచి వెనుకకు దరుముచుఁ గ్రిందుమీదగుచుఁ గొంతసేపు పోట్లాడినవి.

అంతొకటి బలము తఱిగి వెనుకకు తిరిగి పరచుటయు దానిందరుముకొని రెండవపులి పోయినది. అంతలోఁ దెల్లవారినది. రవితేజము దెసనెల్లెడల వ్యాపించినది. పక్షుల ధ్వనులు వినఁబడుచున్నవి. అప్పుడు జితవతి రోహిణీ! మనమిప్పు డెందుండిమి సమసితిమా? అని పలికిన నేనుతేచి నలుమూలలు చూచి విస్మయ సంభ్రమములతో నౌరా! ఎంత చిత్రము. పులులు వానిలో నవి కొట్లాడి మనలఁ జూచినవికావు. ఈ యడవి యంతయు వాని పెనుకవచే నరికినట్లే విచ్చిన్నమైనది. తెఃపిగా దారి కనంబడుచున్నది. చూడుమనుటయు జితవతి లేచి పరికించి యిట్లనియె.

సఖీ! భగవంతుని యద్భుతమును నాకుఁ దెలిసినది వినుము. మన పురాకృత

మతిక్రూరము ఇంకను జిక్కులు పడవలసిన యోగమున్నది. అందులకై మనల పెద్ద పులుల కాహారము సేయఁదయ్యె. ఇఁక మనము బ్రతికిన ప్రయోజనములేదు. పులుల వెదకికొనుచుఁ బోవుదము. నోఁటిలోఁ దలపెట్టినను మ్రింగవాయేమి? పదపద. మనకు దారిజేసినవని పలికిన విని నేనును శక్యాలోచితమైన మాటలనే నాబోటికిఁ బ్రత్యుత్తర మిచ్చితిని.

అప్పు డిద్దరము లేచి తెరపిచేయఁబడిన తెరవున మెల్లగా నడువఁ దొడంగితిమి. కొంతదూరము నడిచినంత నా క్రూరమృగముల ధ్వనులు మా చెవులఁ బడినవి. అప్పుడు నేను భయకంపితగాత్రినై గద్గదస్వరముతో జితవతీ! అవిగో రాత్రి పులులు మనదెసకు వచ్చుచున్నవి. ఇప్పుడు విడువవు. చంపగలవు. అయ్యో, అయ్యో, అని వగచుచుండ వారించుచు, జితవతి నవ్వుచు, రోహిణీ! నీకాభయ మేమిటికి? క్షణకాల మోర్చితివేని నీ యిక్కట్టు లన్నియుం బాయునుగదా. అనంటోయిన తీర్థమెదురైనట్లు మన మా పులుల కొరకు వెదకుచుఁ బోవుచుండ నవి యెదురైనవి. సంతసము జెందక దుఃఖించెద వేమిటికి? అని బోధించుచు నాచేయిపట్టుకొని వానికెదురుగాఁ దీసికొనిపోయి నది.

క్రమంబున నా పులులు రెండును మా దాపునకు వచ్చి వచ్చి మచ్చికజేసిన వానివలెఁ దోకలాడించుచు మా పాదములు నాకఁదొడంగినవి. అప్పు డామెయు మృగ రాజములారా! మమ్ము భక్షించి మీ యాఁకలి యడగింపఁ జేసికొనుఁడు. అని పలికి కన్నులు మూసికొన్నది.

ఆ మెకంబులు పెంపుడు కుక్కలవలెఁ బ్రీతిగా సేవించి తోఁకలూఁగించుచు నడుగులు నాకుచుఁ జేతులు మూర్కొనుచు మమ్మాశ్రయించు సూచన లగపఱచుచుండి నవి అప్పు డబ్బురపాటుతో నాబోఁటి యిదియేమి వింత! పులులు శాంతమూర్తులైన వేమి? ఇవి మరియొక జంతువులు కావుగదా యని యడిగిన నే నిట్లంటి.

సఖీ! తెలిసినది. పులులు నీ శీలమునకు మెచ్చి యిట్లు వర్తించుచున్నవి. మహర్షుల యాశ్రమముల మృగములు జాతివైరములు విడుచునని మనము వినియుండలేదా. నీవు ఋషితుల్యవైతివి. ఇఁక మృత్యువు నిన్నేమియుం జేయఁజాలదు. నీ సహవాసమున నేనును కృతకృత్యనైతిని. ఇఁక నీ మనోరథము సఫలము గాఁగలదు.

అని పొగడిన వినిపించుకొనక జితవతి పులుల వీఁపుపైఁ జేయివైచి నిమురుచు జూలు దువ్వుచు ముద్దుపెట్టుకొనుచు మృగములారా! వీండ్రు కృతఘ్నురాండ్రని మా మేనిమాంస మేమాగించితిరా? అగునగు కృతఘ్నుని మాంసము కుక్కయు ముట్ట దండ్రుఁ. మీ మాట జెప్పనేల యని యేమేమో పలుకుచుండ నవి పిల్లి కూనలవలె నణఁగి మా యడుగులమోలఁ బండుకొన్నవి.

పిమ్మట మేము లేచి నడువఁ దొడంగిన నదియు మా ముందర నడచుచుండునది నిలఁబడిన నిలువఁబడును. తావులేనిచో లతాగుల్మాదుల ఖండించి దారిజేయునవి. మృత్యుతుల్యములగు సాహసకృత్యములు భృత్యకృత్యములు గావింపుచుండఁ బశ్చిమ ముఖముగా గొంతదూరము పోయితిమి. అంతొక నది మా కడ్డమైనది. ఇంద్రనీల ప్రభాధగద్ధగితములగు నదీజలంబులు గన్నులపండువు గావింప నది యమున యని తెలిసికొని తత్పవిత్రోదకంబున స్నానము గావింపుచుండఁ బులులును మా ప్రక్కనే క్రుంకులు పెట్టుచుండెను. ఆ వినోదము జూచుచు మేము గొంతసేపు వానితో గూడ జలక్రీడ లాడితిమి. అట్టితఱి చిన్న మబ్బుబట్టి వామనదేహమట్లు క్రమంబున విస్తరిల్లి యింద్రజాల ధూమమువలె వ్యాపించి దెసల జీకట్లు గ్రమ్మ మొగులు మూసికొని పెద్ద వర్షము గురియఁ దొడంగినది.

మ. కరకాచ్ఛాదితమై ఘనాఘనబృహద్గర్జారవోపేతమై
వరవిద్యుల్లతి ప్రబలమై హస్తోష్ణృతిష్యానసం
ధురిమై సర్వదిశావిభాగములు నస్తోకాంబుపూర్ణంబుగా
గురిసెవ్వర్షము నీరజప్రజము సంక్షోభింప భీమంబుగా.

ఆ వృష్టిపాతంబునకు వెఱచుచుఁ గంఠదఘ్న జలంబున నిలిచి పృథుధారాతాడనంబున శిరోవేదన జనియింప జలంబుల మునుగుచుఁ దేలుచుఁ గొంతసేపెట్లో యా సంకటము సైరించితిమి. క్రమంబున నవ్వర్ష ప్రదవంబు ప్రళయకాలంబో యన వెరపుగలుగఁజేయ దొడంగినది.

అంతలో నా ప్రవాహమునకుఁ గ్రొత్తనీరు దగిలి పొంగుట ప్రారంభించినది. మా పాదములు తేలిపోయినవి. నీటిలో మునుగుటకు సిద్ధపడితిమి. అప్పుడు దాపుననున్న పులులఁ జేరి యొక దానిం బట్టికొంటిమి. అవియు వినాశనముగా మమ్ముఁదమపై కెక్కించుకొని యోడలవలె నా ప్రవాహములో నీద మొదలు పెట్టినవి. కొండంత యెత్తునఁ బొంగి యా ప్రవాహము శరవేగముగాఁ బారుచుండెను. తీరభూరుహములు వ్రేళ్ళతోఁగూడ గుభాలుమను చప్పుళ్ళతో నేటిలోఁ బడి కొట్టుకొని పోవుచుండెను.

మమ్మా పెద్దపులులు వీపుపై నాపికొని ప్రమాదము రాకుండ నీదియీది యవ్వలిదరి జేరవలయునని ప్రయత్నించినవి. శక్యమైనది కాదు. రెండుపులులు విడిపోయినవి. నేనెక్కిన పులి బలహీనమై కాళ్లుతేలవైచి నీరుత్రాగి కొంత సేపటికిఁ బ్రాణములు విడిచినది. నేను దాని కళేబరము విడువక యొక కర్రతోఁ జేర్చి పట్టుకొని యా రాత్రి యెల్లఁ గొట్టుకొని పోయితిని. తెల్లవారుజామున నీ పల్లెవాండ్రు వచ్చి నన్నుఁ దెప్పలపై నెక్కించుకొని తీరము జేర్చిరి. ఆనఁడు రాత్రి యా పల్లెలో నొక

గృహస్తునింట బందుకొంటిని. దొంగలా రేయి వారిల్లు కొల్లబెట్టినమాట వాస్తవము ఆ నేరము నాయందు మోపి రాజభటులు నన్ను మీ యొద్దకుఁ దీసికొనివచ్చిరి. అదియే నావృత్తాంతము అని యెఱింగించిన విని యా రాజపుత్రుఁడు ముక్కుపై వ్రేలిడుకొని పెద్దతడ వట్టె నిలువంబడి ధ్యానించుచు నౌరా? యెట్టిచిత్రము వింటిని. ఆ యోగిని జితవతియా? చిత్రఫలకము గాంచి యుండుటంబట్టి యామె రూపమెప్పుడో కాంచినట్లే యున్నది. భళిరే! యెంత చోద్యము! బాపురే! యెంత యాశ్చర్యము? అట్టి కృతఘ్నులకి దైవము తోడుపడకుండునా? క్రూరమ్మార్గము లాడిగిమేలు జేయుట యబ్బురమా? అని యూరక వెరగుపడుచు నయ్యయో! అంతఃపురము మెలంగెడిమీరెక్కడ! వసిష్ఠమహర్షి యాశ్రమ మెక్కడ? జితవతికి వెళ్ళియెత్తిక నీవు వలవనక పెద్దవారంకుఁ జెప్పక యట్లు చేయుదువా? ఆమెంగానక తల్లిదండ్రు లెంత చింతించుచుందురో? కానిమ్ము గతంబునకు వగచినం బ్రయోజనములేదు. ఇప్పుడామె యుత్తర దిశనున్న అరణ్య మార్గమునఁ బోయినదని వాడలు దెలిసినవి మనము పోయి పట్టుకొని కట్టి పెట్టి బలవంతమున నామె నింటికిం దీసికొని పోవలసము. జితవతియని తెలిసిన నేన ప్పుడే చేయిపట్టుకొని యాటంకము చేయకపోవుదునా? అని చెప్పి అతండు తండ్రి కా తెరం గెఱిగించి యుచిత పరివారముతోఁ గూడికొని రోహిణి వెంటబెట్టుకొని యుత్తర దేశారణ్యములు తిరుగుచు నామెను వెదకుచుండెను.

అని యెఱింగించి మణిసిద్ధుండు—ట్లని చెప్పందొడంగెను.

# 112 వ మజిలీ.

## సన్యాసులకథ

అమ్మా! లెమ్ము లెమ్ము. ఎన్ని దినము లిట్లాహారము గుడువక కృశించెదవు? జితవతి రోహిణియుఁ బ్రయాగమున కవ్వల అడవులలో దిరుగుచున్నట్లు వాడలు తెలిసినవట. ప్రయాగ నగరాధీశ్వరుండు కొందఱ సన్యాసుల మన రాజధానికిఁ బంపెను. వారి ఆలోచనము విచారించుచు అయ్యగారు మీకివార్త దెలుపుమని పరిచరునిఁ బంపిరి. అనుటయు జితవతితల్లి అట్లే లేచి యేమీ! నాపట్టి బ్రతికి యున్నట్లు వార్తలు వచ్చినవియా? అయ్యయ్యో! అరణ్యములలో దిరుగట కేమి కారణము? ఎవ్వరు చెప్పిరి? ఏమని చెప్పిరి? అని అడిగినఁ దిలక యను పెద్దదాసి అమ్మా! పరిచరుఁ డీమాట చెప్పెను. అతఁడు ద్వారమున నున్నవాఁడు రప్పింపనా! అనుటయు నామె వాని రాక కనుజ్ఞ యిచ్చినది. తిలక పోయి వానిం దీసికొనివచ్చి అమ్మగారితో సవిస్తరముగాఁ జెప్పుమని నియోగించిన నాకింకరుం డిట్లనియె.

అమ్మా! ప్రయాగమునుండి సన్యాసులు కొందఱు సంకెళులు వేయఁబడి తీసికొని రాఁబడిరి. వారేమి నేరము జేసిరో తెలియదుకాని అమ్మాయిగారును రోహిణియు నా దేశములో దిరుగుచున్నట్లు వారివలన నొక ప్రతీతి బయలు వెడలినది. ప్రయాగాధిపతి అయ్యగారి కేదియో జాబు వ్రాసి పంపిరి. ఆ పత్రికం జదివికొనినతోడనే మీకీ వార్త జెప్పిరమ్మనిరి. ఇంతకన్న నాకేమియుం దెలియదని యా కింకరుఁడెఱింగించెను.

అప్పుడు రాజపత్ని తిలకా! నీవు సభకుఁ బోయి సన్యాసు లేమి జెప్పెదరో విని నాకు వచ్చి జెప్పుము. పొమ్మని యాజ్ఞాపించుటయు నా తిలక వానివెంట నోలగంబునకుఁ బోయినది. అప్పు డుశీనర వరపతి సన్యాసుల విచారింపుచున్నవాఁడు.

రాజు—నీ వెవ్వఁడవు?

మఠాధిపతి—ప్రయాగములోనున్న మాధవ మఠమునకు ధర్మకర్తను.

రాజు—మాధవ మఠములో సన్యాసు లెందఱుందురు?

మఠాధిపతి—వేయిమందికి తక్కువ యుండరు.

రాజు—వాండ్రకు భోజనమెట్లు.

మఠా—ఆ మఠమునకు రాజదత్తములైన యగ్రహారములు పెక్కుగలవు. తదాదాయమువలన సన్యాసులకు జీవనోపాధి జరుగును. ఆరునెలలు దేశాటనము చేసి వచ్చినవాఁ డారునెలలందు గూర్చుండి కుడువ వచ్చును.

రాజు—మీ కలహము లేమిటికి వచ్చినవి?

మఠా—దేవా! కొందఱు దుర్మతులు మఠములోఁ జేరుటచే మాకును మఠమునకుఁ గూడఁ జాల అపకీర్తివచ్చినది. వినుండు. కడచిన శివరాత్రికి నిరువురు బాలయోగినులు త్రివేణిలో స్నానము చేయచుండ చిదానంద రమానందులు మోహించి వసిష్ఠాశ్రమమున కరుగుచున్న వారి సంకల్పము దెలిసికొని ఈ బడుగువానిచే వసిష్ఠవేషము వేయించి ఈ బ్రహ్మానందుని మూలమున జంపకారణ్యమునకుఁ దీసికొనిపోయి యా యోగినులకు వీడే వసిష్ఠుఁడని చూపిరట. "ఆ బాల యోగినులు వీరి కపటము దెలిసికొని యెంటో పారిపోయిరఁట." అందుండి యీ యోగులిద్దరు తిరుగ మఠమునకు వచ్చుటయు వారినెల్ల వెదకి కొనుచు వీరిద్దరు మఠములో దగవుపెట్టి యిచ్చిన లంచము తమకిమ్మని పోట్లాడిరి. వాండ్రిచ్చిరికారు. దానకోపించి ఈ రమానందుఁడు దుడ్డుకఱ్ఱతో ముసలివాని నెత్తిపైఁ గొట్టెను. బ్రహ్మానందుఁ డద్దమురా వానిం గొట్టి నేలఁబడవేసెను. వృద్ధయోగు లిద్దరు బడినతోడనే అందున్న సన్యాసులు కొందఱు వారి పక్షముజేరి రమానంది చిదానందులఁ జాపమోదిరి. అప్పుడందున్న సన్యాసులెల్ల రెండు పక్షములై పెద్ద యుద్ధము గావించిరి. రాజభటులువచ్చి అందఱం బట్టుకొని

సంకెళులు వైచి కారాగారంబునఁ బడవేసి కొన్నిదినము లందుంచి చివరకు మాతెరు ఏలినవారి యొద్దకుఁ బంపిరి. ఇదియే జరిగిన కథ యని యెఱింగించెను.

రాజు—ఇందుఁ బ్రద్యుమ్నయోగి యెవ్వఁడు?

ప్రద్యుమ్న—దేవా! నేను అని యెదురు నిలువంబడియెను.

రాజు—నీవు ఆ యోగినుల బ్రహ్మానందు నొద్ద కనిపితివిగదా! అందులకు బాలసన్యాసులు నీకేమి లంచమిచ్చిరి?

ప్రద్యు—దేవా! నాకు లంచముగా నీయలేదు జ్ఞానపత్రి నిమిత్తమేదేని అప్పు డప్పు డిచ్చుచుందురు. అదియే వారు కాకిచ్చినది.

రాజు—పాపము! నీవు జేసినపని వారల కుపచరించినది కాదు కాటోలు.

ప్రద్యు—చిత్తము చిత్తము. నే నేమియుఁ జేయలేదు.

రాజు—కానిమ్ము. చిదానంద రమానందు లెవ్వరు?

చిదా-రమా-మేము దేవా! మేము అని ముందరకు వచ్చిరి.

రాజు—మీరా యోగినుల నెందుఁ జూచిరి?

రమా—ప్రయాగములో గంగాస్నానము జేయుచుండఁ జూచితిమి.

రాజు—వారికై యెంతసొమ్ము వ్యయపరచితిరి.

రమా—దేవా! దాచనేల వేయిమాడలు వ్యయమైనవి. యా మఠములో మా వలన లంచము తిననివాఁడులేడు. మఠాధిపతికిఁ బదిమాడల నొసంగితిమి దేవా!

రాజు—పిమ్మట నా బాలయోగినులేమైరో వెదకితిరా!

రమా—లేదు దేవా! తరువాత బద్ధులమై చెరసాల నుంపఁబడితి మెట్లుపోయిరో తెలియదు.

అని యీ రీతి నా నృపాలుండు సన్యాసు లందరివలన సాక్ష్యము పుచ్చుకొని తన్మూలమున రోహిణీ బిలవతుల మనశ్శుద్ధియు సన్యాసుల క్రౌర్యములు వెల్లడిగాగ వాండ్రనెల్లఁ గలయ గనుంగొని యిట్లనియె.

ఓ దురాత్ములారా! మీరు సన్యాసులమని పేరుపెట్టికొని మఠంబునం గూర్చుండి కాల్యన్నంబులం భుజించి మత్తిల్లి యధమకృత్యములు జేయఁ దొడంగిరి మీ రధోగతి పాలగుటయేకాక యా జాతికిఁ గూడఁ గళంకము దెచ్చితిరి. మీ మేనులు తునకలుజేసి యుప్పుపాతర వేయించినను నిష్కృతి గలుగదు. మీకుఁ దగినశిక్ష యేది వేయుటకుం దోచకున్నది. ముందు విచారించెదనని పలుకుచు రాజభటుల వెంట వాండ్రనెల్లఁ జెర సాల కనిపి తాను విచారగ్రస్త మానసుండై యంతఃపురమునఁ కరిగి భార్యతో నా వృత్తాంతమంతయు నెఱింగింపు చుండెను.

ఆ వేళలోఁ బ్రబ్యోతన నగరమునుండి రోహిణిరాజదూతల వెంటనందు వచ్చిన దను వార్త యెవ్వరో చెప్పినంత రాజపత్ని లేచి యేడి యేడి నాబిడ్డకూడ వచ్చినదా ? అని యడుగుచుండ రోహిణి వచ్చి యామె పాదంబులంబడి గోలున నేడువఁ దొడంగినది.

అప్పుడు శీనయుఁ దూరడింపుచుఁ రోహిణీ లెమ్ము లెమ్ము. శోకించినం బ్రయోజనంబులేదు నీ విప్పు డెందుండి వచ్చితివి? జితవతి యేమైనది వసిష్టా శ్రమమునకుఁ బోయితిరా! మీ వృత్తాంతము కొంత తెలిసినది. సన్యాసుల విడిచిపోయిన పిమ్మట నేమిజరిగినదియో చెప్పుమని యడిగిన వెరగుపడుచు లేచి కన్నులం దుడిచికొని నమస్కరించి యిట్లనియె.

దేవా! జితవతికి వసిష్ఠుని జూడవలయునని తలంపుతప్ప వేరొక తలంపులేదు. నా యావచ్ఛక్తి నా పయనము మానిపింప వలయునని చూచితిని సాగినదికాదు. నిప్పునకుఁ జెదలుపట్టిన నదియే నశించును. యోగు లామె నేమి సేయగలరు? ఆమె శీలమునకు మెచ్చికొని పెద్ద పులులు భృత్యకృత్యములు నెరవేర్చినవి. యమునలో మేము విడిపోయితిమి. ఆమె పులితోఁ బ్రబ్యోతన నగరము జేరినది. పౌరులకుఁ దదీయ మహిమాతిశయము విస్మయము గలిగించెను.

రాజపుత్రుఁడు ప్రభాకరుఁ డామెతో ముచ్చటించెను. పులి సమసిన దాని తోలు శిరంబునందూని యామేకు విడచి యుత్తర ప్రదేశమున కరిగినదఁట. నన్ను దొంగగా నెంచి యారాజు నొద్దకుఁ దీసికొనిపోయిరి. నేనా రాజకుమారునికి యదార్థము జెప్పితిని. ఆ యోగి జితవతియని వినిన పిమ్మటఁ బ్రభాకరుఁడు మిక్కిలి పరితపించుచు నన్ను వెంటఁబెట్టుకొని యుత్తర దేశారణ్యము లన్నియుం దిరిగెను.

ఎందును నామె గనంబడినదికాదు. ఆ యడవులలో దిరిగినట్లు కొన్ని జాడలు తెలిసినవి. గురుతులు జూచికొనుచుఁ బోవంబోవ యమునానదీ పరిసరమున దట్టముగా గుమురుకొనియున్న చెట్లపడుమ నొక వృక్షశాఖకుఁ పాదములు దగిలించి తల్క్రిందుగాఁ దపము గావింపుచున్న యొక యోగి మా కన్నులం బడియెను.

భయభక్తి సంభ్రమములతో నా చెట్టుచెంతకుఁ బోయి శిరంబునఁ జేతులు జోడించి వినయముతోఁ బ్రార్థించుచు నందు నిలువంబడితిమి. సాయంకాలమున నయ్యోగి తపంబు జాలించి యోగంబు వదలి చెట్టుదిగి యమునకుం బోవుచుండ నడ్డమువచ్చి పాదంబులఁబడి మహాత్మా! జితవతియను రాజపుత్రిక వెఱ్ఱియెత్తి యీ యడవుల దిఱుగుచున్నది. ఆ చిన్నది మీ యొద్దకు రాకమానదు. వసిష్ఠమహర్షి యాశ్రమమున కరుగ సంకల్పించుకొని యున్నది. ఆ ముగుద మీకుఁ గనంబడి

నదియా? అని యడిగిన యోగి అగును. ఆ సద్గుణమ్మ నా యొద్దకు వచ్చినది దాని చిత్తశుద్ధి యరసి యడి కోరినరీతి నతివేగముగా వశిష్ఠుని యాశ్రమమున కరుగునట్లు చేసితిని. మీ రెవ్వరని యడిగిన విని నే నాతురతజెంది యిట్లంటిని.

మహాత్మా! నేనామె సఖురాలను. ఆమెతోఁగూడ నిల్లు వెడలితిని. కష్టముపడితిని. యమునలో విడిపోయితిమి. నన్నుఁ గూడ నందు జేర్పరా? అని మొరపెట్టుకొనిన నతండు చాలు జాలు మా కిడియే పనియా పోపొమ్ము. నీవందఱుగ నర్హురాలవు కావని పలికి యా తపసి స్నానమునకై యరిగెను.

అప్పుడు మేము దారి గాచుకొని యతండు మరల వచ్చుదనుక నందుండి పాదముల కడ్డముపడి నమస్కరింపుచు మునివర్యా! ఆ చిన్నది యెన్నటికైన నింటికి వచ్చునా? ఇది యొక్కటియే చెప్పుఁడు. ఇఁక మా దారి మేము పోయెదమని పలికిన నతం డించుక ధ్యానించి యింటికి రాకేమగును. పొండు అని పలికి వెండియు వృక్షారోహణము గావించెను. మేము సంతోషము జెందుచుఁ గ్రమ్మరఁ బ్రిట్కో తన నగరమునకు వచ్చితిమి. ఆవార్త మీకుఁ దెలుపుటకు దూతలవెంట వెంటనే యిందు బుచ్చితిని. ఇదియే నావృత్తాంతమని యాకథయంతయు రోహిణి వారి కెఱింగించెను.

అని యెఱింగించి మణిసిద్ధుండు—ఇట్లని చెప్పఁదొడంగెను.

## 113వ మజిలీ.

## వసిష్ఠుని కథ

ఆహా! ఆమహర్షి ప్రభావ మేమని కొనియాడఁదగినది? కన్నుల మూసికొని తెరచి చూచినంతలో నెంత సంతోషము గలుగఁజేసెను? అయ్యారే! యిది మేరు పార్శ్వ భూభాగమునందలి వసిష్ఠమహర్షి యాశ్రమము గావలయును. ఔరా! బహు యోజనదూరములో నున్న వసిష్ఠాశ్రమము రెప్పపాటులోఁ జేర్చిన యా సిద్ధతాపసుని తపః ప్రభావము అవాఙ్మానసగోచరముగదా? తాపసులు లోకోద్ధరణమునకై తపంబు గావింపుచుందురు. తపోధనప్రభావంబునంగాక యీ ప్రదేశము మనుష్యులకుఁ జేర శక్యమా? ఇది దేవతాభూమివలెఁ గనంబడుచున్నది. ఔరరే యిచ్చటి భూమియంతయు రత్నమయమైయున్నది వృక్షములు సువర్ణచ్ఛాయలచే విరాజిల్లుచున్నవి. జాతివైరములు లేక మృగములు తిరుగుచున్నవి. ఇది తప్పక వసిష్ఠాశ్రమమే నా కోరిక ఫలించు సూచనలు గనంబడుచున్నవి. అదిగో మునిబాలుఁ డెవ్వఁడో నాదెసకు వచ్చుచున్న వాఁడు. వానివలన నీదేశవృత్తాంత మడిగి తెలిసికొనియెదంగాకయని యొకనాఁడు ప్రాతఃకాలమున నొక వనములో నిలువంబడి జితవతి తలంచుచుండెను.

అంతలో నామునికుమారుండు పలాశ దండము చేతంబూని యచ్చటికి వచ్చెను. వారికిట్టి సంవాదము జరిగినది.

శిష్య-అమ్మా! నీవే మునికన్యకవు? పులితోలు ముదతగా బూని శిరంబున దాల్చితివేల? నీపేరేమి? యెందుండి వచ్చుచుంటివి?

జితవతి-ఋషిపుత్రా! నేను మునికన్యకనుగాను. రాజపుత్రికను. నాపేరు జితవతియందురు ఈపులి బ్రతికియున్నప్పుడు (అని కన్నీరు గార్చుచు) నాకమితమైన యుపకారము గావించి నానిమిత్తమై సమసినది దానంజేసి యీకృత్తి నిట్లు భక్తితోఁ బూజించుచుంటిని.

శిష్యుఁడు-తపఃప్రభావంబులు సత్యంబులు మునులకు కృత్య కృత్యంబులు గావించుట యాచారమై యున్నది. నీవు దీనియందిట్టి కృతజ్ఞత గలుగుట స్తుతిపాత్రమై యున్నది గదా!

జిత-బాలకా! నీవెవ్వని కుమారుండవు? ఈతపోవన మెవ్వరిది?

శిష్య-తల్లీ! ఈవనము త్రిభువనవిదితుండైన వసిష్ఠమునీంద్రుని తపోవనము నేనాయన శిష్యుండ హోమధేనువుం గాచువాఁడ.

జిత-హోమధేనువన నందినీధేనువేనా?

శిష్య-అవును వారికి మఱియొక మొదవులేదు.

జిత-పుత్రా! ఈనడుమ వసువులు దానిం దీసికొని పోయిరని వింటి. సత్యమేనా?

శిష్యుడు-సత్యమే అందులకు వారికిఁ బ్రాయశ్చిత్తమైనది. కాదా?

జితవతి-ఏమైనదితండ్రీ! చెప్పుము చెప్పుము.

శిష్య-వారినెల్ల మనుష్యయోనిం బుట్టునట్లు శపించెను.

జిత-తండ్రీ వారువచ్చి పాదాక్రాంతులైరని వింటిని కనికరించి యమ్ముని వారి శాపవిముక్తులం జేయలేదా?

శిష్య-తల్లీ! అష్టమవసువు ప్రభాసునితక్కఁ దక్కిన నేడ్వురను జన్మమాత్రముననే విముక్తులగునట్లు కనికరించెను.

జిత-ప్రభాసు నేమిజేసెను.

శిష్య-అతఁడే యీయపరాధమునకెల్ల కారకుఁడు వినుము వాఁడు పుడమి మనుష్యుఁడై పుట్టి భార్యాపుత్రులులేక దరిద్రుఁడై యాధివ్యాధులు బాధింపఁ బరమ మూర్ఖుఁడై క్రూరకృత్యములు గావింపుచుఁ బెద్దకాలము బ్రతుకఁగలఁడని శపించెను.

జితవతి-హా! పరమేశ్వరా! హా పరమేశ్వరా! యెట్టికర్ణకఠోర వాక్యము

వినంబడినది। యోగసక్తా! నాకతంబున మీకెట్టియిక్కట్టు వచ్చినది అని పలుకుచు నేలంబడి మూర్ఛిల్లినది.

అమునిబాలకుఁడు లేవనెత్తి తల్లీ! పశువులు నీకు బంధువులాయేమి? వారి కొరకై పరితపించెదవేమిటికి? అని యడిగిన జితవతి కన్నీరు దుడిచికొనుచుఁ దన కథ అంతయుఁజెప్పి బాబూ! వారి ముప్పునకు మూలము నేనైతిని తండ్రీ యోగసక్త నేమైన శపించెనా? యామె యేమైనది నాయనా! చెప్పుమనుటయు నాబాలుండు సాధ్వీమణీ మాగురుండు బతిని సతీసుతహీనునిగా శపించిన విని యదలుచు యోగసక్త తన్నుఁగూడ మనుష్యయోనిం బుట్టఁజేసి అతనికి భార్యయగునట్లు చేయుమని కోరినది.

ఆయన అందుల కంగీకరింపలేదు అప్పుడప్పడతి చురచురం జూచుచుఁ గఠినమతీ! నీసతి నీకెట్లో యాయనకు నేనట్లుగానా? మీ వియోగమునకు మీభార్య పరితపింపదా? మమ్ము విడఁదీయుదువా? అని యేమేమో నోటికి వచ్చినట్లు మునివరుని నిందించినది.

ఆజడదారి పెద్దతడవోపిక జేసియుఁ గోపము నిలుపలేక దుర్మతీ! నీవు స్త్రీవని విడిచినందులకుఁ జిన్న పెద్ద తారతమ్యము విచారింపక ప్రేలుచుంటివి. ఈయపరాధమంతయు నీవుం జేయుచున్నది. నిన్ను విడువఁగాను. వినుము నీవు గోమాంసభక్షులైన మ్లేచ్ఛజాతిం బుట్టి పెక్కు కష్టము లనుభవింపఁగలదానవు. పోపొమ్ము అని పలికి అమ్మునివరుం డవ్వలికిఁ బోయెను. ఆసంపతులు విచారగ్రస్త చిత్తులై యేమాటయుం బలుకక శాపఫలం బనుభవింప నరిగిరి.

పురాకృత మెట్టివారికి ననుభవింపక తీరదుగదాయని చెప్పిన విని యాచిన్నది గుండెపగుల నేడ్చుచు యోగసక్తా! నాకతంబున కాదా నీవ మునిచేత దుర్మతివని నిందింపఁబడితివి. ఇప్పుడేమి చేయుదును నీదురవస్థ వినియుఁ బ్రతికియుంటిని? నేను కృతఘ్నురాలనా? కాను కాను వేషమునకే అని పలవరింపుచుండ మునిబాలకుఁడు వెరగుపడుచు తల్లీ! నీశీలము కొనియాడఁదగియున్నది. ఇప్పుడు మా అయ్యగారు భార్యతో వినోదముగా మాట్లాడుచున్నవారు. నీవు వేగము పోయి వారిం బ్రార్థింపుము యేదేని నదుపాయము జేయఁగలరని బోధించి యాశిష్యుఁ డవ్వలికిఁ బోయెను.

జితవతియుఁ దదుపదిష్టమార్గంబునఁబోయి వసిష్ఠాశ్రమాంతరమున—

గీ. పదతిగాఁజేసి వ్యాఘ్రచర్మంబు భక్తి
దైవమునువోలెఁ దనదు మస్తమునఁదాల్చి
తడఁబడఁగ మెల్ల మెల్లన నడుగులిడుచు
వచ్చు జితవతిఁగాంచె దాపసవధూటి.

కనుంగొని యాశ్చర్యముతో అరుంధతీమహాదేవి నొసట మడతలుదేర గన్ను లెత్తి చూచుచు భర్తతో "ప్రాణేశ్వరా! ఈ వచ్చు మచ్చెకంటి యెవ్వతె? యోగినీ వేషంబు బూనిన శ్రీవిష్ణుని జగన్మోహినీ రూపముగాదుగద? పులితోలు శిరంబున దాల్చి నదేమి? అహా! జటావల్కలములు ధరించినను అమ్మించుబోణి రూపమా సేచన కంబై యున్నది మునికన్యకల కిట్టి సోయగముండునా? ఈమె యెవ్వతెయో చెప్పు డని యడిగిన విని వసిష్ఠుండు వెరగుపాటుతోఁ జూచుచుండెను.

అంతలో జితవతి వారిదాపునకువచ్చి పులితోలు నేలంబెట్టకయే సాష్టాంగ నమస్కారములు గావించి మహాత్ములారా! పుణ్యదంపతులగు మిమ్ముఁ జూచుటచే నేను కృతార్థురాలనైతిని. నాపాపములు పటాపంచలైపోయినవి. మీదర్శనమునకై యెన్నియో వెతలఁబడి యిక్కడికి వచ్చితిని. మిమ్ముజూచితిని నాకోరిక సఫలముగాఁ గలదని పెద్దగాఁ బొగడినది.

అప్పు డరుంధతీ మహాదేవి అచ్చిగురుఁబోఁడిని గ్రుచ్చియెత్తి యాదరించుచు సుందరీ! నీవెందలిదానవు? నీపేరెయ్యది? మాయొద్దకు రాఁబనియేమి? ఈపులితోలు అంత శ్రద్ధగా శిరంబునఁ బూనితివేమిటికి? నీవృత్తాంతమంతయు నెఱింగింపుము నీయందు మాకు గనికరము గలుగుచున్నదని పలికిన విని యక్కలికి యిట్లనియె.

తల్లీ! నీవు ముల్లోకములో వాసికెక్కిన పతివ్రతవు నీపేరు దలంచిన స్త్రీలు పూతురాండ్రగుదురు. నీవు నాకభయహస్త మిచ్చితివి. ఇంక నాకుఁ గొదవలేదు. వినుము నేను శీవరుఁడను నరనాథుని కూఁతురను నాపేరు జితవతియండ్రు. యోగసక్త యను మునిపత్నితో నాకు మైత్రి గలిగినది. ఆమె నన్ను దివిజకాంతఁజేయు తలంపుతో మీధేనువుంగట్టి తీసికొనిరమ్మని పతిని బోధించినదఁట. అకారణంబు నంజేసి మీభర్త వారిని శపించెనఁట ఆవృత్తాంతము విని నేటరి తపించుచు జటావల్కలములధరించి పురమువిడిచి మీయొద్దకు రా బయలుదేరితిని అని తాను నగరము విడిచినది మొదలు నాఁటి తుదదనుక జరిగినకథయంతయు నివేదించినది.

అయ్యుదంతము విని యాపతివ్రత వెరగుపాటుతోఁ బతిమొగము జూచినది. వసిష్ఠుండు దివ్యదృష్టినంతయుఁ జూచి యామె ఈశీలవతి చెప్పినదంతయు సత్యము మఱియు నిందు స్వగుణోత్కర్ష విడిచినదని యెఱింగించెను.

అప్పు డరుంధతి యాసుందరిని గౌఁగలించుకొని ముద్దిడుకొనుచు పుత్రీ! నీ యట్టి కన్నెజవరాలి నేపురాణములో వినియుండలేదు. నీ సుగుణంబులెన్న ఫణిపతి చాలడు నీశీలము మా కెంతేని మెచ్చువచ్చినది మఱియు హోమధేనువను నీమహర్షికిఁ బ్రాణసమానంబది పసువులు దానిం దీసికొని పోయిరి అలిగి యిమ్మునివారిని శపిం

చెను. ప్రభాసుని దక్కఁ దక్కిన వసువులు జన్మమాత్రముననే ముక్తులగు నట్లను గ్రహించెను. ప్రభాసుండు పుడమిలో జనింపక తీరదు యోగసక్త మునిపై నలుగుటచే శపురాలైనది. మ్లేచ్ఛజాతియందుఁ బుట్టును. ఇప్పుడు మేమేమి చేయుదుము శాపములు క్రమ్మరింప శక్యముగాదు. నీయభిలాష యేదియో చెప్పుము నీకు సంతోషము గావింప మాకుత్సాహముగా నున్నదని పలికిన విని జీవపతి యిట్లనె.

దేవీ! యోగసక్త నాకు మనుష్యజన్మ వలనఁ గలిగిన యిక్కట్టు బాపఁ బ్రయత్నించి నాకతంబున నావెతలం గుడుచుచుండ నాకు వేరొక పనివలన సంతోష మెట్లు కలుగునో చెప్పుము. నాకుపకారము గావింపఁ బూనినవా రాపద నొందుచుండి నాబ్రతుకేమిటికి, నావైభవము కాల్చనా? తల్లీ! ఆదంపతులశాపము నేననుభవించెద. వారి విముక్తులం గావింప నీపతిం బ్రార్థింపుము. నన్ను మ్లేచ్ఛజాతిగాదు చండాలజాతి యందుఁ బుట్టింపుము. పతివ్రత శూన్యంజేసి ధరింపరాని యిడుములం గుడింపుము. అందులకు వెరవను. నామిత్రులు దుఃఖశూన్యులైనంజాలును అయ్యో! నా ప్రాణసఖురాలు యోగసక్త మనుష్యులు జరామరణ రోగములవలనం బడు నిడుములు విని మిక్కిలి విచారించినది తానధమజాతియందు జనించి యట్టిబాధలం బొందుదునని వినినప్పుడెంత చింతించెనో తెలియదు. నన్నెంత నిందించెనో? నానేస్తము వలన గలిగిన చిక్కులకు విసుగుకొనక మానునా! అయ్యో అట్టి యుత్తమురాలిం గష్టపెట్టితిని నేను జీవచ్ఛవమునుగానా! కటకటా! నాకుపకారము చేయఁబూనినవారెందఱు చెడిరో చూడుము దివ్యలోకముల భర్తతోగూడ విమానమెక్కి స్వేచ్ఛవిహారములు గావించు యోగసక్త యధోగతిం బొందినది. అంతఃపురముల రాజభోగములందెడు రోహిణి యేటిపాలైనది. అడవిలో మెకములకెల్ల తాన యొడయఁడై కడుపునిండ మాంసము గుడుచుచు యథేష్ట విహారముగావించు నీమృగరాజు తిండిలేనక కుళ్ళిచచ్చినది అమ్మా! నేను వేషమున కిట్లుంటినిగాని కడుపాపాత్మురాల. నేనుత్తముల శోకాయత్తులం జేయుటకు జనించితిని నేను బుట్టకున్న వీరి కీయిక్కట్టు లేఁబోవును గదా! కావున నాయావుల శాపవిముక్తులం గావింపుము. లేకున్న నిప్పుడే మీపాద మూలమున నాశిరము వ్రయ్యఁజేసి యాదుఃఖము మరచెదనని గోలుగోలున నేడ్చుచుఁ బలితోలు నేలం బెట్టకయే యాదంపతుల మ్రోల జాగిలంబడినది.

అప్పుడరుంధతి పతితో మహాత్మా! ఈసుగుణమణి దుఃఖించిన మనము నాశనము నొందుదుము యిట్టికృతజ్ఞురాలు భూతభవిష్యద్వర్తమాన కాలములయందు మఱియొకతె లేదని నాయభిప్రాయము. ఈమె నెట్టైన సంతోషపెట్టక తీరదు మన తపంబంతయు ధారపోసియైన నుపకారము చేయవలయునని ప్రార్థించిన విని యమ్మహర్షి

తదీయ సుగుణవిశేషంబుల కంతకుముందు మెచ్చియున్నవాడు కావున మందహాసము గావింపుచు జితవతి శిరంబునఁ గరంబిడి లేవదీసి యూరడింపుచు నిట్లనియె.

పుత్రీ! నీచారిత్రము కడు పవిత్రమైనది నీశీలము స్తుతిపాత్రమైనది. నీయభీష్ట మొకరీతి దీర్పఁగలను. వినుము వారికి మనుష్యజన్మము తప్పదు. అందు సర్వోత్కృష్టత గలుగు నట్లనుగ్రహించెద వినుము ప్రభాసుండు పుడమి దేవతాగర్భంబున నుత్తమక్షత్రియకులంబున జనించును. అస్త్రశస్త్రములందుఁ దేజోబలపరాక్రమములయందు మూడులోకములలో నీడులేనివాఁడని వాడుక వడయును. విద్యలచే బృహస్పతిని మించగలఁడు మహర్షులతనియొద్ద జ్ఞానము నేర్చుకొందురు అతనికిఁ దెలియనిధర్మంబు లుండవు. జితేంద్రియులలో మొదటి వాఁడగును. పరమభక్తాగ్రేసరుఁడు, స్వచ్ఛందమరణుఁడై పెద్దకాలము పుడమి నలంకరించును భార్యాపుత్రశూన్యుండయ్యును బెక్కుబలగము గలవాఁడగును. వేయేల? అతనికి వసువుగా నున్నప్పటికంటె మనుష్యుఁడుగా నున్నప్పుడే యెక్కుడు ఖ్యాతి రాఁగలదు వసువు లప్పుడప్పుడుపోయి యతనితో సంభాషించి వచ్చుచుందురు. నీనిమిత్తమై యిన్నివరంబు లతని కొసంగితిని. సంతసించితివా? అని పలికిన విని నమస్కరించుచు జితవతి యిట్లనియె.

తండ్రీ! ప్రభాసు ననుగ్రహించితివి. యోగసక్తన గూడ సత్తమజన్మగాఁ జేయ వాయని వేడిన నతం డించుక యాలోచించి కానిమ్ము నీవుజెలఁగినఁ జాలు నీసఖురాలు యవనప్రతికయను వాడుక బడయుంగాని బ్రాహ్మణునికే జనించును విద్యలలో సరస్వతిని, రూపంబున రతిని, భాగ్యంబున లక్ష్మిని, ప్రభావంబున గౌరిని మించి కారణాంతరమున రెండవజన్మమెత్తి పండితరాయలను బిరుదము వహించిన ప్రభాసునే పెండ్లియాడును. కోపంబు గలిమిచేఁ గొన్ని యిడుములం బడునుగాని యవి దీర్ఘములుగావు. చివురకు భార్యాభర్త లిరువురు గంగా గర్భంబునఁ బ్రవేశించి పూర్వరూపంబులం దాల్తురు వారికివరంబులు చాలునా? జితవతీ! అని అడిగిన నప్పుడతి చేతులు జోడించుచు నిట్లనియె.

తండ్రీ! ప్రభాసుండు పుడమిఁ బెద్దకాలము భార్యలేక సంచరించుంగదా? ఆతండు రెండవ జన్మమెత్తుదనుక యోగసక్త యేమి చేయుచుండును. అనతీయుఁడని యడిగిన నవ్వుచు నతండిట్లనియె.

తనపతి రెండవజన్మమెత్తుగనుక యోగసక్త తనపేరు సార్థకము నొంద యోగసక్తయై తపంబు గావించు నట్లనుగ్రహించితి నిఁక జాలునా యని పలికిన విని జితవతి ప్రహర్షసాగరంబున మునుంగుచు దండ్రీ! ఇంకొక్కటి మిమ్ము వేడఁదలంచితి నాగ్రహింపవలదు నా నిమిత్తమై మరణమునొందిన యీ పులి కుత్తమలోకము గల్గు నట్లు వరమీయఁబ్రార్థింతు. ఇదియే నా కడపటికోరికయని నుడివిన నతండిట్లనియె.

పుత్రీ! నీ యట్టి పుణ్యాత్మురాలి కుపకారము గావించిన పులియూరక పోవునా? విను మది చక్రవర్తియై యుదయించును. క్రౌర్యస్వభావంబునం జేసి యవనుండగును. అతనికి యోగసక్త కూఁతురనువాడుక బడయునని యానతిచ్చెను.

పిమ్మట నా కొమ్మ రోహిణి సమసినదికా నిశ్చయించి దాని గురించియడుగఁ బోయి మోమాటపడి యూరకున్న గ్రహించి వశిష్ఠుఁడు బాలా! నీ సఖురాలు రోహిణి యింటికిం బోయినది. సుఖంబున్నది. క్రమ్మర నీతోఁ గలిసికొనఁగలదని పలికెను.

అప్పుడు జితవతి మహాత్మా! నీ దయవలన నా మిత్రులెల్లను గృతార్థులైరి. మఱియొక విషయమడుగ మరచితిని. ఇప్పుడు రోహిణి బ్రతికి యింటికిం బోయినదని చెప్పితిరి. దాని నెక్కించుకొని యమునలో నీదికొనిపోయిన పులిమాట యడుగుట మరచితిని. అదియు నా కుపకారము చేసినదే దానికుత్తమగతు లడుగ మరచిన నేను గృతఘ్నురాలను కానా? నా వలన దానికేమి ప్రతిఫలము గలిగినది. స్త్రీ చాపల్యంబున నిట్లడుచున్నదని తలంపక అదియును ముక్తినొందునట్లను గ్రహింపుము. ఇఁక మిమ్మేమియు నడుగనన నతండు చిరునగవు మొగమునకు భూషణముగాఁగ నిట్లనియె.

పుత్రీ! నీవెన్ని వరము లడిగినను నాకు మురిపెమే కలుగుచున్నది. నీవు స్వార్థపరురాలవు కావు. నీ కృతజ్ఞత త్రిభువన విఖ్యాతమై యుండఁగలదు. రెండవ పులియు ఢిల్లీశ్వరునికి మంత్రియై యుదయింపఁగలదు. ఇప్పుడు నీవు పూర్ణముగా సంతసించితివా! అభీష్టము లన్నియుం దీరినవియా! ఇఁక నీవింటికి బొమ్ము. సుఖింపుము. అని వక్కాణించిన విని యమ్మించుఁబోణి చేతులు ముకుళించి స్వామీ! మీ యనుగ్రహంబున నేను మనుష్యాంగనలలో నుత్తమురాలనైతిని. ఇఁక నాకే కామితము లేదు. మీ పుత్రికనై యిందు మీ పాదసేవ జేసికొనుచుఁ గాలము పుచ్చెద. మఱియు నే పుణ్యాత్మురాలి మూలమున నాకు మీ దర్శనలాభము గలిగినదో యా యోగసక్త యొకసారి నా కన్నులం బడునట్లు చేయుఁడు. ఇక నాకు స్వర్గలోక సౌఖ్యమిచ్చినను నవసరము లేదని కోరుకొనియెను.

అమ్మహర్షి పుంగవుం డా మాటవిని యరుంధతి మొగము జూచెను. ఆ పతివ్రత జితవతిని బుజ్జగింపుచు బుత్రీ! నీ శీలమహిమచేఁ బుణ్యలోకంబు లన్నియు గుత్తగొంటివి. మఱియు సుఖోచితమైన ప్రాయంబునఁ బడరాని యిడుములం గుడిచితివి. నీ సౌందర్యమునకుఁ దగినట్టి వరుం బరిగ్రహించి గార్హస్థధర్మంబుల నడిపి పిమ్మట ముక్తవయ్యెదవుగాక ఇప్పుడింటికి బొమ్ము. తృటిలో నంపించెదమని పలికిన

నా కలికి యం పలకు సమ్మతించినది కాదు. అక్కడ నుండియే ముక్తనయ్యెదనని దీనయై నిక్కిలి ప్రార్ధించినది.

అరుంధతి యాటోగి మాటలన్నియుఁ బూర్వపక్షములు జేసి చేయఁదగిన కృత్యంబు లుపదేశించుచుఁ గన్నుల మూసికొనుమని చెప్పినది. యోగసక్తం జూపిం తుననుటచే జీవవతి తన కరతలంబుల గన్నుల నాచి మూసికొనినది.

అని యెఱింగించి—ఇట్లని చెప్పదొడంగెను.

# 114వ మజిలీ కథ

ఔరా! కన్నులుమూసి తెరచినంతలో నత్తపోవన మంతర్ధానమైనదే. ఈ భవన మెవ్వరిది? నవరత్న ప్రభాభగద్దగితములై కుడ్యాంతరంబులు కన్నులకు మిరు మిట్లు గొల్పుచున్నవి. ఇది మదీయ సదనము కాదు. ఇదియొక దేవలోక విశేషమని తోచుచున్నది. అగునగు మఱచితిని. నా సఖురాలిం జూపింపుమని యామునిపత్నిం గోరితినికానా? ఇది యోగసక్త మందిరము కావచ్చును. సందడియేమియుం దోచ దేమొకో? లోపలికిఁబోయి చూచెదంగాక యని తలంచి జీవవతి మెల్లన తలుపులు తెరచికొని లోపల అడుగుపెట్టినది.

గదిలో మంచముపైఁ బండుకొని ధ్యానించుచున్న యోగసక్త "ఎవరువారు" అని కేక పెట్టినది. ఆ ధ్వనివిని యోగసక్త యని నిశ్చయించి జీవవతి యామె దాపు నకుఁబోయి నమస్కరించినది.

యోగసక్త లేచి యెదురువచ్చి యామె నెగా దిగఁజూచి అమ్మా! నీవెవ్వతెవు ? ఇందేమిటికి వచ్చితివి? ఈ ప్రాయంబున యోగినివై జటావల్కలములు ధరించితి వేల? నీయుదంత మెరింగింతువే అని యడిగిన సఖీ! నన్ను మరచితివా? నీకష్టముల కెల్లఁ గారకురాల జీవవతిని దల్లీ! కుశలినివై యుంటివా అని పలికినంత నాశ్చర్య ముఖముతో నామెం గౌఁగలించుకొని ప్రాణసఖీ! ఇట్టి వేషము ధరించితివేల? నీవి క్కడకెట్లు వచ్చితివి? మా దేవత్వము భ్రష్టమైనది వింటివా? నీకును వార్త నంపియే యుంటిననీ అభిప్రాయంపులుజెండ విచారించుచుఁబలికినది.

జీవవతి యామె నోదార్చుచు అమ్మా! నీ దుఃఖమును సమూలముగా నిర్మూ లింపఁజాలనుగాని కొంతకొంత కొరఁత వడునట్లు చేసితిని. వినుమని తాను రోహిణితో నగరము విడిచి యోగిని వేషము వైచినది మొదలు అంతదనుక జరిగిన వృత్తాంత మంతయు నెఱింగించినది.

యోగసక్త సంతసముపై జేయివైచుకొని అమ్మనేజెల్లా! ఎంత సాహసము జేసి

తివి? తల్లీ ! యెన్నియిడుమలంబడితివి సఖీ! యెట్టి కృశత్వ గాంచితివి యెట్టిమహిమ సంపాదించితివి అని యబ్బురపాటుతో నామెం గౌఁగలించుకొని రాజపుత్రీ! స్వర్గ మర్త్యపాతాళములలో నీవంటి పుణ్యాత్మురాలు లేదు. నీమైత్రివలన నేనును గృతార్థురాలనైతినని పెద్దగా బొగడినది.

బాలుఁడాలుఁ ఎదురు నన్నుఁ బొగడుచుంటివా? నీ సుగుణములలో సహస్రాంశము వాకడలేదు. నీ సత్యము నీ యౌదార్యము నీపరోపకృతియే సుకృతికిఁ గలదు. పోనిమ్ము మనమిద్దరము ఇందుఁ దపంబు జేసికొనుచుండుదము దేహయాత్రి నడుపఁగలదని పలికిన యోగసక్త యిట్లనియె.

దేవీ! మేమి ప్రపంచముచూచి రోసితిమి? నీవు చూడకయే రోయుచుంటివి. అయినను అప్పురాణ మునిదంపతులు నిన్నింటికిఁ బోయి పెండ్లియాడుమని యాన తిచ్చిరి కదా! ఆ వైభవము కొన్ని దినము లనుభవించి పిమ్మట తపంబు జేసికొన వచ్చును.

తపమనఁగా ముక్కుమూసుకొని కూర్చుండుటగాదు. శమదమాది గుణంబులు గలుగుటయే తపము. సత్యము తపము, దానము తపము, కృతజ్ఞత తపము, సుగుణంబులన్నియుఁ దపంబులు. కావున నీవు గావించన తప మేమహర్షులు చేయలేదని వ్యాఘ్రసేవయే చెప్పుచున్నది. నీవిఁక నింటికిఁబోయి యా ప్రభాకరుని బెండ్లి యాడుము. సౌఖ్యమొందగలవని యుపదేశించినది.

జితవతి యేమియు మాటాడక కర్తవ్యాంశము గురించి వితర్కించుచున్న సమయయంబున నగ్రవసువు భార్య తేజోవతి యచ్చటికి వచ్చి సోదరీ యేమిచేయు చున్నావు? నీకొక శుభవార్త చెప్పెద నిటురమ్మని పిలిచినది సంతోషముతో లేచి యోగసక్త వాకిటకుఁ బోయి తోడితెచ్చి యుచితాసనాసీనం గావించినది.

జితవతి లేచి యామెకు నమస్కరించుటయు నబ్బురపాటుతో ... నీ యోగిని యెవ్వతె? నీకీమె పరిచయ మెందుఁ గలిగినదని యడిగిన యోగసక్త పిమ్మట నీమె వృత్తాంతము జెప్పెద నీవుదెచ్చిన శభోదర్క మేమనవుఁడు. తేజోవతి యిట్ల నియె.

వసువులెల్ల శప్తులై భూమిలో జనింపఁ దలచి తల్లు లెవ్వరని యాలోచించుచుఁ బోవుచుండ దారిలో బ్రహ్మశాపతప్తయగు గంగా మహాదేవి యెదురు పడినదట. వసువులామెతోఁ దమపాట్లు జెప్పికొనిరి. ఆమెయు వారికిఁ దమశాపప్రకార మెఱింగించి వారినెల్లఁ దనయందు జనించునట్లు నియోగించినదఁట.

పిమ్మట అద్దేవి శంతనుఁడను మహారాజును భర్తగా వరించి వసువుల నందఱ

గాడుకులంగాఁగనినది. జాతమాత్రమున శాపవిముక్తులై యార్వురు వసువులును నీవు రక్షించిన దుష్టశాపముల గుఱించి పరితపించుచుండ నాకాశవాణి వసువులారా ! మీరు ప్రభాసుని నిమిత్త మించుకయు విచారింప నవసరములేదు. అతడు భీష్ముండను పేరుతోఁబుడమిఁ బెద్దకాలము బ్రతుకును. దేవతలకన్న నెక్కుడు విఖ్యాతి వడయఁగలడు. సర్వధర్మములు అతనికే తెలియును. స్వచ్ఛంద మరణుండై యుండునని పొగడుచు నెఱింగించినది. వసువు లింటికి వచ్చినిక వార్త దెలిపి రమ్మనిరి. అని చెప్పినవిని యోగసక్త యిట్లనియె.

అక్కా ! అతి క్రూరమైన యతి శాపంబిట్లు మారుటకుఁ గారణమేమియో తెలిసినదియా? యని యడిగిన నామె యది యేమియో నాకుఁ దెలియదు. ఇదిఅసత్యము కాదు. యదార్థవచనమని పలికిన నవ్వుచు యోగసక్త అక్కా! యిక్కార్యంబంతయు నీ కాంత వలన ఫలించినది. అందు వసుసామర్థ్య మేమియు లేదని జితవతి వృత్తాంతమంతయు నెఱిగించినది.

అప్పుడు తేజోవతి యేమీ! యీయామెయే జితవతి. ఆహా! నేఁడెంత సుదినము. అని పొగడుచు నామెం గౌఁగలించుఁ కొనుచు దల్లీ నీ వలన మా కులంబు నిలఁబడినది. మే మందరము నీ కృతజ్ఞతకుఁ దాసులమై యుండెదము. నిన్నుఁబోలిన పుణ్యాత్మురాలు లేదు. అని పొగడుచుండ జితవతి యామెకు నమస్కరించుచుఁ జెవులు మూసికొనినది. యోగసక్తయుఁ దేజోవతియు జితవతికి బోధించి జటావల్కలాదులఁదీసి దివ్యమాల్యానులేపన మణిభూషాలంకృతం గావించి ముహూర్తమాత్రములో నామె మేడమీద డింపి రండని పరిచారకుల నియమించిరి.

అయ్యుప్పరిగపై నున్న పరిజనమా రాజపుత్రిక రాకఁజూచి జితవతి జితవతి యని కేకలువైచుచుఁ బదుగురకుం దెలియఁజేసిరి. సంభ్రమముతో రాజపత్నియు రోహిణియు మున్నగు అంతఃపుర కాంతలామేడకు వచ్చి జితవతింజూచి కౌఁగలించుకొను చుండిరి. జితవతియు వారినెల్ల నాదరించుచుఁ దల్లికన్న ముందు రోహిణిం గౌఁగలించుకొని ప్రియసఖీ! ఇంటికెట్లు చేరితివి? ప్రవాహములోఁ గొట్టుకొనిపోయి యెందుఁ గడ్డెక్కితివి? ఆ పులియేమైనది. చెప్పుము. అని యడిగిన రోహిణి తత్కథ యంతయు జెప్పినది. జితవతియు రోహిణి యడుగఁ దన వృత్తాంత మంతయు వారికెల్ల నెఱింగించినది.

పిమ్మట మందిరాభ్యంతరమున కరిగి పరంపరలుగా వచ్చి చూచెడు బంధువుల కందఱకు ఆ తెరంగెఱింగించుచుండ వినోద నినాద మేదురంబై యాగృహంబు సాగరంబువోలె ఘూర్ణిల్లుచుండెను. ఱే నరుండరుదెంచి పుత్రికం గౌగలించుకొని యానందాశ్రువులచేఁ దదీయ శిరంబు దడుపుచుండఁ గులపాలికా విరుద్ధంబగు చర్యలఁ

గావించితినని సిగ్గుపడుచుండ అతండు గద్గదకంఠముతోఁ దల్లీ! నీ సౌశీల్యము లోక విదితమైనది. నీవు విచారింపవలదు. నీ చరితంబున మా వంశము వాసి కెక్కినది.

క. తలనుండి తృణముదీసిన
నలరారుం గోటియిచ్చినట్లుల సుజనుం
డిలఁ బ్రాణమిచ్చి యుపకృతి
సలిపిన వైరముగనడి యసజ్జనుఁ డెంచున్.

నీవు కృతజ్ఞురాలవై మంచికీర్తి సంపాదించితివని పొగడుచుఁ బెద్దగా గౌరవించెను. పదిదినముల దనుక రోహిణియు జితవతియుఁ దమ ప్రయాణవిశేషంబుల నాప్తుల కెరింగించుచుండిరి. ఆ ప్రస్తావములో రోహిణి ప్రభాకరుని గుణగణంబులను పెద్దగాఁ బొగడుచు నామె మనసు వానియందు లగ్నమగునట్లు గావించినది.

తన నిమిత్తమై యుత్తర దేశారణ్యములఁ దిరుగుచు నతండు పడిన కష్టములును జెప్పిన మాటలును జేసిన కృత్యంబు లుగ్గడించిన విని జితవతి అయ్యో! సఖీ! ఆ రాజపుత్రుఁడు నా కొరకంత పరితపింప నేమిటికి? నా మాత్రపు జోగురాలాయనకు దొరకదా? కటకటా! నేనెందఱిని గష్టపెట్టితినో అని పలికిన విని రోహిణి జితవతీ! ప్రభాకరుఁడు నీ రూపము గురించి యెంతగా స్తుతిజేయుఁడు. నీ కృతజ్ఞతఁ దలఁచి అబ్బా! వాని మనసు నీరై పోవునుగదా? అని యానందబాష్పములతో నెరంగించిన జితవతి పలుమారు వినివిని యొక్కనాఁడిట్లనియె.

రోహిణీ! నీ యుపన్యాసము శ్రోతవ్యమై యున్నది. నేను జోగురాలనై గుడిలో వసించియతనితోసంభాషించితిని. ఇప్పుడుశృంగార క్రీడలవానిమతినెట్లురంజింపఁజేయఁ గలను. శృంగార వైరాగ్యములు పరస్పర విరోధములుకావా? నా వైరాగ్యమంతయు, గపటమని తలంపఁడా అని యనేక విషయంబులఁ దలఁచి చెప్పిన విని రోహిణిచాలుఁ జాలు. నీ వైరాగ్యమే వానికి హృదయంగమమై యున్నదట. నాఁడు నాతోఁజెప్పిన మాట లెన్నిగలవు? నీవు మరియొకరీతిఁ దలంప వలదు. మీ తలిదండ్రుల యభిలాషయు నట్లే యున్నది. నీ భర్త ప్రభాకరుఁడని యప్పుడే నిశ్చయించిరి. ముహూర్తము నిశ్చయించిరి. నీతో నూరక చెప్పుచున్నాను. కాని యిదివరకే విన్నాపమంతయు, గౌరవించిరని యెరిగించి యామె యంగీకారము గైకొని కాశీనరున కెరిగించినది.

కాశీనరుఁడు ప్రభాకరునిఁ బంధుమిత్ర పరివార సహితముగా రప్పించి శుభముహూర్తంబున నత్యంతవైభవముతో జితవతివచ్చి వివాహము గావించెను. అరుంధతీ మహాదేవి నాఁటిసీధేశ దుర్గంబులు స్వయముగాఁ బెనికి జితవతి కిచ్చియున్నది. ఆ పాల నా రాజపుత్రిక జాగరూకతతోఁ దెప్పించుకొని వివాహానంతరమున భర్తకిప్పించి

నది. యా పొలంతిగోలి ప్రభాకరుండు దివ్యప్రభాకరుండై జితవతింగూడి యభీష్ట కామంబులం దృప్తుండయ్యెను.

ఒకనాడు క్రీడాంతరంబునం బ్రభాకరుండామె మొగముజూచి నవ్వుచు ప్రేయసీ! నాఁడు నీవు యోగినివై యున్నప్పుడు నీ చూపులు జూచితిని. కేవలము శాంతరస ప్రధానములై యున్నవి. ఇప్పుడిట్లు పచ్చ విల్తుని పూములుకులవలె హృదయభేదకము లగుచున్నవి. ఈ శృంగారవిలోకము లెప్పు డభ్యసించితివని పరిహాసమాడిన నవ్వుచు నాపువ్వుంబోఁడి ప్రభాకరుని సాన్నిధ్యంబు లభించినం గనుదమ్ములకుం గ్రొత్తయందము గలుగుట యబ్బురము గాదు. అని యుత్తరముజెప్పి యా పురుష సింహమును సంతోష సాగరమున నోలలాడించినది.

ప్రభాకరుండు జితవతింగూడి పెద్దకాలము ఇంద్రవైభవ మనుభవించుచు రాజ్యము గావించెను.

గీ. ధరం గృతజ్ఞునికన్న నుత్తమ సుకృతి యు
గనం గృతఘ్నునికన్న దుష్కర్ముండు
లేడు లేడని శాస్త్రము లేర్పిచెప్పె
సత్య మా మాట కిదీ నిదర్శనము కాదె.

సీ. నితరణంబున జగద్విశ్రుతయశులైరి
శిబి సూర్యసుత దధీచిప్రముఖులు
సత్యంబె వ్రతముగాం జను హరిశ్చంద్రుడు
త్రిభువనంబు లెఱుంగం దేజమందె
సాహసంబె ప్రధాన సద్గుణంబై యొప్ప
విక్రమార్కుఁడు దేవ వినుతుఁడయ్యె
శమగుణై కాంచిత స్వాంతుఁడై భరతుండు
మునుల కందరాని ముక్తిపడసె

గీ. జితవతి కృతజ్ఞ తాగుణ వ్రతముబూని
చిరతపఃపూత మునిజాత నిరతిశయన
మస్తసురగీత విఖ్యాత మహిమగాంచె
సుగుణమేదైన జనుం బరిశుద్ధంజేయ.

గోపా! వినుమా ప్రభాసుండను శంతనునివలన గంగాగర్భంబునం జనించి భీష్ముండను పేరు వడసి సమస్త విద్యలం జదివి యస్త్రశస్త్రధారణంబునం అసమానుండై యొప్పుచు రెండవ జన్మంబునం బలదిత రాయలై యుదయించెను.

ఆ యోగసక్త లవంగియై బ్రాహ్మణ పుత్రిక యయ్యె. పాదుషా కూతురను వాడుక వడసినది జితవతి కుపకారము చేసిన పెద్దపులియే పాదుషాయైనది రెండవ పులి యతనికి మంత్రియైనది. పండితరాయలును లవంగియు నాజన్మంబునఁ గొన్ని యిడుమల గుడిచియు శాపావసానమున గంగాగర్భంబునం బ్రవేశించి వసురూపంబులం దాల్చి వసులోకమున కరిగిరి. తెలిసినదియా? యని యడిగిన గోప కుమారుండు పరమానందభరిత హృదయుండై యా కథ పలుమారు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు అయ్యవారి కనేక దండములు గావించెను.

ఉ. ఊరక చేతితోఁ దలఁచున్న తృణావళి దీసినంత బం
గారము కోటియిచ్చిన ప్రకారమున న్మదమందు సజ్జనుం
డారసి ప్రాణదానముననైన నొనర్చు మహోపకారము
న్వైరముగాఁదలంచి యుపవాదము సేయు ఖలుండు ధాత్రిలోన్.

గద్య—ఇది శ్రీమద్విశ్వనాథ సదనుకంపాసంపాదిత కవితావిచిత్రా
త్రేయ మునిసుత్రామగోత్ర పవిత్ర మధిర కులకలశ జలనిధి
రాకాకుముదమిత్ర కొండయార్యపుత్ర సుబ్బన్నదీక్షిత
కవి విరచితంబగు కాశీయాత్ర చరిత్రంబునందు
సప్తమభాగంబున జితవతీ చరిత్రము.
శ్రీ విశ్వనాథార్పణమస్తు.

— ० —

శ్రీరస్తు

# కాశీమజిలీకథలు

## సప్తమ భాగము

## 115 వ మజిలీ

మహాత్మా ! యీ యవనకథంబు విచిత్ర విషయశూన్యంబగుట నడుగవల సిన విశేషంబేమియుఁ గనంబడలేదు మఱియు విక్రమాదిత్యుని మనుమఁడు విజయ భాస్కరుని చరిత్రము వినినది మొదలు నా చిత్తము తత్కథా సుగుణాయత్తమై యున్నది. అతండు కలభాషిణీ హేమప్రభలతోఁ గూడికొని యుజ్జయినీ నగరంబు బ్రవేశించి పట్టాభిషిక్తుఁడయ్యెనని యెఱింగించితిరి గదా !

ఆ రాజపుత్రుని తదనంతర వృత్తాంతం బెట్లుండెనో వినివేడుక యగుచున్నది. పరోపకారపారీణుండగు నమ్మహానుభావుండు లోకోపకారకమగు కార్యంబు లేమేమి గావించెనో దివ్యరత్న ప్రభావంబునం దెలిసికొని వివరింతురే యని ప్రార్థించినవిని మణిసిద్ధుండు మిగుల సంతసించుచు నా రత్నంబు ముందు నిడికొని పూజించి విడితోడంతుండై యబ్బురపాటుతో నౌరా ! నీ వడిగిన విషయంబేదియుఁ జమత్కార కథారహితంబై యుండదు. ఏతచ్చరిత్రంబు కడు చోద్యంబు సావధాన మనస్కుం డవై యాకర్ణింపుము.

## వీరసింహుని కథ

సకలసంపత్ప్రభాకరంబగు నజ్జయినీ పురంబునఁ దేజోభాస్కరుండగు విజయభాస్కరుండు సుజనలోక బాంధవుండై విబుధమిత్రుండై దివ్యప్రభాసంప న్నుడై రాజ్యంబు గావింపుచు నొకనాఁడు కొల్వుకూట మలంకరించియున్న సమయం బునఁ బ్రతీహారి జనుదెంచి జోహారు జేయుచు దేవా ! దూరదేశ వాసియగు భూసురుం డొకండు ఇరువుర శిష్యులతో వచ్చి గోపురాసన్న వేదిక యందున్నవాఁడు. భవద్దర్శ నాభిలాషియై యరుదెంచెనఁట. దేవరకు విన్నవింపుమని కోరుకొనియె. సెలవేమి యని అడిగిన నతండు బాలికా ! ఎన్నిసార్లు జెప్పవలయును. బ్రాహ్మణుల రాకకు సెలవ వసరము లేదని నియమింపలేదా ! పో ! పొమ్ము వేగఁ బ్రవేశ పెట్టుమని యాజ్ఞాపిం చెను.

ఆ ద్వారపాలుఁడు పోయి వెండియువచ్చి స్వామీ ! యాతండిందురాఁడఁట. దేవరతో నేదియో చెప్పుకొనునఁట. అక్కడకే దయచేయుమని ప్రార్థించు చున్నాఁడని యెఱింగించిన నారేఁడు గ్రక్కున లేచి మొగసాలకరిగి యందున్న విప్రునకు నమస్క

రించుచు ఆర్యా ! మీరే కార్యమునకై వచ్చితిరి? సభకేల రారైతిరి? మీ యభీష్ట మెఱిం గింపుఁడని అడిగిన నా భూసురుం డాశీర్వచన పూర్వకముగా నిట్లనియె.

దేవా ! మాది దక్షిణదేశము. నా పేరు సుముఖుఁడందురు. వాస్తుదేవతా భూయిష్టమగు కోటలోనికి వత్తునేని వాస్తుదేవతలు ముందరి కార్యమునకు విఘ్నములు చేయుదురు. అందులకై లోపలికి రాలేదు. నేను సమస్త విద్యలం జదివితిని. అంజన ప్రభావంబున నెక్కడ నిక్షేపములున్నదియుం జెప్పఁగలను. దాని నరయుటకై గిరి నదీ పక్కాణారణ్య భూములఁ దిరుగుచుందును. యీనగరమునకు దక్షిణముగా నున్న యరణ్యములోని పర్వతకూటమున మర్రిచెట్టు క్రిందఁ బెద్ద నిక్షేపమున్నది దానిఁ బరిశీలించి వచ్చితిని. భూతభేతాళములు దానింగాచికొని యుండును. దేవర పట్టమహిషితోవచ్చి ఖననప్రారంభము గావింతురేని నిక్షేపము లభింపఁగలదు మంత్రబలంబున భూత భేతాళములు విజృంభించకుండఁ గట్టివైచెదను. అందు దేవరకు సగబాలు బంచియిచ్చెదను. ఇక్కార్యంబునకు సహాయము గావింప దేవరం బ్రార్థింపు చున్నవాఁడ నిదియె నా యభీష్టమని తెలిపిన విని నవ్వుచు విజయ భాస్కరుండు ఆర్యా! మీ నిక్షేపములో నాకు సగమీయ నక్కరలేదు. అంతయు మీరే తీసికొనిపొండు. మే మప్పుడక్కడకు రావలయునో చెప్పుఁడు. వచ్చి మీరు చెప్పినట్లు చేయుదుమని పలికిన విని యా బ్రాహ్మణుండు మిగుల నభినందించుచు దేశకాలము విశేషంబుల నిరూపించి చెప్పినాగ్గిరి శిఖరంబున కరిగెను.

అంత నిరూపింపఁబడిన దివసంబున విజయభాస్కరుం డుచిత పరివారముతోఁ గూడికొని కలభాషి నందలం బెక్కించి యను దుర్గారూఢుండై బయలు వెడలి మెల్లగ నా గిరిపరిసరధరణి కరిగెను.

వారి రాక వేచి యందున్న యాపారు శిష్యులిద్దరు పరివారము నంతయు నందే యుండ నియమించి యందలముతో రాజు భార్యను రాజును మార్గము శిఖరంబునకుఁ దీసికొని పోయిరి. ఆ కూటంబున నా జన్నిగట్టు మర్రిచెట్టు క్రింద నగ్ని వేల్చుచు విజయభాస్కరుని నమస్కారము లందుకొని వారి నందుఁ గూర్చుండ నియమించి శిబికావాహకుల గొండ క్రిందికిం బోవు నట్లాజ్ఞాపించెను.

రాజును రాజు భార్యయు శిష్యులును సుముఖుండు తప్ప నందెవ్వరు లేరు. పరిజనమంతయు దూరముగా నున్నది. అప్పుడా సుముఖుఁడు లేచి రాజదంపతులఁ దూరపుముఖముగా నిలువంబెట్టి కన్నులు మూసికొమ్మని చెప్పి ముకుళిత నేత్రులై యున్న యారాజదంపతుల హఠాత్తుగాఁ దన దేహమును బెంచికొని వారి నిద్దరఁ జెరి యొక భుజముపై నిడికొని శిష్యులు వెంటరా వియద్గమంబునఁ దక్షిణముగా నెం దేనిఁబోయెను.

పర్వతపాదమున వసించియున్న విజయభాస్కరుని పరిజనులు సాయంకాలము దనుక నలుదండి రాజదంపతులం దీసికొని వచ్చుటకై యందలముతో శిఖరదేశమున కరిగిరి అందెవ్వరి జాడయుఁగనంబడ లేదు. మఱ్ఱిచెట్టు క్రింద వేదిక మధ్యమున నగ్ని భగ్గుభగ్గుమన్నది అప్పుడు మిక్కిలి తొట్రుపడుచుఁ గొండగుహలు ప్రతిధ్వనులిచ్చునట్లు మహారాజా! విజయభాస్కరా! అని కేకలు వేయఁ దొడంగిరి. అతని ప్రతిధ్వని యే మూలనుండియు వినక పరిజనులు హాహాకారము సేయుచు అయ్యో! ఆ బ్రాహ్మణుఁడెవ్వఁడో మాయావి రాజదంపతుల నేమి జేసెనో తెలియదు. తెలియక మోసపోయితిమి. అందరిని దూరముగా బొమ్మనిన నేమోయనుకొంటిమి హా! మహారాజా! ధర్మశీలా! హా పరోపకారనిరతా! అని దుఃఖించుచు నా పర్వతమంతయు వెదకి యరణ్య భూమును పరిశీలించి యత్యంత దుఃఖాక్రాంత స్వాంతులై నాలుగు దినములకు దిరుగ నగరముజేరి మంత్రులకు తెరంగెరింగించిరి.

అప్పటికి రెండు దినములక్రింద హేమప్రభ ప్రసవమై మగశిశువుం గనినది. మహారాజుగారి వార్తకొఱకుఁ బ్రజలెదురుచూచు చుండిరి. నిజమైన వార్తవినిమంత్రులు విచారసాగరమగ్నులై పురిటిదినములు పదియు దాటుననుక నా కథ హేమప్రభకెఱుంగనిచ్చిరికారు. నలుమూలలకు రాజదంపతుల వార్తఁదెలిసికొన సమర్థులైన వీరభటులఁ బెక్కండ్రఁ బంపిరి.

హేమప్రభయుఁ బదొకండవ దివసంబున మంత్రుల వలన భర్తృప్రవాస ప్రకారంబువిని యదలుచు నొతలెఱుంగక మూర్ఛ మునిగినది. విజయభాస్కరుని తల్లియు నావార్తవిని యుల్లము భేదిల్లఁ దల్లడిల్లుచు గుమారుని గుణముల నగ్గించి యతండు దైవబలసంపన్నుఁడు శత్రువుల బరాభవించి యెట్లో రాగలడని కోడలి కుదుట గరపుచు దేశమరాజకము గాకుండ రాజ్యతంత్రము లన్నియు హేమప్రభ యనుమతిని మంత్రులు జూచునట్లుగా నియమించి తదన్వేషణమునకై మిక్కిలి రొక్కము వ్యయపరచుచుండెను.

హేమప్రభకు బొడమిన పిల్లవానికి నాకార లక్షణములు పరీక్షించి విద్వాంసులు వీరసింహుఁడని పేరు పెట్టిరి.

గీ. చేరలకు మీరు కన్నులు బేరురంబు
తనుకు జెక్కులు ముద్దులు గులుకు మొగము
దీర్ఘబాహులు గల్గి యెంతేని వింత
కాంతిఁ జూపఱ కద్భుతఁ బ్రాంతిగొలుప.

వీరసింహుఁడు దినదిన ప్రవర్ధమానుండై సింహకిశోరము భాతిఁబరాక్రమ

సాలియై విజృంభించి యథాకాలమున నుపాధ్యాయులవలన విద్యల నభ్యసింపుచు అచిరకాలములో నఖండకళానిపుణుండై విరాజిల్లెను.

హేమప్రభయు మంత్రులు గావించు రాజతంత్రముల స్వయముగా విమర్శించుచు మంచి చెడ్డల నిరూపించి ధర్మలోపము గాకుండఁ బూర్వఖ్యాతి సెడకుండఁ బ్రకృతిజనంబులు స్తుతియించునట్లు రాజ్యంబు గావించుచు రాజదంపతుల భూమండలమంతయు వెదకి తీసికొని వచ్చునట్లు గొప్ప ప్రయత్నము గావింపుచుండెను.

అచ్చేడియ యొకనాఁడు ప్రతిప దాయత్తచిత్తయై ధ్యానించుచుండ మంత్రులెద్దియో పత్రిక నామెయొద్దకుఁ బంపిరి. విప్పి దానిం జదువ నిట్లున్నది

రాజ్ఞీ! వీరసింహునకుఁ బిత్ప్రవాస ప్రకారం బేమియు దెలియనీయఁగూడదని నీవు మా కాజ్ఞాపించితివి గదా? నీ యానతి ననుసరించి అర్థివారిం గట్టిగా శిక్షింతుమని మేము ప్రకటించి యుంటిమి. తద్భాషణంబునకు వెరచి యెవ్వరును యువరాజుగారి కత్తెరంగెఱింగించి యుండలేదు. నేఁడొక విదేశభూసురుండు విద్యాలాలసుండగు వీరసింహునిం జూడ విద్యాశాలకరిగి యుపాధ్యాయులు వలదని సంజ్ఞలు సేయుచుండఁ దెలిసికొనలేక మాశాసనము మన్నింపక వీరసింహునితోఁ బ్రసంగింపుచు నీక్రింది పద్యములు నుడివెను.

గీ. విక్రమాదిత్యకులరత్న! విపులయగ్న
తరణిసమతేజ! యర్థిమందారభూజ
విజయ భానుతనూజ! యో వీరసింహ!
స్వస్తియగు నీకు భూలోక సార్వభౌమ.

చ. వనజహితుండు నాఁడగు భవజ్జనకుండు విదేశవాసియై
చనఁ దిమిరంబు గ్రమ్మికొనెఁ [illegible] చోరులు మీరిలోఁ పీ
డన మొనరింపఁ దద్వ్యథ [illegible] గదా [illegible] చెల్వ[illegible]
జనని హితంబుగోరెడు ప్రజాతతి [illegible] త్వదాధిపత్య[illegible].

గీ. భాస్కరునిరాఁ గోరు నీ పత్రిజలు తత్ప
మాన తేజ ప్రదీప్తుఁడవైన నీ మ
హోదయస్ఫూర్తిఁ బరితుష్టి నొందుచుండి
రవని నాలింపు లోకబాంధవుఁడ వగుచు.

ఆ పద్యములు విని యందు రెండవ పద్యమునందలి అర్థమును విమర్శించి వీరసింహుఁడౌరా! కడానిమెఱుఁగు చెల్వయను మాతల్లి హేమప్రభయని సూచించుచున్నది. విజయభాస్కరుఁడు మాతండ్రియా? అతండు ప్రవాసమరిగినట్లు

చూచింపుచున్నదేయని తలంచుచు నావిప్రునితో మాతండ్రి వృత్తాంత మీరేమి యెఱుఁగుదురో చెప్పుమని యడిగిన నతండు సర్వము నివేదించెను.

ఆ కథ విని రాజపుత్రుఁ డాశ్చర్యసంభ్రమ వివశుఁడై యొక్కింత తడ వాలోచించి యొజ్జల మొగము జూచుచు నీ పారుండు చెప్పిన కథ యదార్థమా? అని యడిగిన వారేమియు మాటాడక మూగలవలె నూరకొనిరి.

అంతలోఁ గొందరు రాజపురుషులా విధమెఱింగి త్వరితముగా వచ్చి యావిప్రుం బట్టికొని కట్టి తీసికొనిపోవుచుండ నాబ్రాహ్మణుఁడు మొఱ పెట్టెను. రాజపుత్రుఁ డద్దము వచ్చి కట్టులు విప్పించి వారి నదలించుచు వీని అపరాధమేదియో చెప్పుఁడని యడిగిన వాండ్రు అయ్యా! ఇది మంత్రిశాసనము ఈతడు కఠినశిక్షకుఁ బాత్రుఁడని చెప్పిన నితండు చేసిన తప్పు చెప్పక తీసికొనిపోవనీయనని గట్టిగా నిర్బంధించెనట. కింకరులు భయపడుచుండ నందున్న యుపాధ్యాయులు నిజమంతయుఁ జెప్పివేసిరట. అప్పుడు మీబిడ్డఁడు ఛీ! ఛీ! మా మంత్రులింత యవివేకులా? దేశాంతరగతుండైన తండ్రిఁ దీసికొని రాలేక తమ పట్టణములో సాధుజనములపైఁ బ్రతాపములు జూపుదురుకాఁబోలు ఓహో! వీరి రాజ్యతంత్రములు స్తుతిపాత్రములుగానున్నవి. నాకీవార్త నిన్నినాళ్ళు చెప్పక దాచినందులకు వారు శిక్షార్హులు ఈ భూసురుఁ డర్చనీయుఁడు అని పలుకుచు నాభూసురునకు గానుక లిప్పించి మమ్ముదనయొద్దకుఁ దీసికొనిరమ్మని యా రాజభటులు బంపెను.

మీకుమారుం డిపుడు సర్వకళాపూర్ణుండై పూర్ణిమాచంద్రుండు వోలె విరాజిల్లుచున్నవాఁడు. అతనికి ధనుర్వేదమునం దసమానప్రజ్ఞ కుదిరినది అతం డేమి దలంచి కొనినను సాగకమానదు. మమ్ము శిక్షింపవలయునని తలంచి యున్నవాఁడట. దేవీ! యనుగ్రహించి కుమారునికి కోపోపశమనము గావింపుము అట్టిశాసనము నీయాజ్ఞ చొప్పునఁ గావించితిమి. కాని మేము స్వతంత్రించి చేయలేదు. రక్షింపుము నీకు నమస్కారము.

అనియున్న మంత్రులు వ్రాసిన పత్రికం జదివికొని హేమప్రభ మంత్రుల కభయప్రదాన పత్రిక పంపి కుమారుం దీసుకొని రమ్మని పనికత్తెలఁ బంపఁబోవు సమయంబునఁ గుమారుండే తల్లిం జూడవచ్చుచున్నవాఁడను వార్త యొకదాదివచ్చి చెప్పినది.

రాజపుత్రుఁడు విషాదమేదురహృదయుండై వినీత వేషముతో అంతిపురి కరిగి తల్లికి నమస్కరించెను. ఆమె కన్నీటిధారలచేఁ బుత్రుని శిరంబు దడుపుచు అక్కునం జేర్చుకొని దీవించినది.

మ. జననీ! యేమిటి కిన్నినాళ్లు వగఁ బ్రచ్ఛన్నంబు గావింతు వ
జ్జనకోదంతము దండ్రి లేడనియె నిచ్చెన్ గుందుదున్ రాజు నం
దనమంచున్ ధనమంచుఁ బాఱుఁడు దురాచారుండు గొంపోయెనే
వనికిన్ సత్యము జెప్పుమమ్మ తగఁ దద్వార్తల్ వినుర్మించెదన్.

అయ్యో తల్లీ! నాకు బుద్ధివచ్చి యెనిమిదేండ్లయినది. అప్పుడే నాకీకథ యెఱింగించిన నీపాటికి మా తండ్రిం దీసికొని రాఁబోవుదునా. అక్కటా! యెవ్వరి నడిగినను మా తండ్రి లేడనియే చెప్పిరి. కాని పరివాసము దీసికొని పోఁబడెనని యొక్కండును జెప్పకపోయెను. పై పెచ్చు చెప్పినవానిని శిక్షింతుమని శాసనము జేసితిరట. ఆహా! యెంత చోద్యము. అని యడిగినఁ గుమారునకుఁ దల్లి యిట్లనియె.

నాయనా! ఈ వార్త నీకెఱింగించిన వగతుఁ గాని నీవేమి జేయఁగలవు. అందులకై అట్టి శాసనము జేసితిమి. ఇందు మంత్రుల తప్పులేదు. వినుము మీతండ్రి మరణమనిన వెరవరు. దేహమును దృఢముగాఁ జూచుచుందురు. ఎవ్వఁడో మాయావి బ్రాహ్మణ వేషంబునన వచ్చి నిక్షేపమున్నదని నెపముపన్ని తీసికొనిపోయెను. మీ పెద తల్లి కలభాషిణి తొమ్మిదిమాసములు నిండియున్నది. యంతఃపుర కాంతలు వలదను చుండ వినక యందల మెక్కించి తీసికొనిపోయెను. వాఁడు బ్రాహ్మణుఁడు కాడు రాక్షసుడు. మా యవ్వకు సోదరుఁడు రక్తాక్షుఁడై యుండును. నారాక విని కోపించి మీతండ్రి నెత్తుకొని పోయెను. వాని నివాసము పాతాళలోకమున కడుగునన్నున్న తలాతలము అక్కడకుఁ దీసికొనిపోయి యా దంపతుల దాచియుండును. వారిం బంపుటకు వానికి సామర్థ్యములేదు. మీతల్లిదండ్రులు జీవించియున్నారని నాకు దృఢమైన నమ్మకముగలదు. ఎప్పటికైనఁ దప్పించుకొని రాఁగలరని స్వప్నమూలమునఁ దెల్లమైనది. నీవు విచారింపవలదని బోధించిన విని వీరసింహుండు అమ్మా! మా పెత్తల్లి యుంటోయెనా! అయ్యో! ఆమె ప్రసవమై మగవానిఁ గనిన నాకన్నయగునా, తమ్ముఁడగునా, చెప్పుము అనుటయు నామె కన్నీరు గ్రమ్మఁ దండ్రీ నీకు నన్నయే యగును అని యుత్తరము జెప్పినది.

అప్పుడతండు అమ్మా! గతమునకు వగచినఁ బ్రయోజనములేదు వారు పాతాళముననున్నను స్వర్గముననున్నను వెదకి తీసికొని వచ్చెద నన్ననుపుము దృఢనిశ్చయునకుఁ గార్యసాఫల్యముగాకమానదు. అని యడిగిన హేమప్రభ చాలు చాలు పట్టీ ఇట్టి యూహలెప్పుడును జేయకుము వారే రాఁగలరు. పాతాళమునకు మనుష్యులుపోఁజాలరు. రాజ్యభారము వహించి ప్రజలం బాలింపుము. పిచ్చిమాట లాడకుమని బోధించిన నతండు ఆత్మగతంబున నోహో! ఈమెతోఁ జెప్పిన సమ్మతింపదు. చెప్పకుండఁ

గనే పోవలయునని తలంచి తల్లి మాటకంగీకరించు వాఁడుబోలె నభినయించుచు ననుజ్ఞ పుచ్చుకొని నిజనివాసంబునకుఁ బోయెను.

తమవారు పాతాళలోకమున నున్నారని వినినదిమొదలా లోకమునకు మార్గ మెట్లని యాలోచించుచుఁ బండితుల నడుగుచు గ్రంథముల విమర్శింపుచుండెను.

శ్లో. ఏతత్తు నాగలోకస్య నాభిస్థానే స్థితంపురం
పాతాళమితి విఖ్యాతం దైత్యదానవసేవితం.

నారదుండు మాతలింగిసికొని వరుణలోకము మీదుగాఁ బాతాళ లోకమున కరిగినప్పుడా యా లోకవిశేషంబులు శ్రీమహాభారతంబున దెలుపఁబడియున్నవి. వానిం జదువుకొని వీరసింహుండు సముద్ర మధ్యమున దుమికినఁ బాతాళము గనంబడు నని నిశ్చయించుకొని యట్టి సన్నాహము గావించుచు నొకనాఁడు వేకువజామున నెవ్వరికిం దెలియకుండ బయలువెడలి దక్షిణాభిముఖుండై పోయి పోయి కొన్ని దినంబులకు సముద్రతీరము సేరెను. అప్పటికి జాముప్రొద్దుమాత్రమే యుండెను.

సముద్రమును జూచి యతండు వెరగుపడుచు నాహా ఈ మహాసాగరమును సంసారముతో విద్వాంసులు పోల్చియున్నారు. ఈతరంగములవలె నందు సుఖదుఃఖములు పరంపరలు వచ్చుచుం బోవుచుండును. ఇక్కల్లోలము లొకక్షణమైన నేకరీతి నిలువవు ఒక్కొక్కటి కొంతపొడవున పైకిలేచి కొంతదూరమువచ్చి విరిగి యడంగిపోవును. వేరొకటి దానంజనియించి యింకొకదానికి జనహేతువగుచుండును. ఇంచుకయు గాలి లేకున్నను నీతరంగంబు లింత ఘోషముతో వెల్లువలుగా నెగయుచుండుట కేమికారణమో నిజమెఱింగినవారులేరు.

ఇది యరణ్యదేశము. ఓడ యేదియుం గనఁబడదు. సముద్రాంతరంబున కెట్లు పోవువాఁడనో తెలియదు. అని యాలోచించుచు నా రాజపుత్రుండు తత్తీరదేశమున నడచుచుండెను.

సముద్రుండతిథికిఁ బాద్యమిచ్చుచున్నవాఁడో యన జిన్నయలలతని యడుగులం గడిగి వెనుకకుఁ బోవుచుండును. పర్వతములవలె పొంగివచ్చు తరంగములకు వెరచి యతం డొడ్డుదెసకుఁ బరచుచుండ నవి యందే యణంగుచుండును. వేరొకటి చిన్నదియని నిర్లక్ష్యముగా నడువ దానికింకొకటి తోడుపడి మెల్లగావచ్చి కంఠదఘ్నమై యతని జలకమాడించుచుండును.

ఒక్కొక్క తరంగమున గంపతోఁ బోసినట్లు శంఖములు గవ్వలును గుమ్మరించుచుండును. అట్టి వింతలం జూచుచు నతం డతివినోదముగా నాసముద్రతీరమున నడుచుచుండ నొకచో సద్యోగతాసువగు చేపయొకటి తరంగముల రాయిడి నతని

యడుగున బ్రోలఁబడినది. రత్నాచ్ఛాదితమగు శుభ్రాంశుకముభంగి మెరయుచున్న యామీనుంజూచియతండు వెరగుపడుచుఁ దనచేతినున్న కత్తికొనఁ దదురగోళంబు భేదించి నంత నద్భుత ప్రభాపటల విరాజితమగు రత్న మొండు గన్నుల పండువు గావించినది.

అబ్బురపాటుతో దానిం గైకొని నీళ్ళచే గడిగి పరీక్షించుచు నది దేవతామాణిక్యమువలెఁ బ్రకాశించుచున్నది. సముద్రమునకు రత్నాకరమని పేరుగలిగి యున్నది గదా! దీనిం జేపలు మ్రింగియుండ వచ్చును కాదు కాదు ఇది మండనము చేయఁబడి నట్లు గుర్తులు గనంబడుచున్నవి. నాగలోకములో దివ్యమణులున్నవని ప్రసిద్ధిగాఁ జెప్పికొందురు. పాతాళమునకు సముద్రమునుండి మార్గమున్నట్లు నిశ్చయింపవలసి నదే. ఇది నాగకన్యలు ధరించుమండనము. నాకిది శుభసూచకమని తలంచుచు రంధ్రములున్న యామణికి దారముగుచ్చి మెడలో వైచికొనియెను. అది యతని యురమున మిక్కిలి ప్రకాశించినది. యేమిటికో ప్రమాదమున జాఱి యుదధినేలం బడిన నతని కన్నులకుఁ గనంబడినదికాదు.

అయ్యో! నాకీరత్నంబు ప్రసన్నమై తిరోహితమైనదేమి? నే నేమియపచారము గావించితిని? ఎవ్వరి నిందించితిని. ఇట్టి మణి ధరించుటకు నేనర్హుండగానా? మెడలో వైచికొనుటతప్పా? అగును జాగ్రత్తపడవలసినది తాల్చుట తప్పేయని పరితప్తుండై తలంచుచు నా ప్రాంతమందుఁ జేతులతోఁ దడివి వెదకెను. ఒకచోట నతని చేతికిఁ దగులుకొని కన్నులపండువ గావించినది. అతండొండు రెండుతేపలా రత్నంబును విడిచి పట్టుచు దాని మహిమ తెలిసికొని యోహో? నిక్కము గ్రహించితి ఇది మేనికిఁ దగిలిన దృశ్యమగు లేనిచో నదృశ్యమగును. దీనింధరింప నేనును నితరులకుఁ గనంబడను. ఇది మంచిసాధనమేయని తలంచుచుఁ బరమానందముతోఁ బృథుగుణంబున దాని గట్టి మెడలో వైచికొని యాతీరమున నడుచుచుండెను.

కొంతదూరమరిగిన నంత నొకచోట సముద్రములోనికిఁ ద్రోసికొనిపోవ తిన్నెయొకటి గనంబడినది. దానిపైకెక్కి నడచుచు వీరసింహుఁ డౌరా! యీభూమి యింత కఠినముగానున్నదేమి? సైకత చిహ్నములులేవు. లంకభూమియుంగాదు? రాతినేలయుంగాదు. వింతగా నున్నది సముద్రతీరమున నిట్లుండుట కాబోలునని యంచునకుఁ జేరవలెనని వడిగా నడుచుచుండెను.

కొంతసేపటికి కదలుచున్నట్లు పొడకట్టినది. భూకంపమని మొదట నిశ్చయించి తరువాత దీరమునకు దూరమగుచు నదియొక జలజంతువని తెలిసికొని యతం డిట్లు తలంచెను. అహో! విధివియోగములు కడు విచిత్రములుగదా! ఇది

తాబేలై యుండవచ్చును. దీనిం దీరమును జేరియుండుటచే నేలయే యనుకొంటిని. ఇప్పుడిది మహావేగముగాఁ బోవుచున్నది. కమఠరూపుఁడైన శ్రీహరియే నన్నెత్తికొని పోవుచున్నాఁడు. ఇఁక నాసంకల్ప మీడేఱఁగలదు. ఇది సముద్ర మధ్యమునకుఁ బోయి మునఁగును. నేనును మునిఁగి పాతాళలోకమున కరుగుదును. నాకు దైవ మనుకూలుఁడై యున్నట్లు తోఁచుచున్నది. లేకున్నఁ ద్రిలోకాశ్చర్యకరమగు దివ్యమణిం దెచ్చి యామత్స్యంబు నాపాదములమీఁద బడవిడుచునా ? అని యత్యంత సంతోషముతోఁ దలంచుచుఁ బరమేశ్వరుని దయకు స్తోత్రములు జేయుచుఁ బెనుయోద మీఁదం బలె నతండు నిర్భయముగానందు విహరింపుచుండెను. అంతలో బద్మినీకాంతుఁడస్తాచలమలంకరించెను. క్రమంబుగఁ జీకటులు నలుమూలలు వ్యాపించినవి. అప్పుడంతా కమఠపృష్ఠంబున వసించి కన్నులు మూసికొని ధ్యానించుచు నారాత్రి నిద్రలో లేదు. మఱునాఁడుదయమునఁ గన్నులువిప్పిచూడ నాతాబేలొక యొడ్డునఁ జేరియున్నది. అందుగల వృక్షలతాగుల్మాదు లతనికి నేత్రపర్వముగావించినవి. అప్పుడా రాజకుమారుం డౌరా ! నేను సముద్రాంతరమున మునుఁగుదమనుకొన్న నది మరల తీరమునకు దెచ్చినది. ఇది యే దేశమో తెలియదు. ఒడ్డు గోడవలె నుండుటచే నెక్కుటకు శక్యముకాదు. దూరము చూడ నిడియొక పర్వతమువలెఁ గనంబడుచున్నది. పైకెట్లు పోవుదునని యాలోచించుచు నాదెసఁ బరిశీలించుచుండెను.

అప్పుడొక అడవిపంది యాగట్టుపైనుండి నీటిదెసఁ దొంగిచూచి దిగవలయునని ప్రయత్నము చేసినది నూయివలె నుండుటచే శక్యమైనదికాదు. అప్పుడది యిటు నటు తిరిగి తనదంష్ట్రాగ్రంబున నేల విరజిమ్ముచు గునపముతోఁ ద్రవ్వినట్లు పొడిచి పొడిచిసోపానములు చేసికొని యాసముద్రములో దుమికి జలక్రీడగావింపఁదొడంగినది.

రాజపుత్రుఁ డవ్వింత కచ్చెరువందుచు నల్లనదిగి యడిగావించిన మెట్లవెంబడిని పై కెగప్రాకెను. అతం డొడ్డుపైకెక్కి తానెక్కి వచ్చిన కూర్మమును జూడ నది యంతలో సముద్రమున మునిఁగినది. ఆ తాబేలును దైవమేయని తలంచి యతండు స్తుతించుచు అటఁగదలి కొంచెము దూరము నడచినంత సింహశార్దూలాది మృగ భయంకరమైన యొక యరణ్యము గనంబడినది. అయ్యడవియందు నడుచునప్పుడా రాజకుమారుడు భగవంతుడు తనకు సహాయము గావించెనని సంతసించుచు మధ్యాహ్నము దనుక నడిచి అయ్యడవి కంతము గనంబడమి గమనాయాసమున వాయవొక చెట్టుపీడ విశ్రమించియుండ అచ్చటికొకసింగం బరుదెంచి యందె విశ్రమించినది

తన్నుజూచి బెదరక పండుకొనియున్న యాకేసరిం జూచి వీరసింహుఁడు

వెరగుపడుచు నిది పెంపుడు మృగమా! కానిచో నిట్లు నాచెంగ నిలుచునా యని తలంచి ఓహో! తెలిసికొంటి నిమ్మణిధారణంబున దీనికి నేను గనంబడలేదు. దానం జేసి నిశ్శబ్దముగా నిందుఁబండుకొన్నది. కానిమ్ము, ఖడ్గహస్తుండనైన నన్నది యేమి చేయఁగలదు. దీనిపై నెక్కి చూచెద గుఱ్ఱముపలె నడిచిన నుపకారమే యగు కానిచో మఱియఁజేసెదనని తలంచి యడి లేచి నిలువంబడి యెక్కడికో పోవయత్నించు సమయమున నుపాయముగా దానిపై నెగసి కూర్చుండి నడుము కాళ్ళతో అదిమిపట్టి కేసరముల గట్టిగాఁ బట్టుకొని యదలించెను.

అప్పుడా పెనుమెకంబు నాకంబు పిడుగు మీఁదబడినట్లు వెఱచుచు నెఱకలు గలదివోలె నెగిరి యెగిరి శరవేగంబునఁ బారఁదొడంగినది. వృక్షగుల్మాదుల నవలీల లంఘించుచు నాపంచాస్యంబు యామద్వయకాలం బేరీతి బరుగిడి దారుణ కాంతారములు పెక్కులు దాటి యొక మేటిగిరి శృంగాటంబున నిలిచి గమనశ్రమచే నలసి వివశయై నేలంబడినది.

అప్పుడా వీరసింహుండు తన్నుబున ర్తాతులగాఁ దలంచి పుడమికి దిగి మేనెల్ల జెమ్మటలుగార నిట్టూర్పులు నిగుడించుచు నోరెత్తలేక పడియున్న యా ర్యక్ష మును జూచి జాలిపడి పాదములొత్తుచు నాకులచే విసరుచు నుపచరింపఁ దొడంగెను.

అప్పటికి రెండుగడియల ప్రొద్దున్నది. అతండు ప్రొద్దు తిరుగు మొగంబై పరిశీలింపుచుండ నాసింగం బట్టిలేచి రివ్వున నెగిరి యొక మూలకుఁ బాఱిపోయినది. అవింతజూచి అతండు ముక్కుపై వ్రేలిడు కొని యౌరా! ఈమహారణ్య మీమృగ రాజం బల్పకాలములో దాటించినది. పాదచారినై సంవత్సరమునకైనను దీనిం దాటఁజాలను. రమణీయోద్యాన భాసురమగు నీగిరికూటము జేరుటకును నాకు శక్యమా? పెక్కేల శ్రీమన్నారాయణుని యాద్యావతారములు నాలుగును నాకీ యుప కారము గావించినవి. మత్స్యంబు మణిహార మర్పించినది. కూర్మంబు సాగరంబు దాటించినది వరాహంబు గట్టెక్కించినది. సింహంబు మహారణ్యంబు దాటించినది. ఇది యేదేశమో తెలియదు ఓహోహో దక్షిణముగాఁ జూచిన గొప్ప పట్టణము నేత్ర పర్వతము గావించుచున్నది మెరపుతీగెయంటోలె పిండిచుట్టును గాంచనప్రాకారము కాంతులీనుచుఁ గన్నులకు మిరిమిట్లు గొల్పుచున్నది. భూలోకనగరము లిట్టి శోభ గలిగియుండునా?

ఈరాజధానికి శైలము క్రీడా శైలము కాబోలు. ఇందలి భవనములు విచిత్రరత్న ప్రభాయుతములై యొప్పుచున్నవి. ఈపట్టణ రాజమును జూచి కన్నులకిమి సాఫల్యము నొందఁ జేసికొనియెదను భానుండపరగిరిపరిసరము జేర్చుచున్నవాఁడు. నేఁటి

నిధ్రాత్రి త్రికూటమున వసియించి రేపు పోయెదం గాకయని తలంచి యందు నలు మూలలు తిరిగి యొక క్రీడాసౌధము యందలి యటుగుపయిం గూర్చుండి యందలి వింతలం జూచుచుండెను.

ఇంతలోఁ జీకటి పడినది తన మెడలోనున్న రత్నహారము కాంతులు పండు వెన్నెలను గాయుచుండ వీక్షించి యదివస్త్రచ్ఛన్నము గావించి తల క్రిందనిడుకొని పండుకొనియెను. అప్పుడాప్రాంతమున నిద్దరుపురుషులిట్లు సంభాషించుకొనిరి.

నరాంతకుఁడు—దుర్ముఖా! నేను రాననుచుండ బలవంతముగా నేకాంతము చెప్పెదనని నన్నీత్రికూటమునకు తీసికొనివచ్చితివి అదియేదియో చెప్పుము.

దుర్మ—మిత్రమా! నరాంతకా! అస్మత్స్వామి పుత్రుఁడగు విద్యుజ్జిహ్వుఁడు విభీషణమహారాజు గారి పుత్రిక చంపకను వరించి యున్మత్తుండై తిరుగుచున్నాడను వార్త నీవు వినియుంటివా?

నరా—వినలేదు ఆదుర్మతికి భర్తృదారిక నిత్తురా? వాని పిచ్చియేకాని లాభములేదు రావణబ్రహ్మతోనే వాని బాంధవ్యము తెగిపోయినది.

దుర్మ—ఆమాట సత్యమే. పెద్ద విభీషణునికి శూర్పణఖ సంతతి పేరు తల పెట్టినఁ గోపము పెద్దగా వచ్చును. వారికిష్టము లేకున్నను వీని కోరికకేమి అభ్యంతరము.

నరా—బాగును ఫలములేకున్నను మనోరథము లనేకములుండ వచ్చును. తరువాత

దుర్మ—నేఁడు పుణ్య దినసమగుట విభీషణ మహారాజు మనుమనితోఁ గూడి రంగనాథు నారాధింప భూలోకమున శ్రీరంగమున కరిగెను.

నరా—అట్లుపోవుట వారికి వాడుకయై యున్నది. ఉచితమే శ్రీ రామదత్తంబ యిన రంగనాథుని విమానము అతండు లంకారపురంబునకుఁ దీసికొనివచ్చుచుండ కావేరికోరిక లీడేర్ప నాస్వామియందు స్థాపితుండయ్యె కాకున్న శ్రీరంగము లంకాపురములో నుండకపోవునా?

దుర్మ—ఇదియవకాశముకని విద్యుజ్జిహ్వుఁడు నేటిరాత్రి అత్తవారల యంతఃపురమున దిగి [illegible] పాటవంబున నీకూటంబునకు దీసికొని వచ్చునట.

నరా—ఓహో! పులిమీసములు లాగుటకే ప్రయత్నించుచుండెనే పెద్ది విభీషణుని శాసన మతిక్రూరమని యెఱుఁగఁడు కాబోలు

దుర్మ—కామాంధునకు యుక్తాయుక్తవివేక ముండదుగదా అది యట్లుండె స్వామి వచన మెట్లయినను సేయక దీరదుకాదా.

నరా — యేమి సేయవలయును.

దుర్మ — పెండలకడ నుండువోయి యామందిరము శుభ్రము సేయుమని నాకు నియమించెను. వేరొక పనిమీద నాకిందు రాజాగయ్యె. అతండు వచ్చు వేళయైనది లోపలికింబోయి బాగుచేయుదమురమ్ము. ఇందులకే నిన్నుం బిలిచితిని.

నరా — బాగుజేసితిమనియే చెప్పుదము. నేను లోపలికిరాంజాలను. అని సంభాషించుకొనుచు విద్యుజ్జిహ్వుని రాక నిరీక్షించుచుండిరి వీరసింహుడు వారి సంవాదమాలించి యోహో! వింతలపై వింతలు దోచుచున్నవి. యిది లంకాపట్టణమా! వీండ్రు రాక్షసులా విభీషణుని మనుమనిపేరును భీషణుండే కాంబోలును. వారిరువురు శ్రీరంగమున కథిగినట్లు చెప్పికొనిరి. అది భూలోకములో నున్నదట. యిది లంకాపురము గానిచో నట్టి సంభాషణము నకవకాశముండదు. అయ్యారే! ఎంతచిత్రము మనుష్యమాత్రునకి దీనికి గాశక్యమగునా? కమఠరూపుండగు హరియే నన్నిచ్చటికిం దీసికొని వచ్చెను. ఇది శుభోదర్కమని తలంపవలగు అని వెంగుపడుచుం గన్నులు మూయక సందడిచేయక పండుకొని యుండెను. అని యెఱింగించునంతకు వేళయతిక్రమించుటయు నవ్వలి మజిలీయందిటని చెప్పదొడంగెను.

# 116 వ మజిలీ.

## అశోకవనము కథ

ఏకాక్షి — అక్కా నీకెన్ని యేండ్లున్నవి నాకంటె పెద్దదానవా చిన్నదానవా భీః రామ సీతారామ.

ఏకకర్ణ — నాకెన్ని యేండ్లున్నవో తెలియదుగాని నీకంటె కొంచెము పెద్దదానగుదును భీః రామ భీ రామ సీతారామ రామ.

ఏకాక్షి — సీతాహరణకాలమునకును నీకేన్ని యేండ్లున్నవి.

ఏకకర్ణ — మొన్న మొన్ననేగదా సీతాహరణమైనది. దేవాసురయుద్ధము నాంటికి నేనీడేరితిని. ఆ సంగరములోనే నాభర్తకడ తేరెను.

ఏకాక్షి — నీవు తాటక యీడుదానవా యేమి?

ఏకకర్ణ — సరిసరి తాటక నాకంటెం జాల చిన్నది. తాటకా సుందుల వివాహము నకు నేను పేరంటమునకుం బోయితిని సుందోపసుందులునాకు మేనత్తకొడుకులు.

ఏకాక్షి — నాను మాత్రము తక్కువయేండ్లున్నవియా; సముచితాంబరులు నాకంటెం జిన్నవారలు. అమృతమునిమిత్తము దేవాసురులు కలహించినది నేను బాగుగనెరుంగుదును.

ఏకకర్ణ—అట్లయిన మనము సమాన ప్రాయమువారమే భీ రామ భీ రామ!

ఏకాక్షి—ఏకాలమందైన రాక్షసస్త్రీలకిట్టి నిర్బంధము గల్గినదా! కట్టా! యీ పాడుకావళములు తిప్పలేక వ్రేళులు గంటులు వారుచున్నవి. ఈపాడు రామమంత్ర మెన్ని నాళ్ళిట్లు జపముచేయుచుందుము దీర్ఘాయువుగలుగుటకు గష్టములకు గారణమైనదిగదా.

దీర్ఘ జిహ్వక—మనశత్రువగు వానినామమిట్లు జపించుమని విభీషణుడు దిక్కులేనివారలమగుట మనకు నియమించెను. అన్నన్నా! రాక్షస్త్రీలకెట్టి యిడుములు వచ్చినవి. రావణబ్రహ్మ సీతనిచ్చుటకిష్టపడక పోయినను మనకీ ముప్పులేక పోవును భీ రామ భీ రామ.

లంబోదరి—రావణుని కాలమున మనమేవీరభటులమై చటులముగా బట్టణ మంతయు దిరుగుచు నెల్లవారిం బెదరించుచుండువారముగదా. అట్టి మనమిప్పుడీ రండాపుత్రులకు వెరవవలసి వచ్చినది ఔరా కాలమహిమ భీ రామ భీ రామ.

అజాముఖి—మనపాపములకు సంకేతమువలె వైచిన యీపాడు రామమందిరము ముంగల గూర్చుండబెట్టి రామమంత్రము జపింపుమని నియమించిన విభీషణుని పాపమునకు మేరయున్నదా మన యుసురెప్పుడు తగులునో!

వ్యాఘ్రముఖి—ఆమహారాజు రావణబ్రహ్మకాలములో నడుదినము తినెడి మాంసము దలచుకొనిన గుండె పగిలిపోవుచున్నది. ఈలంకలో దినమునకు లక్షమణుగుల నరమాంసము తినని రక్కసి గలదా! అక్కటా ఎంత యిక్కట్టువచ్చినది. భీ రామ భీ రామ.

శూర్పకర్ణి—మనకు నరమాంస మాకాశకుసుమమైనది. ఇందు మాంసము దినుటయే దప్పుట. మునులవలె శాకాహారము తినిన మన కడుపులెట్లు నిండును? మనల నిట్లాకటవేపుచున్న విభీషణుడు కొలదికాలములో నశింపకుండునా?

పాదచూళిత—అబ్బ! మనుష్యమాంస మనిన నానోరూరుచున్నదిగదా! అన్నా రావణబ్రహ్మ! నీవు మృతుండవగుటయే మా పాపమేకదా! భీ రామ.

లంబకర్ణి—ఈవిభీషణునికి విధి గావెల విధించెడో తెలియదు పాపీ చిరాయువను మాట సత్యమే భీ రామ భీ రామ

హంసపాదిక—మన పతులను హరించునని బెదిరించి విడిచితిమి కాని నాడు సీతనుమ్రింగితిమేని నీ వెతగలుగకపోవును భార్యా వియోగదుఃఖంబును గాకుండు సమసిన రావణబ్రహ్మకు మరణమేల గలిగెడిని? అట్లైన మనరాజునకిట్టి భీషణుండు వరపుండై యెలంగుచుండునా గదా? భీ రామ భీ రామ.

గోముఖి—యీచిన్నవిభీషణుండు తాతంటెం గ్రూరకర్ముడుగదా! మనకు మద్యమాంసము లిచ్చినచో లింగమయ్యే అల్పాహారము లిచ్చి ఇద్దుంబజేసి మాడ్చుచున్నాడు.

అనాసిక—పది యేనుగుల భక్షింపగల్గిన మనకీ స్వల్పాహారమే మూలకు వచ్చెడిని.

గోముఖి—పోనీ చచ్చినట్లు పడియుందమన్న నీ యీతండిసీ మాలికలం ద్రిప్పటయు నోరు నొప్పిపెట్టునట్లు శత్రునామము జపింపుమనట్లు విధించెనే? మరియు దినమునకు లక్ష తక్కువగాకుండ జపింపవలయుననట ఆకలిబాధని వేగుచుండ నీ నామము లెట్లుసాగెడివి.

దీర్ఘ నాసిక—పూర్వము ప్రహ్లాదుని రాజ్యకాలములో రాక్షసులనెల్ల నారాయణమంత్రము జపింపుడని నిర్బంధించినట్లు మాయమ్మమ్మకల్లి చెప్పెడిది ఆవెత మనకిప్పుడు గలిగినది.

లంబోదరి—అదిగో; రాజభటులిటులవచ్చుచున్నారు. మాలికలబూని జపము సేయుడు, శ్రీ రామ, శ్రీ రామ (అని అందురు జపించు చున్నారు.)

రాజభటులు—(ప్రవేశించి) రండలారా! జపములు మాని మాటలాడుకొనుచుండిరా! మేము చూచితిమిలెండి లంబోదరీ! నీవిప్పటికెన్ని జపించితివో చెప్పుము.

లంబోదరి—ఏబదివేలు జపించితిని.

రాజు—ఛీ రండా! రెండుగడియలప్రొద్దెక్కినదో లేదో యే బదివే లెట్లుజపించితివి. నీలెక్క తప్పులెక్క. నిన్ను శిక్షింపుడు జేసెదము చూడుము.

లంబోదరి—పొరపాటు చెప్పితిని. రక్షింపుడు రెండువేలనుటకు నాగో గీటులు చూడుండు.

రాజభటులు—అసి ముండా! ఎంత వెరగాతివి ఇందులకు శిక్షనేడు అధికముగా రెండులక్షలు రామనామము జపింపుము. లేనిచో మహారాజుగారికి దెలియజేసెదము.

లంబో—చిత్తము చిత్తము సీతారామసీతారామ యని గడగడగా జపించుచున్నది.

రాజభటు లందరిని నిర్బంధించి దాపునం గూర్చుండి శ్రీ రామనామజపము చేయింపుచుండిరి. మహామునులవలెం దాపసులు మూసికొని యారాక్షసస్త్రీలందఱు నొకరివంక నొకరుచూడక తారక మంత్రము జపించుచుండిరి.

అట్టి సమయమున దీర్ఘనాసికలేచి గాలి యాఘ్రాణించి హాయి హాయి మానిసి వాసన యెన్నిదినములకు నాసాపర్వమైనది. అనుటయు అప్పుడప్పుడు మనుష్యవాసనయే.

అని యందఱును కాలిగోళ్లును తెగునట్లు చిందులు ద్రొక్కఁ దొడంగిరి. అప్పుడు రక్షకభటులు వారింగశలచే బాది యదలించుచుఁ గూర్చుండఁబెట్టి మీ యలజడి యేమి యేమి యని అడిగిన అయ్యా మాకు నరవాసన గొట్టినది. చిరకాల మైనను ఓనిన నోళ్ళగుట అమ్మాంసము నందలి లాలసత్వముచే నిలువలేక గంతులువైచితిమి. ఇది ప్రమాదము క్షమింపుడు అని వేడికొనిరి. రండలారా! ఇక్కడికి మనుష్యులెట్లువచ్చిరి వచ్చిననో భక్షింతురా యేమి! రాజశాసనము మఱచితిరా! ఇఁక మీరిన శిక్షింతుముజుడి అని వెఱపించుచు యథాగతముగా వారినెల్ల శ్రీరామ మంత్ర జపరాయణులం గావించిరి. అంతకుఁ బూర్వమే యా ప్రాంతమున నిలిచి యా వింతలం జూచుచు వారి సంభాషణము లాలించుచున్న వీరసింహుండు మనంబున నిట్లు తలంచెను.

ఔరా? ఈరక్కసుల విస్ఫురద్రూపములు హఠాత్తుగా జూచిన నరులకు నుల్లములు తల్లడిల్లక మానవు. అన్నన్నా? ఈ ఘోరాకారము లనడుమఁ గఠ్న కఠోరము లగు తర్జన భర్జనములకోర్చి మహాపతివ్రతయైన సీతామహాదేవి యెట్లు నివసించినదో తెలియదు. చిరకాలమైనను వీరి ప్రలాపములు దుస్స్వరముగా నున్నవి. ఆహా! ఇట్టి వాండ్రనెల్లఁ గాళ్ళకు సంకెళ్లు వైపించి రామమంత్రముచెప్పునఁ గూర్చుండఁబెట్టి జన్మకారితమగు రామనామము జపింపఁ జేయుచున్నాడు. విభీషణుఁడెంత కృతజ్ఞుఁడో ఎట్టి పరమార్థవేదియో, ఎంత వివేకశాలియో, నరశరీరములఁ జెఱుకుముక్కలవలె విఱుచుకొనితినియెడు దానవులకు మాంసభక్షణము నిషేధముజేసి శాకభక్షులనుఁ గావించిన విభీషణుని వంటి దయాశాలి యెందైనం గలఁడా ఔరా? నేనెట్టి పుణ్యము జేసికొంటిని? త్రేతాయుగమునాఁటి వింతలం జూడగంటిని. రామాయణకథ వినుటయే గాని చూచినవారుండిరా. రామలక్ష్మణులకుఁ దక్క మనుష్యులకీ లంకాపురము ప్రవేశింప వశమా! మహాపుణ్యాత్ముండైన విభీషణునిం జూచి జన్మము సార్థక్యము జేసికొందును. ఆహా హా ఎక్కడి లంకాపట్టణము యెక్కడి యుజ్జయిని. యెక్కడి వీరసింహుండు మామిత్రుల విక్రమార్కుని సుకృతమే నాకీఫలము గలిగించినది. నా వాసనగొట్టినంతనే గంతులువైచిన యీరక్కసిముండలు తన్నుగుప్తుఁదను గాంచో గుహలవలెనున్న తమ నోటిలో వైచికొనకపోవుదురా! కానిమ్ము ప్రచ్ఛన్నముగానే యీలంకాపట్టణమంతయుం దిరిగి చూచెదంగాక. ఇందలి ప్రకటనాపట్టములే పట్టణపువింతలఁ జెప్పకయే తెలియఁజేయఁగలవు. ఇది ప్రాతలంకకు మార్గమఁట. ఆ సౌధంబులు మేడలన్నియు శిథిలములై యున్నవి విభీషణుఁడు పూర్వపులంక విడిచి దక్షిణముగాఁ గ్రొత్తపట్టణము నిర్మించుకొనినట్లు రాజభటుల మాటల వలనం దెలిసినది. ఇది అశోకవనమునకు మార్గమఁట ఈదారిపోయి అందలి విశేషములం

జూచి యానందించెదంగాక యని తలంచి యొక మార్గంబునంబడి నడువసాగెను కుసుమఫలసహిత మనోహరములగు తరులతా విశేషములచే నవ్వన మతనికిఁ గన్నుం పండువ గావించినది పలురకములగు పూవులతావి యాఘ్రాణించుచు మెచ్చుకొనుచు వింత పండ్లం జూచి యచ్చెరువందుచుఁ గొంత సేపందు విహరించి పోయి పోయి సీతామహాదేవి వసించిన శింశుపావృక్షమును గనుంగొనియెను.

అది మిక్కిలి ప్రాతదై యున్నది. విభీషణుఁడు శ్రీరామునందుగల భక్తివిశేషమునఁ జేసి సీతామహాదేవి కాశ్రయభూతమైన యా వృక్షరాజమును శిథిలము గాకుండ దోహదముల గావించుచు ననేకవిధాలంకారములచే వెలయింపఁజేసెను. తన్మూలమున నవరత్నములచే వేదిక గట్టించెను. శాఖోపశాఖలను కుసుమకిసలయ ఫలసమూహములను కృత్రిమముగఁ గనకరత్న విశేషములచేఁ బ్రకాశింప జేయుచుండెను. ఆ వేదికయందు వేనవేలు రాక్షసవృద్ధులు వసించి వేదశాస్త్రపురాణములఁ జదువుచుండిరి. కొందరు మూలమున స్థాపించియున్న కాంచన సీతావిగ్రహమును నామెతో సంభాషించు చున్నట్లు నిలువఁబడి సీతామహావిగ్రహమును సహస్రనామములచేఁ బూజించుచుండిరి.

పెక్కేల రావణుఁడు నాఁడు గావించిన చర్యలెల్ల నందుఁ గల ప్రతిమలం జూచినఁ బురాణములు చెప్పినట్లు తెల్లముగాక మానదు.

అట్టి విశేషములం జూచుచుఁ బరమానంద భరితుండై నరవాహనుఁడు కేలం గీలించి మణిధారణంబున నొరుఁడుఁ గనంబడక యవ్వన మంతయుఁ దిరిగి తిరిగి ఫలములం దిని యాకలి యడంచుకొనియెను. రత్నప్రభావంబునఁ దనకు క్షుత్పిపాసలు లేవని తెలిసియును రుచి జూచు ఫలముల నారగింపుచుండును.

అందుఁగల రాక్షసులెల్ల వికృతరూపములచే నొప్పుచున్నను వారి చేష్టలు క్రూరములు కావు బ్రహ్మఘోషము చేయుచుందురు సామగానంబులుచ్చరించు చుందురు శిష్యులచే వల్లె వేయించుచుందురు అంతొకచో నీదారినెవ్వరు రాఁగూడదు. రాజపుత్రిక చంపక విహరించు నుద్యానవనమున కీదారి పోవును అని యున్న ప్రకటనం జూచి యతండు మిక్కిలి సంతసించుచు నాదారింబడి పోయిన కొంతదూరము యేగువరకు నొక పూవు దోట నతనికిఁ గన్నులపండువు గావించినది. దానింజూచి యతండు ఔరా! నావంటి పుణ్యాత్ముం డెందునులేఁడు. మున్ను రావణుఁడు దిక్పాలుర నగరములోనుండు మంచివస్తువులెల్ల నేరితెచ్చి లంకలో నుంచుకొనెనని పురాణములు చెప్పుచున్నవిగదా? వానింజూచిన మనుష్యుఁడులేఁడు నాకు స్వప్నమో యింద్రజాలమో తెలియదు యిట్టికేళీవనము చూచుటకు నాకి రెండుకన్నులు చాలవు.

ఓహోహో! ఈపరిమళము భూలోకము లోనిదియా? మేను పరవశమగు

చున్నది. దేవలోకములోని నందనవనమునం గల మంచి వృక్షముల నెల్ల పెరికితెచ్చి లంకలో నాటిరిగదా ? ఇంతకంటె రమణీయమగు నుద్యానవన మేలోకమునందు లేదని నిశ్చయింప వచ్చును.

ఇది మిక్కిలి విశాలముగా నున్నది. జలయంత్రముల విశేషములు చూడ వర్షాకాలమువలెఁ దోచుచున్నది. కాలమానముల నల్లిక వేసవిం దెలియనీయదు సర్వర్తు కుసుమ ఫలభాసురమై యిక్కాన నొదగట్టుచున్నది. ఇందే వసించి దేహయాత్ర నడుపుకొనియెదను. నేనెవ్వరనో యేమిటికిందు వచ్చితినో నాకేమియుఁ దెలియకున్నదియని తలంచుచుఁ బరవశమైన చిత్తముతో, అతండు విహరింపుచుండెను.

# చంపకకథ

అంతలో నొకమూలనుండి తంత్రీనాదమిశ్రితమైన మనోహరగానం బతనికి శ్రోత్రపర్వము గావించినది. ఆధ్వని విని యదరిపడి బాపురే నాకన్నులకుఁ దృప్తికరినది చెవులకుఁ గూడ బర్వము గలుగుచున్నది. అద్భుతగానశ్రవణము అపూర్వవస్తు సందర్శనముగూడ నాకుఁ గలుగఁబోవుచున్నది. ఇది విభీషణ పౌత్రికయగుఁ జంపక విహరించు కేళీవనమని ప్రకటనలవలనం దెలియఁబడుచున్నది అనగా నాదము నాపైదలిదేయని తలంచెదను. అదృశ్యుండనగుట నాకెక్కడ బోయినను నాటంకము లేదుగదా చంపకం జూచెదంగాకయని యాలోచించి యానాద మేతెంచినదెసఁ కరిగెను.

ఒక గున్నమామిడి క్రిందఁ జంద్రకాంత శిలావేదికపైఁ గూర్చుండి పెక్కండ్రు చెలికత్తెలు చుట్టునం బరివేష్టింపఁ దంత్రీస్వరముతో గంఠనాదము మేళగించి సంగీతము పాడుకొనుచున్న యొక చిన్నది యతని కన్నులం బడినది.

అద్భుతగాన స్వనాకర్షణంబున నీరైన యతని చిత్తము త్రిలోకమోహజనకం బగు నా కనకగాత్రిం జూచినప్పు డెట్లున్నదో వర్ణించుటకు బృహస్పతికి శక్యము గాదు. ఆమెం జూచి యతండు పరవశుండై నేలం బడెననుట యతిశయోక్తి గాదు. ఒక్కింత వడికిఁ దెలిసి మెల్లనం గన్నుఁదెరచి మెఱుపు తీగయుంబోలె తత్తనులావణ్యము మిరిమిట్లుగొలుపఁ గన్నులు మూసికొనియె ననుట యథార్థ కథనము.

మరల మరల గన్నులం దెరచుచుఁ జేతులచేఁ దుడిచికొని రెప్పవేయక యట్లే చూచుచు వాపోవక యాకేశస్తని నాపాదమస్తకముఁ దిలకించి మేను పులకింప నతం డిట్లు తలంచెను. ఔరా! దైవసంఘటనము. రాక్షసరాజపుత్రికయగు నీ చంపకను దలంచి విద్యుజ్జిహ్వుఁడు విరాళిజెంద నేమో యనుకొంటిని. ఇది యెక్కడి రక్కసి కూన. రక్కసులు వికృతాంగులు కారా! సురగరుడోరగ సిద్ధ విద్యాధరయువతులీనాతికి దాస్యముసేయఁ బనికిరారని శపథముజేసి చెప్పఁగలను పెక్కేల యొక్కొక్క యవయవము చక్కఁదనము వర్ణింప శేషునకొక్క సంవత్సరము చాలదని చేయెత్తి పన్నిదము చేయగలను.

ఓహోహో? కనురెప్ప లెగయ రాగముల వెలయింపుచుఁ గృతుల నాలాపించు నప్పుడు పండువెన్నెలలు గాయ నాజెము త్తెముల వలె నించుక బయల్పడుచున్న పలువరసయందము జూడ శ్రీ శుకునకైన మోహము గలుగక పోవునా! అబ్బబ్బా! అమ్ముద్దుమొగము చక్కఁదనము. అని గంతులువైచుచు నున్మత్తుని భంగి కొంతసేపు ప్రలాపించుచుండెను.

మరల మోహమడంచుకొని అయ్యో! నేనింత మూఢుండనైతినేమి? చాలు జాలు. నీ ప్రోయాలు మగనాలైనచో నా మనసు వ్యభిచారదోషముం బొరయదా? మాతల్లి చెప్పిన నీతివాక్యముల మరచితినేల? పరాంగనల గన్నెత్తి చూడరాదు గదా! ఇది చంపక యగునో కాదో ఇప్పుడు మంగళగీతంబులం బాడుచున్నది గానావసానమున వీరు మాటాడుకొనక మానరు. అప్పుడు వీరి కులగోత్రములం దెలిసికొనియెదంగాక యని నిశ్చయించి యాప్రాంతమందుఁ గూర్చుండి గీతావసానకాల మరయుచుండెను.

ఆ చిన్నది సంగీతము కట్టిపెట్టి యప్పుడే వచ్చి కూర్చుండియున్న యొక చేటికం జూచి చామరికా! నీవు నేఁడింత యాలసించితివేల? నీ కొంతకుఁ బెద్దతరవు వైచియుంటిమి! పని యేమి గలిగినదని యడిగిన నమ్ముగువ యిట్లనియె.

రాజపుత్రీ నిన్నరాత్రి నీ యంతఃపురమున నేను వాడుక ప్రకారము సంగీతము పరిశ్రమ జేయుచుంటి. నీవేమిటికో యక్కడికి వచ్చితివికావు. పెద్దతడవు పాడి పాడి నీవు లేమింజేసి నీ మంచముపైఁ బండుకొని గాఢముగా నిద్రపోయితిని. కొంతసేపటికి లేచి చూడఁ ద్రికూట నగరంబునందలి చీకటియింటిలో నుంటి. అప్పుడు శూర్పణఖా పౌత్రుఁడగు విద్యుజ్జిహ్వుఁడు చంపకా! చంపకా! అని నన్ను లేపుచు నేమేమో ముచ్చటింప బొరంగెను. అప్పుడు నేను లేచి ఓయీ! నేను చంపకనుఁ గాను. ఆమె సఖురాలు చామరికను. నన్నేమిటికిఁ దీసికొని వచ్చితివి చంపకతో నీకేమి పనియున్నది. అని యెదఁబొడమిన వెఱపు బయల్పడనీక ధైర్యముగా నడిగితిని.

అప్పుడు వాఁడు పశ్చాత్తాపము జెంది అయ్యో! చామరికా! నిన్ను రాజపుత్రిక యనుకొని భ్రమపడి తీసుకొని వచ్చితిని. నీవాము మంచముపై బండుకొంటివి కాఁబోలు. కానిమ్ము. నీవు నాకొక యుపకారము చేయుదునంటివేని నిన్ను విడిచి పుచ్చెద లేకున్న నీపని పట్టెదనని బెదరించిన నే నాలోచించి యిట్లంటి కుమారా! మేము పరిచారికలము ఎవ్వరు చెప్పిన పనులనైనం జేసి మెప్పువడయుచుందుము. నాయోపినంత యుపకారముజేసి నీవలన గానుకల నందెద నీయభీష్టమేమో తెలుపుమని నైపుణ్యముగాఁ బలికితిని అప్పుడు వాఁడు నన్ను మెచ్చుకొనుచు చామరికా! ఇట్లు బలుకుట నీకే తగును. నాకోరిక వినుము.

చిన్న విభీషణుని పుత్రిక చంపక నాకంటె నించుక చిన్నది. చిన్నతనము నుండియు నేను దానిఁ బెండ్లియాడవలయునని యభిలాష పడుచుంటిని దానితండ్రి తాతలకు జయంతునకో మన్మథునకో పెండ్లి చేయవలయునని యున్నదఁట. రావణ బ్రహ్మ చనిపోయిన పిమ్మట విభీషణుఁడు రాక్షసులం బెట్టు బాధలు నీవెఱింగియే యుందువు, అట్టివాఁడు నాకుఁ బిల్ల నిచ్చునా? శాంబరీపాటవంబున దానిం గొనిపోయి పెండ్లియాడఁ దలంచుకొంటిని. నిన్న విభీషణుఁడు మనుమనితోఁ గూడ శ్రీరంగమున కరిగెనని విని రాత్రి మాయాబలంబున నా యంతఃపురంబునకు వచ్చి నీవే యామెయనుకొని తీసికొని వచ్చితిని. గుఱితప్పినది.

ఇకమీఁదఁ జంపకకు నాయందు మోహము గలుగునట్లు నీవు చేయవలయును. నీవు సంతతము చంపకయొద్ద నుందువు. కావున నీవలనఁ గార్యసాఫల్యము కాఁగలదు. నీకు మంచి పారితోషిక మిప్పింతును అని నాతోఁ బెద్దగద వేడియో గౌరవచెప్పెను.

అప్పుడు నేను దప్పించుకొనుటకై వానికనుకూలమగు మాటలాడి కానుక లంది వచ్చితిని. అని యాకథయంతయు నెఱింగించినది.

చంపక మిక్కిలి కోపముతో నేమీ? ఆ పాపాత్ముఁడట్లు గావించెనా? ఈవార్త మాతండ్రి కెఱింగించితివా? లేకున్న నిప్పుడేపోయి చెప్పుము తప్పక ఆనీచం బరితపించును. అనుటయు నది దేవీ! నీవనకమున్న యెఱింగించితిని. అయ్యగారెద్దియో తొందరలోనుండిరి. పాతాళలోకములోఁ గర్కోటకకులమువారికి వాసుకి వంగడము వారికిని బెద్దయుద్ధము జరుగనై యున్నదట. వాటికి వంశజాతులు మనవారిని బాట రమ్మని కమ్మఁబంపిరట. దానిం జదువుకొనుచున్నారు. ఆ తొందరలో నామాట పాటింపక పోపొమ్మ్మ. పిమ్మట విమర్శింతుములే అని యదలింప నిచ్చటికి వచ్చితిని అని చెప్పినది.

ఆమాట విని ఆబోఁటి అక్కటా! వారికిఁ బోరేమిటికి వచ్చినదియో తెలిసి కొనవలయును. లెండు లెండు అని పలుకుచు సఖులతో గూడ బయలువెడలి చంపక శుద్ధాంతమున కరిగినది.

వీరసింహుఁడు వారి సంవాదము విని మురియుచు నిమ్ముదిత రాక్షసరాజ పుత్రియగు చంపక. దీనికింకను వివాహము కాలేదు. ఏను దీనిని వరించుట తప్పు గాదు. వచ్చినపని మఱచుటతప్పు. ఇందుండి పాతాళమునకు దారి గలదు గదా! యురగసమరసహాయమున కరిగెడు రక్కసులవెంట నేనక్కడికిఁ బోయి నా తలి దండ్రుల జాడ తెలిసికొనియెదనని నిశ్చయించి నాచేడియలవెంట గొంతదూర

మరిగెను. అంతలో వారదృశ్యులగుట విభ్రాంతుఁడై దిక్భ్రమజెంది యంతటొక దారింబడి పోవఁదొడంగెను.

అని యెఱింగించువరకు వేళ యతిక్రమించుటయు దదనంతరోదంత మవ్వలి మజిలీయం దిట్లని చెప్పందొడంగెను.

# 117 వ మజిలీ

## విభీషణుని కథ

అయ్యో! సుడిగుండమునఁ బడినయాకుగానివలెఁ బదిదినముల నుండి యీ పట్టణమునఁ దిరుగుచుంటిని. అగమ్యగోచరముగానున్నది. విభీషణుని గేహమేదియో తెలిసికొనవలయునని యెఱిఁగినను గనంబడకున్నది. చంపకసుజాచు భాగ్యము నాకిఁకఁ బట్టదుకాఁబోలు ఈపాటికి రాక్షససేనలు పాతాళమున కేగియుండును. ఇప్పుడు నాకుఁగర్తవ్యమేమి? ఎన్ని దినములిట్లు తిరుగుచుందును? అన్ని మేడలు జూచినట్లె కనఁబడును. క్రొత్తవివలెఁ దోచుచుండు కాళ్ళు నొప్పిపెట్టుచున్నవి. ఇఁకఁ నడువఁజాలను. సాయంకాలమగుచున్నది. ఈ కనంబడుచున్న మేడ ప్రహస్తునిదని వ్రాయఁబడియున్నది. ఈరాత్రి యిందు గడిపి విశేషంబులం దెలిసికొనియెద నని తలంచి వీరసింహుఁడు ప్రహస్తుని మేడలోనికిఁ బోయెను.

అంతటొక శయనగృహంబున భార్యాభర్తలిట్లు సంభాషించుకొనిరి.

భార్య—ప్రాణేశ్వరా! నగరవిశేషములేమి? నేఁడు ప్రొద్దుపోయి వచ్చితిరేల!

భర్త—అబ్బా! యీ విభీషణుని కొల్వుసేయుట కష్టముగానున్నది. సృష్ట్యాదినుండియు దమోగుణ ప్రధానులగు యాతుధానుల మనులవలె నుండుమనిన నుందురా? సహజగుణము మానుప నెవ్వరి తరము. ఈ నడుమ శూర్పణఖా పుత్రుఁడగు విద్యుజ్జిహ్వుఁడు మాయాబలంబున జంపక యంతఃపురమున దాఁగి యాసు చెలికత్తె నెచ్చటికో తీసికొనిపోయెనఁట. అది నాయపరాధముగా నెంచి నీవు మాయావిం బరిభవింపకున్న నిన్ను మన్నింపనని చిన్న విభీషణుఁడు నాపై నలిగెను. విద్యుజ్జిహ్వుని నిమిత్తము పెక్కండ్రు దూతల నంపితిని. వాఁడెక్కడికో పాఱిపోయెనఁట, వారియింటనున్న మాయాకథపుస్తకములెల్ల లాగికొని రాజవశము గావించితిని. నేఁడాలస్యమైనదని యెఱింగించెను.

ఆమాటవిని భార్య అయ్యో! పూర్వము లంకలోఁ గల రక్కసుల మాయాశక్తి యంతయు నేమైనది. యిప్పుడు వ్యాపకముగాలేదేమి అని యడిగిన భర్త సతి

మణీ! విభీషణ శాసనంబున నా విద్యలన్నియు గుప్తము జేయఁబడినవి. ఆ పుస్తకములన్నియు లాగికొని యొక గృహంబున ముద్రలు వేయఁబడినవి. వానిం జదివిన వాని శిక్షింతుము అని యెరింగించెను.

భార్య వెండియు నేడియో యడుగఁబోయిన అతండు కొమ్మా! నన్ను నిద్రబోనిమ్ము. రేపు పెద్ద విభీషణుఁడు సభకు వచ్చును. పెందలకడ సభకు లేచి పోవలయునని పలుకుచు నిద్రించెను.

ఆ సంవాదము విని వీరసింహుఁడు సంతసించుచు నేఁడెందురా నొక విశేషము దెలిసినది. ఈ ప్రహస్తుడు అమాత్య ప్రహస్తుని వంశములోనివాఁడు కాఁబోలు. ఈఁతడే యిప్పుడు మంత్రిగానుండెను. రేపు విభీషణమహారాజు సింహాసన మలంకరించునఁట. వీనివెంట నాయోలగంబున కరిగి యాపుణ్యాత్ముని దర్శనముజేసి కృతార్థుండనయ్యెదనని తలంచి యందే యొకచోఁ బండుకొనియెను.

అరుణోదయ సమయమునకే ప్రహస్తుండు లేచి కాలకృత్యంబులు నిర్వర్తించి ద్వారమున వేచియున్న వీరభటులతోఁ గూడ రాజ సభకుఁ బోయెను.

వీరసింహుండును ప్రహస్తుని విడువక యతని వెంట నరిగి యా సభలో నొకచో నిలువంబడియెను. అంతకుఁ బూర్వమే పౌరులెల్లరు వచ్చి సభ నలంకరించిరి. మిక్కిలి విశాలమగు నా సభాభవనంతయు మంత్రిసామంతరపురోహిత శ్రీబాల వృద్ధరాక్షస వీరులచే నిండింపంబడి యెంతేని దర్శనీయమై యొప్పినది. వీరసింహుఁడా సమ్మర్దములోఁ దప్పించుకొనుచుఁ దనకుఁ నిలువఁ జోటెందును లేమింజేసి క్రమంబున రాజసింహాసనము దాపునకుఁ బోయి యందు సింహాసన మంటప మణి స్తంభమునకాని నిలువంబడి యావింతలం జూచుచుండెను.

సింహాసనమునకు దక్షిణమున అర్ధముగా వేయఁబడిన పీఠంబునఁ బ్రహస్తుండును నుత్తరమున వేయబడిన పీఠంబున జిష్ణు విభీషణుండును గూర్చుండి నారు మహారాజునకు విన్నవింపఁదగిన విషయంబులన్నియుఁ జర్చింపుచుండిరి.

ఇంతలో భేరీనినాదము సభ్యులకు శ్రవణానందము గావించుటయుఁ జూడ్కులు సభాభవన ద్వారమునకు వ్యాపింపఁ జేసిరి. విభీషణమహారాజు పెక్కండ్రు రాక్షస వృద్ధులు పరివేష్టించి శ్రీరామమంత్రపారాయణము జేయుచుండ శిబికారూఢుండై చనుదెంచి ద్వారదేశమున దిగి రాక్షసుల నమస్కారము లందుకొనుచు సమున్నతంబగు రత్నవితర్దికపై దూరపు ముఖముగా వేయఁబడియున్న సింహాసన మలంకరించెను. అప్పుడు సభాసదులెల్ల విజయధ్వానములతోఁ గరతాళములు మ్రోయించిరి. ఆపీఠము దాపునున్న వీరసింహుఁడు విభీషణునకు నమస్కరించుచు నిట్లు తలంచెను.

ఆహా! పరమభాగవతాగ్రేసరుండైన యీ మహాత్ముంజూచుటను నేను గృతార్థుండనైతిని. నాజన్మ సాఫల్యము నొందినది. నాకన్నులు కలిమి సఫలమైనది. ఇతండు శ్రీరామభక్తులలో ముఖ్యుడు. యుగాంతరములు గతించిన వృద్ధుడైనను నితని తేజము దృష్టులకు మిరిమిట్లు గొల్పుచున్నది తనువెల్ల నూర్ధ్వపుండ్రములఁ ధరించి తులసీ దామభూషితప్రతీకుండై యొప్పు నితని యాకార మెంతమనోహరముగ నున్నదియో? యీ భక్తుని నోటినుండి వెల్వడిన వాక్యామృతము గ్రోలి శ్రవణంబులఁ బవిత్రము జేసికొనియెదనని తలంచుచు నతనిఁ జూచుచుండెను.

సభాభవనంబంతయు నిశ్శబ్దంబైయున్నంత విభీషణుఁడు శ్రీరామ మంత్రంబు జపించుచుఁ దత్ప్రభావము సభాసదులకు వివరింపుచు

గీ. రామనామంబు జన్మతారకము సకల
కలుషకానన భూరిపావకము మౌని
కల్పకము దాని జపియించు ఘనులె మునులు
సాటిలేనిది సకలార్థసాధకంబు.

సీ. జపియించుచుందురే సద్భక్తి శ్రీరామ
మంత్రంబు దానవుల్ మౌనులట్లు
పఠియించునే నిత్యపారాయణముగ శ్రీ
రామాయణంబు బహుశ్రవణంబు
గావింతురే రామకళ్యాణములు మహో
త్సవముగం దరసి దానవులు వేడ్క
భజింతురే యొడల్ పరవశత్వమునొంద
దైత్యులారాము నృత్యములు సేసి

గీ. బలిమిఁ గ్రవ్యాదులైన దైత్యులను గంద
మూలశాల్యన్న ఫలశాక భోజనులుగ
జేసి సద్వృత్తి గలుగ శిక్షింతురే స
దా విమర్శింపుఁడు సమత్వమున మీరు.

ప్రహస్తా! నాఁడు సీతామహాదేవిని బెదరించిన వికృతాంగులగు రాక్షసాంగనలఁ గదలనీయక కట్టిపెట్టి రామమంత్రము జపించునట్లు నియమించితిరా! యాతుధానుల వలన సాధుజనులకు బాధగలుగకుండఁ గాపాడుచుంటిరా? పాతాళంబునంగల రక్కసుల నదలింపుచుంటిరా? మాయాగ్రంథములఁ జదువకుండ గుప్తము గావించితిరా? అని యడిగినఁ బ్రహస్తుండు లేచి యెల్లరు విన అతనికి నిట్లనియెను.

శా. దేవా! దేవరశాసనంబున సురద్వేషుల్ దురాచార దు
ర్భావంబు ల్విడనాడి సంతతము శ్రీరామప్రభావంబులం
గైవారంబులు సేయుచుం గథల నాకర్ణింపుచుం భక్తిం ద
త్సేవాతత్పరులై తపోధనుల రీతిం బొల్తు రెల్లప్పుడున్.

మహారాజా! యువరాజుగా రాజ్యాపించుచుండ మనలంకఁగల రక్కసులెల్లఁ దారకమంత్రము జపించుచు నేమంబున మహామునులం బరిహసింపుచుండిరి. దేవతల నాత్మభావంబునం బూజింపుచుండిరి. పుడమియందుం గలదనుజులు మన యాజ్ఞకులోనై వర్తింపుచుండిరి. బ్రహ్మపదంబున సముద్రమధ్యగృహంబున వసించి జీవహింసఁ గావించెడి జ్వాలాముఖియనుదానవి విక్రమాదిత్యుని మనుమఁడు విజయ భాస్కరునిచేఁ జంపఁబడినది. ఆగృహము మన వశము జేసికొంటిమని చెప్పిన విని విభీషణుండు ఏమీ! ఆమహాపాతకురాలు మడసినదియా? అది వరగర్వంబున మనలఁ దిరస్కరించు చుండునది దానిం జంపినవాఁడు విక్రమాదిత్యుని మనుమఁడా? ఆహా! ఆ మహారాజు సుగుణగణంబులు గంధర్వులు పాడుచుండఁ బెక్కుసారులు వినియుంటిని. మంచిమాట చెప్పితిరి. ఆరహస్యగృహంబున మఱెవ్వరేని క్రూరులు చేరలేదుగదా? అని అడిగినఁ బ్రహస్తుం డిట్లనియె

దేవా! ఆసదనము మనభటులు కాచుచునేయుండిరి. మఱియు జ్వాలాముఖి సోదరుఁడు రక్తాక్షుం డనువాఁడు గర్భభరాలసయైన యొక యువతిఁ బలిమితోఁ దీసుకొనివచ్చి యందు దాచెనఁట. ఆ వార్త కింకరులు మాకెఱింగించిరి. యువరాజుగారు రక్కసునిఁ బట్టుకొని రండని యాజ్ఞాపించిరి. రాజభటులు పోయి యా శాసనము వానికెఱింగించినవాఁడు బెదరుచు నెదిరించి పోరకక నాపురుషు నెత్తుకొని యెచ్చటికో పారిపోయెను. అంతలో నాకాంతకు నెలలు నిండుటయుఁ బ్రసవవేదన యావిర్భవించి మగశిశువుం గనినదట. ఆకథమేము విని యుపచారమునకై కొందర పరిచారకులనంపి నెల దాటినతోడనే యాచేడియను శిశువుతోఁ గూడ నిందుఁ దీసికొని రమ్మని నియమించితిమి. వారునుం బోయి మాతాశిశువులం గడు జాగరూకులై కాపాడుచుండ నానెల లోపల నాపలాశనుండు వెండి యుజ్జనుదెంచి పరిచారకులు మొరపెట్టుచుండ శిశువుతోఁ గూడ నాచేడియ నెత్తుకొని పాఱిపోయెను. రక్షకభటు లెరిగి వెంటఁబడి తరుముకొని పోయిరఁట వాఁడు పాతాళములోనికిం బోవుడు భోగవతి నగరోపరిభాగంబున మన భటులు వానిం బట్టుకొనిరి. కాని వాఁడు బాలునితోఁగూడ నాచేడియను గ్రిందకిఁ బడవైచెను.

అప్పుడు వానిం బట్టుకొని మనభటులు పెడకేలు గట్టి యిప్పటికిఁదీసికొనివచ్చు

చుండ నడుమ వాఁడెట్లో తప్పించుకొని పారిపోయెనఁట పాపమా మాతాశిశువులు క్రిందఁబడుటచే సమసిరని దూతలు వచ్చి యాకథయంతయుఁ దెలిపిరి.

అని యెఱింగించిన విని విభీషణుండు కటకటంబడి మనుమనితో నిట్లనియె. వత్సా! రక్తాక్షుం డట్టియక్రమ కృత్యంబులం గావించుచుండ నుపేక్షింతివేల? ఇదియా నీరాజ్యపాలనము అయ్యయ్యో! నిష్కారణము దిక్కులేక యక్కాంతయును బాలుండును బలవంతమ్మున మడిసిరే! వాఁడట్టివాని పనియెంతయుఁ బరిమార్చుచుండెనో? స్వయముగాఁ బోయి నీవా దానవుని వెదకియేమిటికి శిక్షింతివికావు? పాతాళంబునందలి రక్కసులు మనయాజ్ఞనుల్లంఘించుచుండిరాయేమి? బాగు బాగు. అని యాక్షేపించిన విని బాలవిభీషణుం డెద్దియో చెప్పంబోవుడు నడ్డంబై ప్రహస్తుండిట్లనియె.

దేవా! దేవరవారు వృద్ధులై తాపసవృత్తి వహించుటయు లంకంగల రాక్షసులు మాయాబలశూన్యులగుటయు నరసి రసాతలంబునం గల దానవులు మన యాజ్ఞ మన్నించుటలేదు. తలాతలము కవచమువలె వారిం గాపాడుచున్నది.

అందున్నవారి మనమేమియుం జేయఁజాలము. ఇపుడు మఱియొక యుపద్రవము తటస్థించినది వినుండు.

రసాతలాధిపతులగు కౌరవ్యునకు నేలాపుత్రునకుఁ గన్యకా మూలమునఁ దగవువచ్చి యిపుడు పెద్దయుద్ధము జరుగుచున్నది. తక్షకవంశస్థునకు నందుగల రక్కసులు మిత్రులగుటఁ దద్వంశ సంజాతుండగు నేలాపుత్రుఁడు వాసుకి వంశజుండైన కౌరవ్యుని కూఁతురు తేజోవతికిఁ దనకుమారుఁడు పారిజాతున కిమ్మని అడిగిన నతం డొడంబడమిననలిగి రాక్షససహాయ బలంబునం గ్రొవ్వి చివరకు రాయబారము బంపెనఁట. కౌరవ్యుండు భయార్తుండై యావార్త మనకుం దెలియంజేసి సహాయము రమ్మనుటయు మీమనుమఁడు వారి కిసందేశమంపెను.

గీ. వలదు యుద్ధము వాసుకి వంగడంబు
మాకుఁ బ్రాణమువంటిది మదిఁదలంపు
కదఁగి యన్యాయమునకు విక్రమముఁజూపఁ
దగునె కనవె విభీషణ ధర్మబుద్ధి.

గీ. అన్నయైనను విడిచెఁ బాపాత్ముఁ డగుట
శాత్రవుండైన ధర్మవిశ్వాస గరిమ
నాశ్రయించెను శ్రీరాము నది యెఱింగి
సంధి గావించుకొనుఁడు రక్షకము గాఁగ.

గీ. కానిచో నింక నాగలోకమున కరయ
రాజులందఱు లేరు ధర్మప్రసక్తిఁ
బాలనము సేయు నేకాతపత్రముగను
బలిమి గౌరవ్యుఁ డొక్కఁడే తెలిసికొనుడు.

శా. లంకాపట్టణ వీరులాస్థవిరబాల స్త్రీసమేతంబు సా
హంకారంబుగ నాఫణీంద్రునకుఁ దోడై వచ్చి యాజిన్నిరా
టంకం బొప్పఁగ నీబలంబులను జుట్టంబెట్టి వారాశిని
శ్శంకన్ ముంచెదరింక వట్టి నిజ మస్మద్వీర్యముల్ గ్రొత్తలే.

క. ఏలా? పుత్రుకతంబున
నేలాపుత్రా! యకార్య మీవొనరింపన్
మేలా పుత్రుని దుర్నయ
శీలా ప్రతిపుం గఁబట్టి శిక్షింపంగన్.

అని మఱియు ననేక నీత్యుపదేశములతో నేలాపుత్రునకు రాయబారము బంపితిమి. అదర్శనీతఁడెట్టి ప్రత్యుత్తరము వ్రాయించెనో చూచితిరా? వినుండు.

గీ. దనుజసత్తమ! మేమెఱుఁగనివి కావు
నీచరిత్రలు శాత్రవునిం భజించి
రాజ్యలోభంబునను జేసి భ్రాతృసుత హి
తాళిఁ జంపించి తప్పు మింతకన్నఁ గలదె

గీ. విడువఁదగునె పెట్టఁబడి కుందులఁ నన్న
నెట్టివాడైన నీవుఁదెలిఁగి యెఱిఁగి
రిపుపదంబుఁబట్టి నృపతియై మనుకంటె
పోరఁ జచ్చి యగసుఁ బొందు టెడి.

గీ. అన్న జంపించి కొన్న రాజ్యమున నిలిచి
తేనెఁబూసిన కత్తి చందాన లోని
దుర్నయంబుల నెల్ల బైఁబోపనీక
పరమధర్మంబు లెఱిఁగింతువౌరులకీవు.

శా. నీతివిదుండువోలె రజనీచరసత్తమ! మాకుఁదెల్పెదీ
చాతురి మెచ్చవచ్చు బలిపద్మమునంగల నాగులెల్ల నీ
చేతఁ బ్రభుత్వమియ్యఁబడి చేరినయట్లదలించుచుంటి
వౌరా? తలకెక్కెఁ బాడుకలు రక్కసులెంతటి సాధులైరటన్.

మ. వినుఁ లంకాపురివారుగారు మఱి దోర్వీర్యంబునం బేరుపొం
దిన నానాభువనంబులం గల సురద్వేషుల్ మహేంద్రాదులే
పున నేకంబుగఁ గూడివచ్చి బవరంబుంజేసినం బోక నొ
క్క-నిమేషంబున మిమ్ముఁ గెల్చిజయముం గైకొందుమోదానవా!

క. నీవొక వివేకవంతుఁడ
వే! పిరుఁదవే! తృణప్రవృత కూపగతిన్
బై వెలయింతువు నీతుల
కోవిదుఁడవుగావు చెప్పకుము ధర్మంబుల్.

సీ. శేషుఁడెంతటివాఁడు చెప్పంగనగునె వా
సుకి ప్రభావంబు తక్షకునిమహిమ
కొనియాడవశమె కర్కోటకు సామర్థ్య
మలఁతియే ధృతరాష్ట్రు నతిశయంబు
ప్రణుతింపఁదరమె కౌరవ్యు నాధిక్యము
సన్నుతింపఁగ బ్రహ్మశక్యమగునె
తరమె యెలాపుత్రు గరిమవర్ణింపంగ
నైరావతుఁడు నతి కింతువాఁడె

గీ. జగము లన్నింటి ద్రోవంగఁ జాలువారు
మాదు పెద్దలు బుద్ధులు మాకు మేము
చెప్పుకొనవలెగాక శాసించి యిట్టు
లవుర! తెలుపంగ నీ వెవ్వఁడవుర మూఢ.

అని మనకు మరల రాయబారముఁ బంపెనని చెప్పిన విని విభీషణుఁడు భీషణభ్రుకుటీముఖుండై యేమేమీ? ఏలాపుత్రుసికే యింతక్రొవ్వా. మనకు దాసుఁడై క్రుమ్మరు నా నీచున కింత ప్రౌఢిమ యెట్లు వచ్చినది. యెవని యూఁతఁజూచి యిట్లు ప్రల్లదము లాడెను. కానిమ్ము పిమ్మట నేమిగావించితిరని అడిగినఁ బ్రహస్తుండు దేవా! మన లంకంగల వీరభటులనెల్లఁ గౌరవ్యునికి సహాయముగఁ బంపితిమి. పోరు ఘోరంబుగ జరుగుచున్నదట మఱియు మనవారి బలమఁడియగుచున్నదని ఈనడుమ గాలివార్త దెలిసిన శాంబరీ గ్రంథాలయము దెరపించి మాయావిద్యల నేర్పించి పెక్కండ్ర రక్కసుల మొన్ననే యుద్ధమునకుఁ బంపితిమని యావృత్తాంత మంతయుం జెప్పెను. ఆకథ యంతయును విని విభీషణుం డొక్కింతసేపు శ్రీరామ నామమంత్ర పారాయణపరాయణత్వమున వివశుండై అంతలోఁ దెలిసి ప్రహస్తా!

యేలా పుత్త్రుఁడు దుర్వారబల సహాయబల గర్వితుండై పోరుచున్న వాఁడు మనము తగు ప్రయత్నము చేయవలయును లంకలోఁగల మూలబలంబులనెల్ల నాయితము గావింపుము ఇప్పుడు యుద్ధమెట్లున్నదో వార్తాహరులనంపి తెలిసికొనుమని పలుకుచుండఁగనే రాక్షసవీరుల హాహా కారధ్వనులు వినంబడినవి.

అందఱు నాదెస చెవియొగ్గి వినిరి. ఘోరముగా నాధ్వని వినంబడుచుండెను. కొందఱాదెసకుఁ బరుగిడిపోయిరి అంతలోఁ బాతాళమునుండి పరాజితులై రక్కసులు పారిపోయి వచ్చుచున్నారను వార్తయొకటి వ్యాపించినది. ఆమాట విని విభీషణుం డదరిపడి ప్రహస్తుం జూచి నేనవలేదా! మన కపజయము గలుగునని సూచనలు దోఁచినవి. నిజమేమియో తెలిసికొనుము తరువాత సన్నాహము గావింతమని పలికెను.

అట్లువారు సంభాషించుకొనుచుండగనే పాతాళమునుండి వచ్చిన రాక్షసబలములా ప్రదేశము నిండించినవి అప్పుడు సేనాధిపతియగు దుర్ధముండు దీనవదనుండై రాజునొద్దకు వచ్చి నమస్కరించి నిలువంబడుటయుఁ బ్రహస్తుండు వాని నమస్కారము లందుకొని యిట్లనియె దుర్ధమా! యరిమర్దన సమర్థములగు మనబలంబు లిట్లు యుద్ధవిముఖంబులై వచ్చుటకుఁ గారణంబేమి? అందు శౌర్యధుర్యులగు మహావీరు లెవ్వరు గారు? సంగరంబెట్లు జరిగినది? మీరేమి చేసితిరి? సవిస్తరంబుగఁ దెలుపుఁడని యడిగిన నావాహినీపతి యిట్లనియె.

దేవా! దేవరవారి యానతి వడువునఁ జతురంగబలంబులంగూడికొని నేనును గుప్తబిలమార్గంబున రసాతలంబున కరిగి కౌరవ్యునింగాంచి తమ సందేశం బెఱింగించితిని. అయ్యురగాధిపతి మమ్ముఁజూచి అపరిమితానందంబుఁ జెందుచు దమ బలంబులతోఁ గలిసి వ్యూహంబుగా నిలువ నాజ్ఞాపించెను. అప్పటికి భోగవతీనగరంబునకు దక్షిణముగా రెండుక్రోశముల దూరములో శత్రుబలములు వ్యూహముగా నిలువంబడి యున్నట్లు తెలియవచ్చినది.

తలాతల రసాతలంబులంగల రాక్షసబలంబులు తక్షక కర్కోటక బలంబులుం గలసి రోదసీకుహరంబు నిండ గర్జిల్లుచుఁ బెల్లుకొని వచ్చు కల్లోలమాలింబోలె నాభీల రౌద్రావేశంబున అరుదెంచి యొక్క పెట్టున నప్పట్టణంబు ముట్టడింపఁ దలపెట్టి యట్టి సన్నాహము గావింపుచుండిరఁట.

మేమును సర్వబలంబులును, దర్పంబున వ్యూహంబులుగా బురి చుట్టునుం గాచికొని శస్త్రాస్త్రప్రయోగంబులం గావించుచుంటిమి. మా రాకవిని మూఁడుదినంబుల దాక నెదరి మూకలు వ్యూహంబునందలి కదలి మీఁదికి రాలేకపోయినవి. అప్పుడు

మేమే విజృంభించి పలు సన్నాహములతోఁ బోయి శత్రువ్యూహముపైఁబడి ఘోరంబుగాఁ బోరుఁ గావించితిమి దేవా! ఇఁక జెప్పనేల. అప్పుడు మన బలంబులు ముప్పిరిగొను కోపంబున రౌద్రంబు రూపంబు దాల్చినయట్లు శస్త్రాస్త్రంబులఁ బ్రయోగించియు ఖడ్గంబుల నరికియు గదల మోదియు పరిఘల వేసియు శూలంబుల గ్రుచ్చియు ప్రాసంబుల ద్రోసియు పట్టంబుల ఘట్టించియు సర్వవిధములఁ శత్రుసైన్యములనెల్లఁ బీనుఁగు పెంటలం గావించినవి.

మారాయిడికి నిలువలేక కాకోదరబలంబులు గరుడానీకముతోఁ గూడఁ దోకత్రెంపిన పిట్టవలె వెన్నిచ్చి తమపట్టణము దెసకుఁ బారిపోవఁ దొడంగినవి. మేమును గొంతదూరము వారిందరిమి విజయ నాదముతో మరల బురిఁజేరి కౌరవ్యునకు సంతోషము గలుగఁజేసితిమి. నాఁటిదివసంబెల్ల విజయోత్సాహంబునఁ దృప్తిగా వెళ్ళించితిమి మరునాఁడు తెల్లవారినదో లేదో శత్రువీరుల సింహనాదములు భీషణముగా మాచెవులం బడినవి. అపుడు మాబలంబులెల్ల రిపుల నెదిరించినవి. వెండియు నుభయబలంబులకుఁ బ్రచండభండనంబు జరిగినది.

దేవా! వినుండు అందొక మహావీరపురుషుండు తురగారూఢుండై యెక్కడఁ జూచినను దాన కనంబడుచు గొఱవిఁ ద్రిప్పినట్లు వ్యూహంబులఁ జిఱిగివచ్చుచు మెఱపు మెఱసినట్లు క్షణమొకచోట నిలువక శస్త్రాస్త్రవర్షంబున మన సేనలనెల్ల ముంచిముంచి అందఱకు నందరై యర్ధయామములో మమునెల్లఁ గాందిశీకుల గావించెను.

పెక్కేల మనలో నొక్కవీరుండైన వాని నెదిరించినవాఁడు లేఁడు అప్పుడు వానియాకారము జూడఁ బ్రళయాంతంబున జగంబుల సంహరించు రుద్రుండువలె వెఱపుగలుగఁజేసినది. ఇది యతిశయోక్తిగాదు. యదార్థము మేముకాదు ముప్పదిమూడుకోట్ల వేల్పులు వచ్చినను వానితోఁ బోరజాలరని రూఢిగాఁ జెప్పగలను.

పిమ్మట మమ్ముఁ దఱిమికొనివచ్చి శత్రుబలంబులు భోగవతీపురంబు ముట్టడించినవి. పౌరులెల్లఁ దల్లడపడి స్త్రీబాలవృద్ధ సహితముగ నగరంబువిడిచి అడవుల పాలైన పిమ్మట మేమా కోటలోనికిఁ బ్రవేశింపకుండఁ దలుపులు మూసి బురుజులపై నెక్కి యాపిన గతిఁ బోరితిమి. యామహావీరుని పరాక్రమమునకుఁ గోటలు నగడ్తలును నాటకములగునా! ఏలాపుత్రుఁడు కౌరవ్యపుత్రికయగు తేజోవతిని బలవంతముగాఁ దీసికొనిపోయి తనపుత్రుఁడగు పారిజాతునకుఁ బెండ్లి సేయుటకు నిశ్చయించి యావీరుని సహాయమునఁ దలుపులు విదళించి బలంబులతో లోపలఁ బ్రవేశించెను. అప్పుడు మేమేమిచేయుటకుం దోఁచక వాని దుర్వృత్తినెఱిఁగి తేజోవతితోఁగూడ నంతఃపురకాంతల నెల్ల నందలంబుల నెక్కించి గుప్తద్వారంబున నిచ్చటికిఁ దీసికొని వచ్చితిమి.

కౌరవ్యుఁడు శత్రువులచేఁ బట్టుపడెనని తరువాత వార్తలు వచ్చినవి. నాగకాంతల
నెల్ల నిప్పుడే దేవరవారి యంతిపురమునకంపి వచ్చితినని యయ్యుదంతమంతయు
నెఱిగించెను. ఆకథవిని విభీషణుఁడు శోకసంభ్రమాశ్చర్య వివశుండై ప్రహస్తా! శత్రు
హస్తగతుండై కౌరవ్యుం డెంతచింతించునో మనకాప్తుండై యిట్టి యిక్కట్టు జెంద
దగునా! యితర వీరసహాయంబునం గాక యేలాపుత్రునకును సందుగల రాత్రించరుల
కును మనల నెదిరించు పరాక్రమ మెక్కడిది? వారి శౌర్యధైర్యాదులు మనమెఱుంగని
వియా! అవీరుఁడెవ్వడో తెలిసికొనవలసియున్నది. కానిందు నాగకాంతల జెఱఁబడ
కుండఁ దీసికొని వచ్చితివి గదా! మనము తగ్గప్రయత్నమునఁ బోయి కౌరవ్యుని మఱల
రాజ్యప్రతిష్ఠునిఁ జేయవలసియున్నది. మన వీరపుంగవ సేనలనెల్ల సిద్ధపఱచి
యుంచుము. ఈరేయి మదభీష్టదేవతం బ్రార్థించి శుభాశుభ ఫలంబులం దెలిసికొని
యెదనని ప్రహస్తునకు నియమించి విభీషణుండంతటితో సభచాలించి నాగకాంతల
నూరడింప నంతఃపురమున కఱిగెను. అని యెఱింగించి మణిసిద్ధుఁ డంతలో వేళ
యతిక్రమించుటయు కథఁ జాలించి యవ్వలి మజిలీయందు తదనంతరోదంతం బిట్లని
చెప్పఁ దొడంగెను.

## 118 వ మజిలీ.

## తేజోవతి కథ

అమ్మా! ఊరడిల్లుము. కౌరవ్యున కేమియుఁ గొదవరానీయరు. మాతాతగారు
రెండుమూఁడు దినములలోఁ బోయి యేలాపుత్రుని బుత్రమిత్రకళత్రాదులతోఁ జెర
సాలం బెట్టించెదనని శపథము జేసిరంట వింటివా? మాతాత యెదుట నిలువఁబడు వీరు
డెందును లేడు. గొప్పవారికే యాపదలు. తొల్లి మా పెద తాతవలన సీతామహాదేవి.
యెట్టి యిడుమలం బడినది. నీవు కంటఁ దడిపెట్టిన మాగుండెలు పగిలి పోవుచున్నవి.
నీకేలోపమును లేదు. ఈ రాజ్యము నీదిగా భావింపుము మేము చిన్నవారము నీకుఁ
జెప్పువారమా? మొదట వారికిని మీకును నీతగవేమిటికి వచ్చినది. యావృత్తాంతము
జెప్పుము. అని యంతఃపురమునఁ జంపక తేజోవతి తల్లి యగు పద్మావతి నూరడించుచు
నడిగిన గన్నీరు దుడిచికొని యామె యిట్లనియె.

పుత్రీ! మీయిల్లు నాకుఁ గొత్తదికాదు. నీతల్లికి నీ సుగుణంబులు చూచు
భాగ్యము లేకపోయినది. నీతల్లియు నేనును దగ్గరచుట్టములము. వెనుక నామెతో నొక
తేప సింహళపురికి వచ్చితిని. నన్ను బ్రాణపదముగాఁ జూచినది నీవు చిన్నదానవైనను
నంతకంటె నెక్కువగా నాదరించుచుంటివి. మా వృత్తాంతము జెప్పెద నాకర్ణింపుము
పాతాళలోకము నీవెప్పుడును చూచియుండలేదు. భూలోకమున కడుగున నున్నది. ఈ

భూమియే దాని కాశసము. సూర్యసంచారములేమిం జేసి యంధకారగ్రస్తమైయుండును. అత్తిమిర నివారణమునకై బ్రహ్మ ప్రతిస్పటికమునకు శిరంబున రత్నము బ్రకాశింపు నట్లుఁజేసెను. పర్వతములయందు సమున్నత ప్రదేశములయందును గొప్పరత్నములు వెలుఁగు చుండును. వానికాంతులు సూర్యప్రభను మించియుండును. అందు రాత్రిం బగళ్ళ వివక్షతలేదు. నాగకాంతలు మిక్కిలి చక్కనివారు నందనవనమును మించిన యుపవనంబు లనేకములు గలవు. స్వర్గవాసులకు బలెఁ బాతాళవాసులకు గూడ జరా రోగములు లేవు. భోగమునకు నాకము తరువాతఁ బాతాళమునే చెప్పదగినది. దానఁ జేసియే యిందు గలవారికి భోగులని పేరువచ్చినది.

రసాతలమంతయు నాలుగు రాజ్యములుగా విభజింపఁబడి యున్నది. వానిలో మారాజ్యమే పెద్దది. తక్షకవంశస్థుం డెప్పుడు మాయందు విరోధము గలిగియున్నది నాగులలో వాసుకి వంశస్థులే సాత్వికగుణముగలవారు తక్కిన వారందఱు రాక్షసకృత్యములు గల వారు విషపూరితముఖులై లోకులకు వెరపుఁ గలుగఁ జేయుచుందురు. వారిం బాటింపక నాభర్త కౌరవ్యుఁడు న్యాయంబుగ రాజ్యము పాలించుచుండెను.

ఒకనాడు రేవతియను నాదాది యాత్యాశ్చర్యముతో నాయొద్దకువచ్చి అమ్మా! మన యుప్పరిగపైనున్న హంసతూలికా తల్పంబున నవప్రతేజంబున బ్రకాశించు శిశువుతోఁ గూడ నొక చేడియ బండుకొనియున్నది. ఎవ్వతెవు. అని యెంత పిలిచినను పలికినది కాదు. నిద్రజెందియున్నది కాఁబోలు నీవు వచ్చి చూతుము. అని పలికిన విని నేను సత్వరముగా నామేడనెక్కి బోయితిని. పందిరిలేని యా శయ్యపైఁ బవ్వళించియున్న యాయన్నులమిన్నం జూచి తదీయరూపలావణ్యాదులకు వెరగుపడుచుఁ గొంతసేపు ధ్యానించి పరిచారికచే లేపించితిని. ఎంతపిలిచినను బలికినదికాదు. అముద్దుల బాలుండామె యురముపై బండుకొని పాలుద్రాగుచుండెను. ఆమె వేషము జూడ బాలింతరాలువలెఁ దోచినది.

ఆబాలునెత్తుకొని ముద్దాడుచు రేవతి అమ్మా! వీఁడు మిక్కిలి చక్కనివాఁడు. నీకుఁగూడ నిట్టికొమరుండు గలుగవలయును వానిం జూడ నాగశిశువువలె దోపఁడు. మనుష్యబాలుండని తోచుచున్నది. వీరెట్లిక్కడికి వచ్చిరో తెలిసికొనవలయునని పలుకుచుఁ జేతితోఁ దట్టుచు నానాతిం బిగ్గరగాఁ బిలిచినది పలుకలేదు. మఱియు మూర్ఛల వలన నాయాసము జెందుచున్నట్లు కనంబడినది.

అప్పుడు నేను దొందరపడి యొదలు గాపించియు విసరించియుఁ బట్టించియు నుపచారములు పెక్కు జేయించితిని. మూడు దినముల దనుక మాటాడదలేదు. నాలుగవ నాఁడు కన్నులం దెరచి చూచినది. అప్పుడు నోటిలో నాహారము పోయించితిని.

కొంచెము సేపునకు లేచి కూర్చుండి బాలునిదెసఁజూచి కన్నీరు గార్చినది. బాలునకు మే ముపచారములు చేయుచునే యుంటిమి. పిమ్మట బాలునకుఁ బాలిచ్చినది. కొంత విశ్రాంతి వహించిన పిమ్మట నేనల్లన యప్పల్లవపాణిని సమీపించి యిట్లంటిని. అమ్మా! నీవెవ్వతెవు? నీపేరేమి? ఈమంచముపై కెట్లువచ్చితివి? నీయుదంత మెఱిం గింపుము. నీపతి యెవ్వఁడని అడిగిన నమ్మగువ యిట్లనియె.

దేవీ! నేనొక నిర్భాగ్యురాలను నాకులశీలనామంబుల నడుగకుము. నాపేరు కళావతి అని జ్ఞాపకము. ఇక్కడికెట్లు వచ్చితినో నేనెఱుంగను. నీమొగముజూడ పుణ్యాత్మురాలువలె గనంబడుచుంటివి నేను పరవశనైయుండ నాపుత్రుం గాపాడితివి. నీయుపకారమెన్నటికిని మఱువను. నేను బ్రతికినను లాభములేదు. వీని నీవా నిగా నెంచి పెంచుకొనుఁడు. నేనింకేదేని బోయెదనని శోకగద్గదయై పలికిన నాలించి నేను ఓహో! ఈయువతి పెద్దయాపద జెంది వచ్చినది ఇప్పుడడిగి యాయాసపరుపఁదగదు. కొన్నిదినములు గడచినవెనుకఁ దెలిసికొనియెదఁగాక అని తలఁచి మఱేమియు నడుగక తల్లీ! నీవు వగవకుము. నీవును నీపుత్రుఁడును యథేచ్ఛముగా నిందు వసియింప వచ్చును. నీకిది పుట్టినిల్లనుకొనుము ఏలోపమురాదు. నాకును సంతతిలేదు. నీబాలుని ముద్దుముచ్చటలు జూచుచుఁ గాలక్షేపము జేసికొనియెదనని చెప్పి యామె నూరడించి తిని.

నాయోదార్పులకు సంతసించుచు నమ్మించుఁబోణి పుత్రునితోఁ గూడ మాయింట వసించినది. ఒకహాయనము గడవకుండఁగనే నేను గర్భవతినై యీతేజోవతిం గంటి. చిరకాలము సంతానములేక యీ కళావతి వచ్చెడి కొలఁదికాలమునకే పుత్రిక జనించు టచే నాభర్తకు నాయెయందును బుత్రునందును ననురాగము గలిగినది. మిక్కిలి యక్కజమగు రూపమునఁ బ్రకాశించు నీతేజోవతింజూచి యెల్లరు వెరగుపడఁ జొచ్చిరి. నాగలోకమంతయు నీబాలిక చక్కఁదనము గురించి స్తోత్రములు వ్యాపించి నవి. గారవముగాఁ బెంచుచుంటిమి. అయిదేఁడుల ప్రాయము వచ్చినంత కళావతి కుమారునితోఁ జతపరచి జదివింపుచుంటిమి. సింహమువలె గర్జించుచు సమంచిన లక్షణవంతుడగు నాబాలునకు జయసింహుఁడని మేమే పేరు పెట్టితిమి.

జయసింహుఁడు తేజోవతియు నాటపాటలయందును నాహార విహారముల యందును విడువక సంతతము కలిసియుండువారు. క్రమంబున వారిమైత్రి దిట్టమై నది. కలసియే బడికిఁబోయి చదువుకొని వచ్చుచుందురు.

జయసింహునకుఁ బదియేడుల ప్రాయముగలిగినప్పుడు బడిలో నున్న నాగ బాలురందఱు వానియందీసుగలిగి వీఁడుమానిసి. మానిసి. భర్తృదారికి పుస్తకములు

మోయు కూలివాఁడని యాక్షేపించుచుండిరఁట. ఆబాలుండా మాటలు సైరింపక యొకనాఁ డుపాధ్యాయునితో నార్యా! నేనెవ్వరిజోలికిం బోక చదువుకొనుచుండ నీనాగకుమారులు నన్ను నిత్యము వీఁడు మానిసి. కూలివాఁడు వీనితల్లి పనికత్తియ అని వెక్కిరించుచున్నారు మందలింపుఁడని చెప్పిన జాతిగుణం బెట్లు పోవును. అతండు ఔను. నీవు మానిసివే నీతల్లి రాజపత్నికిఁ బనికత్తె అగుట నిన్ను పుస్తకములు మోయునిమిత్తము తేజోవతితోఁ గూడ బడికి బంపుచున్నారు. లేకున్న నిన్ను బడిలోఁ జదువనిత్తుమా! నీవు కూలివాఁడవుకాక మఱియెవ్వఁడవు? అభిమానపడిన లాభములేదని యొజ్జలుగూడ నధిక్షేపించిరి.

ఆయూతజూచి బసింగల పిల్లలెల్ల జదువుటమాని వాని నేకరీతిగా నాక్షేపించు చుండిరఁట సహజపరాక్రమశాలియగు నాబాలుం డామాటలు సహింపక యొక నాఁడు బసింగల బాలకులనెల్లఁ బదములతోఁ దన్నియు జేతులతోఁ గొట్టియు గ్రుద్దియుఁ బొడిచియుఁ జిందరవందర గావించెను. ఒక్కఁడును వాని నెదురుకొనలేక తల యొక దెసకుఁ బారిపోయిరి.

ఆమరునాఁడు బడికట్టిపెట్టి పిల్లలతోఁ గూడి నాయుపాధ్యాయుండు కౌరవ్యు నొద్దకుఁబోయి దేవా! మీయింటనున్న దాసిపుత్రుఁడు బడికివచ్చిన నేను జదువు జెప్పఁజాలను. నిన్నను బడిలోనున్న పిల్లలనందఱ జావగొట్టెను. మీయింట దీని పిడుగులాగున నుండుటచే వానితో నెవ్వరును పోట్లాడఁజాలరు. అని వానిమీఁద లేని పోని నేరములు జెప్పి పిల్లల దెబ్బలం జూపించి రాజునకు గోపము గలుగఁజేసెను.

భూభర్త యాక్షణమ జయసింహుని రప్పించి యేమిరా? నీవు కావరించి బడి పిల్లలనెల్లఁ జావమోదితివఁట. ఇది యేమి యాగడము పద్మావతి నీవు మంచివాఁడవని చెప్పినదే నిన్ను శిక్షింతుము. నిజము జెప్పుమని అడిగిన నాబాలుండు భయపడుచు నిట్లనియె

దేవా! ఇందు నాయపరాధమేమియును లేదు నిజము తేజోవతికిఁ దెలియును ఆ చిన్నది నాతప్పని చెప్పినచో మీరు చేసినదండనకు బాత్రుఁడనయ్యెద. నామ నడుగుఁడని పలుకుటయు నాభర్త తేజోవతిం దీసికొనిరమ్మని అంతఃపురమునకుఁ బరిచారికల నంపెను.

ఆసమయమునఁ దేజోవతి యావృత్తాంతము నాతోఁ జెప్పుచున్నది. పరిచారికల వెంట తండ్రి యొద్ద కరిగినది. రాజు తేజోవతి నెత్తికొని పుత్రీ! నిన్న బడిలో నీ జయసింహుఁ డేమిచేసెనో చెప్పుము. పిల్లల నందఱఁ గొట్టెనఁట నీవు జూచితివా? యని అడిగిన నది యిట్లనియె.

తండ్రీ! అందు జయసింహు నపరాధమేమియును లేదు. ఎంత శాంతమైనది యైనను సింహము తన కేసరముల లాగిన నూరకొనునా. నిత్యము మాయొజ్జలు పిల్లలచేత వీనిమానిసియనియుఁ గూలివాఁడనియు దాసీపుత్రుడనియుఁ బలికించుచు దనతోఁ జెప్పినను వినిపించుకొనక వారిని పురికెల్పెను. ప్రతిదినము దన్నాక్షేపించుచుండ సైపక నిన్న వీరినెల్ల దన్నినమాట వాస్తవమేయని యావృత్తాంతమంతయుం జెప్పినది.

అప్పుడు రాజపుత్రికను ముద్దుపెట్టుకొనుచు తల్లీ! సహవాస పరిచయ మూరకటోవదుగదా. నీవ జతఁగాఁడని యిట్లనుచున్నావా యేమి? నిజము చెప్పుమని పలుసారులడిగి యదార్థము తెలిసికొని యాబాలురతోఁగూడ సుపాధ్యాయుని మందలించి వారికి వేరొక గురువును నియమించి చదువు చెప్పించుచుండెను.

జయసింహుఁడును తేజోవతియు గురువులయొద్ద సంగీతము సాహిత్యము శాస్త్రములు లోనగువిద్యలు మూడు సంవత్సరములలో సాంతముగా గ్రహించిరి. తేజోవతికి యౌవనము పొడసూపినతోడనే బడికిఁ బంపుట మానిపించి కొదవవిద్యలు శుద్ధాంతమునందే నేర్పించితిమి.

జయసింహునకుఁ బాల్యమునంగల ధనుర్వేదము తగినయొజ్జలయొద్ద నేర్పించితిమి కొలదికాలమున అతండు శస్త్రాస్త్ర విద్యానిపుణుండై యెల్లరచేతను పొగడ్తల జెందుచుండెను.

ఒకనాడు తేజోవతి సఖులతోఁగూడ నుద్యానవనములో విహరింపుచు సంగీతము పాడుకొనుచుండఁగా సేనాపుత్రుని కుమారుఁడుపారిజాతుఁ డనువాఁడు మిత్రులతోఁ గూడికొని యెక్కడికో పోవుచు నా గానము విని మోహపరవశుండై యందునిలువంబడి పరిజనులచేఁ దీని వృత్తాంతము దెలిసికొని యింటికిం బోయి హంసికయను చేటికను దేజోవతియొద్ద కనిపెను.

ఆ హంసిక తేజోవతితోఁ బారిజాతుని గుణగణంబులు సౌందర్య శౌర్య ధైర్యాదులం బొగడి పొగడి యతఁడు నిన్ను వరించి యున్నవాఁడు పెండ్లియాడుమని బోధించిన అవి పెడచెవినిబెట్టి యేమియు సమాధానము చెప్పక వేరొక ప్రస్తావన దెచ్చినదఁట. ఆ మాటయే పలుమారు వర్ణింపుచుండెను. మఱియు,

గీ. సకల కాకోదరాన్వయ చక్రవర్తి
పారిజాతుండు కామినీ పారిజాతుఁ
డాత్మ నినుఁగోరి గురు విరహమునఁ గుందు
చున్నవాఁడు త్వదీయ భాగ్యోదయమున ॥

ఉ. అతనిఁ గూడినప్పుడెగదా! భవదీయ మనోజ్ఞ సుందర
త్వాతిశయంబు సత్యమగునం బుజపత్ర విశాలనేత్రి! త
చ్చాతురి శ్రీతనూభవ వసంత జయంతులకైన లేదు ప్ర
ఖ్యాతకళావిదుం డతని కాతఁడె సాటిసుమీ! వధూమణీ

అని మఱియు అనేక ప్రకారంబులఁ బారిజాతుని స్తుతియించుచుండ వినిపించు కొనక తన సఖి రేవతి కెద్దియో సంజ్ఞచేసినది. అప్పుడా రేవతి తేజోవతి యభిప్రాయము గ్రహించి హంసికతో నిట్లనియె.

హంసికా! మీ పారిజాతుఁ డంతవాఁడగుట వాస్తవమే కాని తేజోవతిని గురించి విరహాతురుండగుట సమంజసముకాదు. తేజోవతియొక సుందరునిం బెండ్లియాడ నిశ్చయించుకొన్నది. కావున మీపారిజాతుని చిత్తము మరలించుకొనుమని చెప్పుము. పోపొమ్మని పలుకుటయు హంసిక చిన్నవోయి మరుమాట పలుకక యథాగతముగా పోయి యావార్త వాని కెఱింగించినది.

అతండు విరహముకన్న అవమాన పరితాప మెక్కుడుగా భావించి యేమి యుఁదోచక దుఃఖించుచుండెను. ఎట్లో తండ్రి తెలిసికొని వాని రప్పించి యేకపుత్రుఁ డగుట నూరడింపుచు నిట్లనియె.

పుత్రా! నీవు పాతాళలోక చక్రవర్తి కుమారుఁడవు నీకే లోపమును లేదు. ఎందులకై నీవిట్లు కృశించి దుఃఖించుచున్నావు? నీకు మూడు లోకములలో దుర్లభమైన వస్తువులేదు. నిన్నెవ్వరేని అవమానపరచిన వారిం బేర్కొనుము. ఇప్పుడు కోటముంగల వారి యంగములు తునుకలుగాఁ గోయించెదనని లాలింపుచు అడిగిన వాఁడు కన్నీరు దుడిచికొనుచు నిట్లనియె.

తండ్రీ! నాయవమానమును వక్కాణింతును వినుండు. కౌరవ్యుని కూఁతురు తేజోవతి మిక్కిలి చక్కనిదఁట నాయొద్ద హంసిక యొకనాఁడు దానిరూపము పొగడుచు నీకాచిన్నది సరిపడియున్నది. పెండ్లి యాడెదవాయని అడిగినది. అర్ధాంగి కారము సూచించితిని. అదివోయి తేజోవతి సఖులతోఁ గ్రీడించుచుండ నా రూపము, నా వైభవము, నా సౌందర్యము పొగడుచు నన్నుఁ బెండ్లియాడుమని యడిగినదఁట. తనకిష్టములేకున్న నామాట చెప్పిన లోక పరిపాటిగానుండును.

ఇస్సిరో పారిజాతుని సిరి మేమెఱుగనిదియా? వానిసౌందర్యాది గుణంబులు మాయొద్దఁ బొగడనక్కరలేదు. ఏలాపుత్రుని రాజ్యమెట్టిదో మేమెరుంగనివారము కాము. పారిజాతుండు గుణహీనుఁడు. విద్యాశూన్యుడు దరిద్రుఁడు కులముతక్కువ వాఁడు. మాతేనిపుత్రికను వరింపదగినవాఁడు కాఁడు. ఇట్టి యసమానసంబంధమున

కానపడవలదని చెప్పుము. అని తేజోవతి తన పరిచారికచే నోటికిరాని దుర్భాషలు పలికించినదఁట. వాని కెద్దియో హంసిక సమాధానము చెప్పఁబోవుచుండఁ బరిచారికలచేఁ గొట్టింపఁ బ్రయత్నించిన నది పారిపోయి వచ్చినదఁట హంసిక నడుగుఁడు అని వెక్కి వెక్కి యేడువఁదొడంగెను.

అప్పుడేలాపుత్రుఁడు రోషానలంబు గన్నులఁ గ్రక్కుచు హంసికను రప్పించి ఏమే రండా? పెద్దవారికిఁ జెప్పకుండ నీ వక్కడికిఁబోయి పిల్లనేమిటి కడిగితివి. కానిమ్ము. ఆనీచురాలేమన్నదో చెప్పుమనుటయు అది స్వామీ! పోవుట నాది తప్పే! అబ్బాయిగారేమియు నెరుగనే యెరుఁగరు. తోడు సరిపడును గదాయని తలంచితిని. ఇంత గర్వమని యేరికి తెలియును? పోనీ! ఆ అమ్మాయిగారన్నను బాగుండును. గవ్వజేయని దాసిపుత్రికచే నిందించినందులకు చింతగానున్నది. వారిపరువునకు మనము సరిపడమఁట అబ్బాయిగారు విద్యలేనివారఁట తండ్రీ! ఆమాటలన్నియు మీకడఁ జెప్పఁజాలను. అని లేనిపోని మాట లెన్నెని చెప్పి అతని కోపాగ్ని ప్రజ్వరిల్లఁ జేసినది.

అప్పు డయ్యురగపతి మంత్రుల రప్పించి అయ్యుదంత మెఱింగించి కౌరవ్యుని వంచించు నుపాయ మెరింగింపుడని అడిగిన వానికి వేణీస్కంధుఁ డను మంత్రి యిట్లనియె.

దేవా! చిన్నతనముచేత నాతనిఁ కూతురేమో యాక్షేపించినదని మనము పెద్ద సన్నాహము చేయఁదగదు. కౌరవ్యుఁ డుత్తమగుణ సంపన్నుఁడు. మనల నిందించువాఁడు కాఁడు. వీరి మాటలలో నెంత నిజమున్నదియో యరయవలయును. తొందరపడరాదు. అదియునుంగాక కౌరవ్యుఁడు లంకాధిపతియగు విభీషణునికిఁ బ్రాణ బంధువుఁడు వాని మనము వంచింపఁబూనితిమయేని విభీషణుఁడు సహాయము రాక మానఁడు. మూఁడులోకము లొక్కటియైనను నా రాక్షసవీరులతో బోరవశమా? కావున సామమునసే యీ మాటల నాయనకుఁ దెలియజేసి యాక్షేపింపవచ్చునని పలుకగా వారించుచు శిశుమారుండను మఱియొక మంత్రి యిట్లనియె.

బాపుఁ జాలు. నీమాటలు మెచ్చఁదగినవే. రాజపుత్రుఁడు స్వయముగాఁ జెప్పుచుండ నసత్యముండునా? కౌరవ్యునికి విభీషణ సహాయమున్నదని మనము వెరవఁ బనిలేదు. అదియే మన కుపకారమైనది. విభీషణుఁడు రాక్షసజాతికెల్ల శత్రువు. రక్కసిపురుగున కతనిపేరు జెప్పిన రోసమెక్కకమానదు. మాంసాశనులగు వారి నెల్ల శాకాశనులగమ్మని నిర్బంధశాసనము జేసియున్నాఁడు. అందఱును రామ భక్తుల గమ్మని యాజ్ఞాపించుచున్నాఁడు. దానంజేసి యీపాతాళంబున గల దానవు

రెల్ల విభీషణుని వంచింపకాలమెప్పుడైన వచ్చునాయని నిరీక్షించుచున్నారు. అప్పుడు మనము కోరినవారందరు మనకు సహాయము రాఁగలరు. మరియు లంకలోని రక్కసులలో నొక్కనికి మాయాపాటవము లేదు. అదియు విభీషణుఁడు జేసిన శాసనమే. మాయాచ్చన్నులై దనుజులు మనుజుల, వేల్పుల బాధింతురని యా రావణానుజుండు శాంబరీ గ్రంథాలయము మూయించెనఁట. కావున విభీషణుఁడు సహాయము వచ్చినను మనము సులభముగా జయింపవచ్చును. దేవర సెలవైనచో రక్కసులనెల్ల నిందు రప్పించెదనని యేమేమో బీరములు పలుకుటయు వేణీస్కందుఁ డిట్లనియె.

ఓహోహో ? నీ నీతి వైదుష్యము స్తోత్రపాత్రమై యున్నది. మాటాడనేరని అబలయొకతె యేమో యన్నదని అలిగి దండు వెడలఁ బ్రయత్నించుచుంటివా ? మరియు విభీషణ పరాక్రమ మెట్టిదో నీ వెఱుంగుదువా ? అతం డేనాఁటివాఁడు. దేవాసుర సంగరంబుల నారి తీరినవాఁడు శస్త్రాస్త్ర బలసంపన్నుండు రసాతలదను జులుగారు పదునాలుగు లోకములఁగల మహావీరుల గూడి వచ్చినను విభీషణు నెదు రింపఁజాలరు. పోరువలదు సాహసంబునఁ బిల్లనీయమని కౌరవ్యునికి వార్త నంపుఁడు. అతం డీయకున్నఁ దరువాతఁ విచారించుకొందమని ధారాళముగా బలుకుటయు నేలా పుత్రుఁడు శింశుమారుని వప్పని కావింపుమని నియమించి వేణీస్కందుఁడు చెప్పిన వడువున మాకిట్లు జాబు వ్రాయించెను.

కౌరవ్యా ! నీవు పన్నగ కులావతంసుఁడగు వాసుకి వంగడంబున జనించితివి. కావున నీ వంశము కడు పవిత్రమైనది యురగలోకములోఁ గొంత దేశమున కధికారము గలుగుటచే ధనధాన్యముల విషయమై తెలియనవసరములేదు. విద్యాశీలంబులు నీకడ లేవనరాదు. కావున మాతో సంబంధము చేయుటకు నర్హుండవై యుంటివి. నీ కూఁతురు తేజోవతి వివాహవిధి కర్హురాలై యున్నదని వింటిమి. నా కుమారుడు పారిజాతునికరము గ్రహింపఁదగినదని తెలిసినది. కావున మే మంగీకరించి యీ శుభపత్రిక వ్రాయించితిమి. తదనుకూలముగఁ బ్రత్యుత్తరము వ్రాయుదువని నమ్ముచుంటినని వ్రాసి వార్తాహరునిచే మా యొద్దకనిపెను.

ఆ జాబు చూచుకొని నా భర్త వెరగుపడుచు నా యొద్దకు వచ్చి పౌలోమీ ! యెలాపుత్రుండెట్లు వ్రాసెనో చూచితివా ? యెంత స్వాతిశయము ప్రకటించెనో గనుఁగొంటివా ? ఔరా ? ఎంతకావరము ! పిల్లనడుగక నీ గర్వోక్తు లేమిటికో యని అసహ్యించుకొని జాబు నేలఁ బారవైచి అంతకుమున్ను జరిగిన చర్య లేమియు నెఱుంగఁడు కావున నిట్లు ప్రత్యుత్తరము వ్రాయించెను.

నీ శుభలేఖను జూచి మిగుల నానందించితిమి. నీతో సంబంధము చేయుటకు నాకర్హత గలదని నీకుఁ దోఁచినందులకు సంతోషమే కాని అందలి యదార్థము పండితులవలన దెలిసికొనవలసియున్నది. వారితో నాలోచించి ముందు దగినట్లు ప్రత్యుత్తరము వ్రాసెద నంతదనుక నిదియే సమాధానము. అని వ్రాసియంపిరి. దానికి వికటముగా నేలాపుత్రుఁడు ప్రత్యుత్తరము వ్రాసి యంపెను. అంతకన్న వికటముగా వ్రాసి మరల వీరు పంపిరి. ఈ రీతి నుత్తర ప్రత్యుత్తరములతో నారు మాసములు గతించినవి.

గూఢచారు డొకనాఁడు వచ్చి యేలా పుత్రుని సభలో జరిగిన చర్యయంతయు మాకుఁ దెలియఁజేసిరి. నేనాకథ విని దేవతిం జీరి. ఓసీ ? పారిజాతుం డెప్పుడో తేజోవతినిఁ దన్ను బెండ్లియాడుమని అడిగిన నతని నెక్కుడుగా నవమానపరచితి రఁట. ఏమిటికని యడిగిన నది యిట్లనియె.

దేవీ ! వినుము మే మొకనాఁ డుద్యానవనములోఁ గ్రీడించుచుండఁగా హంసికయనునది వచ్చి పారిజాతుని సౌందర్యాదులు పొగడుచు నతనిం బెండ్లియాడుమని భర్తృదారికతోఁ జెప్పినది. ఆమాట లాబోటికిష్టములేక నాకుఁ గన్నుసన్న జేసినది. మీరాజపుత్రుఁ డట్టి వాఁడే కావచ్చును. మారాజపుత్రిక వేరొక సుందరుని వరించియున్నది. ఈమెపైఁగల అతని విరహము మరలించుకొనుమని చెప్పితిని. ఇంతకన్న మఱేమియు ననలేదు. ఈమాటయుఁ దేజోవతి యానతివడువున నుడివితినని జెప్పిన నే నివ్వెరపడి యిట్లంటి.

అమ్మాయి యెవ్వరిని వరించియున్నది. మేమెఱుగమే? నిజము చెప్పుమనుటయు నది భయపడుచుఁ గొంతసేపేమియుఁ జెప్పినదికాదు. నేనెక్కుడుగా నిర్బంధించుటచే నాపతి తల్లీ ! మనయింటఁ బెరుగుచున్న జయసింహునిఁ ద్రికరణములచేత వరించియున్నది మఱియొకనిఁ బెండ్లియాడదు. మీకడ సిగ్గుచేఁ జెప్పుటలేదు. మాతో నట్లే నిశ్చయించినది. అని యామె అభిప్రాయము యెఱింగించినది మాకును లోలోపల నట్టి అభిప్రాయమే కలిగియున్నది. కాని వెల్లడించలేదు. అమాటలు విని నేను సంతసించుచు నా భర్త కెఱిఁగించితిని.

ఆయనఁ జిఱునగవుతో సతీ ! తేజోవతి యభిలాషయుత్తమముగానున్నది. నీ కిష్టమైనట్లు కావింపవచ్చును అతఁడు రూపవంతుఁడు విద్యావంతుఁడు పరాక్రమవంతుఁడును. కాని వాని కులశీలము లెట్టివో తెలియవు. ఈసారి గట్టిగా నిర్బంధించి తల్లి నడిగి తెలిసికొనుము వాఁడెక్కడ నున్నాఁడు? ఈ నడుమ కనంబడుటలేదు. అని పలికిన నేను నాథా ! అమ్మాయికి నీడువచ్చినది మొదలు వాని వేరొక పాఠశాలఁ

జదివింప నియోగించితిమి. అవును. కొన్నినెలలనుండి వాని జాడ తెలియదు. తెలిసికొనుడు అని పలికితిని.

అప్పుడే పరిజనులం బంపి బాలకుని వెదకి తీసికొనిరండని నియోగించితిని. వారు తిరిగి తిరిగి వచ్చి యెందునుం గానక దేవీ ! నాలుగునెలలనుండి జయసింహుండు పాఠశాలకు వచ్చుటలేదని యుపాధ్యాయు లందఱు జెప్పిరి. యెక్కడికిం బోయెనో తెలియదు గ్రామ మంతయు వెదకితిమి. వానిజాడ గనంబడలేదు. ఈ పదుమజూచితిమిని చెప్పినవారు లేరని చెప్పిరి.

అప్పుడు మేము భయపడి కొన్నిదినములు మాదేశమంతయు వెదకించితిమి. కనంబడలేదు. తల్లికిం జెప్పిన శోకించునని యామెకుం దెలియకుండగనే వెదకించుచుంటిమి. ఇంతలో పిడుగులాగున నేరాపుత్రుని సందేశము హృదయభేదకరమై విన వచ్చినది.

తేజోవతిని దీసికువచ్చి పారిజాతుని పాదంబులం బడవైచి రక్షింపుమని శరణు గోరవలెను. ఇందులకుం బదిదినములు గడువిచ్చితిమి లేనిచోం బదునొకండవనాడు చతురంగబలములతో మీపురంబుపైంబడి మిమ్ముం బరిభవించి నీపుత్రికం దీసికొని పోవుదుము. ఆయత్తముగుండు. అని మాపై యుద్ధమును బ్రకటించి యుత్తరము బంపిరి.

అందులకు శత్రులకేమియు బ్రత్యుత్తరమీయక పోరుటకు నిశ్చయించి నా నా భర్త సీతంద్రికా తెరంగెఱింగించి సహాయముగోరెను. రాక్షసబలంబులు పెక్కులు వచ్చిమాపురంబుజేరినవి. రెండు బలంబులకును ఘోరసంగరము జరిగినది. మొదట మనవారే వారింటోసికొనిపోయిరి. ఎవ్వఁడో మహావీరుఁడు వారికిం దోడువచ్చెనని తెలిసినది. వాని సహాయమునం గోట ముట్టడించి శత్రువులు కోటలోం జొరంబడిరి. అప్పుడు రాక్షససేనాధిపతి వారియుద్యమము దెలిసికొని సగకాంతలనెల్ల శత్రువుల జారి బడకుండ గుప్తమార్గంబున నిక్కడికిం దీసికొనవచ్చిరి. నా భర్తను దప్పించుకొని రమ్మనిన నొప్పుకొనక నందే పోరుచుండిరి. ఇదియే జరిగినకథ యుద్ధకారణ మిదియే యని యావృత్తాంతమంతయు బద్మావతి చంపకకుం జెప్పినది.

ఆకథవిని చంపక మిక్కిలి యక్కజమందుచుం దేజోవతిని జూచి చెల్లీ ! నీవుల్లంబున వెగడకుము (నీవల్లభుండైన జయసింహుని) వెదకి తెప్పించి నీకుం బెండ్లి జేసెదను. అంతయు మాతాతగావించునని యోదార్చినది. అప్పుడు తేజోవతి కన్నీరు గార్చుచు అక్కా ! ఈముప్పునకుం గారకురాలను నేనే నేగలుగకపోయిన మావారు సుఖింతురు. మాకులము పెద్దయగు వాసుకి శిరోమణి మాతల్లి చిన్నతనమున నాకలం

కరించినది. సముద్రమునం దీదుచు నది పారవైచితిని. ఆ మణి యుండిన మాతంత్రి కవమానము గలుగకపోవును. దానిఁదాల్చినవారికి క్షుత్పిపాసలుండవు. అంతయుఁ దనకుఁ గనంబడును. తానెవ్వరికిఁ గనంబడఁడు. అట్టి దివ్యమణింగోల్పోయిన మాతంత్రికి యవమానము తటస్థించినది. నా పెండ్లి మాట పిమ్మటఁజూచికొనవచ్చును. మాతంత్రి చెరవిడిపింపయత్నింపుమని ప్రార్థించినది. దివ్యమణి వృత్తాంతమంతయు బద్మావతి వలనం దెలిసికొని చంపక దానిపోకకు విచారించుచు జయసింహుని కులశీలాదులఁ దెలిసికొంటివా యని యడిగినఁ బద్మావతి అడుగలేదు. ఆమెకూడ మాతోనేవచ్చినది. యిక్కడనే యున్నది. పిమ్మటఁ దెలిసికొనవచ్చును. ఈముప్పు దాటవలయుఁగదాయని పలికినది వారట్లు ముచ్చటించుకొనుచుండ వీరసింహుఁడల్లంత దవ్వున నివసించి వారిమాటలన్నియు వినెను. ఏవో కొన్ని మాటలు మాత్రము వినంబడలేదు.

తేజోవతియుఁ జంపకయు నొకచోటఁ గూర్చుండఁగ జూచి యిరువురసౌందర్య తారతమ్యంబుల నిరూపింపఁజాలక యిట్లుతలంచెను.

అహా ! సరస్వతీ ప్రాణనాధుని నిర్మాణకౌశల్యమునకు మేరలేదుగదా ? తేజోవతీ చంపకల నిరువుర నొకద్రవ్యంబు గరిగి యొక యచ్చున ముద్రించెనా ? సవిమర్శనముగా నెవ్వతెంజూచిన నాచిగురుఁ బోడియే యెక్కుడు చక్కనిదిగా దోచుచున్నది. ప్రాయంబుననించుక తేజోవతియే పెద్దదివలెఁ గనంబడుచున్నది. ఈ యిద్దరు ముద్దుగుమ్మలు సౌందర్యమునఁ బరమేష్ఠి సృష్టికిఁ గడపటివారని తలంచెదను. పారిజాతుండి తేజోవతి కొరకు విరహాతురుండగుట నబ్బురముగాదు. జయసింహుఁ డెవ్వఁడో తెలియదు. తేజోవతిచే వరింపబడుటచే నదృష్టవంతుడనియే చెప్పదగినది. ఒకని వరించిన తేజోవతి చక్కదనముతో నాకు నిమిత్తములేదు. చంపకయే వరింపఁ దగియున్నది. చంపక నన్ను వరించిన నాకీగమనము సార్థకమగును. పాతాళలోకమంతయుఁ గౌరవ్యునికిఁ బట్టము గట్టుదును. అదృశ్యుండనై యిట్లు క్రుమ్మరుచుండ నేమిలాభము. ఇక్కడ తేజోవతియు, రేవతియు, జంపకయుఁ జామరికయుఁ దప్ప నితరులులేరు. పద్మావతి లోనికిఁబోయినది. వీరికిఁ గనంబడెదనని తలంచి యామణి గురుతుగా నొక గోడకొయ్యకుఁ దగిలించి ఖడ్గహస్తుండై యచ్చట నిలువంబడియెను. తొలుత తేజోవతి అతనిఁజూచి అదిగో జయసింహుడని కేకవైచినది. తోడనే చంపక చూచినది. పరిచారికలు చూచిరి. అప్పుడు రేవతి యాతనియొద్దకుఁబోయి జయసింహా ! యిక్కడి కెట్లు వచ్చితివి? నాలుగునెలలనుండి కనంబడుటలేదేమి ? ఎందుబోయితివి ? యుద్ధములో నెట్లు తప్పించుకొనివచ్చితివి? ఇటురమ్ము మీతల్లియు నిక్కడనేయున్నది.

పరితపించుచున్నది. రాజ్యమంతయు నెట్లయినటో చూచితివా? యని పలుకుటయు నతండు వెరగుపడి యేమియు మాటాడక చూచుచుండెను.

చంపక వాని నెగా దిగఁ జూచి తలయూచుచుఁ జెల్లీ! నీ పురాకృతము పండినది. మంచివాని వరించితివి. రాజ్యముపోయినఁ బోవుఁగాక వీనితో నెందైనం బోయి సుఖింపవచ్చును. ఇతఁడు మాయలంగూడ నెఱుంగునా యేమి? యీ శుద్ధాంతమున కెట్లు వచ్చెను. కావలివాండ్రు రానిత్తురా? చామరికా! నీవుపోయి వాని కాతిథ్య మిమ్ము. అతిథిపూజ్యుఁడుగదా! అని ప్రేరేపించుటయుఁ జామరికయం దొక పీఠమువైచి బలవంతమునఁ దోడితెచ్చి కూర్చుండ బెట్టినది.

చంపక యేమియో యనఁబోవుచు సిగ్గునమాటరాక తేజోవతితో చెల్లీ! నీకేమి భయము? సహాధ్యాయుఁడు కాడా! పెండ్లియైన తరువాత సిగ్గుపడవచ్చునులే యెట్లు వచ్చెనో అడుగుము మేమును వినియెదముగాక యని ప్రోత్సహించిన నమ్మించుబోఁడియుఁ గొంచెము సేపు వితర్కించి తెగువమై జయసింహా! మమ్ము విడిచి యెందుఁ బోయితివి! మేమాపదలఁ జెందియుండఁ జూడవచ్చితివా? చిన్నతనమునందే పదుగురఁ గొట్టిన నీపరాక్రమ మెందుదాచితివి? అయ్యో! యింత దయాశూన్యుండవైతివేమని పలుకుచుఁ గన్నీరు ధారగా గార దుఃఖింపఁ దొడంగినది. ఆఁబోఁడిమాటల కాతండు జాలిపడి కనుల బాష్పములు గ్రమ్ముదుడిచికొనుచు రమణీ! నేను జయసింహుఁడనో వీరసింహుఁడనో యెవఁడనో యెఱుఁగను. ఎవఁడైననేమి! మీయాపదఁబోఁగింప శపథము చేయుచుంటి వినుము. పదిదినములలో శత్రువులనెల్లఁ బారఁదోలి పాతాళలోకమంతయు నేకచ్ఛత్రముగా నీతండ్రిచేత నేలింపకపోయితినేని నాపేరునంగల సింహశబ్దము తీసి మార్జాలశబ్దము ప్రయోగించి పిలువుము. అభయహస్తమిచ్చితిని. వెరవకుము అని శపథము చేయుటయు నాలించి తేజోవతి యాత్మగతంబున నిట్లు తలంచెను.

అయ్యో! వీని కంఠధ్వని మఱియొకరీతిగా నున్నదేమి? వీఁడు జయసింహుఁడా! మఱియొకఁడా? మఱియొకఁ డిట్టి ప్రతిజ్ఞ పట్టునా? ఇన్నినాళ్ళెక్కడనుం డెనో యడుగవలయును. ప్రాయోదయంబునఁ గంఠస్వరము మారునందు రని తలంచుచు నెద్దియో చెప్పఁబోవు సమయంబునఁ గొందరు కింకరులు తొందరగావచ్చి విభీషణ మహారాజుగారు వచ్చుచున్నారు. పీఠములు సవరింపుఁడని పలికిరి.

అప్పుడు సంభ్రమముతో అందఱు లేచి యుక్తప్రదేశంబుల నిలువంబడిరి. ఆ యలజడిలో వీరసింహుడు లేచి తనహారము వెదకికొని మెడలో వైచికొని విభీషణుని రాక కెదురుచూచుచుండెను.

అని యొఱ్ఱంగించువఱకు వేళయతిక్రమించుటయు అప్పుడు చాలించి యవ్వలి కథ తదనంత రావసథంబున నిట్లని చెప్పదొడంగెను.

# 119 వ మజిలీ కథ

## హ రి దా సు క థ

చామరికా? యేమనియెదవు? వానితోఁ గొంత సేపు మాట్లాడుట సంభవించినది కాదేమి? అయ్యో! మాతాతయునప్పుడే రావలయునా? తేజోవతి యాసుందరుని వరించినమాట వాస్తవమేనా! వానిజూచినది మొదలు నాహృదయము తరళమువైనదేమి? వీఁడు జయసింహుఁడేనా! స్వరభేదమున్నదని తేజోవతి చెప్పినమాట సత్యము కారాదా? నేనుగూడ వీని వరింపవచ్చునా? తేజోవతి యొప్పుకొనదు కాబోలు అవు! దానియదృష్టము అని వెఱ్ఱిదానివలె మాట్లాడుచున్న చంపకం జూచి నవ్వుచుఁ జామరిక యిట్లనియె.

సఖీ! నేనప్పుడే నీ మొగము జూచి అనుమానము జెందితిని. మాధవీలత రసాలముపైఁ బ్రాకుట వింతగాదు. రూపంబునఁ గాక పరాక్రమమునఁ గూడ అనన్యసామాన్యుఁడని అతండు పట్టిన ప్రతిజ్ఞ వలనఁ దెలియఁబడుచున్నది.

మీతాతవచ్చి పద్మావతితో ముచ్చటించిన విషయములు నీవు వినియుండలేదు. వానిం జూచినది మొదలు నీమనసు మనసులో లేదు శత్రువుకు సహాయమువచ్చిన వీరుఁ డెవ్వఁడో యెఱుంగుదువా యని పద్మావతిసిఁ దర్కించి యడిగిరి. ఆమె నాకేమియుం దెలియదని చెప్పినది. వాని వృత్తాంతము దెలిసికొని వచ్చుటకు గూఢచారులంబం పెనట శత్రుమర్మములం దెలిసికొని పోరుట విజయసూచకము గదా? వాని కులశీలాదుల దెలిసికొని పిమ్మట స్వయముగా మీతాత యుద్ధమునకుఁ బోవునట. జయసింహుని మాట ఆయనకుఁ జెప్పలేదు. శత్రువుల జయించిన పిమ్మట నీయభిలాష వెల్లడింపవచ్చును. అంత దనుక దెలియనీయకుము. మఱియు నాయుద్ధ విషయమై మీ తాత నేఁడొక సభ జేయునట. అందు జయసింహునిమాట యేమైన వచ్చునేమో తెలిసికొనివచ్చెద, నీవూరక పిచ్చిమాటలాడకుము వేళయైనది. చోటు దొరకదు. పోయివచ్చెదనని చామరిక రాజపుత్రికనోదార్చి రాజసభకు బోయి స్త్రీలు వసించు తావున నిలువంబడి యా విషయముల వినుచుండెను.

రాజసభలో, బ్రహస్తదోదితుండై మర్మజ్ఞుండను వేగులవాఁడు లేచి నమస్కరించి యిట్లనియె.

విభీషణమహారాజా! మేము దేవరవారి యానతి శత్రుదేశముల కరిగి మారుభూముల నందందు సంచరించితిమి. పాతాళంబు నా విషయము సవసవగాఁ దెలిసి

నది. అప్పుడు నేను మర్కట రూపము ధరించి తలాతలంబున కరిగితిని. బలి చక్రవర్తి కొన్ని యేండ్లనుండి యోగంబవలంబించి బాహ్యప్రచారశూన్యుండగుటంజేసి రసాతలంబు వంగడ రక్కసులు తలాతలమునకు నిరాటంకముగా రాకపోకలు జరిగించుచున్నారు. తలాతలముఖద్వారమున బలిచక్రవర్తి భటులనేకులు కాచి యుందురు. వారలు ఇప్పుడొక్కఁడైన నందులేడు. నేను నిర్భయముగా నా గుమ్మము గడచి లోనికిఁ బోయితిని. నేను తలాతల మెప్పుడును జూచియుండలేదు. చీకటిగా నుండునని వాడుకయేకాని పాతాళముకన్న నెక్కుడు తేజముతో నొప్పుచున్నది.

ఉరగ లోకమునందుగల రత్నములన్నియు దొంగిలించి రక్కసులు తలాతలంబున దాచికొనిరి. వజ్రకంఠుఁడు దానిని బాలించుచుండెను. ఇఁక చెప్పనేల రాక్షసకృత్యము లన్నియు నందేయున్నవి. దయా సత్యశౌచముల పేరెక్కడి వారికిఁ దెలియవు. పచ్చిమాంసము తిని రక్తము త్రావుచుందురు. ఆకలియైనప్పుడు తండ్రులను బిడ్డలను గూడఁ దెలియక భక్షించుచుందురఁట. అట్టి దుష్టలోకమున నెట్లో యొక యోగి వసియించి యుండెను. ఆతం డొక మంటపము మీఁదఁ గూర్చుండి జపము జేసికొనుచుండును. వాని జోలికెవ్వరును బోరు వజ్రకంఠుఁడా యోగిమాట శిరసావహించును ఆ యోగికిఁగల భూతదయ యెవ్వరికిని లేదఁట. తన ప్రాణము గవ్వగానైనఁ జూడడఁట. పెక్కుసారులు రక్కసులు వానిం భక్షింపఁ దీసికొని పోయిరఁట. తినమని తన శరీరమిచ్చెనఁట. కాగిన యినుపకమ్మివలె నుండుటచే వాని దాకియాకితవులే సమసిరఁట.

అందున్న వారందరు నా యోగిమాటజవదాటరు. క్రూరులైనను అందరి వారి నయ్యోగి పుత్రులుగాఁ జూచుచుండును. ఆతం డాహారమెప్పుడు గుడుచునో తెలియదు. ఎప్పుడును, కన్నులఁ మూసికొని జపము జేసికొనుచుండును. ఆ యోగి మహిమ సామాన్యముగాదు. కొన్ని నెలల క్రిందట చక్కని యొక మనుష్య కుమారుఁ డాతలాతలమునఁ బట్టణ వీధిలో నొరులు కట్టఁబడి పడియుండెను. వానింజూచి రక్కసులు సంభ్రమముతో మూఁగి నరమాంసము లభించెనని యుబ్బుచు వాని కట్టులు విప్పి పట్టుకొని నాదినాది అని పలువురు పెనగులాడఁ దొడంగిరి.

అప్పుడా కుమారుఁడు తెలివివచ్చి హస్తపాదములు విదిలించి వారినెల్ల ముష్టిఘాతములఁ బారఁదోలెను. మఱికొందఱు వీరులు ఖడ్గపాణులై వానిమీఁదఁబడి యేయఁ బూనిరి. కాని వారి యాయుధముల లాగికొని వానితో వారినెల్ల బరిమార్చెను. అప్పుడు బెబ్బులిం గనిన మేకలవలె రక్కసులు వీధులంబడి పారిపోఁదొడంగిరి. వజ్రకంఠుండు వానిరాకవిని పెక్కండ్ర దానవవీరుల వానిఁ గట్టి తీసుకొని రండని

పంచటయు వాండ్రు గాండ్రుమని యార్చుచు నావీరుని పైఁబడి యగ్నింబడిన మిడుతలవలె మ్రగ్గిపోయిరి.

కృపాణపాణియై కృతాంతుని చందమున సుర విరోధుల మడియింపుచు వీధుల గ్రుమ్మరుచున్న యా వీరపురుషుని నెదుర్కొన నాలోకములో నొక్కరుఁడు సమర్థుఁడు లేకపోయెను. అప్పుడు వజ్రకంఠుఁడు విచారించి యాయోగి పాదంబులంబడి మహాత్మా! ఈ మానుషయువకుం డెవ్వఁడో తెలియకున్నది శ్రీవిష్ణుండు మమ్ముఁ బరిభవింప నీరూపమున జనుదెంచెనేమో తెలియదు. సామాన్య మానవునకింత బలముగలుగునా? నిన్ను శరణుజొచ్చితిమి. రక్షించి వాని యుపద్రవము తప్పింపుమని ప్రార్థించిన నయ్యోగి యిట్లనియె.

దానవోత్తమా! ఆ వీరుఁడెవ్వఁడో నేనెఱుంగను. నామాట పాటించెనేని మీకుపకారము గావించెదను వాని నాయొద్దకనుపుఁడని చెప్పిన నారాక్షసరాజు ఆలోచించి కొందఱుగ్రవ్యాదులవాని నెదుర్కొన బంపెను. అదనుజులు వోయి పోరరమ్మని చీరి మీఁదఁబడవా రామతపఃదారిం బారిపోయిరి.

ఆవీరుండు దారిలో మఠములో జపము జేసికొనుచున్న మహాయోగిం జూచి వెరగుపడుచు నోహో! మాంసపల్లిలో హోమధేనువు వలె నిందీయోగి యెట్లు వసించెను. వీని యాకారము మహానుభావత సూచించెడి. వీరితో సంభాషించి కృతార్థుండ నయ్యెదనని తలంచి యితఁడు మంటపములోనికిఁ బోయి యాయుధముల నేలపెట్టి సాష్టాంగ మెరగి యెదుర నిలువంబడియెను.

అప్పుడు యోగి వానిం జేరరమ్మని వీపుపై జేయివైచి దీవించుచు వత్సా! నీవెవ్వనికుమారుఁడవు ఇక్కడి కెట్లువచ్చితివి ఊరక నీరక్కసుల బలిమార్చుచుంటి వేమిటికి? జీవహింస మహాపాతకముగదా? భూతదయలేదా? స్వార్థపరుని భూతములు శాసించును. శస్త్రధారణమున కిదియా ఫలము భీరువులఁ దరుముట వీర ధర్మమే? నీవాలించితివేని మంచిమాట లుపదేశించెద. హింసక్రియనుపసంహరింపుమని పలికిన విని అతఁడు చెవుల కమృతము సోకినట్లు మురియుచు నిట్లనియె.

మహాత్మా! నీయుపదేశమున నాయుధముల విడిచితి. వీండ్రు నన్ను బాధించుటచే నింత సేయవలసివచ్చెను. నేనిక్కడి కెట్లు వచ్చితినో తెలియదు నాతండ్రి పేరు నేనెఱుంగను. మాతల్లిదండ్రు లేడియు నాకు నామకరణము చేయలేదు. హరిదాసుండని పిలువఁబడుచుందును. ఇది యేదేశము? ఈ క్రూరులనడుమ నీవెట్లుంటివి? అక్కటా! వీరిచర్యలు కడువిపరీతములు కావా? వీండ్రఁజూచిన నీకక్కటిక మెట్లు కలిగినదో తెలియదు. నీవు సహజదయాశాలివగుట తెల్లమైనది నీరూపమున్న నీకోక

మంతయు నాలుగు దినములలో శూన్యము జేయుచు పోవుదునా? సింహళంబున నీ క్రూరుల కెల్ల నభయహస్త మిచ్చితిని వెఱపుడిగి సంచరింపుమని చెప్పుడు. ఇఁక దారుణకృత్యములు విడిచి వర్తింపుమనుఁడు విడువకున్న మడియఁజేయక మానను. నేను మీకడ వసించెద మంచిమాటల నుపదేశింపుఁడని ప్రార్థించెను.

ఆయోగి హరిదాసుని మిక్కిలి మెచ్చుకొనుచు వత్సా! నీవు జీవులకు సర్వోత్కృష్టమైన ప్రాణదానం బొసంగితివి. కావున నీకు నే దాసుండనైతిని. భూతదయ కలవాఁడే నాకు జుట్టము దేహములు క్షణభంగురములు నీటిబుగ్గ వోలెఁ బ్రతిక్షణ వినాశియగు నీ దేహ సుఖమునకై జీవహింస జేయనగునా? వీండ్రు క్రూరులగుట నిజమే. సృష్టి వైచిత్రము కడువిపరీతముకాదా! గోవుల సాధువులఁ జేసి వ్యాఘ్రంబుల ఘాతకంబుల జేసినట్లే భగవంతుఁడు అసురుల ఖలులం గావించెను అది భగవంతుని తప్పుగాక వారిదికాదు. వృశ్చికపుచ్ఛంబు విషపూరితము కాకున్న నది కుట్టినను బాధ యేమియున్నది. సహజ గుణంబులు మానుప నెవ్వరితరము? లోక ప్రకృతి తెలిసి వర్తింపవలయు నని యుపదేశము చేయుచుండ నాహరిదాసు కొన్ని దినములా యోగివద్ద వసించి శుశ్రూషజేయుచుండెనట.

మఱియొకనాఁడు హరుదాసు దాపునలేనప్పుడు వజ్రకంఠుఁడు యోగియొద్దకు వచ్చి పాదంబులంబడి మహాత్మా! మీదయ వలన మేము తలాతలంబున నిర్భయులమై సుఖించుచుంటిమి. నీతియందు శుక్రాచార్యుండు నీ కెనగాఁడు. ఇప్పుడు మాకుఁ బ్రాణసంకటమైన యుపద్రవ మొండు సంభవించినది. అది తప్పించుకొన మాకుశక్యముకాదు. నీవు మమ్ము రక్షించెదనని యభయహస్తమిచ్చు దనుక నీపాదము విడువనని మిక్కిలి దీనుఁడై ప్రార్థించెను.

కృపాళుండగు నాయోగి వానిమాటలు విని జాలిపడి రాక్షసోత్తమా! లెమ్ము లెమ్ము నీకువచ్చిన యుపద్రవమేదియో యెఱింగింపుము. తెలిపితివేని తీర్చెదనని పలికిన స్వామీ! మీపనివారుగారు మీరు తలంచుకొనిన నింద్రుఁడు వచ్చి దాస్యము చేయఁగలఁడు మీరు మాకు నభయదానమొసంగితినని శపథము చేసినంగాని మా కార్యమైనట్లు తలంతునని కన్నీరు గార్చుచుఁ వ్రాకుచ్చిన మెత్తనిమనసుగల వాఁడగుట నావిరాగి యందుల కంగీకరించి శపథము గావించెను.

అప్పుడు వాఁడు పాదములనుండి లేచి స్వామీ! వినుండు ఇప్పుడు నాబంధువులు శత్రువుతోఁ బోరాటము గావింపుచు నోడి పోవుచున్నారు నన్నుసహాయము రమ్మని కోరిరి. శత్రువులు బలవంతులగుట నేను తోడుపడినను వారిం జెనక జాలను. ఇప్పుడు ఉపేక్షించితినేని బగతు రిచ్చటికిఁగూడవచ్చి మారాజ్యము లాగికొందురు.

కావున నీయాపద మీరు దాటింపవలయును మీశిష్యుఁడైన హరిదాసుం బంపితిరేని వాఁడు శత్రువులఁ దీవమడంపఁగలడు వీఁడు అసహాయశూరుఁడు మీమాట జవ దాటువాడు కాడు మేమెల్ల మీయానతి వానికి వశవర్తులమై యుంటిమిగదా? యీ సహాయము చేయుఁడనని వేడిన నాయోగి యించుక యాలోచించి సరియే మీరుపొందు వానికిం జెప్పి నాయోపిన యుపకారము గావించెదనని యూరడించి వారినంపెను. సహజకృపాపారీణులు పరహృదయ కాపట్యముల లెక్క సేయరుగదా?

హరిదాసు తనచెంతకు వచ్చినతోడనే యోగి వానిం జేరబిలిచి వత్సా! నీవు నేఁడు నాకొక యుపకారము గావింపవలసివచ్చినది నీవు స్వార్థపరుండవు కావు. పరోపకార పారీణుఁడని యెంచి యీమాట జెప్పుటకు సాహసించితిని అప్పని నీమది కొప్పమియగునేమోయని వెరచుచున్న వాఁడనని సందియమందుచుండ నాహరిదాసు ఇట్లనియె.

స్వామీనిన్ను గురువనియుఁదండ్రియనియు నాథయందవనియుఁ దలంచి మీ సేవజేయుచుంటిని మీకుఁ బ్రియ్యుఁడ ఇట్లు చేయుమని నాకు విధింపక నాకుఁ బని చెప్పుటకు సందేహపడుచుంటి రేమిటికి?

గీ. అగ్గిలగమన్నఁ బడియెద నంబురాశి
మునుఁగుమన్నను మునిఁగెద మోహముడిగి
తోడువిడిచెద నెట్టిబంధువులనైన
యోగిసత్తమ! నీవాజ్ఞ యొసఁగెదేని.

మహాత్మా! తొల్లి దండ్రి నానతి బరశురాముండు తల్లి ని జంపెను. శ్రీరాముండు సంసిద్ధంబైన రాజ్యలక్ష్మిని విడిచి అడవులం జరించెను. గురునాజ్ఞనుదండకాదిమహ ర్షులు ప్రాణంబులర్పించుటకు సిద్ధపడిరి నీతివిదులైన సేవకుల యజమానులమాట నెట్టి యకార్యకరణంబులనైనగావించిరి. కావున మీరు నావిషయమై సంశయింపవలదు. సత్వరమ కావించి మీనయకు, బాత్రుండయ్యెదనని శపథముజేసెను

యోగి వానిమాటలు మెచ్చుకొనుచు వత్సా! నీకు థందన మనినఁబండుగ్రగదా! ఈశక్రసుల మిత్రులకు శత్రువులఁ వలన నుపద్రవము వచ్చినఁదట దానివారించి వీరికి జయము గలిగింప వలయునిదియే నేచెప్పుపని యనుటయు హరిదాసు ఓహో! యింతమాత్రమునకే నన్నింతగాఁ బలికితిరి నాకు వీరెవ్వరు సహాయము రానక్కర లేదు. వారిం బేర్కొనుమనుఁడు ఇప్పుడే వశవర్తులం గావించెదనని పలికెను.

యోగి వజ్రజంతుు రప్పించి అతనిచేయి హరిదాసు చేతిలోఁబెట్టి ఈతని నీవు మిత్రునిగా భావింపుము అత్తైరంగు పీడెజింగించును. వీనితోఁబోయి ధర్మవిజయము గైకొనిరమ్మని నియమించెను.

హరిదాసు వజ్రకంతునందు నిష్టములేనివాఁడైనను గుఁగునాళఁ జేసి అంగీకరించి నీశత్రులెందున్నారు చెప్పుమని యడిగిన నారక్కసుండు వీరోత్తమా! పాతాళమున నా మిత్రులకును శత్రువులకుఁ బెద్దయుద్ధము జరుగఁబోవుచున్నది. మేము మిత్రులకుఁ సహాయము పోవుచున్నారము. మీ సహాయంబునఁ దప్పక విజయము మాకుఁ గలుగఁ గలదని చెప్పెను.

పాతాళంబున మీకు మిత్రులెవ్వరు శత్రులెవ్వరని అడిగిన హరిదాసునకు వాఁడిట్లనుచుండు అయ్యా! వినుండు కాకోదర చక్రవర్తులైన తక్షకకర్కోటక కులస్థులగు నురగపతులు మాకు మిత్రులు తత్కాలకాతుండగు నేలాపుత్రుండు వాసుకి కులజుండగు కౌరవ్యునిపై, గత్తికట్టి వారినగర మిప్పుడు ముట్టడింపఁ బ్రయత్నించుచున్నాఁడు. లంకాధిపతియగు విభీషణుఁడు వారికిఁ జుట్టమగుట సహాయము రాకమానఁడు. నీసహాయము లేకున్న మేమును నురగులును వారిని జయింపఁజాలము. అందులకే మిమ్ముఁ గోరుకొంటిమి. మీరే సర్వసేనాధిపతులై యుద్ధము నడిపింపవలయునని చెప్పెను.

అప్పుడా హరిదాసు కన్నులు మూసికొని యించుక ధ్యానించి యెద్దియో విచారము హృదయంబునం దోప అల్లన కన్నులు విప్పి చూచుచుఁ గౌరవ్యునకుఁ నేలాపుత్రునకుఁ విరోధమేటికిఁ గలిగినదని యడిగిన వాఁడిట్లనియె.

అయ్యా! అంతయు జెప్పవలయునా? వినుండు. ఇప్పుడు కాకున్నఁ బిమ్మట యైనం దెలియకమానదు. కౌరవ్యునిసుత తేజోవతి మిక్కిలి చక్కనిదఁట దాని నెక్కడనో చూచి యెలాపుత్రుని కొడుకు పారిజాతుఁడు బాల్యచాపల్యంబునఁ దన్నుఁ బెండ్లియాడుమని యొక దాదిచే వర్తమానము బంపినఁ దానంతకు మున్నె యెవ్వనినో వరించి యున్నాననిచెప్పుము పారిజాతుని దాసీపుత్రికచే దుర్భాషలాడించినదఁట ఆకారణమున వారికిని వీరికిని గ్రమంబున వైరంబు పెరిగినది. ఇప్పటికిరువురు యుద్ధసన్నద్ధులైయున్నారు. విభీషణుఁడు సంధికి నేలాపుత్రునకు రాయబారము బంపియున్నాఁడు. మనవారు జడియుచున్నారు ఇప్పుడు మనము పోయి వారి కుత్సాహము గలిగింపవలయునని యా వృత్తాంతమంతయుఁ జెప్పుటయు నతఁడొక్కింతతడవు [illegible] కొంతవడికిఁ దెలిసి వచ్చుచు [illegible] నిప్పుడే [illegible] బలంబులతోఁగూడఁ బాతాళమునకు వచ్చెనఁట ఇవి మేము [illegible] వచ్చిన విశేషములు. ఆవీరుఁడే మనవారినెల్ల గాంధీకులఁ [illegible] మీరు పోయి యాయనను నాశ్రయించితిరేని [illegible] యుద్ధము [illegible] అప్పుడు మనము సులభముగా శత్రువుల జయింతుమని [illegible] వాఁడు చెప్పెను.

పిమ్మట మరియొక వేగువాఁడు వినుటకువచ్చి మహారాజా! తమయానతి నేను

గూఢచారినై పాతాళలోకమంతయుఁ దిరిగితిని. జయసింహునిగురించి వితర్కించితిని వినుఁడు జయసింహుని తేజోవతివరించి తన్నవమానపరచెను కోపముతోఁ బారిజాతుండు కొందఱు రాక్షసుల సహాయంబున నొకనాఁడు నిద్రించుచుండ జయసింహుని బట్టుకొని యొడలెల్లగట్టి యొక పాడునూతిలోఁ బడవైచి చంపించెనని తెలిసినది. హర హరా? యెంత ఘోరకృత్యము గావించెనో వింటిరా? అట్టివానిఁ బుత్రమిత్ర కళత్ర యుక్తముగా నాశనముజేయక తీరదని చెప్పి యవ్వలకుఁ బోయెను. అని యెఱింగించిరి.

# 120 వ మజిలీ

## కలభాషిణికథ

అహా! నాపురాకృత భాగధేయము ఫలించినది చంపక దామరికతోఁ జెప్పిన మాటలు వినుటచే నేను గృతార్థుండనైతిని. నన్ను జూచి జయసింహుఁడు తేజోవతి భ్రమపడినట జయసింహుండు నా పోలికగా నన్నవాఁడుకాబోలు. అతండు మదీయ సోదరుఁడు కాడుగద. అట్టిభాగ్యము నాకు బట్టునా? నన్నీ లంకాపురమునకుఁ దీసికొనివచ్చిన భగవంతుని యెత్తికోలు ఎవ్వనికిఁ దెలియును. ఎట్లయినను నేను బాతాళలోకమున కరుగవలయుంగదా? విభీషణుఁడు నేఁటి రాత్రియే దండయాత్ర వెడలుటకు నిశ్చయించుకొనియెను. వారితోఁ బోయెదంగాక. అంతదనుక మఱియొకచోట నుండ నేల? చంపక యంతఃపురమునకుఁబోయి వారి సంభాషణ మాలింపుచుఁ గర్వపర్వము గావించుకొనియెదను. అని తలంచి వీరసింహుఁడు ద్వారపాలురఁ దప్పించుకొనుచుఁ జంకక యంతఃపురమున కరిగెను

అప్పుడు శుద్ధాంతమంతయు హల్లకల్లోలముగా నుండెను. హా! జయసింహా హాపురుషసింహా! సింహకిశోరముఖాతి సుగుణలసదుపుఁ బ్రకాశించుచుందువు. నీకి మృత్యువు విధియెట్లు విధించెనురా? దుర్మతీ! పారిజాతా! వానిం జంపించినంతనే నిన్ను వరింతుననుకొంటివిరా! నాకుఁగూడ వానితోడిద గతియనియెఱుంగవు. అమ్మా! ఇఁక బ్రాణములతోఁ బనిలేదు. సఖీ! చంపకా! నాబ్రతుకు నేఁటితోఁ దీరినది దుఃఖింపుచుండ జంపక తేజోవతీ! యూరడిల్లుము. ఆమాట సత్యమో యసత్యమో విచారింపక నక్కరలేదా? నిన్న మన యంతః పురమునకు వచ్చినవాఁడు జయసింహుఁడనినాయని యోదార్చిన నామె యిట్లనియె.

సఖీ! రూపసాదృశ్య మున్నది. కాని స్వరభేదము గలుగుటం బట్టి మొదటనే సందేహించితిని. అతండు జయసింహుఁడు కాఁడు. నాలుగు నెలలనుండియుఁ గనం

బడుటలేదు. ఎక్కడికో విహరింపనేగె ననుకొంటిని. ఆపాపాత్ముడు వానింజంపిన మాట వాస్తవమే. అసత్యము గాదు. వాఁడే జీవించియుండిన మాకీ యిక్కట్టు రాక పోవును. కోటదావునకు శత్రువుల రానిచ్చునాయని పెద్దయెలుంగున నేడువఁదొడం గెను.

పద్మావతియుఁ గన్నీరునించుచుండెను. చామరికయు రేవతియు తేజోవతిం బట్టుకొని యూరడింపుచుండిరి. ఇంతలో లోపలినుండి జయసింహునితల్లి కళావతి యక్కడికివచ్చి యడలుచు హా! పుత్రరత్నమా హా! విక్రమాదిత్యకులరత్నాకర నిశాకరా! విజయభాస్కరతనూభవా! అస్తమించితివా? యని తన వృత్తాంత మంతయుఁ దలంచుకొని చింతింపఁదొడగెను.

అప్పుడు వీరసింహుడా యల్లరియంతయుఁ జూచి గుండెపగుల నౌరా! తేజోవతి సంతోషమునకు విధి యంతరాయము గలుగఁజేసెనే? జయసింహునితల్లి దుఃఖముజూడలేకుంటిగదా? మఱియు విక్రమాదిత్యకులదీపిక విజయభాస్కరతనూభవ యని వగచుచున్నది. నా మనంబునంగల అనుమానము దీరినది. ఈమె కళాభాషిణియే జయసింహుఁడు నాసహోదరుఁడగుట సత్యము. వాని మరణవార్త నిన్న వేగులవారు తీసికొనివచ్చియుందురు. చంపకాసక్తుండనై నిన్న నేను రాక్షస సభకు బోలేదు. మంచివార్తయే వినంబడినది. నన్ను విధి పైకెత్తి నేలంబడఁద్రొబ్బెనే అయ్యో! నాసోదరునిఁ జూచుభాగ్యము పట్టినది కాదుగదా? శుభపరంపరలభించున్నదని యానందించుచుంటిని. ఇప్పుడు నాతల్లి నేమని యోదార్చుదును. నేను శత్రువులఁ బరిభవించి విజయము గైకొనిన లాభమేమి? ఇందుల కానందించువారెవ్వరు? అక్కటా! మాలవిధీ! నాసంతోషమంతయు నెంతలో నంతమునొందించితివి ఇఁక నాకుఁ జంపకతోఁ బనియేమి! మాతల్లి నోదార్చి యింటికిం దీసికొనిపోవుట కర్జము. ఈ రాక్షసస్త్రీ మధ్యంబునఁ గురరియుంబోలె నూరక శోకించుచున్నది. అని తలంచుచు వీరసింహుఁడు నిలువలేక నాహార మొకచోట దాచి హా తల్లీ! వగవకుము నీపుత్రుండ నేనిదిగో వచ్చితినని పలుకుచుఁ గలభాషిణిదాపునకుఁ బోయెను

ఆతనింజూచియెల్లరు తెల్లపోయిచూచుచుండిరి. జయసింహుఁడు,జయసింహుఁడు అనికొందఱు కేకలుపెట్టిరి.తేజోవతిజూచియు నిన్నటివాడే అని యుపేక్షజేసి లోపలికిఁ బోయినది చంపకయు సఖులతో నొక గదిలోనికింబోయి గవాక్షమునుండి చూచు చుండెను. ఇతరకాంతలెల్ల దూరముగాఁ బోయిరి. కలభాషిణియుఁ బద్మావతియుఁ గాక మరి యెవ్వరును లేరు.

కలభాషిణి వీరసింహునింజూచి అదరిపడి నాయనా ? నీవు మాజయసింహు

దవే ? యెట్లువచ్చితివి బాబూ ! నీపైఁ బడినవార్త యసత్యమా ! తండ్రీ అని లేచి వానిం గ్రుచ్చియెత్తికొనియెను. అప్పుడతండు తల్లీ ! నేను జయసింహుండనుకాను వీరసింహుండ హేమప్రభానందనుండ నిన్నును మాతండ్రిని రక్షింపఁ దెత్తికొనిపో యెనని తెలిసి మీకొరకు దేశములు దిరుగుచు సింహపురమున కెట్లోవచ్చితిని. నా సోదరుని మరణవార్తయిప్పుడే వింటిని నేను నిర్భాగ్యుడ ! వానిం జూడలేకపోయితిని మాతండ్రి యెందున్నవాఁడు తల్లీ! యెఱింగింపుమని యామెం గౌఁగలించుకొని వీర సింహుఁడు దుఃఖింప దొడగెను.

ఆవార్తవిని యామె యొక్కింతతడవు పుత్రశోకము మరచి యబ్బురపాటులో నేమీ ! నీవు హేమప్రభపుత్రుఁడవా ! మానిమిత్తమై యిక్కడికి వచ్చితివా బాబూ ! నిన్నుఁ జూచుటచే దుఃఖము పోయి యానందము గలుగుచున్నది. పుత్రా ! మీ తండ్రి జీవించియే యున్నారు. ఎందుండిరో తెలియదు నా కిట్టి నిమిత్తములు గలుగు చున్నవి. వత్సా ! వీరసింహా ! రాజ్యసుఖంబులు విడిచి కష్టములకోర్చి మా నిమి త్తము దేశాటనము జేయుచుంటివా ! సామాన్యుఁడవు నీవు రాఁగలవా ! నీ శౌర్య ధైర్యాదు లనన్యసామాన్యములే తండ్రీ ! నీ సోదరుఁడు అట్టివాఁడే. మీ యిరు వురకు రూప సాదృశ్యమున్నది. వాఁడు చిన్నతనమునందే యుక్కు గలిగి పెక్కండ్రం జావమోదెను. అని తాను శ్రావస్తీపురంబు వదలినది మొదలు నాఁటి తుదదనుక జరిగిన కథ యెఱింగించి పుత్రా ! వాని విద్యా సంపత్తియు సౌందర్యాతి శయము పరాక్రమ ప్రకారముజూచి తేజోవతి వరించినది. కౌరవ్యుండు నీ పద్మా వతియు అంగీకరించిరి

పారిజాతుఁడు వీనికతంబునఁ దేజోవతి తన్ను వరించినదికాదని యాసుబాని అతండు నిద్రించుచుండ గాలుసేతులు బిగియఁగట్టి నూతిలోఁ ద్రోయించి చంపిం చెనఁట. ఇప్పుడే యా వార్త వేగుం వారు తీసికొనివచ్చిరి. తండ్రీ యని పెద్ద యెలుంగున దుఃఖించుచుండెను.

అప్పుడతండామె కన్నీరు దుడుచుచు అమ్మా! నీవు శోకింపకుము. నా సోద రుఁడును దైవబలము గలవాఁడు. మా తండ్రిగారి నిశ్చయ ప్రకారము మరణ మకాలమున గలుగదు నూతిలోఁ బడినను దప్పించుకొని బ్రతుకవచ్చును. అది యునుం గాక వేగులవాండ్రు దెచ్చువార్తలన్నియు సత్యములుగావు శత్రువులను వంచింపుటకై రాజు లసత్యవార్తలఁ బ్రకటింతురు మనకుఁ బరమోపకారియైన కౌర వ్యుండు శత్రుహస్తగతుండై యాపదజెందియున్నవాఁడని తెలియుచున్నదిగదా ! నేనిప్పుడుపోయి అతని చెరవిడిపించెదను. ఏలాపుత్రుని బుత్ర మిత్ర కళత్రాదు

లతోఁ బరిభవించెదను. నిన్ను నీ కోడలితో శపథము జేసియుంటిని నా సోదరుఁ డెంటో చిక్కు పడియున్నవాఁడు. కావున్న గౌరవ్యునికి యాపద రానిచ్చునా! విభీషణ బలంబులతోఁ బాతాళమున కఱిగెద అనుజ్ఞయిమ్ము దీవింపుము నా సోద రుని వెదకిఁ తీసికొని వచ్చెదనని పలికిన విని యా యిల్లాలు నిట్టూర్పు నిగుడింపుచు నిట్లనియె,

పుత్రా! నీవాసంగరమునకుఁ బోవలదు. మహావీరుఁ డెవ్వడో శత్రుపక్ష పాతియై పోరుచున్నవాఁడట. సురా సురులు వానింగెలువఁ జాలరని చెప్పుకొను చున్నారు. జయాపజయంబులు దైవాయత్తములు వంకొంకురమైన నీవిందికిఁ బోయి రాజ్యమేలుకొమ్ము. రాక్షస మాయలు కడు విపరీతములు మనుష్యులకుఁ దెలియవు. రామభక్తాగ్రేసరుండీ విభీషణుండు కౌరవ్యుని విడిచిపెట్టఁడు. ఎట్లో వానికి రాజ మిప్పింపక మానఁడు. మాగతి యేమగునో తరువాత విమర్శింపవచ్చును. నీవు గూడఁ జిక్కుపడనేల? జయసింహుఁడు బ్రతికియుండెనా సంతసముతో నెప్పటికైన నింటికివత్తుము లేకున్నఁ జెప్పవలసినదేమియున్నది. అని యిన్నిగతి ప్రసంగింపఁ బలికిన విని వీరసింహుఁడిట్లనియె.

తల్లీ! నీవు వీరమాతవైనను నాయందుఁగల వాత్సల్యంబున నిట్లు చెప్పుచున్నావు. ఆ వీరుఁడు కాదు దేవాసురులు వచ్చినను నేనవలీల గెలువఁజాలుదును. నీవు సందియ మందవలదు నన్ను దీవించి యంపుము నీవు దుఃఖింపకుము. మనకు మంగళము గలుగు నిమిత్తములు తోడఁజూపుచున్నవి. అని ప్రార్థించిన నారాజపత్ని బాష్పము లచే అతని శిరము దడుపుచు గ్రుచ్చియెత్తి శిరము మూర్కొని విజయమందుమని దీవించి యంపినది.

విభీషణుండు చతురంగ బలములతోఁ గూడికొని పుత్రుండు చిన్న విభీష ణుండు సర్వసేనాధిపత్యము వహింపఁ బ్రహస్తాదిమంత్రులు సేవింప భేరీభాంకార ములు రోదసికుహరమునిండ దండు వెడలి దక్షిణముగాఁ బయనము సాగింపుచుండ వీరసింహుఁడు వానితోఁ గలిసికొని నడుచుచుండెను.

ఆ బలములు దక్షిణముగాఁ బోయిపోయి యొక బిలంబునఁ బ్రవేశించినవి. అందుఁ గ్రిందికి సోపానములున్నవి. బలములన్నియు వాని వెంబడి అడుగునకు, బోవుచుండెను. పెద్దదూరము పోయిన వెనుక బిలావసానము గనంబడినవి అంతొక పాషాణము కమ్మివలె నడ్డముగా వేయఁబడియున్నది. దానిక్రింద నవకాశముగాని నడియేమియునులేదు. రాక్షసులు పక్షులవలె నెగయఁ గలరు. కావున నారాతిపలక నుండి క్రిందికి దుమికి పాతాళమున కరుగుచుండిరి.

వీరసింహుఁడు దళములవెనుక నడుచుచున్న కతంబున నందఱు గుమికిన పిమ్మట నారాతిపలక చేరెను. క్రిందికిఁ జూడ నేమియుఁ గనంబడదు. అందుఁ గూర్చుండి అయ్యో! రక్కసులందఱు దుమికి క్రిందికిఁ బోయిరి. ఆధారమేదియును లేదు నేనెట్లు దిగుదాఁన! నేను వట్టి మూఢుఁడ. విభీషణుని యెదురఁ బడి నా వృత్తాంతము జెప్పి యుద్ధమునకుఁ బోదువత్తుననిన శిరముపైఁ గూర్చుండఁ బెట్టుకొని తీసికొనక పోవునా? నా బుద్ధి సుడిగినది. ఇఁక నేనేమి జేయుదును. వీండ్రవలె దుమికితి నేని క్రిందఁబడి ప్రాణములు విడుతును అందులకు నా పరాక్రమమేమిటికిఁ బనికి వచ్చెఁడిని అని తలంచుచు నారాతిపై నిలిచి మరల దుముకుటకు సాహసించి కాళులు క్రిందికిఁ జాపుచు మఱల నురక వెరచుచు నీరీతి డోలాయితహృదయుండై యున్న సమయంబున వెనుక యెవ్వరో వచ్చుచున్న ట్లలుకుఁ డైనది.

ధైర్యముతో నెవరువారని కేకవైచెను. నేను విరూపాక్షుఁడనని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఓహో వచ్చితివా? ఇంత యాలస్యము చేసితివేం? నీ నిమిత్తమే మహారాజు నన్నిందు నిలువఁ బెట్టెను. పోదము రమ్మని పలికిన నడియుచు నా బడుగు అయ్యా కొంచెము పనియుండి యాలసించితిని. మహారాజునకే తెలిసినదా అయ్యో యేమి చేయునో కదా యని వెరచుచుండ రమ్ము రమ్ము ఏమియుఁ జేయఁడు అని పిలిచి వాని మెడ బిగ్గరగఁ బట్టుకొని వానితోఁ గూడఁ బాతాళలోకమున కురికి రాక్షసబలంబులం గలసికొనియెను.

అందు విభీషణునితోఁగూడ నరయుచుండ నతండు బలిదర్శనమునకుఁ బోయినట్లు ఎవ్వరో చెప్పుకొనుచుండఁ దెలిసికొని తానుగూడఁ బోవఁదలంచి యా ప్రదేశమంతయు దిరుగ నొకచోట బలి భవనద్వారమని వ్రాయఁబడియున్న ప్రకటనఁ జదివికొని అల్లన నాద్వారముగుండ లోనఁ బ్రవేశించెను.

ఊర్ధ్వపుండ్రముల ధరించిన వైష్ణవభటులు పెక్కండ్రా గుమ్మమునఁ గాచుచుండిరి. వారిం దప్పించుకొని లోనికిఁ బోవఁ బ్రయత్నించుచుండ నొకవైష్ణవుఁడు వాని చేయి బట్టికొని నీవెవ్వఁడవు? ఇట్లదృశ్యుఁడవై పోవుచుంటివేమి? చెప్పుమని అడిగిన భయపడుచు స్వామీ! నేను విభీషణ పరిచారకుండ. బలిచక్రవర్తిం జూడఁబోవుచున్నాఁడ నన్ననుగ్రహింపుఁడని వేడికొనిన నతండు నవ్వుచు పోపొమ్మని చేయి విడిచెను. ఒకటవవాకిలి రెండవవాకిలి అని ప్రతిద్వారమునకును సంఖ్య వేయఁబడి యున్నది అట్టివాకిళులు నాలుగుదాటి వీరసింహుఁడు విస్మయావేశహృదయుండై దిగ్భ్రమజెంది వచ్చినదారియుం బోవలసిన దారియుం దెలియక తిరుగుచుండెను. అందుఁగల విశేషముల వర్ణింప ననంతునకైనను బెద్దకాలము పట్టును అది యింద్ర

లోకమా? వైకుంఠమా యని తలంచుచు వీరసింహుఁడు తాను వచ్చిన పనియేదియో మరచిపోయెను. చూచినవింతయే చూచుచుఁ బోయినచోటునకే పోవుచు నాలుగవ వాకిలియందుఁ బరిభ్రమించుచుండ నింతలోవిభీషణుఁడు బలిచక్రవర్తి దర్శనముజేసి తిరిగి వచ్చుచుండం గాంచి ప్రహర్షము జెందిమఱి లోపలికిఁ బోవక యతనితోఁగూడ సేనానివేశము చేరెను. మొదటిద్వారమునందు మునుపు గనంబడిన వైష్ణవులెవ్వరు గనంబడలేదు.

అప్పుడు వీరసింహుఁడాత్మగతంబున బలిచక్రవర్తి ద్వారము మహావిష్ణుండు గాచుచున్నాఁడని పురాణములుచెప్పుచున్న వినాఁడేయి పటుకొనినవైష్ణవుఁడు జగదీశ్వరుఁడైన నారాయణుఁడు కాఁడుగదా అవును సందియమేలా! బహుళరూపుఁడనగు నన్నుఁ దెలిసికొనుట వశమా! ఛీ! ఛీ! నేను వట్టి మూర్ఖుండ. దర్శనమిచ్చినను దెలిసికొనలేకపోయితిని. నేనువట్టిపాపాత్ముఁడనని పశ్చాత్తాపము జెందుచుండ నింతలో దళంబులు రాజు నానతి పయనము సాగించుటయు వీరసింహుఁడు వానితోఁకూడ భోగవతీనగర ప్రాంతదేశమునకరిగెను. అనియెఱింగించెను.

## 121 వ మజిలీ.

# భుజగాసురుల యుద్ధము

లంబకర్ణిక—దీర్ఘజిహ్వికా! యిటురా! చెవులో మాట! నీకు మంచి యేకాంతము జెప్పెదను.

దీర్ఘజిహ్విక—ఇక్కడనుండఁగ జెప్పవచ్చును. ఎవ్వరివినరుందరు నాలుక అడ్డము పెట్టెదనులే. చెప్పుము.

లంబ—ఇక మనలంకకు రాజు వచ్చినఁడంచుఁదగునఁట వింటివా?

దీర్ఘ—ఎట్లు విభీషణమహారాజో.

లంబ—వానిపని యేమైనదఁట. యిప్పుడే నాకొడుకు దీర్ఘజంఘుఁడు పాతాళము నుండి యొకజాబు తీసికొనివచ్చెను భుజించి చంపక యున్నాను టోపును.

దీర్ఘ—ఆ జాబులో నేమున్నయున్నది?

లంబ—(మెల్లగా) విభీషణుం డాయుద్ధములో మూర్ఛపోయినాఁడని చెప్పినాఁడు కాని అది చావనియే తలంపవలయును. అంతఃపురకాంతలనెల్ల బారిపోయి మానములఁ గాపాడుకొనవలయునని జాబులోనున్నదఁట చావుకానిచో నట్లు వ్రాయుదురా?

దీర — మఱి చిన్నవిభీషణుఁ డేమయ్యెను? తక్కిన రాక్షస వీరులందరు మడిసిరాయేమి?

లంబ — ఆవివరమంతయు నాకుఁ జెప్పలేదు కాని మహాబలశాలియగు పెద్దవిభీషణుఁడే మడిసినప్పుడు తక్కినవారి లెక్కయేమి? పోనీ మంచిపని జరిగి నడిలే.

దీర్ఘ — అవును మనల కడుపులు మాడ్చుచున్నందులకు మన యుసురు తగులక మానునా? తప్పక వాఁడు చావవలసినదే.

లంబ — ఇఁక మనము నిరాటంకముగా మనుష్యమాంసము తినవచ్చును. మద్యము త్రాగవచ్చును. యథేష్టముగాఁ దిరుగవచ్చును. ఇంకను వెల్లడింపకుము.

దీర్ఘ — ఆహాహా! మద్యమాంసములు పేరు చెప్పినంత నానాలుక నూరు గజములు పెరిగినది చూడుము. వజ్రకంఠా! రాక్షసజాతికెల్ల నుపకారము చేసితివిరా! (అని గంతులు వైచుచున్నది)

లంబ — అయ్యో! కేకలు వేయకుము భుజించుచు నెవ్వరికి జెప్పవలదని సంక్షేపముగా నాకొడుకు నాకీమాట జెప్పెను. వాఁడు వినినఁ గోపించును ఇంతలో నాగ కఁజెప్పితిని. కొడుకు లేచువేళయైనది. పోయివచ్చెదను.

అనిచెప్పి లంబకర్ణిక యింటిలోనికిఁ బోయినది. అంతలో దీర్ఘజంఘుఁడు భుజించి యాపత్రికం దీసికొని అమ్మా! నేను చంపక యంతఃపురమున కరిగివచ్చెదను నేనన్నమాట యెవ్వరికిం జెప్పకుమీ! యని పలుకుచు నతివేగముగా శుద్ధాంతమున కరిగెను.

అప్పుడు చంపక కలభాషిణితో నిట్లు సంభాషించుచున్నది. దేవీ నీవాపురుష సింహునితోఁ బెద్దతడవుమాట్లాడితివి. మేము మాటుననుండి యాకర్ణించితిమి. కొన్ని వినంబడలేదు. అతండెవ్వఁడు? ఇక్కడికెట్లు వచ్చెను. వానితోఁ గులశీలాదుల గుప్తము గావించితినని చెప్పుచుంటివి ఇప్పుడు మాకుఁ జెప్పక తీరదని అడిగినఁ గలభాషిణి యిట్లనియె.

యువతీ! యెఱింగించెద వినుము. ఈతండు జయసింహుఁడుకాడు. వీరసింహుఁడు. విక్రమార్క ప్రసిద్ధి మీరు వినియేయుందురు. అతనిమనమఁడు విజయభాస్కరుని కిద్దరము భార్యలము పెద్దది హేమప్రభ రెండవదానిని నేను. నాపేరు కలభాషిణియండ్రు. వీఁడు హేమప్రభ కొడుకు. హేమప్రభ వృత్తాంతము మీకునుఁ దెలిసియేయుండును. ఆమె రాక్షస వంశజాతయే అని యాత్మీయ వృత్తాంతమంతయుఁ జెప్పినది. ఆకథ విని చంపక యుబ్బుచు హృదయంబునం బొంగమిన సంతసము దెలియనీయక చామరికతో సాభిప్రాయముగా నేడిసో చెప్పినది. అప్పుడు తేజోవతి వారియొద్దకు వచ్చి యుద్ధవార్తలేమైనం దెలిసినవియా చారులెవ్వరు రాలేదుగదా అని పలుకుచుండ

దీర్ఘజంఘుఁడు ముందరకువచ్చి భర్తృదారికి నమస్కారము నేను సందేశహరుండ దేవరదాసుఁడ, పాతాళమునుండి యిప్పుడే వచ్చితిని. ప్రహస్త పుత్త్రుండు మీకీ పత్రిక నిమ్మని పంపెను. గైకొనుఁడు అని పలుకుచు నాకమ్మ చేతికందిచ్చెను.

చంపక దానిం బుచ్చుకొని తొందరగాఁ విప్పి యిట్లు చదివెను. యుద్ధక్రమమంతయు దీర్ఘజంఘుఁ డెఱింగింపఁ గలఁడు. ప్రస్తుతము మన కపజయము గలిగినది. వజ్రకంఠుఁడు పారిజాతుని ప్రోత్సాహమున లంకాపురి కరుదెంచి తేజోవతిని చెరఁబట్ట యత్నించుచున్నట్లు తెలిసినది. అంతఃపురకాంతలెల్ల నేకాంత నిశాంతముల కరుగుటకు నాయత్తచిత్తులై యుండవలయును. మా రెండవవార్త వచ్చుదనుక నిల్లు కదలవద్దు. ఇట్లు పాదసేవకుఁడు మంత్రిపుత్త్రుఁడు. ఆకాబు చదివికొని యిచ్చగింపక కంపకలితదేహయై దీర్ఘజంఘా! మాతాతయుదండ్రియు దగ్గరచుట్టములుండఁ బ్రహస్త పుత్త్రుఁడీ పత్రిక పంపుటకు గారణమేమి? యుద్ధవిశేషము లేమియో చెప్పుము. నా మనసు తొట్రుపడుచున్నదని అడిగిన వాఁడిట్లని చెప్పఁదొడంగెను.

దేవీ! వినుము విభీషణమహారాజు చతురంగ బలంబులతోఁ దండువెడలి పాతాళలోకంబునకుంజని దారిలో బలిచక్రవర్తి దర్శించి క్రమంబున భోగవతీ నగర ప్రాంతమున విడిచి వ్యూహములుబన్ని రణభేరీ మ్రోగింపఁజేసిరి. ఆధ్వని విని శత్రువులు మరల రణభేరీ మ్రోగించిరి. క్రమంబున రెండు సేనలు కలియఁబడి సంకుల యుద్ధము గావించినవి. మీతండ్రి సర్వసేనాధిపత్యము వహించి సేనలు నడుపుచుండ విభీషణమహారాజు గదాపాణియై యుద్ధము జేయుచుండఁ బాములును దనుజులును నిలువఁగలరా? విభీషణుండు ముహూర్త మాత్రములోఁ బగతురనెల్ల హాహాకార రవంబులతోఁ బలాయితులం గావించెను.

మన బలంబులు గౌరవ్యుని కోట నాక్రమించుకొనఁబోవు సమయంబున నొక వీరపురుషుండు తురంగారూఢుండై అరుదెంచి ఆబలంబులఁ బురికొలుపుచుఁ బ్రచండ ఖండనము గావించెను. ఇకజెప్పనేల నావీరుని సంగరప్రకారమిట్టిదని వర్ణింపఁ బరమేశ్వరునికి వశముకాదు. అందరు కన్నిడూపులై యెక్కడఁ జూచినఁ దానియై దానవ వీరులనెల్ల నవలీల లేళ్ళగమి శార్దూలంబువోలెఁ బాఱదోలెను. రాక్షస వీరులు ప్రయోగించు శస్త్రాస్త్రసాధనంబు లతని నించుకయుఁ బాధింప కృతఘ్నునికింజేయు నుపకృతి వలె వ్యర్థంబులైపోయినవి.

మొదటఁ బ్రహస్తునికి నతనికి ద్వంద్వయుద్ధము జరిగినది. ముహూర్తకాలమైన

అతని యెదుట మన మంత్రి నిలువలేక నేలంబడియెను తరువాతఁ జిన్నవిభీషణుఁడు కలియంబడిన వారికి ముష్టాముష్టి యుద్ధము జరిగినది. రెండు గడియలు సమముగాఁ బోరెను వజ్రజంకఁతాది దనుజులు సింహనాదములు సేయ నంతలో నాసేనాధిపతి నేలఁబడఁ బోసెను. మనుమని పాటుజూచి విభీషణమహారాజు మిగులఁ గోపించుచు నిలునిలుడాని యదల్చుచు గదఁజేబూని సింహనాదము గావించుటయు మాతంగంబు మీఁది కుఱుకుసింగంబు చాడ్పుననార్చుచు దురగంబు దిగ్గనురికి గదబూని యమ్మహారాజుతోఁ గలియఁబడిగదా యుద్ధము చేయఁదొడంచెను.

భీమదుర్యోధనులకుంబోలె వారిద్దరికిఁ జెప్పఁదరమవు గదాయుద్ధము జరిగినది. వారి సంగరనైపుణ్యము జూచి దేవత లచ్చెరువుజెంద దొడంగిరి.

తప్పించుకొనుటయు దాటుటయు మరుకుటయు నొగ్గుటయుఁ దగ్గుటయుఁ దిఱుగుటయులోనగు లాఘవంబుల నొకరునొకరు మించిపోరాడిరి. దేవదానవులయుద్ధము లనేకములు చూచి యారితేరిన విభీషణమహారాజుగారితో నల్పప్రాయముగల నావీరుండు సమముగాఁ బోరుటఁ జూపరకు వింతదోపక మానదు.

అట్లు పోరుచుండ గొంతవడికి మన రాజుగారి దెబ్బలు తప్పిబ్బులు కాఁజొచ్చినవి. అయ్యంతరమరసి యవ్వీరుండు దారుణ గదా ఘాతంబునఁబీడితుంజేసి మీ తాతగారిని మూర్ఛనొందించెను. అప్పుడు మన సేనలో హాహాకారములును, శత్రుసేనలలో జయజయ ధ్వానములును నింగిముట్టినవి.

అవ్వీరుండంతటితో యుద్ధవిముఖుండై యవ్వలికిఁబోవుటచే మన సేనలందు నిలువంబడియున్నవి. కాకున్న నీపాటికి లంకాపురిఁజేరవలసినవే. మనరాజు మూర్ఛదేరునంతలో లంకాపురి బ్రవేశించి దేజోవతి మొదలగు నాగకాంతలంజెరబట్ట వజ్రకంఠాది దానవుల సహాయమునఁ బారిజాతుండుఁ బ్రయత్నము జేయుచున్నట్లు గూఢచారులవలనం దెలిసికొని సహస్ర పుత్రుండీ పత్రికనిచ్చి నన్ను మీ యొద్ద కనిపెను. ఇవియే యుద్ధవిశేషములని చెప్పుటయుఁ జంపకశోకాక్రాంత స్వాంతయై పరితపించుచు దేజోవతి కత్తెరంగెఱిగింపుచున్న సమయంబున మఱియొక సందేశహరు డరుదెంచి యొక పత్రిక నారాజపుత్రిక కిచ్చెను. ఆమె తత్తరముతో నాయుత్తరమువిప్పి యిట్లు చదివినది చేపీ! మీరు శుద్ధాంతముల విడిచిపోవనక్కరలేదు. శత్రువుల రాయిడి యుడిగినది. మనకు విజయసూచనలు గనంబడుచున్నవి. అంతయు నీశార్దూలుం దెఱిగించును. అనియున్న జాబుచదివి యబ్బుచు నోరీ శార్దూలా! మనవారుమూర్ఛనుండి లేచిరా? శత్రువులేమిటికి బారఁదొడంగిరి. యుద్ధక్రమం బెఱిఁగింపుమని అడిగిన వాఁడిట్లనియె.

అమ్మా! మనవారింకను మూర్ఛనుండి లేవలేదు. ఇది మన వారి ప్రజ్ఞకాదు. వీరుండు మనవ్యూహమునకు నా వీరపురుషుం డెట్లు వచ్చెనో తెలియదు. మనవీరు లందరు పిరికితనము వహించు దనుక నూరకొని అంతలోఁ దురగారూఢుఁడై శంఖము పూరించెను.

ఆధ్వని విని పరబలంబులు చెవులు బీటలువార శార్దూల ఘోషంబు వినిన మేషంబులవలెఁ జిందవందర జొచ్చినవి. అప్పుడు మన వీరుండు సేనల కుత్సాహము గలుగఁజేసి రౌద్రావేశముతోఁ బ్రతిబలంబుల గలిసి కరవాలంబు నేసియు శూలంబులం బొడిచియు శరంబులు సేసియు శీఘ్రకాలములో మంధరము సముద్రమువోలె సంక్షోభమునొందజేసెను.

వానిముందర నొకవీరుండైన నిలచినవాడు లేదు. రణాంగణమంతయు బట్ట బయలైపోయినది. మనవీరుండు శంఖము బూరించుచు వారిం దరిమికొనిపోయెను. అప్పుడు మన బలంబులు సింహనాదంబులు జయజయధ్వానములు నాకసము ముట్టినవి. పడిపోయిన మనవీరులింకను మూర్ఛ దేలలేదు. ఆవ్వలి వీరుండింకను ననిమొనకు రాలేదు. ఇంత పట్టుచూచి వచ్చితినని చెప్పెను. ఆ వృత్తాంతము విని చంపక యెడద బొదమిన ముదము ప్రకటింపక చారులారా! మీరు పొండు మఱల వేగవచ్చి తరువాత యుద్ధవృత్తాంతము వెల్లఁగింపుఁడు ప్రతివీరుని పరాక్రమము చూచువరకు మనవిజయము నమ్మరాదని పలికి వారినంపి యక్కలికి కలభాషిణం జూచి యిట్లనియె.

దేవీ! నీపుత్రుం డధికపరాక్రమశాలియని తెల్లమగుచున్నది. ఇప్పుడు రాక్షస వీరులకెల్ల రక్షకుండై పోరుచున్నాఁడట. మనకు దప్పక విజయము గలుగఁగలదు. అనివాని గుణంబులు కొనియాడుచుండఁ దేజోవతి యరుదెంచి అక్కా! జయసింహుని వార్త యేమయినం దెలిసినదా? అతండు బ్రతికియుండెనేమో తెలిసికొంటివా! యని యడిగినఁ జంపక అయ్యో! యీవిజయోత్సాహములో వానిమాట యడుగుట మరచితిని. రేపు మఱల దూతలువత్తురు. తప్పక తెలిసి కొనియెదంగాక. పోరుతొందరలో వాని మాట విమర్శించుటయుఁ దటస్థించదు అని వారందఱు నాయుద్ధవార్తలగురించి ముచ్చటింపుచు నారేయిఁ గడిపిరి.

మఱునాఁడు శార్దూలుం డరుదెంచుటయు నంతఃపురకాంతలెల్లవాని మూఁగి కొని యుద్ధవార్తలు చెప్పుము చెప్పుము. మనవీరుఁడు విజయమందెనా? ప్రతివీరుఁ డేమిఁజేసెను? విభీషణాది మహావీరులు మూర్ఛదేలిరా అని అడిగిన వాఁడిట్లు చెప్పందొడంగెను.

దేవీ మీరు విచారింపవలదు మనకు విజయము గలిగినది. మీకొఱకే వచ్చితిని. విభీషణాది వీరులందరు మూర్ఛనుండి లేచిరి. కోట మనకు స్వాధీనమైనది అని

సంక్షేపముగాఁ జెప్పుటయుఁ జంపక సంతసించుచు వానికిఁ బారితోషిక మొసంగి యిట్లనియె వీరసింహునకు ప్రతివీరునకుఁ బోరు జరిగినదా! కోట మన కెట్లు స్వాధీన మైనది? ఆవృత్తాంత మెఱింగింపుమని అడిగిన వాఁడిట్లనియె.

ఆమహావీరుని ప్రతాపము నాల్గోటులువర్ణింపఁజాలరు వినుండు మనవీరుండు విజృంభించి శత్రుసేనల సమానపరాక్రమంబునఁ బీనుఁగు పెంటలుగావించినఁ బ్రతివీరుండు యుద్ధమునకుఁ జూచుకొనిన యేదియో విచారంబునఁ గుందుచుండెనఁట. మనవీరునకుఁ జిక్కి రణవిముఖుండయ్యెనని కొందరు దలంచిరి. అప్పుడు వజ్రకంఠుఁడు విభీషణ జయంబునకుఁ బరితపించుచు నావీరుంబోర యనేకవిధంబులఁ బ్రతిమాలు కొనియెను.

అతండు దుఃఖాక్రాంతస్వాంతుడై వాని పరిదేవనంబు వినిపించుకొనఁడయ్యెను. వజ్రకంఠుండు అతనుమ వేగము తలాతలంబున కరిగి అందున్న యోగి పాదంబులంబడి మహాత్మా! మీయక్కటికంబున మనవీరునివలన విజయము గైకొంటిమి. మీశిష్యుండు విభీషణాది దానవులఁ బీచమడఁచెను. అంతలో శత్రుసేనలోనుండి యొకవీరుండు తురగారూఢుండై యరుదెంచి మాబలంబులనెల్లఁ బరాసంచలు గావించెను. వాని నెదుర్కొను మని మే మెంత ప్రతిమాలినను మన హరిదాసు ఆయుధము బూనఁడయ్యెను మాకు వేరొంకగతి లేదు. మీరువచ్చి వానికి రణోత్సాహము గలిగింపకున్నఁ బ్రతివీరునిచే మే మందరము మడియఁగలము. వేగవచ్చి రక్షింపుమని వేడుకొనియెను. అతిదయాళుండైన యా యోగి వానిదుఃఖమునకు వగచుచు వానితోఁ గూడఁ బాతాళమున కరుదెంచి హరిదాసుం గాంచి కోపించుచు వత్సా! శత్రువులు విజృంభించుచుండఁ బ్రతివీరుల నాపఁ నోపియు నుపేక్షించుచుంటివఁట. ఏమిటికి? అట్లుచేసిన శరణాగతరక్షణమునకు లోపముగాదా?

సత్వరముగ లేచి యాయుధము బూని స్వపక్ష రక్షకుండవై ప్రతిపక్షుల శిక్షింపుము. అని యుపదేశించిన విని యావీరుండు అతనికి నమస్కరించుచు యోగీంద్రా! వేరొక కారణంబునఁజేసి సమరవిముఖుండనైతిని. పగరకు వెరచిగాదు. కానిండు ఇప్పుడు త్రుటిలో శత్రువుం బరాభవించెదఁ జూడుఁడు. అని పలుకుచు అపుడు తత్తడ నధిష్ఠించి యాయుధంబులం బూని దానవపన్నగంబులఁ బురిగొల్పుకొని రణరంగంబున కరిగెను. వెండియు రెండుబలంబులకుఁ బోరు ఘోరంబుగా జరిగినది.

అందు మనవీరుండు ప్రతివీరుని దలపడి సింహనాదము జేయుచు విచిత్రగతులఁ దురగమును నడిపించుచు అద్భుత సంగ్రామము గావించెను. ఆవీరకుమారు

లిరువురు నొకరినొకరు మించలాగున లంఘించుచు నేయుచుఁ బొడుచుచు ద్వంద యుద్ధములం గావించిరి. అపుడు రెండు బలంబులంగల యోధులాయుధములం బారవైచి వారి యాయోధన వైచిత్ర్యంబుఁ జూడఁబొడంగిరి. మూఁడ హోరాత్రంబు లేకరీతి నావీరులు పోరాడిరి. జయాపజయంబు లెవ్వనికిం గలుగలేదు. అపుడు మనవీరుఁడు విసిగి—

చ. కులపతివిక్రమార్క నృపకుంజరుఁడుత్తమ దానధర్మ ని
ర్మలమతియేని భాస్కరుఁడు మజ్జనకుండు పరోపకార ని
శ్చల దృఢచిత్తుఁడేని సురసంస్తవనీయ మహాపతివ్రతా
తిలకమయేని మజ్జనని ద్రెంచురిపుణ్ నిశితంబ మోఘమై.

ప్రతివీరుండు.

గీ. యోగివర్యుండు సతతపరోపకార
తత్పరుఁడయేని నాతలిదండ్రుల సమ
ధర్మరతులేని నేనని ధర్మబుద్ధి
జేయుదుఁనయేని వీని శాసించు శరము.

అని పలుకుచు వారిరువు నొకరిపై నొక రాయుధంబులఁ బ్రయోగించు కొనిరి. ఒకని సాధన మొకనికిఁ దగిలినంత నిద్దరును వివశులై నేలంబడి మూర్ఛిల్లిరి. అప్పు డుభయసేనలలో హాహా కారంబులు నింగిముట్టినవి. పిమ్మట మనవీరుని మనవారును బ్రతివీరుని శాత్రవులును నిరపాయస్థలమునకుఁ దీసికొనిపోయి కాపాడు చుండిరి. అప్పుడు మహారాజుగారు హృదయశూలమై ప్రతివీరుని యుద్ధతి యడంగి నంత సంతోషముతో శంఖము బూరించుచు సేనల కుత్సాహము గలుగజేసి అవలీల సవిక్ర విక్రమంబునఁ బరబలంబులం బారదోలి శత్రుహస్తగతంబైన క్షారవ్యూని కోట వశము చేసికొనిరి. మన వారందరు అందుబ్రవేశించిరి. పిమ్మట మాయొడయండు మీకి విజయంబెరిగించి మిమ్ముంనందర నక్కడకుఁ దీసికొనిరమ్మని నన్నంపెను.

అని శార్దూలుండు ఎరింగించుటయు విని చంపక హృదయంబునఁ గంపము జనింప నో శార్దూలా! మన వీరుండు మూర్ఛనుండి లేచునా? వానిమాట యేమను కొనుచున్నారు? ఎందు బరుండబెట్టిరి, కయ్యంబున అతఁడు గావించిన యుపకారంబు దలంచుచుండిరా? అయ్యో! పాపమతండు అని యున్మత్తవలె వానిగుఱించి అడిగిన మాటయే అడుగుచుండెను. ఆనడుమ తేజోవతి జయసింహుని వార్త యేమైనం దెలి సినదా అని యడిగినది. అప్పుడు శార్దూలుండు అమ్మా! నేను వచ్చునప్పటికి నావీరుండు మూర్ఛనుండిలేవలేదు. వాఁడుజేసిన యుపకారముగురించి పెద్దగాస్తుతి యింపుచుండిరి బ్రతుకునని నాసతో దగిన యుపచారములం జేయుచుండిరి.

జయసింహుని యుదంతము నేనెరుంగను. గూఢచారులవలన శత్రువులు గావించు కపటములన్నియు మనవారు తెలిసికొనుచుండిరి. మీరక్కడికి వచ్చిన అంతయుఁ దెలియఁగలదు రండు రండు అని తొందరపెట్టుచు అందలంబుల నెక్కించి వారి నందరఁ బాతాళలోకమునకుఁ దీసికొనిపోయెను.

అని యెఱింగించి మణిసిద్ధుండు వేళ యతిక్రమించుటయు అవ్వలికథ పైమజిలీ యందిట్లని చెప్పఁదొడంగెను.

# 122 వ మజిలీ

## మ హా యో గి క థ

మహారాజా, తమ శాసనమననుసరించి వజ్రదంష్ట్రాది దానవవీరుల బద్ధులం జేసి లంకాపురంబునంగల చెరసాల కనిపితిని. ఏలావృతునిఁ బుత్రమిత్ర హిత మంత్రిసహితంబుగా నిందు బందీగృహంబునఁ బెట్టించితిని. రాక్షసులు విమత భుజంగాంగనల జోలికిఁబోకుండఁ గాపాడితిని. తలాతలముగూడ మనకు వశమైనది. కౌరవ్యునికిఁ బాతాళలోకరాజ్యంబునకుఁ బట్టముగట్టవలసియున్నది. మనకు మహోప కారము గావించిన వీరుండింకను మూర్ఛనుండి లేవలేదు అతని కులశీల నామాదులు వివరముగాఁ దెలియలేదు. దేవర విమర్శింప వలయునని ప్రహస్తుండు విభీషణునకు నివేదించెను.

ఆ వెంటనే గూఢచారుండొకఁ డరుదెంచి నమస్కరించుచు దేవా, నేను సార ణుండ మీయాజ్ఞపడువున నవ్వీరయోగీంద్రుల చర్యల దెలిసికొని వచ్చితిని వినుండు. అయ్యోగివరుండు శత్రునగర బాహ్యోద్యానంబున వసించి హరిదాసు పాటునకును వజ్రకంఠాది దానవుల పరాభవమునకు మిక్కిలి వగచుచు శరణాగతులైన పన్నగు లును దనుజులుం బరివేష్టింప హరిదాసున్న తావునకుఁబోయి యనల్పతేజంబున నిద్రించు సింగంబుభాతి మొరయునున్న యావీరకుమారుంజూచి విరక్తుండయ్యుఁ బామరుండువోలె దుఃఖించుచు అక్కటా! ఈ మహావీరుఁడెవ్వడో నేనెరుంగను. తలాతలమునకు వచ్చినది మొదలు పరిచయము గలిగినది. నాయందు వీనికి నిర్హేతు కముగా గురుభావము గలిగినది. ఈసంగరము తనకిష్టము లేకున్నను నామాట మన్నించి కావించెను. ఇట్టి పరోపకారపారీణుని నాయాయువిచ్చియైనఁ బ్రతికింపవల యును. లేకున్న నీ హత్య నాకుఁ దగులును అని తలంచుచు

ఉ. ఏను బదారువత్సరములేక గతింబొనరించు సత్తప
  శ్రీనయసిద్ధింజెంది విలసిల్లెడి దేనిఁ బరోపకార సం

ధాస పరుండనేని౯ బరదార పరద్రవిణాభిలాషలం
బూనినవాఁడనేని౯ నృపపుత్రి౯ డితండు నిరామయుండగున్.

అని పలికినంత నక్కుమార శేఖరుండు నిద్రించి మేల్కొనినట్లు లేచి కన్నులు నలిమికొనుచు నయ్యోగికి నమస్కరించెను.

ఆమాటవిని విభీషణుండు గుండెలు తరబళ దద్దరిల్లుచు నయ్యో ప్రహస్తా! ఆ వీరుండు మూర్ఛనుండి లేచెనట ఇఁక మనము గావించుకొనవలయు నేమని విజయము నకు విపరీతము గలుగక మానదు. వాని ముందర మనము నిలువఁజాలము అయ్యోగి సత్తముని తపో మహత్వమున వానికట్టి సత్వము గలిగినది. దయాసత్య విహీనులైన దుర్మతుల కయ్యతి యుపకృతి జేయుచున్నాఁడేమి? మనముపోయి యాతని నాశ్రి యింతమా! మనవీరుండు లేచు నుపాయమేదేనింగలదా! ఇప్పుడేమి జేయఁదగినదియో యాలోచింపుమని పలికిన విని ప్రహస్తుండు దేవా! వాఁడు దేవదానవ వాజేయుండగుట నిక్కవము. వానికి మనవీరుఁడే తగినవాడు. యోగి వానిం బ్రతికించెను. దేవర వీనిం బ్రతికింపవలయును. అయినను దరువాత వృత్తాంతమువిని కర్తవ్యమాలో చింతము సారజా! అందు తరువాత నేమి జరిగినదియో చెప్పు మనుటయు దాది ట్లనియె.

దేవా! దేవరమాట కడ్డుజెప్పిన౯ గోపింతునని యూరకుంటిని అందులకై మనమేమియు౯ వొందరపడవలసిన పనిలేదు వినుండు

అట్లు లేచిన యాహరిదాసుం గ్రుచ్చియెత్తి అయ్యోగి సత్తముఁడు కుమారా మన ప్రయత్నమంతయు రిత్తవోయినది. మనను శరణుజొచ్చినవారలుశ్రుతుహస్త గతులైరి. సీతోఁబోరినవీర౯ డెవ్వఁడు వత్సా! చెప్పుమని అడిగిన నతండు దీనస్వర ముతో౯ నిట్లనియె.

తండ్రీ! నేను మహాపాపాత్ముండ నావంటికృతఘ్నుఁ డెందును లేడు. పెంచిన బరిభవించితిని నాకు నిష్కృతిగలదా? అయ్యయో! నా నిమిత్తమై ఈ రాజర్షిక యెట్టియిక్కట్టు జెందుచున్నదో చూడుఁడు నావృత్తాంత మెవ్వరికిం జెప్పవలదని మా తల్లి శాసించుటచే మీకెఱింగించితి కాను. ఇఁక దాచినం బ్రయోజనంబులేదు. నేను విక్రమార్కుని మనుమఁడగు విజయభాస్కరునికి౯ గుమారుండ మాతల్లి పేరు కలభాషిణి నేను గర్భస్థుండనై యున్నపుడు రాక్షసుండొకఁడు భూసురవేషంబున౯ జనుదెంచి మా తల్లిదండ్రుల నెత్తికొని పోయెను. మాతండ్రి నేమిజేసెనో దెలియదు! నేను బుట్టిన నెలలోపుగనే యెట్లో కొరవ్యుని యింటికి౯ జేరితిని. ఆ దంపతులు నన్ను త్యంతవాత్సల్యంబునం బెంచి విద్యలం గరపి పెద్దవానింజేసిరి. తేజోవతి నన్ను౯

పెండ్లి యాడుటకు నిశ్చయించుకొన్నది. అందులకే యీ తగవు వచ్చినది. పారిజాతుని ప్రోత్సాహమున నే నిద్రించుచుండ ననుఁగట్టి తలాతలంబునఁ బడవైచిరి.

అది అంతయు నెఱింగియే మీతోఁ నాడినమాట దాటుట తప్పని యీ యుద్ధము జేసితిని. ప్రతివీరుండు చదివిన పద్యమువిని నాకు సోదరుండట్లు తోచుచున్నది. భాతృవధయు, మిత్రవధయు నన్ను బాధింపకమానవు. విశ్వాసఘాతుపాతకమన్నింటికంటె పెద్దది మహా పుణ్యాత్ముఁడైన విభీషణుని మూర్ఛ నొందించిన నా దురితమునకుఁ బరిమితిగలదా? మహాత్మా! నేనన్ని గతులఁ బతితుండనైతిని. బంధువులకు వెలియైతిని తేజోవతి నేమొగముతోఁ జూడగందును. ఇఁక నాకు సంగరముతో బనిలేదు. మీ పదములమ్రోలఁ బ్రాయోపవిష్టుండనై ప్రాణములు వదలెద నన్నాజ్ఞ యిండు" అని అడుగులంబడి వేడుకొనుచున్నాఁడు. ఇంతవట్టు చూచివచ్చితిని. వాఁడే జయసింహుఁడు ఇఁక పోరుసల్పఁడు వెరవకుఁడు అని యెఱింగించె.

ఆకథవిని విభీషణుండు ఏమీ! వాఁడు జయసింహుఁడా ఔరా! వాడెంత బలవంతుఁడు ఏట్టి సత్యసంధుఁడు ఇప్పటికి నా ప్రాణములు గూటఁబడినవి దేవాసురుల యుద్ధములనేకములు జూచితిఁగాని వీనివంటి వీరుం జూచియెఱుంగను. ఈ శుభవార్త నంతఃపురకాంతల కెఱంగించిరండు. మనమందఱము పోయి యాయోగిం బ్రార్థింతము. మన వీరునిఁగూడ బ్రతికింపఁగలడు అని పలికి ప్రహస్తాదిమంత్రులతోఁ గూడికొని యా యుద్యానవనమునకరిగెను.

అందయ్యోగీంద్రుండు జయసింహునిఁ దొడలపై నిడుకొనియెద్దియో ముచ్చటింపుచుండెను.

తన దర్శనార్థమైన విభీషణుఁడు వచ్చినాడని విని యాయోగి యట్టిలేచియెదురు వోయి నమస్కరించుచు నిట్లు స్తుతియించెను.

సీ. ధరణిశ్రీరామావతార తారకమూర్తి
గన్నులారఁగన్న పావనుఁడవీవు
ఖలులైన పౌలస్త్యఁ డిండుల నెల్ల వరతపో
ధనులఁ గావించిన ఘనుఁడ వీవు
హరిపాద కమల సేవా యత్తపృథు చిత్త
పరమభాగవత శేఖరుఁడ వీవు
బలిమృకండు తనూజపవనాత్మజుల మించి
చెలఁగొందు చిరకాల జీవివీవు

గీ. నిన్నుఁజూడగంటి నేను ధన్యుఁడ నంటి
వసుధలేదు నాదువంటి సుకృతి
కావుమయ్య పాద కమలంబులను నాశి
రంబునందు మోపి రాక్షసేంద్ర।

క. అనఘా। జనవంబున కే
దనుజుండవు గాని నితాంతతపశ్శ్రీం
తనియత మానవ శుద్ధికి
నెనవత్తురె యెట్టి తాపసేశ్వరులైనన్.

అట్టి నిన్నుఁ బ్రత్యక్షముగాఁ జూచితిమి మీ వంటి పుణ్యాత్ములు లేరని స్తోత్రములుజేసిన విని విభీషణుండు అతనికి నమస్కరించుచు మహాత్మా। నీవద్భుత ప్రభావసంపన్నుఁడవని నీ చరిత్రమువలనఁ దెల్లమగుచున్నది. నీ తపస్సామర్థ్యంబు ననే దుర్బలులైన రక్కసులుకుక్కగలిగి విజయమందిరి. నీవు తపోధనుండవయ్యు నసాధువులగు యాతుధానుల కేమిటి కుపకారము గావించితివి? నీవా తలాతలంబున కెట్లు వచ్చితివి? నీవృత్తాంతము విన వేడుకయగుచున్నది. మఱియు మీ వీరుండు కౌరవ్యునిచేఁ జంపబడినవాఁడే? వానిం బ్రతికించినట్లే మా వీరునిఁ గూడఁ బ్రతికింపరా? అని ప్రార్థించిన విని యా యోగీంద్రుఁ డిట్లనియె.

దానవేంద్రా। నా వృత్తాంత మింతవఱకుఁ గోప్యము జేసితిని. విప్లుతకృతుండ వగు నీ కడ నసత్యములాడరాదు. వినుము నేను విజయభాస్కరుండనువాఁడ విక్రమాదిత్యుని మనుమఁడనిచేపము నెపంబున భూసుర వేషముతో నొక రాక్షసుఁడు భార్యతోఁ గూడ నన్నెత్తికొని వచ్చి నన్ని తలాతలంబునం బెట్టెను. అది ప్రారబ్ధముగాఁ దలంచి యెవ్వరిని నిందింపక రాక్షసపీడితుండనై కొంతకాల మందుంటిని. రాక్షసులు నాకెన్ని యేని బాధలు గావించిరి. దైవవశంబున నా బాధలు నన్నంట లేదు. పిమ్మట వారికి నాయందు భక్తి విశ్వాసములు గలిగినవి గురువుగా నెంచిన నన్నుఁ బూజించుచుండిరి. అందు నేను దపంబు గావింపుచుంటిని. మఱియొక నాఁ డీకుమారుని యొడలెల్లఁ గట్టించి పారిజాతుండు తలాతలంబునఁ బద్ధ ట్రోయించె నట.

వీ దండుగల రక్కసులనెల్ల నుక్కుమాపి పీడించుచు మన్నియోగంబున శాంతుడై యందుఁ గొన్ని దినంబులు వసించెను. వజ్రకంఠుని యాశ్రయింబున నిక్కపటంబు దెలియక నేనే వీనిని యుద్ధంబునకుఁ బొమ్మంటిని. ఈ జయ సింహుఁడు నాకుమారుండు కలభాషిణీ పుత్రుండు. మీ అనుగ్రహంబున నిందుఁ

గలిసికొంటిమి కలభాషిణి మీ యొద్దనున్నదని వింటి యీ జయసింహుఁడు తన్నుఁ బోషించినవారిఁ బరిభవించితినని దుఃఖించుచుఁ బ్రాణత్యాగము జేసికొనఁబూనుచున్నాఁడు అందుల గుణదోషంబుల నిరూపించి వీనికిఁ బ్రాయశ్చిత్తం బెఱింగింపుము నీ కంటె ధర్మాధర్మ వివేచనము సేయ మఱియొకనికి సమర్థత లేదు. అని పలికిన విని విభీషణుండు పులకితగాత్రుండై యిట్లనియె.

ఓహోహో! నేఁడెట్టి సుదినము. నా చిరకాల జీవితమునకు సాఫల్య మిప్పటికిఁ గలిగినది. మహాపుణ్యపురుషుల మిమ్ము బొడగంటిని. మీ తాతగారి సాహస వితరణాది గుణ గుణంబులు వియచ్చరులు పొగడుచుండఁ బెక్కుసారులు వింటిని. మీ జయసింహుడు గావించినపని త్రిలోక వీరలోక సంస్తుత్యమై యొప్పుచున్నది. ఇట్టి సత్యసంధు నెందును జూచి యెఱుంగను. గురువచనంబునందలి గౌరవంబునం జేసి తన కత్యంత ద్రోహుండైన శత్రుపుపక్షము వహించి ప్రాణబంధువుల కపకారము గావించెను. ఇట్టి సౌజన్యనిధి యెందుఁగలఁడు అని అతని సుగుణంబులఁ గైవారము సేయుచు వారిరువుర గౌరవ్యుని మందిరమునకు రమ్మని ప్రార్థించెను.

జయసింహుఁడు సిగ్గుపడుచుఁ దన్నుఁ దప్పుజేసిన వానిఁగాఁ దలంచుకొనుచు, గౌరవ్యుని యింటికి వచ్చుటకు సమ్మతింపదయ్యెను. అప్పు డాలోచించి విభీషణుఁడు తమ వీరులనందల మెక్కించి అక్కడకుఁ దీసికొనిరమ్మని నిరూపించుటయు దూతలు పోయి వానిం దీసికొనివచ్చిరి.

విజయభాస్కరుఁడు వాని యాకారలక్షణంబులు పరీక్షించి వీఁడు హేమప్రభ కుమారుండాయని యాలోచించుచుండెను.

ఆకారసాదృశ్యము జూచి యిరువురు అన్నదమ్ములని చూపఱులు నిశ్చయించిరి. జయసింహుఁడు సహోదర భావంబున వానిపైబడి విలపించుచుండెను. అప్పుడు విభీషణ ప్రోత్సాహంబున విజయభాస్కరుఁడా కుమారుని మేను నివురుచు

క. మాతాత విక్రమార్కుఁడు
పూతచరిత్రుండు ధర్మబుద్ధి వితరణ
ప్రీతుండై త్రిభువన వి
ఖ్యాతుండగు నేని వీఁడనామయుఁడగుత౯.

అని పలికినంత వీరసింహుండు మహావీరా, నిలు. నిలు. పోకు పోకు. మని పలుకుచు దిగ్గున లేచెను. అంత జయసింహుం డతనిం గౌఁగలించుకొని అన్నా! నేనిందే యుంటిని నేను శత్రుండగాను. మన మన్నదమ్ములము ఎఱుంగక యొరు

లకై పోరాడి మూర్ఛ మునింగితిమి నీవు జదివిన పద్యమువలన నీవు నాకు సహోదరుఁడవని తెలిసికొంటిని. నీవు హేమప్రభ కుమారుఁడవని తలంచుచుంటిమి. ఇతఁడే మనజనకుఁడు విజయభాస్కరుఁడు. కనువిచ్చి చూడుము. నీ వెట్లు వచ్చితివి ? నీ వృత్తాంత మెఱింగింపుమని పలుకుచుఁ దన కథ యెఱింగించిన విని వీరసింహుఁడు విభ్రాంతుండై కొంతసేపు సంతోషము పట్టఁజాలక వివశుండై యెట్టకేలకు తెప్పిరిల్లి తండ్రికి నమస్కరించి యతనిం గౌఁగలించుకొనుచు నిట్లనియె.

అన్నన్నా! విధిపరిపాకము యెంతచోద్యమైనది. తేజోవతివలన నీ వృత్తాంతమంతయును వింటిని. ఆ చిన్నది నీ నిమిత్తమై పడిన దుఃఖమునకు మేరలేదు గదా ? అట్టివారిపై గత్తిగట్టితివి. అది వీర ధర్మము. నీ పని యెఱింగిన వారింత చింతిల్లకపోవుదురు. పాపమా కౌరవ్యుఁడు కొన్నిదినములు శత్రువులకు లొంగియుండెంగదా ? మన తండ్రిగారి శాంతమే యింత వింత గలుగఁజేసినది. వారు దలంచుకొనినఁ దలాతలవాసులు విజృంభింతురా? పైపెచ్చు వారికే వుపకారము జేయించిరి. దుర్జనుల కుపకారము జేయుటచే సుజనులకుఁ బీడ గలుగుచున్నది. అక్కటా ! దండ్రీ ! నీ వొక్కరుండవు దిక్కుమాలి పాపుల మధ్యమున నాతలాతలమున నిన్నినాళ్ళెందులకు వసించితివి. నీవె తలంచిన లోకములు తల్లక్రిందులుకావా? అని పలుకుచుఁ దాను జనించినది మొదలు నాఁటి తుదదనక జరిగిన కథ యంతయు నెఱింగించెను.

ఎల్లరు విస్మయము జెందిరి. విజయభాస్కరుం డిరువురుకుమారుల నక్కునం జేర్చుకొని ముద్దువెట్టుకొనుచు వత్సలారా ! మనమెందులకును స్వతంత్రులము గాము. అంతయు దైవమే చేయించుచుండును. కర్మానుసారముగా బుద్ధి బొడముచుండును. నే నప్పుడే యా రక్కసుని కంఠము పిసికినచో నింతకథ యెట్లు జరుగును. అందులకే కలభాషిణి బోధించుచున్నను నాకట్టిబుద్ధి పుట్టినదికాదు ఈ మహానుభావుని దర్శనము మానవుల కెవ్వరకేని దొరకునా ? మన పురాకృతము పండుటచే లభించినది. ఆరక్తాక్షుం డీరూపమున మన కుపకారి యయ్యెను. లేకున్నఁ గూపకూర్మమువలె మన మింటియొద్దనేయుందుము గదా. దైవ మనుకూలుఁడయ్యెనేని అపకార ముపకారమగును. ప్రతికూలుఁడైనచో నుపకార మపకారమగును అని పెద్దగా నుపన్యసించెను.

అంతకుఁ బూర్వ మంతఃపుర కాంతలతో వచ్చి యాసంవాద మాలించుచున్న కలభాషిణి తటాలున వచ్చి హా ! ప్రాణేశ్వరా ! అని పలుకుచు భర్త పాదంబులంబడి దుఃఖించినది. అతండు లేవనెత్తి గారవింపుచు, ప్రేయసీ ! విచారింపకుము. నీవు

కౌరవ్యునింట బిడ్డతో వసించి కాలక్షేపము జేసితివి. నీయుదంత మెఱింగితిని. దైవ మిప్పటి కనుకూలుం డయ్యెను. మనకు మానవదుర్లభమైన లంకాధిపతి దర్శనమైనది మఱియుం బాతాళలోకము మర్త్యులకుం జూడశక్యమైనదియా? ఈ పయనములో మన కపూర్వవస్తు సందర్శనలాభము గలిగినది రక్తాక్షుఁడే మనకి యుపకారము గావించె నని పలికి యూరడించెను.

అప్పుడు విభీషణుండు మహారాజపుత్రా! నేను రాత్రించరుల నరుల బాధ పెట్టకుంట శిక్షింప నియమించియే యుంటిని వజ్రకేతుని ప్రోత్సాహమున సముద్ర మధ్య గృహంబున నున్న హేమప్రభను దీసికొని వెళ్ళుటకు తదనుచరుండైన రక్తాక్షుం దరుదెంచి యందాసుందరిం గానక నీవు దీసికొనిపోయినవిధం బెఱింగి కోపించి తొలుతఁ దన దూతల దీర్ఘదంతశూలనఖులను బంపి నిన్నుం గట్టి తీసికొనిరమ్మని నీయొద్ద కనిపెనఁట భవదీయ ద్వారపాలకుండైన భేతాళుండు కోటలోఁ బ్రవేశించు చుండ వారిరువురం బట్టికొని దీర్ఘదంతునిదంతం బూడబెరికి శూలనఖుని చేతులు విరచిపాదంబులం బట్టికొని గిరగిరం ద్రిప్పి విసిరి పారవైచెనఁట.

వాండ్ర పరిభవము జూచి రక్తాక్షుండు భేతాళునకు వెరచి బ్రాహ్మణవేషంబున నీయొద్దకువచ్చి కోటలోనికి రాక మాయజేసి మిమ్ముఁ దీసికొనివెళ్ళెను. ఆకథ మొన్ననే నాకు మాదూతలు నివేదించిరి. హేమప్రభాపుత్రుఁడు మాకుఁ దోడుపడి యుపకారముగావించెను. హేమప్రభ రాక్షసవంశ సంజాతయేకావున మాకుఁ జుట్టమైనది. నీ యిద్దరి పుత్రులతో వచ్చి మాలంకాపట్టణము పాలింపుము. నేను పెద్ద వాఁడనైతిని సామర్థ్యములేదు. ఉన్నవారి పాలనము సమంజసము కాకపోవుటచేతనే మీకిబాధ గలిగినది అని ప్రార్థించుచుండగనే కౌరవ్యుఁడు సబంధుకముగా వచ్చి విజయభాస్కరుని పాదంబులంబడి యిట్లనియె.

ఆర్యా! నీభార్యయుఁ బుత్రుఁడును మాయింట వసించి మమ్ముఁ గృతార్థు లంగావించిరి. ఎఱుఁగక వారి నేమేని న్యూనతపరచితిమేమో క్షమింపవేడుచున్నాను. నీవును మాచుట్టరికము తెలియక యేలాపుత్రునకు సహాయము జేసితివి. నీకుమారుం డెఱింగియు ధర్మమునకై పోరాడెను. తొల్లినాగదౌహిత్రుండగు బభ్రువాహనుఁడు తండ్రితోఁ బోరలేదా? అది వీరధర్మము. అందుల కతండు సిగ్గుపడుచున్నాడని వింటిని. ఆ పనియే వానికీర్తికి మెఱుఁగు బెట్టుచున్నది. మా తేజోవతి వానిని వరించి నది. కావున పాతాళలోకరాజ్యముతోఁ గూడ మాపిల్లం బరిగ్రహింప నీపుత్రుండు పాత్రుండై యున్నవాఁడని కోరుకొనియె.

అప్పుడు విజయభాస్కరుఁడు కౌరవ్యుని మిక్కిలి స్తుతిజేయుచు తండ్రీ

నీకతంబున భార్యాపుత్రులు బ్రతికిరి—నీయట్టి హితుండు నాకుఁ గలఁడా! నీయుపకార మెన్నటికిని మఱువఁ దగినదియా? యావజ్జీవము నీకుఁ గృతజ్ఞుఁడనై యుండెదను నీకు నేను జేసిన యపకారము మరువుమని ప్రార్థించెను

అప్పుడు కౌరవ్యుఁడు వారినెల్ల బ్రార్థించి వాహనంబు లెక్కించి తన రాజధానికిఁ దీసికొని పోయెను. అందుఁ బద్మావతి యంతఃపురంబున దనుజపన్నగ కాంతలతోఁ గూడికొని వీరసింహ జయసింహుల దీసికొనిరమ్మని పరిచారకుల నంపినది. జయసింహుం డంతఃపురమున కరుగుటకు సిగ్గుపడుచుండ వీరసింహుఁడు అన్నా! వెరచెదవేమిటి పోదమురమ్ము. ఆమె నిన్నుఁ బెంచినదికాదా! తేజోవతి నీకు సహాధ్యాయిని పదపద యని పలుకుచు నతని వెంటఁబెట్టికొని శుద్ధాంతమునకరిగెను. అయ్యంతఃపురము వింతగా నలంకరింపబడి యున్నది. తదీయ శోభావిశేషములు వీరసింహుని హృదయంబునకు విస్మయము గలుగఁజేసినవి.

నాగకాంతలు వారినిరువురఁ జెరియొక రత్నపీఠంబునం గూర్చుండంబెట్టి స్తుతిగీతంబులం బాడుచు మంగళహారతులిచ్చిరి.

అప్పుడు తేజోవతి పుష్పమాలికాహస్తయై అల్లనతగ్గి వెరవనొదిగి నడుచుచు జయసింహుని దాపున నిలువంబడి అమ్మా! యీతండేనా మన జయసింహుండు! వీరి పరాక్రమమేగాదా మనల నందఱ లంకాపురంబు బ్రవేశపెట్టినది అందులకు వీరి కెద్దియేని గానుక లీయవలయుంగదా? ఇదిగోదీనితోఁ గూడ మదీయహృదయం బర్పించుచున్నదానవని పరిహాసమాడుచు నతని మెడలోఁ బుష్పమాలిక వైచినది.

అతండు సిగ్గుపడుచు నౌను నేను జేసిన పని తప్పే మీయింటఁ గుడిచి మీకే యపకారముగావించితి నా యపరాధము సైరింపుమని పద్మావతి పాదంబులంబడి నమస్కరించెను. ఆమె గ్రుచ్చి యెత్తి బాబూ! తేజోవతి నిన్నుఁ బరిహాసమాడినది అందులకుఁ దగినమాటాడక వగచెదవేమిటికి? నీవు జేసిన పనికెల్లరు మెచ్చుకొనుచున్నారు. సంతోషముతోనే తేజోవతి యట్లనుచున్నది లెమ్ము లెమ్ము. తేజోవతి మెడలో నీపూఁదామము వైవుము. అని మరియొక మాలిక యందిచ్చినది.

అతండందికొని తేజోవతీ! తప్పుంజేసితిని క్షమింపుము యిదియే క్షమార్పణము అని పలుకుచు నాపుష్పదామంబా కామినీమణిమెడలో వైచెను. అప్పుడందున్న పన్నగకాంతలెల్ల వారిపైఁ బుష్పవర్షము గురిపించిరి.

పిమ్మటఁ జామరిక లేచి యువతులారా? యీ జయసింహుడు మనకు భయప్రదుడైనను దేజోవతి హృదయమిచ్చి యర్పించినది. అభయప్రదుఁడైన యీవీరసింహునెట్లు పూజింపవలయునో తెలియకున్నది. తండ్రితాతల కుపకారము గావిం

నిన పీని సర్పించుటకు రాక్షసరాజపుత్రిక యగు సీచంపక యామోదించుచున్నది. అని పలుకుచు అన్వనితను నియోగించినది.

అప్పుడు చంపకలేచి పుష్పమాలంబూని వీరసింహుని డాపునకుబోయి ఆర్యా! నీవదృశ్యుండవై మాయంతఃపురమునకు వచ్చి మా హృదయంబు హరించినచోరుం డవు నిన్ను బద్ధుంజేయవలసినదియేకాని మాపక్షము వహించి పోరిమాకు విజయము గలుగఁజేసితివి కావున గానుకగా నీ మాలిక సర్పించుచుంటి మదీయ చిత్తం బిదివరకే నీయధీనమైనది కైకొనుమని పలుకుచు మెడలో వైచిరి.

అతండు వేరొకమాలికనందుకొని యామె మెడలో వైచెను. స్త్రీలు పూవుల జల్లిరి. జయ జయ ధ్వానములతో దదీయ విజయగీతములతో సభముగిసినది.

మరునాఁడు విభీషణుఁడు సపుత్రకముగా నేలాపుత్రు రప్పించి నీవు రాజ్యా ర్హుండవు గావని అతండు గావించిన తప్పులన్నియు నిరూపించి నిండించుచుఁ గొన్ని గ్రామంబులు మాత్ర మిప్పించి నాగరాజ్యమునకెల్లఁ గౌరవ్యునే బట్టభద్రుం గావించెను. కౌరవ్యుఁడు లంకాధిపతి అనుమతివడిసి శుభముహూర్తంబునఁ దేజోవతిని జయసింహు నకిచ్చి వివాహము గావించెను. పాతాళలోక విశేషములు జూచుచుఁ బది దినములు వారందుండిరి.

తరువాత విభీషణుఁడు వారినెల్ల లంకాపురంబునకు సగౌరవముగాఁ దీసికొని పోయి మహావైభవముతో వీరసింహునకుఁ జంపక నిచ్చి వివాహము గావించెను. అంత

మ. జయసింహుఁడును వీరసింహుఁడును యోషారత్న ముల్మానసన్
ప్రియముల్సేయఁగ వారిఁ గూడి మదనక్రీడాపయోరాశిన
వ్యయసౌఖ్యంబున దేలి యాడిరి మనోజ్ఞారామ కేళీశిలో
చ్చయవాపీతటినీతటస్థలుల స్వేచ్ఛాయుక్త సంచారులై.

అట్లు వారు పరమానందభరితులై లంకాపట్టణ విశేషంబులం జూచుచుఁ గొన్ని దినంబులందు వసించిరి. వీరసింహుఁడు మత్స్యంబువలనఁ దనకు లభించిన రత్నంబు పారిజాతునిదని యెఱింగి యమ్మణి నతనిం బుచ్చుకొమ్మని ప్రార్థించెను. కానియతం డంగీకరింపలేదు.

పిమ్మట స్వదేశదర్శనలాలసుండైని విజయభాస్కరుని యభిలాష యెఱింగి విభీషణుండు విమానశాల నుండి వారిసిమిత్త మొక విమానము దెప్పించి యనర్ఘ కాంచనమణి వస్తువిశేషంబు లెన్నియేని వాటికిచ్చి తేజోవతి చంపకలకు దాసీ సహ స్రము లరణమిచ్చి యందఱ విమాన మెక్కించి కుమారునితోఁ దానుగూడ నెక్కి

యర్ధయామములో నజ్జయినీపురంబు బ్రవేశింప జేసెను. తొల్లి పుష్పకారూఢుండై చనుదెంచిన శ్రీరాముండువోలెఁ బట్టణమునకు సతీపతియుక్తముగా జనుదెంచిన విజయభాస్కరుని వృత్తాంతము విని పౌరలాశ్చర్యమందుచు గుంపులుగా వచ్చి యమ్మహారాజు కుటుంబమును జూడఁ దొడంగిరి.

వియోగ చింతాసాగరంబున మునిగియున్న హేమప్రభం గౌగలించుకొని బుజ్జగింపుచు విజయభాస్కరుఁ డామెకునుఁ దల్లికిని బరమానందము గలుగఁ జేసెను.

అట్లు విభీషణుఁడు వారినెల్ల స్వస్థానమునఁ బ్రవేశపెట్టి జయసింహ వీరసింహులఁ భార్యలతోఁగూడ నప్పుడప్పుడు తన పట్టణంబునకు వచ్చునట్లు నియమించి యొక విమానమర్పించి కుమారునితోఁగూడ నిజనివాసమున కరిగెను.

క. గిరియెక్కి పడిన ధర సా
గరమున మునింగినను బావకముఁ జొచ్చిన భీ
కర ఫణులతోఁ డ నాడిన
మరణకాలము రాదు మహినెవ్వరికిన్.

అను పద్యమును దన దేశమెల్ల జాటింపఁజేయుచుఁ దాను బోయివచ్చిన వృత్తాంతము ప్రకటించి విజయభాస్కరుం డిరువుర పుత్రులతోఁ భార్యలతోఁ బదమిఁ బెద్దకాలము రాజ్యము గావించెను.

అని యెఱింగించి మణిసిద్ధుండు వత్సా! విచిత్ర కథామనోహరంబగు విజయభాస్కరుని చరిత్రము జదివినను విన్నను పవిత్రుండై యభీష్టకామంబులం బొందఁగలఁడు సుమీ! యని వివరించెను శిష్యుండా కథవిని ప్రహర్షసాగరమున మునుఁగుచు నావృత్తాంతమే స్మరించుకొనుచు గురునితోఁ గూడ నవ్వలి మజిలీ చేరెను.

## 123 వ మజిలీ.

# గురుదత్తుని కథ

ఉ. భూపతిజంపితి స్మరుఁడు భూరి భుజంగముచేత జచ్చెఁ బై
నాపద జెందిచెంది యుదయార్కుని పట్టణమేగి వేశ్యనై
పాపము గట్టికొంటినటఁ బట్టి విటత్వము బూనిరాఁగ సం
తాపము జెంది యగ్గిఁబడి దగ్ధముగా కిటు గొల్లభావనై
యీపని కొప్పుకొంటి నృపతీ! వగపేటికిఁ జల్లచింపినన్.

గోపకుమారుండా మజిలీయందలి పట్టణవిశేషంబులం జూడఁ బోయి యొక

దేవాలయమున గోడమీఁదనొక పద్యము వ్రాయఁబడి యుండఁ దానిం జదివికొని మొదటి పాదములు కొన్ని చెరపఁబడి యుండుటచే వాని పిదప తెలిసిన వానినే వ్రాసికొని అతివేగముగా నయ్యగారియొద్దకు వచ్చి అప్పద్యము జదువుచు నింకేదియో మంచి కథ స్ఫురించుచున్నది. ఆ కథ యెవ్వరినడిగిన చెప్పలేకపోయిరి ముందుగా దీని వృత్తాంత మెఱింగింపుఁడని ప్రార్థించెను.

మణిసిద్ధుండు తనమణి మహిమ నయ్యుదంతమంతయుం దెలిసికొని వెరగు పడుచు నాకథ నిట్లు చెప్పందొడంగెను.

సముద్రతీరంబునఁ గుంభీనసంబను నగరము గలదు. అప్పురంబున రత్నాకరుండను వర్తకుండు నౌకామూలకముగా ద్వీపాంతర వ్యాపారము గావించుచు నపారమైన ద్రవ్యము సంపాదించి కోటీశ్వరుండను ప్రసిద్ధివడసి కాపురము సేయుచుండెను. అతనికి యుక్తకాలమున సంతానము గలిగినదికాదు. అక్కొరంతయే అతనికి సంతోషమును దిగమ్రింగుచుండెను.

సులక్షణయను పేరుగల యాబేహారిభార్య అసత్యరాహిత్యమునకు వగచుచు నొకనాఁడు భిక్షార్థమై అరుదెంచిన యొక బ్రాహ్మణుం జూచి నమస్కరించి భిక్షము వేయుచు అయ్యా! మీకుఁ బిల్లలెందరని అడిగినది

ఆపాఱుండు కన్నీరునించుచు అమ్మా! నాకు సంతతిలేదు. మేమేడ్వుర మన్నదమ్ములము. అందరిలో నేనొక్కరుండనే విద్యాధనసుతవిహీనుండనై పొక్కుచుంటిని. లేమికంటె బిడ్డలు లేమికై నా భార్య మిక్కిలి వగచుచున్నది. అన్నము తినదు. నిద్రవోవదు. సంతసముకంటఁ దడిపెట్టుచుండును యాత్రలకుఁ బోవుదము రమ్మని వేపుచుండును తల్లీ దరిద్రులమెట్లుపోగలము అని తనకథ జెప్పుకొనియెను.

అప్పుడామె ఔరా! యాపాఱుండు భిక్షమెత్తికొనచుండియు బుత్రరాహిత్యమునకుఁ జింతించుచున్నాఁడు అగునగు నందుల కాక్షేపింపరాదు. పుత్రానంద మందఱకును సమానమే! అని తలంచుచు నార్యా! మీకుఁ దీర్థయాత్రలకు గావలసిన ద్రవ్యము నేనిచ్చెదను మీరు దేశములు తీర్థములు తిరిగి సంతతి గలుగు మంత్రతంత్రము లేవేని సంపాదించుకొనిరండు. పుడమి నెందైన మహానుభావు లుండకపోరు మీరు వచ్చునంతకు మీ భార్యను నేనుపోషించుచుండెద దైవకృప మనయభీష్టము దీరెనేని మిమ్ము మీఅన్నలకన్న భాగ్యవంతునిగా జేసెదనని చెప్పి అతని నొప్పించి కొంతసొమిచ్చి అంపినది.

సుదక్షిణాప్రేరితుండై యాక్షితిసురుండు శుభముహూర్తమున నిల్లుకదలి కాశీ రామేశ్వరాది యాత్రలు సేవింపుచు నుత్తరారణ్యభూములన్నియుం దిరిగి మహాత్ముల

దర్శించుచు సంప్రాప్తమనోరథుండై యింటికివచ్చి కిరాటవధూటింగాంచి యాశీర్వచన పూర్వకముగా నిట్లనియె.

అమ్మా! నీయుపదేశమునఁ బుడమి యంతయుం దిరిగి తిరిగి బదరీవనంబున నొక యవధూత నాశ్రయించి మూడు సిద్ధౌషధముల సంపాదించుకొని వచ్చితిని. వినుము.

శ్లో. ఋతుదివసె ఘృతసహితం పీత్వానవనాగ కేసరస్వరజః
దుగ్ధమనుసీయ రమణీ రమణీగతా గర్భిణీ భవతి
శ్లో. గోరేక వర్ణభాజః పయసా వంధ్యాపి ధారయే ద్గర్భం
పీత్వా కేకిశిఖాయాః పుత్రం జీవస్యకా మూలం.
శ్లో. పీత్వామునైన పయసారజసి స్నా త్వాచ లక్షమూలం
నస్తాంబుశాళితలం భక్తం భుక్త్వానారీసుతం లభతె.

ఇవి కడు రహస్యములని యాయోగిజెప్పి యున్నవాఁడు మూడిటిలో నేత్రంత మునైనను వంధ్యయైన స్త్రీగర్భముధరించుఁట అయ్యౌషధుల సంగ్రహించుకొని వచ్చితిని. తత్ప్రకారమునఁ గావింపుము. సిద్ధుల యుపదేశ మూరకపోదని యోగించి యాభూసురుండాశీర్వచన పూర్వకముగా అమ్మందులిచ్చి యట్లుకావింపఁ జేసెను.

తత్ప్రయోగమున వైశ్యాంగనయు విప్రపత్నియు అంతర్వత్నులై శుభ లగ్నంబున నిరువురుపుత్రరత్నములం గనిరి.

మనోహర రూపలక్షణ తేజోవిరాజితుండగు కుమారునకు రత్నాకరుండు పండితుల యనుమతిని గురుదత్తుండని నామకరణము వ్రాసెను. బ్రాహ్మణపుత్రునకు గదాధరుఁడని పేరుపెట్టి. ఆవర్తకుఁ డావిప్రుని బురోహితునిగా నియమించుకొని ద్రవ్య ప్రధానంబున దత్సమానులలో నుత్తమునిగాఁ జేసెను.

మఱియు గదాధరునిఁ దనకుమారునితో సమముగాఁ బెంచుచు యుక్తకాలం బున నిరువురం జదువవేసి సమర్థులగు నుపాధ్యాయుల నియమించి పెక్కు విద్యల నేర్పించెను అక్కుమార శేఖరు లిరువురు నొక్కటవలన అచిరకాలములోఁ బెక్కు విద్యలం గ్రహించిరి.

విప్రపఠన యోగ్యములగు విద్యలతో మనకు బనియేమి? వ్యాపారరహస్యముల నేర్చికొమ్మని తండ్రి యెంత బోధించినను వినక తనివి సనక విద్యాగుణాలంకారుండై గురుదత్తుండు పదియారేడుల ప్రాయము వచ్చునప్పటికిఁ బండితప్రవరుండని వాడుక వడసెను.

గురుదత్తునికిఁ బదియేడుల యీడు వచ్చినది మునలు పిల్లనిచ్చు తలంపుతో

నిత్యము ధనికులగు వైశ్యోత్తములు కోరినన్ని కానుకలిత్తు మని యింటిచుట్టును దిఱుగుచుండిరి. పుత్రుని యౌవనోదయ మరసి రత్నాకరుండు పెండ్లిఁజేయు తలంపుతోఁ బ్రసిద్ధిజెందిన వర్తకుల పుత్రికల చిత్రఫలకముల గొన్నిటి దెప్పించి గదాధరుని రప్పించి వీని నీమిత్రునకుఁ జూపించి యిచ్చవచ్చిన మచ్చెకంటి నేరుకొమ్మని చెప్పుము.

అని యిచ్చి యంపుటయు వానిఁగొని గదాధరుఁడు గురుదత్తు నొద్దకుం బోయి యా వృత్తాంతమంతయు నెఱింగించెను. గురుదత్తుండు మిత్రునితోఁ గూడ నాచిత్ర ప్రతిమల రూపము విమర్శించి వారిలో నొక్క రితయుఁ జక్కనిది కాకుండుట దెలిసికొని యాక్షేపించుచు తనకుఁ వివాహ మక్కరలేదని తండ్రికిఁ దెలియఁ జేసెను.

ఆవార్తవిని యావర్తకుఁడు పరితపించుచు నొకనాఁడు గదాధరుని రప్పించి కుమారా! లక్షలకొలఁది కానుకలతో బిల్లల నిత్తుమని పెక్కండ్రు కోటీశ్వరులు వచ్చుచుండిరి. నీ మిత్రుఁడొక కన్యక నంగీకరింపక పెండ్లియాడనని చెప్పుచున్నాడేమి?

గదాధరుఁడు—అవును నీవు ద్రవ్యలాభమే చూచుచుంటివి కాని కన్యకాలక్షణంబులు పరీక్షించుట లేదు. నీవు చెప్పిన కన్యకలలో నొక్కరితయుఁ జక్కనిది లేదు. అందులకై అతండామాటఁ జెప్పెను.

రత్నాకరుఁడు—సరి. సరి. అదియా? ఆలక్షణము లేవియో నాకుఁ దెలియవు కాగితముపై వ్రాసి యిమ్మనుము.

గదా—నీ కుమారుండు పద్మినీజాతి కన్యకంగాని పెండ్లియాడనని చెప్పుచున్నాఁడు సుంకమున కానపడక యట్టిపడతిం బెండ్లి జేయుము.

రత్నా—పద్మినీజాతియా? ఆ మాట నే నడివఱ కెన్నఁడును వినియుండలేదే? మాజాతికి నాజాతితో సంబంధమున్నదో లేదో చిన్నవారలు మీమాటల నమ్మి జేసితినేనిఁ గులములో వెలివేయుదురు.

గదా—(నవ్వుచు) పద్మినీ జాతియన మఱియొక కులము కాదు. స్త్రీ జాతిలో నుత్తమమైనది.

రత్నా—ఇదియే కదా? నీమిత్రు నభిప్రాయము. ఎక్కువ కానుక లెవ్వరిత్తురో వాని పిల్లయే పద్మినిజాతి యువతియని చెప్పుదము. తలిదండ్రులచేత నట్లు చెప్పింతము. తెలిసినదియా!

గదా—అహో ఏమి నీ మోహము. ఇత్తడి బంగారమనిన నమ్ముదురా? ఆ

లక్షణము లాకన్యకయం దుండవలయు. పద్మినీ జాతి లక్షణంబు లెఱింగించెద నాకర్ణింపుము.

శ్లో. కమలముకుళ మృద్వీపుల్ల రాజీవగంధః
సురతపయసి యస్యా స్సౌరభం దివ్యమంగె
చకిత మృగదృశాభె ప్రాంతరక్తె చనేత్రె
స్తనయుగళ మనింద్య శ్రీఫల శ్రీవిడంబి.

శ్లో. తిలకుసుమసమానాం విభ్రతీనాపికాంచ
ద్విజ గురు సుర పూజా శ్రద్ధధానా సదైవ
కువలయ దళ కాంతిః క్వాపి చాంపేయగౌరీ
వికచ కమల కోశా కార కామాత పత్రా.

శ్లో. వ్రజతి మృదు శరీరం రాజ హంసీవ తన్వీ
త్రివళిలతమనుమధ్యా మంజు వాణీమవేషా
మృదుశుచి లఘు భుంక్తె మానినీ గాఢలజ్జా
ధవళ కుసుమవాసో వల్లభా పద్మినీస్యాత్

ఇట్టి లక్షణములు గలదియే పద్మినీజాతి యువతి.

రత్నా—ఔరా సీమిత్రుని కెన్నికోరికలున్నవి ! నీసహవాసంబున వానికి యభిలాషగలిగినదని తలంచెదను. సంసారస్త్రీల కందమేమిటికి? నీవు ఆడిపిన టక్కులన్నియు భోగము వాండ్రకుండవలయును. పద్మినీలు మాకులములో లేరు మీ బాపన కులంబున నుందురేమో నీవేరికొని పెండ్లియాడుము.

గదా—నీకొడుకు నాకంటెఁ జాల చదివెను. వానికి నా యుపదేశ మక్కర లేదు. నీవు కోటీశ్వరుండవై నీకుమారుఁడు అక్కనిపిల్లం బెండ్లి జేయుమని కోరుట తప్పుగా గణించుచుంటివి ఆహా ?

రత్నా — బాబూ ! మీతో మేము మాట్లాడఁజాలము. కులవిద్య నేర్పింపక శాస్త్రములు ఆడివించుట నాది తప్పు పుస్తకములలో వ్రాసినట్టు భార్యలు ప్రవర్తింప వలయునని కోరుచుండిరి. ఆ కోరికలు సంకల్ప లాఖ్యములనందివె కాని సత్యములు కావు. కానిమ్ము ఇప్పుడు వలసినంత ద్రవ్య మిచ్చెదను. పరి వారమిచ్చెదను దేశాట నముజేసి మీయిష్టము వచ్చిన పద్మినీల నేరికొని పెండ్లియాడుండు అని యుపదేశించుట యు వారికంతకుఁ బూర్వమట్టి సంకల్పము గలిగి యుండుటచే సంతోషముతో నంగీకరించెను.

తండ్రి యనుమతి గురుదత్తుండు గదాధరునితోఁ గూడ శుభ ముహూర్తమున నిల్లువెడలి కన్యార్థియై కొంతకాలము దేశాటనము గావించెను.

ప్రతి గ్రామమునకుఁబోవుచు భాగ్యవంతులగువణిక్కులయిళ్ళకుంజని కన్యక లం బరీక్షించుచు రూపవతులైనను బుద్ధిబలసామర్థ్యలగువారిం బరిహరించుచు సంకల్పా నుగుణ్యయగు కన్యకం బడయలేక పోయిరి.

ఒకనాఁడొక గ్రామమున నొకసత్రములో బసజేసి నానా దేశాగతులగు జను లతో ముచ్చటించుచుఁ గదాధరుం డందున్న కొందఱు బేహారులంగాంచి మీరెవ్వరు? ఎందుండి వచ్చుచుండిరి. యెందు బోయెదరు? పనియేమి? అని అడిగిన వారిలో నొకఁడిట్లనియె.

అయ్యా! మాది కుంభఘోణము. మేము వర్తకులము. మా యజమానుఁడు మిగులు భాగ్యవంతుఁడు. అతఁడు తన కుమారునికి మిక్కిలి చక్కనగు మగువం బెండ్లిజేయఁ దలంపుగలిగి దుర్గానగరంబునఁ గనుదాంగదుని కూఁతురు పద్మని అను చిన్నది త్రిభువనాశ్చర్యకరములైన సౌందర్యచాతుర్యాది గుణవిశేషములచేఁ బ్రకాశించుచున్నదని లోకులవలనఁ దెలిసికొని యా కన్నె నడుగుటకై మమ్మందు లకుఁ బుత్తెంచెను.

మేమరిగి యావైశ్యశిఖామణిచే సత్కృతులమై యాయజమానుని విత్తాభిజాత్యాది భాగ్యవిషయములం బొగడుచు నతని సందేశమెఱింగించితిమి అతం డించుక విమర్శిం చుచు నాశెట్టిపట్టి విద్యారూపగుణంబులెట్టివని అడిగిన మేము అయ్యా! అతండు గొడ్డుపిఁగిననిన బిడ్డఁడగుటచే గారాబముగా బెంచి విద్యలు గఱపింపఁ డయ్యెను. పురుషునికి రూపమేమిటికి? "సర్వేగుణాః కాంచన మాశ్రయంతి" అననట్లు వారి సిరియే యన్నిటికిం జాలియున్నది. నీపుత్రిక యింద్రభోగము లనుభవింపగలదు అని చెప్పిన విని అతండు నవ్వుచుఁ దనపుత్రికను రప్పించి అవ్విత్తంబెఱింగించిన నమ్మించుఁబోణి పెదవివిరచుచు మఱుమాట పలుకక అవ్వలికిం బోయినది.

అప్పుడతండు మాతో అయ్యా! మాకు విద్యారూపశీలంబులు ప్రధానముగా నుండవలయును. సంపద నంతగాఁ బరిశీలింపము. మాచిన్నది యొక్కరితయే దిక్కు. మాధనమంతయు నేమిజేయుదుము. మేమనుటగాదు మాపద్మనికి విద్యావ్యస నము మెండు. దానినిం దగిన పండితునికిం జేయకున్న నిందపాల్పడి పోమా? అని యేమేమో చెప్పి మాకుఁ బయనము నకనుజ్ఞనిచ్చెను. మేమును ఫలవిముఖులమై పురాభిముఖులమై అరుగుచుంటి మని చెప్పిన విని గదాధరుఁడు సంతోషభరితహృద యుండై యిట్లనియె.

అయ్యా! మీ రాచిన్నదాని చూచితిరిగదా? సౌందర్యమెట్లున్నదని అడిగిన వారు అమ్మదవతి పదమూఁడేకుల ప్రాయములోనున్నది. అయ్యిందవదను జూచితీర

వలయు జెప్పుటకు మేము కవులముగాము. సామాన్యమైన నింతదూర మేలవత్తుమని పలుకుచుఁ బయనపు సమయమగుటయు నత్తెరవరులు మూటలుగట్టుకొని దక్షిణాభిముఖముగా నరిగిరి.

గదాధరుఁడా మాటలువిని గురుదత్తునితోఁ దమ్ముడా ! నీవు బద్మినినింగాని పెండ్లియాడనని నియమముజేసికొంటివి. నీశపథము సఫలమగునట్లున్నది. వీరిపలుకులు మన కుప్రశుతులవలె సుదర్కమును సూచింపుచున్నవి. ఇఁక జాగుసేయనేల? వేగ మానగరంబునకుంబోవుదము లెమ్మని పలికిన౯విని యతండిట్లనియె.

అన్నా ! అదిన్నది నన్నుమాత్రము స్వీకరించునా ? నావిద్యారూపంబులు దానికి హృదయములగునో కావో ? అది మనకంటె అడిఏనదియేమో ? ఓడిపోయితి మేనిఁ బరాభవముకాదా? కానిమ్ము. నీ బుద్ధిబలం బే తన్మాత్రంబే అనిపలుకుచు నాకలి కింజూచునుత్సుకత్వమెద దంగండుకొన మిత్రునితోఁగూడ బయలుదేరి కతిపయప్రయాణంబుల నవ్వీటికఱిగెను.

దుర్గానగరంబునఁ బద్మిని విద్యారూపవిశేషముల నెఱుంగని వారులేరు ఎవరి నడిగినను బాపురే ! యాబాలికయా ! ప్రాయమునకు మించిన విద్యగలది మంచి రూపము. మంచిగుణమని పొగడుచుందురు. కుముదాంగదునకు రాచ కొలువులోఁ గులపరిపాటిగ వచ్చుచుండెడి విత్తగణకోద్యోగంబు (షరాబుపని) గలదు. అందలి ప్రజలు పద్మిని సౌందర్యాదివిశేషంబులు పొగడుచుండ విని యబ్బురు వారిద్దరు నొకనాఁడు వారిండికిం బోయిరి. ఏడంతరములుగల యాతని మేడ వారికి మిక్కిలి వేడుక గలుగఁజేసినది. వీధి యరుగులు విశాలముగా నున్నవి. అందు గూర్చుండి లోపలినుండి వచ్చిన యొక దాదితో షరాబు గారున్నారా? అని యడుగుటయు నది బాబూ ? వారు కొల్వునకుఁ బోయిరి. సాయంకాల మారుగంటలకు వత్తురని అది యుత్తరముజెప్పి లోపలికిఁబోయి అంతలోవచ్చి తాము లోపలికిదయచేసి చావడిలోఁ గూర్చుండుఁడు మీనివాస దేశమెయ్యది ? పనియేమి యని అడిగిన గదాధరుండు ఈతఁడు వణిక్కులశిఖామణి నేను బ్రాహ్మణుఁడ మేమిరువురము బాటసారులమై యీవీటి కరుదెంచితిమి. మాకాపురము కుంభీనసపురము వినితండ్రి కోటీశ్వరుఁడు రత్నాకరుండనువాఁడు. ఈ నగరంబునఁ గుముదాంగదునివాడుక విని కులపరిపాటి నీతఁడు జూడవచ్చె. వేరొండు పనిలేదని చెప్పెను.

అమాటలు లోపలినుండి పద్మిని విని వేరొకపరిచారికచేఁ గనకకలశములచే ? బాదములు గడుగుకొనుటకై జలమంపినది. లోపలికిరమ్మని వెండియుం బలికించినది. కాళ్ళు గడిగికొని వార్మలోపలిచావడిలోనికింబోయి పీఠములపయిం గూర్చుండి

సభావిశేషములం జూచుచు నందు గాంచనపట్టికాఘటితమగు దర్పణాంతరంబున మెఱయుచున్న యొక చిత్తరువుం జూచి గురుదత్తుండు వయస్యా! యీ ప్రతిమ జూచితివా. కమలవిచక చక్రాదిచిహ్నితములై రక్తాంగుళీసంగతములై మృదువులై పాణిపాదములు వెలయుచున్నవి.

గదా—అవును పాణిపాదములే కాదు అనుపూర్వవృత్తములగు పిక్కలొక్కటియే యిక్కలికి చక్కఁదనము నొక్కి వక్కాణింపుచున్నవిగదా?

గురు—ఆహా! కంబువృత్తబంధురంబైన కంధరంబు ఈ ప్రతిమ సుందరం బప్రతిమానమని చాటింపుచున్నది చూడుము.

గదా—అదియొకటేల? వ్రటువులై నడుమంగన్పడు కెంపుగలిగిని యధరంబు, సంక్షిప్తంబగు చుబుకంబును, కలియ వక్రములై నల్లనై సాంద్రములగు భ్రూలతలు, ధవళరక్తత్రిభాగ భాసురములై ధీరసంచారమంథరములైన దృష్టిప్రసారములు చంద్రకళాసుందరమగు లలాటంబు నింద్రనీలప్రభారమ్యములగు నలకపంక్తియుంగలిగి విరాజిల్లు ముఖకమలంబు సోయగంబు కన్నులపండువు చేయుచున్నదిగదా.

గురు—ఈచిత్రఫలకములలోని కన్నియ యేజాతి యువతియో చెప్పఁగ గలవా?

గదా—పద్మిని పద్మినియే సందేహములేదు.

గురు—ఆహా! ఇంతదేశము దిఱిగియు బ్రత్యక్షముగాఁ బద్మినీజాతి యువతిం జూడలేకపోయినను నేఁడింటి చిత్రఫలకమైనఁ గనంబడినది కృతకృత్యులమైతిమి గదా.

గదా—ఇది చిత్రకారుని రచనాచమత్కృతి యనుకొనుచుంటివా యేమి కాదు.

గురు—మఱియేమి!

గదా—ప్రతిబింబమే.

గురు—ఇప్పు డిప్పుడమి నిటువంటి వాల్గంటులు గలరా?

గదా—లేనిచో భవదీయ విద్యాగుణభాగ్య విశేషంబులకు సాద్గుణ్యమెట్లు?

గురు—ఈకన్నియ ప్రాయమెంత యున్నదనియెదవు?

గదా—బాల్య యౌవనాంతర ప్రాయంబుగలదని యవయవ స్థౌల్యంబు దెలియపరచుచున్నది.

గురు—అగునగు నీకుసుమగాత్రికి విద్యాసౌరభ్య ముండునని తలంచెదవా?

గదా—లేనిచో చతుర్ముఖుని నిర్మాణ కౌశల్యము నిందితవ్యము కాదా?

అని వారు సంభాషించుకొనుచున్న సమయంబున నొక పరిచారిక ఫలములు కొన్నితెచ్చి బల్లమీఁదఁబెట్టి భుజింపుమని చెప్పినది. గదాధరుఁడు ఓసీ! అల్మిర ఫలక మెవ్వరిది? అని యడిగెను. మా అమ్మాయిగారిదేయని యుత్తరము జెప్పినది. మీ అమ్మాయిగారి పేరేమి? యనుటయుఁ బద్మిని అని చెప్పినది. ఆమె చదువుకొన్నదా? యని గురుదత్తుఁడిగెను చదువు గిదువు నాకుఁ దెలియదు మీరా మెకు సమాధానము జెప్పఁగలరా? గొప్ప గొప్ప పండితులు వచ్చి యోడితిమని పలికి పోవుచుందురు. అని చెప్పుచుండ లోపలినుండి మందలింపుచుఁ పద్మిని సీ! మూర్ఖురాల! యిటురా! తెలియక పలుకుచుంటివి వారికదనా? నీ యభ్యాఖ్యానము చాలు చాలు. ఈవలకురా? అని చీరినది

దుందుభిధ్వనివలె మనోహరమైన యాకంఠధ్వనివిని గదాధరుండుబ్బుచు బద్మినీ! యిటురావమ్మా! నీ విద్యావిశేషములు వినియే నిన్నుఁజూడ వచ్చితిమి. పండితులతో నీవు సంభాషింతువని వినియుంటిమిగదా హృదయంగమంబులగు సుపోద్ఘాతములచే మాకుఁ జెవులు పండువు గావింపవా? అని పలికెను.

శ్లో॥ వైదేహి! యాహి కళశోద్భవ ధర్మపత్నీం
అచక్ష్వ రావణవధాది కథాస్సమస్తాః
పృష్ట్వాపి మా పదపయోనిధి బంధనంమే
సైవాహ్యభిఖ్య లికితాంబుసిధేః కళత్రం

సముద్రమంతయు నాపోశనముగా గరతలంబున నిముడ్చిన యగస్త్యమహర్షి భార్యతో ముచ్చటింపుము సీతామహాదేవి తన భర్త సముద్రమునను సేతువుచే గట్టెనని ప్రగల్భముగొట్టిన నెట్లుండునో? నేను మీకడవిద్వాంసురాలనని చెప్పికొనుట యట్లుండును మీరు మహావిద్వాంసులు ఎఱుఁగని దాదిమాటలు పాటింపవలదు ఫలములు భక్షింపుఁడు మాతండ్రి వచ్చు వేళయైనది. సంభాషింతుముగాక యని చెప్పిన గదాధరుండు వికసించిన మొగముతో గురుదత్తుని జూచి తమ్ముఁడా! యట్టి యుపమానము దెచ్చినదియో చూచితివా? అని మెచ్చుకొనియెను.

అంతలో నామెకుఁ జదువు జెప్పిన పండితుఁ డచ్చటికి వచ్చి పద్మినీ! యని పిలుచుటయు నామె సిగ్గుచే నీవలకురాక లోపలనుండియే అయ్యగారూ! అందుఁ గూర్చుండుఁడు. వారు పండితులు వారితో ముచ్చటింపుఁడని పలికినది ఆతఁడా మాటవిని శంకించు గొనుచు జిత్రఫలకమునే చూచుచున్న వారింజూచి అయ్యా? మీరెవ్వరు? పండితులనది మీరేనా? యేమి చదివికొన్నారు. అని యడుగు నంతలో గదాధరుఁడా సంస్కృతభాషతో నుపన్యసించి తన విద్యాపాటవము జూపి యతని కచ్చెరువు గలుగఁజేసెను.

అతని యుపన్యాసమును వినిన తుది మొదలు తెలియక తెలతెల వోవుచున్న యాయాచార్యుని పక్ష మవలంబించి గురుదత్తుఁడు గదాధరుని యుక్తులఁగొన్ని ఖండించుచు నుపన్యసించుటయు నాయిరువురకుఁ గొంత ప్రసంగము జరిగినది. ఆ ప్రసంగమందు వారి శాస్త్రప్రవీణతయంతయు వెల్లడియగుటయు లోపలినుండి వినుచున్న పద్మిని విద్యాభిలాషిణియగుట నక్కజమందుదెందముతో గవాక్షమునుండి తొంగి చూచి గురుదత్తుని విద్యాప్రౌఢిమయు రూపసంపత్తియుఁ దనచిత్తమును సంకల్పశతాయత్తమును గావింప నానందపరవశయై ధ్యాననిశ్చలదృష్టియై పరికింపుచుండెను.

ఆచార్యులును దదీయ నిరవద్య విద్యావావదూకత్వమున కబ్బురము నెందుచుఁ జేతులు జోడించి కోవిదవసంతులారా! మీ ప్రాయంబు కడుచిన్నది. మీకళాపాటవంబు దుర్మదబుధహృదయ పాటనంబు గావింపుచున్నది గదా మీదేయూరు? ఇందులకేమిటి కరుదెంచితిరి. మీకులశీలనామంబు లెఱింగించి నాకు శ్రోత్రపర్వముగావింపుదురా? అని అడిగిన గదాధరుండు తమకథ యెఱింగించి యీ వైశ్యపుత్రికారత్నంబు విచిత్ర కళా కలాపదీపితయని జను లనుకొనవిని స్వకులాభివృద్ధి పరీక్షించువాఁడగుటంజేసి మాగురుదత్తుండు మీపద్మినితో ముచ్చటింప నిచ్చగలిగి యిందు వచ్చినవాఁడు అదిన్నది. మీకిమ్మరాలేకదా? విద్యాకరగ్రహణలాలసయని వింటిమే? ఈతండును విద్యాకరగ్రహణలాలసుఁడే కావున నాపూవుఁబోఁడి నిందు రప్పింపుఁడు ఇరువురు నొకసారి ముచ్చటింతురు. అని పలికిన వినిన యగ్గురువరుండంతేని సంతసించుచు అమ్మా! పద్మినీ! యిటురా! నీ హృదయాభిలాష తీరఁగలదు. నేఁటికి నీవు గోరిన పండితవరుండు లభించె వచ్చి ముచ్చటింపుమని పిలిచెను.

పద్మినియు నగ్గురుడిచ్చిన సమాధానవచనంబులకు నిచ్చిమెచ్చుకొనుచు నల్లన గుమ్మము దాపునకువచ్చి గురువరా! వారుశ్లేషకవులు వారితో మనము ముచ్చటింపఁగలమా! తనహాశ్లేష గుంభనముల కలరని బేలలుందురా? వారియాశయగ్రహణాభిలాష నాకు మిక్కిలి గలిగియున్నది. పితృవరప్రసాదంబునంగాని యదిసిద్ధించునేయని యుత్తరంబిచ్చినది. అప్పుడు గదాధరుఁడు కుమారీ! నీకుముఖత్వంబితనికి హృదయగమంబైనది. నీవు వీనితో ముచ్చటించుచు సిగ్గుపడుచున్నట్లుతోచుచున్నది. కానిమ్ము పోయిపత్తు మనజ్ఞ యిమ్ము. మీ తండ్రివచ్చిన పిదప మఱల వత్తుమనుటయు నాచిన్నది గదాధరునకు నమస్కరింపుచు నార్యా! మాతండ్రి వచ్చువేళయైనది మీరువచ్చిన కార్యంబేదియో అతని కెఱింగింపఁ దీర్పఁగలఁడు నేను జిన్నదానను నాకేమియుం దెలియదు. ఆదినుండియు మీసహాధ్యాయులు మావారుగదా? వారిందే కుడుతురు మీరు మాగురునింట భుజింతురు గాక తొందరయేల? అని వినయముతోఁ బలికినది.

అమృతపు సోనవలె నప్పలుకులు తనచెవులకు ముదము గలుగఁ జేయుటయు గురుదత్తుండు వికసితముఖారవిందుడై గదాధరు సుపశ్లాఘించెను.

ఆసన్న గ్రహించి యాసన్నవర్తియగు గుమ్మడు పద్మినీవరుండు రాగానుషంగుడై విశ్రమింపఁ బక్షిమాచలనిలయంబు చేరుచున్నవాఁడు పద్మినీగురుండును వచ్చు వేళయైనది మీరెక్కడికి కేగెదరు? ఇందే యుండవచ్చును అని పలుకుచు అతండు భాగ్యవిభవంబులు నడుగుచు వారిలో ముచ్చటింపుచున్న సమయంబునఁ గుముదాంగదుఁ డోలగమునుండి యింటికివచ్చి అందున్న క్రొత్తవాండ్రం గాంచి వారెవ్వరని యడుగుటకు సందేహించుమంత నౌకరులు వారి యుదంత మెఱింగించిరి.

రత్నాకరుని వాడుక వినియున్న వాఁడగుటఁ గుముదాంగదుఁడు గురుదత్తు నత్యంత గౌరవప్రతిపత్తి జూపుచు దానింటఁ బెనిశఱినరుదెంచుటచే నెఱుఁగమి నింటిలోనివారలు దగినమర్యాదజేయలేకని చెప్పఁబోవుచు గదాధరుండు కల రూపెఱింగించి పెద్దగాఁ బద్మినిం బొగడెను. కుముదాంగదుండు మిగులఁ జెంగుచు నాతేయి నుపాధ్యాయునింటికి గదాధరుం గుడవఁబంపి తనయింటఁ గురుదత్తునకుఁ బెద్దగా విందు గావించెను.

అతఁడు రాత్రి భార్యతో రహస్యముగా నతని కులశీలరూపవిద్యాధనగౌరవంబు లుగ్గడించుచుఁ బద్మిని నతనికి వివాహము చేయుదమా! అని యాలోచించి కుమారి యభిప్రాయము తెలిసికొమ్మని నియమించుటయు ఆమె నవ్వుచు నిదివరకే దాని మానసంబు వానిపై వ్యాపించినది. దాది చెప్పినదని నడుపుటయు నతగును బుత్రికిని జాటుగాఁ బిలిచిఅమ్మా! నీవందరికిని వంకలు పెట్టుచుందువు. ఈగురుదత్తుఁ డెట్టుండెను? విద్యలోఁ బరీక్షించితివా? అని యడిగిన బాల ముసిముసి నగవులు నవ్వుచు మీరు పెద్దవారలు మీకంటె నాకు దెలియునాయని చెప్పినది

అబ్బా! ఈపెద్దతి మింతకుమున్న మాయందుంచితివా? మేమిష్టపడినవారిని నెందఱదూఱితివి. ఇప్పుడు నీకిష్టమయ్యెం గావున నిట్లనుచుంటివి. కానిమ్ము మాకది యును సంతోషమే భాగ్యముతో బనిలేదు. విద్యలో నెంతవాఁడని యడిగినఁ దండ్రి! ఇక దాచనేల గొప్పవిద్వాంసులు మనదేశములో నింతవారుఁ లేరని పొగడినది.

అంతలో నాచార్యునితోఁగూడ భుజించి గదాధరుఁడు వచ్చినవాఁడను వార్తవిని కుముదాంగదుండు చావడిలోనికివచ్చి చమత్కారముగా ముచ్చటించుచు గురునితోఁ దనయభిప్రాయము సూచించెను. భోజనపు వేళ గదాధరుండా గురునితో గురుదత్తుం డభిలాషయెఱింగించియున్నవాఁడగుట గదాధరునితోఁ గుముదాంగదుండు విననిట్లనియె.

విబుధేంద్రా! గురుదత్తుండు భాగ్యంబున మహేంద్రుం దిరస్కరించువాఁడని లోకమెఱింగినదియే. అది యట్లుండె విద్యారూపశీలంబుల ననవద్యుండగుట మాపద్మిని వరించినది. జగన్మిత్రుండగు నితనిఁ బద్మిని వరించుట యబ్బురముగాదు. మరియొక కోరిక మిమ్ముఁ గోరుచుంటిమి వినుండు. ఈవైశ్యునకు లేక లేక పద్మిని యొక్కతియే పుట్టినది. దానివిడిచి యీదంపతులు క్షణముజీవింపలేరు. గురుదత్తుండు బద్మినిం బెండ్లియాడి యుండే యీ భాగ్యమనుభవించు చుండవలయును. ఇందుల కంగీకరింపుఁడు శుభముహూర్తము నిశ్చయింతమని పలికినవిని గదాధరుఁడు గురుదత్తు మొగము జూచెను.

అతం డెట్టిదైన నక్కన్యకారత్నము హృదయమున నిడుకొనుటకు వేగిరపడు చున్న కతంబున నంగీకారము సూచించెను. అంతలోఁ బద్మినివచ్చి లజ్జావిభ్రమలోల దృష్టిప్రసారముల నతని జూచుచు గురుదత్తు మెడలోఁ బుష్పదామంబు వైచినది.

అప్పుడు కుముదాంగదుఁడు మిగుల సంతసించుచుఁ దన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచుకొని గదాధరుని స్తుతియించుచు నప్పుడు శుభముహూర్తము నిశ్చయింపఁజేసి రత్నాకరునికిఁ దెలుపకయే మహావైభవముతోఁ బద్మినిని గురుదత్తునికిచ్చి వివాహము గావించెను.

గురుదత్తుండాడిన మాటవడువున వెంకయు నింటికింబోక యందేయుండి సమారూఢ యౌవనయైన పద్మినితోఁ గూడికొని యసమకుసుమశరక్రీడా పరతంత్రుండై యౌవనలాభంబు సార్థక్యము నొందఁజేయుచుండెను.

అని యెఱింగించి మణిసిద్ధుండు వేళయతిక్రమించుటయు నవ్వలికథ పైమజిలీయం దిట్లని చెప్పదొడంగెను.

# 123 వ మజిలీ కథ

## సురూపుని కథ

దుర్గానగరంబు సుప్రసిద్ధ పట్టణములలో నొకటి. ఆదేశంబున కదియే రాజధాని. సురూపుండను రాజకుమారుం డాదేశాధిపతియై ప్రజల బాలింపుచుండెను. పట్టభద్రుండైన కొలది కాలమునకే రూపమదము, యౌవనమదము, విద్యామదము రాజ్యమదమునుం గలసి యతనిచిత్తమును విపరీత క్రియాయత్తము గావించినవి. సప్తవ్యసనములలో మొదటివి నాలుగును వానికి నిత్యకృత్యము లయ్యెను.

శ్రోత్రియుల మన్నింపఁడు. విద్వాంసుల దూషించును. మంత్రులనిరాకరించును. విటుల గౌరవించును. జూదరుల నాదరించును. మద్యపులఁ జేరదీయును. పరాంగనాసంగమమున రావణుని మించినవాఁడని వాడుక బడసెను. రూపవతియగు

యువతి అతని కన్నులంబడిన గవయక విడువఁడు. గోమినియను దాదియుఁ గరటుండను పరిచారకుండును వానికిఁ దత్కృత్యంబునఁ బరమమిత్రులై తిరుగు చుందురు.

ఒకనాఁ డతండు దుద్యానవనంబునందలి క్రీడాసౌధంబున వసించి యందు వెన్నెలలు గన్నులపండువు సేయుచుండ గోమినిని రప్పించి విరహాతురత్వంబు ప్రకటింపుచు నిట్లనియె.

గోమినీ! నీవు నిత్యమును గ్రొత్తక్రొత్త పూవుఁబోఁడులం దీసికొనివచ్చి ముచ్చటలుదీర నా కుత్సాహంబు గలుగఁజేయుచుంటివి. అబ్బా! నేఁడుబాధ నేనెన్నఁడును పడియుండి యెఱుంగను. నామేను ముట్టిచూడుము మండిపోవుచున్నది. ప్రతీకారము గావించి బ్రతికింపుము అని నిట్టూర్పులు నిగుడఁ బలికిన విని యాదూతిక యాతురతతో నిట్లనియె.

అయ్యో! దేవర కిట్టి బాధపడ నవసర మేమివచ్చినది? మీరు కోరిన యే నారీమణి యనుమతింపదు? ఏయువతిం దలంచి మీరిట్టి యవస్థ వహించితిరి వేగము యాగజగామినిం బేర్కొనుఁడు మీ పాదాక్రాంతురాలిం గావించెదను అనువతి మిమ్ము నిరాకరించుట కరుంధతియా? సతియా? ఆ వ్రతమెట్టిదో చూచెదంగాక యానతీయుఁడని పలికిన విని యారాజకుమారుం డిట్లనియె.

గోమినీ! వినుము. నావలపంత [illegible] యైనది. ఆ కలకంఠికుల నాకులశీలంబులు తెలియవు. మొన్నటి విజయదశమి యుత్సవమునాడు రాత్రి పట్టపేనుఁగునెక్కి వెంకటేశ్వరుని రథముతో ముంగిల నూరేగుచుంటిని. ఒక మేడయొద్ద నిలువంబడి యుండ నాయింటిలో నుండి యొక వాల్గంటి యీవలకు వచ్చి స్వామికి నివాళి యిచ్చినది.

కప్పుర హారతి వెలుతురున నా సుందరి మోము చక్కఁదనమెంతయుఁ గన్నులపండువు గావించినది. అయ్యారే! అలి కన్నులు గిన్నులుకావు. యువజన హృదయాకర్షకములగు మదనుని యంత్రతమత్స్యములని తలంచెదను. ఆహా! ఆచెక్కుల తళుక్కు చూచితీరవలయును వెయ్యేల? అయ్యొయ్యారము, ఆనీటు, ఆనగలు, ఆచిలకము, ఆపొంకము. పుడమి పడఁతుల కెందును గలిగియుండుట చూడలేదు. అచ్చరలా మచ్చకంటికి దాస్యము సేయఁ బనికిరారు. అట్టి అందముగల సుందరి మనయూర నున్నదని యెన్నఁడును జెప్పితివి కావుగదా? నిత్యముపట్టణమంతయుఁ దిరిగి చక్కనివారిని వెదకుచుంటినని చెప్పుచుందువు. ఆరమణీమణింగాంచి పంచశరవిద్ధ హృదయుండనై మోహపరవశుండనై అంబారీపైఁ బడిపోయితిని. తరువాత నేమి జరిగినదో నాకుఁ దెలియదు. ఇంటికి వచ్చిన పిమ్మట మెలకువవచ్చినది.

అమ్మగువమొగము కన్నులకుఁ గట్టినట్లున్నది. అప్పటినుండియు నేమియుం దోచదు. నిద్రపట్టదు. ఆహారము రుచింపదు. నీకొఱకెన్నియో వార్తల నంపితిని. తరువాతి కృత్య మాలోచింపుము. ఇదియే చింతాకారణమని పలికిన విని యాదూతికి యిట్లనియె.

దేవరవారి అభిలాష సమంజసమైనదియే కాని యామానవతి యున్న గృహమైన గుఱుతు జూచితిరికారు. ఈపీటిలో నే నెఱుంగనిచోటి యెవ్వతెగలదు. పేరు దెలిసినఁదృటిలో మీకౌఁగిటలో జేర్పించెద నావీథియైన జ్ఞాపకమున్నదియా? అని అడిగిన అతండు నాకేమియుందెలియదు. వీథిమాటగాకయా దిక్కుఁ గూడఁజెప్పఁజాల నని యుత్తరమిచ్చెను.

అప్పుడా గోమిని యించుక సేపాలోచించి అతనిచెవులోనేదియో చెప్పినది. దానియుపాయమున కతండు మిగుల సంతసించుచు నప్పుడే ప్రధానమంత్రిని రప్పించి సచివోత్తమా! మనము మొన్న నొక పొరపాటుపని జేసితిమి. విజయదశమినాఁడు హరిహరుల సిరువుర నూరేగింపక హరికి మాత్రమే యుత్సవము జేసితిమి. దానం గోపించి భక్తసులభుండగు శంభుండు నాకలలోవచ్చి నన్నవమానపరచెదవా? యని యేమేమో ముచ్చటించి పోయెను.

దేవతా ద్రోహములనఁ బ్రమాదము రాకమానదు. కావున రేపటి సోమవారము రాత్రి శంకరునకు వెనుకటికన్న గొప్ప యూరేగింపు టుత్సవము జేయింపవలయును. మొన్న నేయేవీథులకుఁ ద్రిప్పిరో యాయా వీథులకుఁ దప్పక పోవలయు. మేళతాళములు మిక్కుటముగా నుండవలయునని చేయవలసిన కృత్యములన్నియుఁ బెద్దగా బోధించెను. మంత్రియు రాజాజ్ఞానుసారముగా సర్వము సంసిద్ధము గావించెను.

నాఁటిరేయి నారాజకుమారుండు చక్కఁగా నలంకరించుకొని భద్రదంతావళముపై నధిష్ఠించి గోమినినిఁ దన ప్రక్కనుండ నియమించి యామించుఁబోణి మాటలే చెప్పుచు నూరేగింపుతోఁ బోవుచుండెను.

స్వామిరథము ముంగలఁ బల్లకియుఁ బల్లకి ముంగలఁ దనయేనుఁగయు, దాని ప్రోలబోగము మేళము, తరువాత భజనలు, పైనగోవులు పిమ్మట వేణువీణాది గాన విశేషములు నడుచునట్లు నియమించెను. తనయేనుఁగ కదలుదనుక నందఱు నిలువవలయునని నిరూపించెను.

అతండుఁ మేడలుగలచోట్లఁ బెద్దతడవు నిలుపుచుండు. హారతులిచ్చు స్త్రీల నిరూపించి చూచుచుండును. ఆ రీతి రెండు యామముల దనుకఁ బోవునంత నొక

సౌధంబు మ్రోల నుత్సవము నిలిపి రాజు గురుతుగా నామేడఁ జూచుచుండ నామేడలో నుండి మబ్బు వెల్వడిన మెఱపుతీగియుంబోలి మానినీరత్నం బొకర్తుక తలుపులు తెఱచుకొని పీతాంబరధారిణియై మోడ్పుకేలుతో స్వామిని స్తుతించుచు ద్వారమున నిలువంబడినది. దీపముల వెలుఁగున ధగద్ధగాయమానంబులగు నాభరణ కాంతులు మిఱుమిట్లు గొలుప అద్భుత లావణ్య పరిపూర్ణయై ప్రకాశించు అక్కాంచన గాత్రి మోము పరికించి రాజు తడఁబడు పలుకులచే అదిగో అదియే మదీయ హృదయచోర కురాలు అని ముమ్మారు పలికి మోహవివశుండయ్యెను.

అప్పుడు గోమిని యేనుఁగును డిగి తదీయ కులశీలాదులఁ దెలిసికొనివచ్చి నృపతిని ప్రబోధితుంజేసి యిట్లనియె. దేవా! యీ మేడ విత్తగణకుఁడు (షరాబు) కుముదాంగదునిది. అమదవతి అతని కూఁతురు. పేరు పద్మినియఁట. మంచి చక్కనిది. మీరు వరింపఁదగినదియేయని పొగడినది.

రాజు విస్మయ మభినయించుచుఁ బెద్దతడవందునిలిచి అక్కలికి సోయగ మాపోవని చూడ్కుల నరయుచుండెను. పద్మిని స్వామికి నివాళియిచ్చి స్తుతియించి ప్రసాదము గైకొని యందు నిలువక మేళ తాళములు చూడక లోపలికిం బోయి నది.

అప్పుడు రాజు కుముదాంగదుని రప్పించి గౌరవించుచు సెట్టీ యీ మేడ నీదఁటకాదా? బహురమణీయముగా నున్నదే! మాకెప్పుడుఁ జూపితివికావేమి! అని యడిగిన అతండు చిత్తము చిత్తము మా పూర్వులు గట్టినది. దివాణపుదయ వలనం గలిగినదియే మేముతమజనముకామా! లోనికి దయచేయుఁడు అని వినయం బునఁ బ్రార్థించుటయు నారేఁడు ఇప్పుడు ప్రొద్దుపోయినది రేపు జ్ఞాపకము చేయుము. సాయంకాలమున వచ్చి చూచెదంగాక! మా పరిజనముల సంపదలు మాకు సమ్మోద జనకములు అని పలికి అతని నంపి యా యుత్సవముతోఁ గొంత దూరము పోయి నిద్రకు నిలుఁవలేనని యింటికిం బోయెను.

మరునాఁడు కరటుని రప్పించి విప్రకుమారా! నీవు శృంగార లీలాతరంగిత ములైన గ్రంథములు పెక్కు చదివితివి. కామశాస్త్రమంతయు నీకుఁ గంఠస్థమై యున్నదిగదా! వాత్స్యాయనసూత్రములు నీకు సంధ్యావందనమువలెనే గట్టిగా వచ్చును. రాత్రి నేను జూచిన చిన్నదానిచరిత్రము నీకుఁ జెప్పితినిగదా? ఆ వాల్గంటి వంటి వన్నెలాడి పుడమిలో నేనిదివరకుఁ జూచియుండలేదు. కోమటింట నట్టి సొగసు కత్తె పుట్టుట వింతగదా! అక్కాంతనాచెంతకెప్పుడు తీసికొనివత్తువు? ఉపాయ మేమి? నిమిషము యుగములాగున్నది. విరహవేదన భరింపలేకున్నవాఁడనని పలి కిన విని యాబ్రాహ్మణపుత్రుం డిట్లనియె.

దేవా! దాని చరిత్ర మిదివఱకు నేనెఱింగినదియే! అది యుత్తమ జాతి యువతి. నేను పెక్కుసారులు శ్రోత్రియ వేషముతో వారింటికేగితిని. పల్కరించి చూచితిని. మోమెత్తి చూడదు. ముఖవిలాసము లరయవలయునని యెంతయో ప్రయత్నించితిని. ఇంచుకయు నవకాశ మిచ్చినది కాదు. సంతతము దేవతాతిథిసత్కారములు జేయుచుండును. విద్యలలో సరస్వతిని మించినది ఆ బోటితో నవకాశమిచ్చినను మా బోటులు మాటాడఁగలరా? అసాధ్యమని తలంచియే యక్కాంత వృత్తాంతము దేవరకెఱింగించితిని కాను. అని చెప్పిన విని యన్నరపతి గోమినిని రప్పించి యిట్లనియె.

గోమినీ! కరటుండు మనయెడ కపటము చేయుచున్నవాఁడు పద్మిని మహాపతివ్రతయఁట కన్నెత్తి యెవ్వనిజూడదఁట స్త్రీలటక్కులు స్త్రీలకేకాక యొరులకుఁ దెలియవుగదా! పద్మినివశవర్తింజేసి వీని నోడించితివేని నీకు లక్షరూప్యములఁ గానుకగా నిచ్చెద నేమనియెదవని యడిగిన నది మూపులెగరవైచుచు నిట్లనియె.

దేవా! యిది యెంతపని కాలవిలంబము సైచితిరేని నరుంధతివంటి వాల్గంటినైనఁ బుంశ్చలిం జేయగలను. ఈ వైశ్యపుత్రిక మాట లెక్కయేల? ఏటో కైతవంబున మీరొకసారి యానారీరత్నము కన్నులంబడి రండు తరువాత మీగుణగణంబుల బొగడి తానంతవచ్చి మిమ్ము సేవించునట్లు చేసెద నామాయలఁ బరసి పడఁతి గలదా యని పలికిన విని రాజుమిగుల సంతోషించెను కరటుండు నవ్వుచు కపటకృత్యముల నీనాసతి తిలకమును వశవర్తినిం జేసితివేని సిఖాయజ్ఞోపవీతములఁ దీసి సన్యాసినయ్యెద నిదియే నాశపథము.

కం. లంజ పడంతుల కడనే
రంజించు న్నీదువాక్యరచనలు మతిసా
గంజెల్ల వాపె కడపడ
భజించు నిన్ను వాడు పదవాతిఁబలుకన్.

నీమాయాడాంబికా డంబరములా కంబుకంఠికడ నుపయోగింపవని యెత్తిపలికిన గోమినియు నామత్తకాశినిం దెత్తునని పెద్ద శపథము జేసినది. అక్కారణంబున వారిద్దరికిఁ బెద్ద కలహము జరుగుటయు రాజు గోమినిపక్షముగా మాట్లాడుచు గరటుని మందలించెను. ఇంతలోఁ గుముదాంగదుండు దర్శనార్థియై వచ్చెనని ద్వారపాలుండు వచ్చి చెప్పినంత నయ్యంతఃకాంతుఁడు సంతోషముతో నెదురేగి పాణిబాణింబీడించుచు సుఖాసనాపవిష్టుంజేసి యెఱుంగనివాడుంబోలె నాగమనకారణం బడుగుటయు ధనగణకుఁడు దేవా! రాత్రి సెలవిచ్చిన మాటమరచితిరా! నేఁటి సాయంకాలము మాయింటికిఁ దయచేయుడుమని చెప్పలేదా! పిలువ వచ్చితినని పలికెను.

సంభ్రమముతో అయ్యో! ఆ మాటయే మరచితిమి గోమినీ! ఈతండు మాకు ముఖ్య స్నేహితుండు వీని సంపదల కానందించితిమి సౌధము నా స్వాంతమునకు వింతగొలిపినది. చూచి వత్తము రమ్మని పలుకుచు నప్పుడే యశ్వశకటము దెప్పించి వర్తకునిఁ బ్రక్కనిడుకొని గోమిని వెనుక నిలువ నతివేగముగాఁ గుముదాంగదుని యింటికరిగెను. అలంకార శోభితమైనను రాజు చూచునని యా వర్తకుఁడు మేడను గ్రొత్తగా నలంకరించెను.

బండి దిగిన వెంటనే వర్తకుఁడు రాజునకుఁ గైదండ యొసంగి అల్లన యింటిలోనికిఁ దీసికొనిపోయెను. గోమిని వెంటనంటిరా నా అంతరము లన్నియుఁ జూచుచు మెచ్చుకొనుచుఁ బద్మిని గనంబడునేమో అని నలుమూలలు తొంగి తొంగి చూచుచుండెను. తిరిగి తిరిగి యెందును నాసుందరిం గానక యొక చావడిలోఁ గూర్చుండి రుక్మాంగదునితో సెట్టీ! నీకుఁ బిల్ల లెందరని యోగక్షేమమడుగుటయు నతం డిట్లనియె.

దేవా! నాకు లేక లేక యొక్కరితయే కూఁతురు గలిగినది. పురుషసంతతి లేదు. కుంభీనసపుర వాస్తవ్యుఁడగు రత్నాకరుఁడను వైశ్యపుత్రుఁడు గురుదత్తుఁడను వానికిచ్చితిని. అల్లుఁడు మా యింటనే యున్నవాఁడని పలుకుచుఁ బరిజనునంపి అతనిఁ రప్పించెను.

గురుదత్తునిఁ జూచి రాజు లోపలవిస్మయముఁజెందుచు నోహో! నీ అదృష్టము మంచిది మంచి అల్లుఁడే అని పలికెను. దేవా! యీతనికి సిరిచాలఁగలదు. విద్యలలోఁ బ్రసిద్ధిపడినవాఁడు మిక్కిలి విన్నాణి అని చెప్పగా నట్లయిన నిందూరకుండనేల? మన యాస్థానమునకు రమ్మనుము వేతన మేర్పరచెదను. పండితగోష్ఠి నృపునకు నవశ్యకరణీయముగదా అని పలికెను.

ఆమాటలేమియు వినఁపించుకొనక గురుదత్తుఁడు కొంతతడవందుండి అంతలో నేదియో పనికల్పించుకొని అవ్వలికిఁ బోయెను. పెద్దతడవున్నను బద్మిని గనంబడమిఁ జింతించుచు రాజు మఱిమఱి నరల శోధించి శోధించి పరితపించుచుఁ గొంతసేపటి కింటికింబోయెను. గోమినికినిఁ బద్మినిం జూచు నుపాయమేదియుం దోచినదికాదు. కావున రాజుతో నఱిగినది. అని యెఱింగించువరకు

# 134 వ మజిలీ.

## గోమిని కథ

అమ్మా! మొన్న రాజుగారితో వచ్చిన గోమిని అను నామె ద్వారమున నిలువం బడియున్నది మీతో ముచ్చటింప వచ్చినదఁట. అయ్యగారు లోపలికిఁ దీసికొని పొమ్మని చెప్పినారు. తీసికొనిరానా అని పరిచారిక పద్మిని నడిగినది. పద్మిని యించుక యాలోచించి అయ్యగారు సెలవిచ్చిరా! అగును. రాజుగారిచుట్టము కాదా? రమ్మనుమని పలికినంత నదిపోయి గోమినిం దీసికొనివచ్చినది.

పద్మిని దానిం గూర్చుండ నియమించినది. అదియు నమస్కరించి కూర్చుండి తాన దెచ్చిన కానుకలు ముందిడి యువతీ! నీ యదృష్టము నూటోఁటులు గొనియాడఁ జాలరు. రూపమా! త్రిభువనజనమోహజనకము. ప్రాయమా మొదటిది బుద్ధియా బృహస్పతికి వంకలుపెట్టఁగలుగునంతటిది. విద్యలకు సరస్వతివే ధనముచే కుబేరున కప్పు పెట్టఁగలరు. ఇన్నిలక్షణము లొకచోట పట్టుట దుర్ఘటముగదా? ఈ పట్టణమేలెడు మహారాజుభార్యలు నీగుణములలో శతాంశమైనలేదు. వట్టియెడ్డిది! యేమియుం దెలియదు మా రాజునకు సరిపడినది కాదు. రాజుమాత్రము నవరస రసికుఁడు మంచి రూపముగలవాఁడు దైవము తగినవానికిఁ దగినభార్య నీయఁడుగదా! నీవాల్లభ్య మనుకూలమగునా? మారాజు నీవిఖ్యాతి విని మిగుల నానందించుచున్నాఁడు. పాండిత్యముగల స్త్రీలచరిత్రము వినిన మా రాజునకుఁ బెద్దసంతోషము ఈ పూవులు, ఫలములు నీకుఁ గానుకగా నిచ్చెను. ఈపుట్టంబులు నీకుఁ గట్టఁబంపెను. మొన్న మీయింటికి వచ్చినది మొదలు మీయందు స్నేహభావము గలిగియుండెను. అని కడు నైపుణ్యముగాఁ బలుకుచుఁ దానుదెచ్చిన వస్తువులు ముంగలఁబెట్టినది.

పద్మిని దానిం జూడక మొగమున నించుక అలుక జనింప గోమినీ! నీదూతికాకృత్యములు నాయొద్దఁ బ్రకటింపకుము. నీస్తోత్రపాఠములకు నేను బుబ్బదానను గాను రాజు రసికుండగుటయు స్త్రీవిద్యాలాలసుండగుటయు రాజ్యతంత్రమునకు ముఖ్యాంగములు గావు. ధర్మబుద్ధిఁగలిగి ప్రజల బిడ్డలఁగాఁ జూచుచు దుష్టశిక్షణంబు శిష్టరక్షణంబు సేయుట రాజధర్మము. దుర్వ్యసనాసక్తుండగు రాజు సిరి వేసవిని మడువువలె క్షీణించును. నాగుణంబు లతండు వినుతించుటకుఁ గతంబులేదు. నాకీ కానుకలంపుట భావ్యముగాదు సన్నుతం దెల్లెఱుంగును. సంసారి స్త్రీ చరిత్రతో అతని కేమిపనియున్నది నాచక్కఁదనము ప్రశంసింప అతనికేమి యక్కర నాకీ కానుక లక్కరలేదు. తీసికొనిపొమ్ము ఇట్టి మాట లెన్నఁడును నాయొద్ద జెప్పకుమని పలుకుచు నాతలికి అందు నిలువక అవ్వలికిం బోయినది.

అప్పుడా గోమిని సిగ్గుపడి యేమిచేయుటకుం దోచక యొక్కింత తడవు ధ్యానించి యావస్తువులందే యుంచి క్రమ్మరి అమ్మనుజపతియొద్దకుఁ బోయినది.

అతండు పదియడుగు లెదురువచ్చి చేయిపట్టుకొని యేమి జరిగినది ? అనుకూలపడినదియా ! నీబుద్ధిబలమునకు లోఁబడని వారుందురా ? అక్కటా ? నీయాగమనావకాశ సమయము యుగాంతరములట్లు తోచినదికదా ! అని యాతురతతో అడిగిన నది యించుక దిగులుతో నాపతికిట్లనియె.

దేవా ! అపూర్వుఁబోఁడి సామాన్యురాలుగాదు. అభిలాషయున్నను దెప్పున హృదయమిచ్చినది కాదు గంభీరురాలు. స్త్రీ చిత్తము దెలిసికొనుట కడుంగడు కష్టముగదా? మీ గుణంబులు పొగడితిని. మీ రూపము వర్ణించితిని మీసరసత్వము గొనియాడితిని. అన్నింటి కన్నియు వంకలే పెట్టినది కానిండు. అని నిట్టూర్పు నిగుడించిన గుండె ఝల్లుమన అమ్మనుజవల్లభుం డిట్లనియె.

గోమినీ ! నీవిట్లు తెల తెల్లబోవుచుంటివేమి ? చూచి మాటాడితివా ! యేమన్నది అచ్చముగా నామాటలం జెప్పుమనుటయు అది జరిగిన కథయంతయుం జెప్పినది. ఱేడు చింతించుచుండఁ దొందరపడవలదు. స్త్రీ చిత్తము క్షణమున కొకరీతి నుండును. కార్యము సాధించెదనని రాజును సమాధానపరచి పెక్కువెవసంబులు వన్ని వారింటికి బలుమారు పోయినది కానీ పద్మిని దానిమాటలకు లోఁబడినదికాదు.

కొనకు వేసరి యాదాసరిది రాజునొద్దకువచ్చి దేవా ! నేనును భూమండలమంతయుం జూచితిని. కాని యిట్టి జంత నిట్టిరాగ, నిట్టిబాణ నిట్టిపలంతి, నిట్టిగరాసు, నిట్టిప్రౌఢ నెందును జూచి యెఱుంగ ఏమన్న పుణ్యపత్నిగా గణించి శ్లోకములు చదువును మనకు నీతి యుపదేశించును. పెక్కేల దేవరనడవడి బాగులేదని యాక్షేపించినది ఇఁక దానితో నెట్లు మాట్లాడుదునని చెప్పినంత యుగాంతప్రళయాకారంబు పగిది గర్జిల్లుచు నేమీ ! యామోటుకొలముది మాకునుం దప్పులుపట్టినదిగా ! తన్ను వరించినందులకు అనుగ్రహముగాఁ దలంపక గడుసుదనముచే వెక్కిరించుచున్నదిగా ? చాలుఁ జాలు. స్త్రీలు సామమునఁ జిక్కఁబడరు. లోకాపవాదమునకు వెఱచి యిన్నినాళ్ళోర్చితిని. ఇఁక కాచికొనుమనుము నా కపటి సందేశ మెఱింగించి రమ్ము.

సామమున మాయేలికతోఁ గూడినఁ బోఁడిచేడియలలో సుత్తమురాలవై సామ్రాజ్య సౌఖ్యమనుభవింపఁగలవు. లేనిచో నిన్ను బలాత్కారముగానైనను బరిభవింపక మానఁడు నీభర్తనుఁ దల్లిదండ్రులను జెరఁబెట్టి సంపదయంతయు లాగికొనును. పిమ్మట నీకడ్డుపడువారెవ్వరో చూతముగాక. అని నిర్భయముగాఁ జెప్పి రమ్ము. పొమ్మని పలికి అతండు దానినంపెను.

ఆదూతయు నిర్భయముగా నరిగి కబురుసేయకయే పద్మినియున్న మేడకుం బోయి నాతీ! నీతో నొక రహస్యము చెప్పవలసియున్నది. యిటు రమ్మనిపలికినఁ బద్మిని దాయిఁ జాలు నీరహస్యములు నాకవసరములేదు. నీవు మాయింటికి దరుచ రావలదని చెప్పలేదా? మఱల నేమిటికి వచ్చితి వనవుడు నది తల్లీ! నీవు నాపైనఁ గోపింప నక్కరలేదు. ఇదియే కడపటిసందేశము వినుము ఇఁక దాచనేల? ఆ రాజ పుత్రుఁడు నిన్ను వరించియున్నవాఁడు నీమీఁది మోహంబున నిద్రాహారములులేక కృశించి రాత్రింబగళ్ళు పరితపించుచున్నాడు. అతనియాసద బాటింతువేని స్త్రీలలో నీవంటి అదృష్టవంతురాలెందును లేదు. నీవతనింగూడిన నింద్రభోగము లనుభవింపఁ గలవు కాదంటివేని——

ఉ. నీదగుతల్లిఁ దండ్రి మగనిన్మఱిఁగల్గిన బంధుకోటి మ
ర్యాద యొకింతఁ జూడక రయంబున బద్దులఁజేసి మాన వి
త్తాదికముల్ హరించి నినునందఱుఁ జూడఁగఁ బట్టితెచ్చి స
మ్మోదముతోడఁ గూడునసృపుండెప రద్దమొనూతుమత్తరిన్.

నీకులంబునకెల్ల నీకతంబున ముప్పు వాటిల్లగలదని పలికినవిని అక్కలికి యులికిపడి యయ్యోదయం దట్టివాఁడు గాఁదలఁచి యొక్కింత చింతించి బిఱువవ్వా లయ నల్లన నిట్టనియె.

గోమిని యింతదనుక భూపతి హృదయమేమిటికి వెల్లడించితివికావు? నీవు సందిగ్ధముగాఁ జెప్పుచుండ నెఱింగియునట్లే యుత్తరము జెప్పుచుంటిని. రాజుకోరిన సమ్మతింపని వెంగలి యెందైనఁగలదా! సిరివచ్చునంత మోకాలడ్డుపెట్టుదురా? నీగడు సుతనంబంతయు నాయెడఁ గనపరచిన హృదయవిచ్చితిసికాను. నేఁడు వెల్లడిదచితివి. కావున నంగీకరించితిని. నేను మగనాలినిగదా? నామగఁ డనుమానములవాఁడు సతతము నింటనేయుండును నీవు పలుమారు వచ్చుచుండ శంకించుచున్నాఁడు రాజుతోఁగలిసికొనుట సామాన్యము! సంచియుపాయ మాలోచింపవలయును. కావున నీవు నాలుగుదినములుండిరమ్ము ఉపాయము చెప్పెదనని నొడివిన విని యత్యంతసంతోషముతో దూతిక యానాతిపీవు తట్టుచు నీవు మంచిజాణవగుదువు మెచ్చుకొంటి నీచిత్తము దెలిసికొనలేక పోయితిని నీవు చెప్పిననాఁడే వచ్చెదనని పలుకుచు దీవించి రాజునొద్ద కఱిగినది.

గురుదత్తుఁడు రాజు తన యింటికి వచ్చుటయు దూతికను బంపుచుండుటయు లోనగు విషయములన్నియుఁ బరిశీలించి యానాఁడు గోమినియుఁ దన భార్యయు మాటలాడుచుండ గడిలోనుండి చెవియొగ్గి వినెను. [illegible]దూరమగుటఁ గొన్ని మాటలు మాత్రమే వినంబడినవి.

నాలుగు దివసములలోరమ్మ ఉపాయము చెప్పెదనని నామగడనుమానము గల వాఁడు తరచు రావలదు అను మాటలు చెవినిఁ బడినంత నతండత్యంత చింతా క్రాంత స్వాంతుండై యిట్లుతలంచెను.

ఆహా ! స్త్రీల చేష్టితములు పలుమారు చదివియు నేను మోసపోవుచున్నాను.

అ. పరఁతినొక్కదాని విడిచి యించుట యమృ
తంబులేదు భువి విషంబు లేదు
అమృతలత లతాంగి యనురాగ వతియైనఁ
గాక మెలఁగెనేని గరళవల్లి.

రాజు దీనిఁజూచి మోహించి దూతికలఁ బంపెను. దూతిక కిట్లు చెప్పినది. ఇఁక దీనిం బతివ్రతగా నెట్లు నమ్మదగినది. అయ్యో పద్మినీజాతి యువతి మంత్రౌ షధములకు వశవర్తినికాదు మహా పతివ్రతి యగునని కొక్కోకుఁడు చెప్పినమాట నమ్మిదీనిం బెండ్లియాడితిని దీని కపట ప్రేమలన్నియు యథార్థములని సంతసిం చుచుఁ దల్లిదండ్రులఁ జూడక యిందే పడియుంటిని. నావంటి మూర్ఖుఁ డెందునులేడు. తరుచ చదువుకొన్న స్త్రీలకే తెలివిగల పనికలకే చాతుర్యముగల పొలఁతులకే శృంగారలీలలయం దభిలాషగలిగి యుండును. మగవాండ్రు అట్టి పొలంతులు పన్నిన వ్యూహములోఁ బడిపోవుదురు. సామాన్య కన్యం బెండ్లియాడిన నాకీ యుప్పు రాకపోయెడిది. ఈచెడిపె కథవినిన మాగ్రామవాస్తవ్యులెల్ల నవ్వుదురు. గదాధరుఁ డింటికిఁబోయి యింకను రాడయ్యెను. ఇప్పుడేమిచేయఁదగినది. చెప్పకుండలేచి పోవు దునా? కానిమ్ము నాలుగు దినములలో నది మరల వచ్చునుగదా? అప్పటి సంభాష ణము విని యుక్తానుసారము గావించెదనని యోచించి తత్సమయ మరయుచుండెను.

గోమిని రాజునొద్దకుఁబోయి మొగమున సంతసము వెల్లివిరియదేవా? నీయ భీష్టము దీరినది పద్మిని వశవర్తినియైనది కరటునిఁ బన్నిదములో గెలిచితిని అని సంక్షేపముగాఁ జెప్పుటయు నుబ్బుచు నతడు ఆహా! అమృతబిందువులవలె నీపలు కులు నాచెవింబడినవిగదా? ఎట్లు వశవర్తినియైనది? ఏమన్నది? చెప్పుము చెప్పుము. ఇదిగో ముందుగా నీకుఁ బారితోషికముగాఁ గడియ మిచ్చుచుంటినని పలికి యవ్వలయ మిచ్చుటయు నది యిట్లనియె.

దేవా! నేనెంత శ్రమపడితినసుకొంటిరి. అబ్బా! అదికడు జాణ విరహవేదనచేఁ గొట్టికొనుచుండియు గుట్టు తెలియనిచ్చినది కాదుగదా! నేనన్యాపదేశముగా మాట్లాడ నదియు నట్లే యుత్తరము జెప్పినది. సందేశము వెల్లడించిన నను మోదించినది చేతిఁ జిక్కినది. తిరుగారమ్మన్నదని పలికిన నాతఁడిట్లనియె.

గోమినీ! నేననుకొనుట కాదుగాని నారూపము, నారసికత, నాయౌవనము జూచిన యువతి రసికురాలైనచో విరాళిఁజెందకుండునా! సరే కానిమ్ము ఎప్పుడు రమ్మన్నది మనపరుషోక్తులు వినలేదుగద అని యడిగిన నది స్వామీ! చెప్పియుం జెప్పనట్లభినయించితిని నాలుగు దినములఁబుగవలయునని యావృత్తాంత మెఱింగించినది.

మఱియు నిరూపింపఁబడిన దివసంబున గోమిని పద్మిని యింటికి వెళ్ళి మాట్లాడివచ్చి రాజుతో నిట్లనియె

దేవా! యెల్లుండి యమవసనాఁడు రాత్రి పెరిటివైపుననున్న పశువులశాలలోనికి రమ్మన్నది. తలుపుతీసియుంచునఁట. అందుమంచము వైచునఁట ఒకరాత్రి యెట్లో కష్టపడిన దివ్యసుఖం బనుభవింపవచ్చునని చెప్పినది దీపములేని లోపము మున్ముందు తీర్పఁగలదఁట చాలాప్రీతిగా మాట్లాడినది అని చెప్పిన విని రాజు కానిమ్ము. ఒక్కరేయిగదా? యెట్లో కష్టపడియెదను ఒకసారి కలసిన వెంటఁబడి వచ్చునట్లు చేయనా? నాచాతుర్యము చూతువుగాక అనుచు నింకను అమవస మూడుదినములున్నదే, ఈ కాలవ్యవధి యెట్లు సహింతునో తెలియదు. ఈకష్టమంతయు దానికెప్పుడు విన్నవింతునో, ఎప్పుడది పశ్చాత్తాపపడునో అని యుఱ్ఱూతలూగు చిత్తముతో గడియలు లెక్కపెట్టుచుండెను నాలుగవదినంబునఁ బద్మిని దూతితో మాట్లాడిన విషయంబు లన్నియును గురుదత్తుఁడు చెవియొగ్గి విని దారుణవిషాద మేదురహృదయుండై ఛీ! ఛీ! ఆడుజాతికి గుణముండదన్నమాట సత్యము కొక్కోకుఁడేకాక వాత్స్యాయనాది మహర్షులును పద్మినీజాతియువతి యుత్తమురాలని వ్రాసిరి అది సౌందర్యవిషయము గాని గుణవిషయము గాదు. స్త్రీలలోఁ బతివ్రతయేలేదని చాటిచెప్పఁగలను. అన్నన్నా! పద్మిని నాయెడఁజూపు నక్కవినయములునమ్మి ప్రాణప్రదముగాఁజూచుకొంటిని అక్కటా! యిట్టిదే యిట్టి తుచ్ఛకృత్యములకుఁ బాల్పడుచుండఁ దక్కిన వారిమాట చెప్పనేల? కానిమ్ము. అమావాస్యచర్యఁజూచి వారిద్దరికి నామంచముమీఁదనే కడతేర్చి యింటికిఁ బోయెదనని నిశ్చయించి కత్తినూరుచుండెను.

అమావాస్యనాఁడు తెల్లవారినది మొదలు సురూపుఁడు గడియలు లెక్కపెట్టుచుండెను. పర్వదివసంబైనను క్షౌరకృత్యము జేయించి మీసములు దిద్దించెను. పన్నీట జలకమాడెను. అద్దము జూచుచుఁ గనుబొమ లెగురవైచుచు గోమినిం జీరి యోసీ! సూర్యరథ గమనము నేడింత మందమైనదేమి? యెంతసేపటికి ప్రొద్దు క్రుంకకున్నదే నాకే దుస్తులు సొంపుగా నుండునో చెప్పుము. అని పలుకుచుఁ బది దినుసుల నగలును, దుస్తులు ధరించి విడిచి యడుగుచుండును.

గోమినియు దేనికడియే చక్కగా నున్నదని రాజును స్తుతియింపఁ దొడంగినది. ప్రొద్దు క్రుంకినది. ఇఁక బయలు దేరుదుమా? అనుటయు నది నవ్వుచు దేవా! రాత్రి పండ్రెండు గంటలుగొట్టిన నిమిషమున నందుండవలయును. ఈలోపలం బోయినను దలుపుతీయదు. వీథినిలువంబడిన వారలుచూచి శంకింతురు. తాళుము తాళుము జాముసేపు తాళుము అని చెప్పుచుండెను.

రాజు గంటగంటకు నడుగుచునే యుండెను. పది గంటలుగొట్టినతోడనే యతనిమేనఁ గంపము జనించినది. ఇఁక నిలువలేను పదపద అని తొందరపెట్టుచు నుద్యానవనము నుండి బయలుదేరెను. రాజు గోమిని ముందుదారిఁ జూపుచుండ నీలాంబరము మేలిముసుఁగు వైచికొని మెల్లగా నడచుచు వారలు కనంబడిన బ్బారు పెదకొసరిల్లుచుఁ గొంతవడికిఁ గుముదాంగదుని పెరటిగుమ్మము దాపునకుఁ బోయెను.

గోమిని ముందుగాఁబోయి తలుపు గొళ్ళెము లేక యోరగా వైచియుండుటకు సంతసించుచు లోపలికిఁబోయి చీకటిలోఁ దడిమికొనుచు మంచమున్న తావరసి చేతితో మంచమునఁదట్టి మరల నీవలకువచ్చి రాజు చేయిపట్టుకొని లోపలి కిడసికొనిపోయి మంచముపైఁ గూర్చుండఁబెట్టి నేను వాకిటనుండెద నాపడఁతి యిప్పుడే రాఁగలదని మెల్లగాఁ జెప్పి తలుపు చేరవైచి గుమ్మములోఁ గూర్చుండెను.

గురుదత్తుండు అమావాస్యనాఁడు రాత్రి ప్రొద్దుపోయిన తరువాతఁ బసువుల చావడిలోనికిఁ బోయి తలుపుగొళ్ళెము వైవకుండుటయు, మంచముపరువఁబడియుండుటయుఁ దిలకించి పద్మిని నిక్కముగా దుర్వృత్తికిఁ బూనుకొనెనని నిశ్చయించి నూరిన కత్తి మంచముప్రక్క నిడుకొని వాఁడు కపటనిద్రఁబోవఁదొడంగెను.

పద్మిని మనోహరుని గుఱ్ఱువిని మెల్లగలేచి యొక కాగితము దీసికొని దీపము వెలుగున నిలువంబడి యిట్లు వ్రాసినది.

ఓమహాజనులారా! ఈరాజు పరస్త్రీలోలుండై మంచిచెడ్డల విచారింపక నన్నుఁజూచి మోహించి నాతల్లిదండ్రులఁ జుట్టములను నిర్బంధించి చెరసాలఁ బెట్టించి నన్ను బలాత్కారముగాఁ దీసికొనిపోయెదనని దూతికాముఖంబునఁ దెలియఁజేసి యున్నవాఁడు. బంధు పరిభవమునకును మానహానికిని వెరచి యొండు తెరవుగానక యొడంబడినట్లభినయించుచు నేఁటిరాత్రి మాయింటికి రమ్మని సాంకేతిక మేర్పరచితిని. యిప్పుడీ దుష్టాత్ముని నాకౌక్షేయకంబునకుఁ బలియిచ్చి మదీయపాతివ్రత్యము గాపాడుకొంటిని. ఇట్టి పాపాత్ముఁడు రాజుగా నుండుటకంటె ప్రజలకు మఱియొక యపకారములేదు. మఱియు నీ ద్రోహుని మూలమున సత్యసంధుండును

దయాహృదయుండునునై తల్లిదండ్రుల ధనధాన్యములవిడిచి నాకడవసించి తన ప్రాణముకన్న నన్నెక్కుడుగాఁజూచు మదీయ ప్రాణనాథుని నాపత్సముద్రమున ముంచి ప్రాణముల విడుచుచుంటిని. ఓరాజబంధువులారా! ఈ కృత్యము నా మనోహరుండుగాని నా తలిదండ్రులుగాని యించుకయు నెరుంగరు మీరు వారినేమియు దండింపవలదు. జన్మజన్మమునకు నాకు గురుదత్తుఁడే భర్త కావలయును. పూర్వజన్మచరిత దురితంబునంజేసి సుగుణసంపన్నుండగునట్టి మనోహరునితో సుఖింపకుండ నిట్లు బలవన్మరణము నాకు దటస్థించినది. అందులకు నిదేనమస్కారము.

ఓ మనోహరా! గురుదత్తా! నీవు నన్నుఁ బరీక్షించి పెండ్లిఁజేసికొంటివి. నీమన్ననలచే బ్రహ్మానందము జెందుచుంటిని. తల్లిదండ్రుల విడిచి, ధనధాన్యముల విడిచి, బంధువులవిడిచి, దేశమువిడిచి, నానిమిత్తమిందు వసించితివి యిట్టినీతో సుఖించుటకు నాకుయోగములేకపోయినది. నాఁడు దేవతోత్సవములలోఁ నన్నుఁ జూచినది మొద లీదుర్మార్గుఁడు పంపెడు వార్తలకు మేరలేదు. మీతోఁ జెప్పిన నేమందురోయని త్రోసిపుచ్చితిని చివరకుఁ బ్రాణసంకటమైనది. నన్ను మీరు దుష్టురాలిగాఁ దలంచితిరేని నాకుత్తమలోకములు గలుగవు. పుణ్యలోకమునకుఁ బోవునట్లు దీవింపుఁడు. మీకిదేకడపటి నమస్కారము ఓ తల్లిదండ్రులారా! మిమ్ము దుఃఖాంబుధిలోఁ బడవైచి యరుగుచుంటి నా కొరకు శోకింపక విరక్తిఁగలిగి పుణ్యకార్యము లాచరింపుడు మీకిదే నాచివరిమ్రొక్కులు అని వ్రాసి మడచి యాచీటినందు విడచి వస్తువులు తీయుటకై మఱియొక గదిలోనికిఁబోయినది.

అదియంతయుఁ గ్రీగంటఁ జూచుచున్న గురుదత్తుఁడు అహా! రంకుమగని కేదియో చీటి వ్రాసినది. చూచెదంగాకయని తలంచి మెల్లనలేచి యాచీటిని సంగ్రహించిమరల మంచముపైఁ బండుకొని యెఱుగనివానివలెనిద్రనభినయించుచుండెను.

అంతలోఁ బద్మిని వస్తువులన్నియుం దీసి నడుము బిగించి కత్తి చేతంబూని ప్రాణనాథుని మంచమునకు మూడు ప్రదక్షిణములుజేసి కన్నీటిధారం బాదంబులు దడియమ్రొక్కుచుఁ దాను వ్రాసిన చీటినందుఁగానక నలుమూలలు వెదకివెదకి యెందుంచినది జ్ఞాపకము లేక తిరుగుచుండెను. ఇంకయేల మఱియొకచీటి వ్రాసెదనని తలంచి యక్కాంత ఇంకొకగదిలోఁ గూర్చుండి వ్రాయుచుండెను.

అయవకాశముఁ జూచి గురుదత్తుండా చీటిని దీపము వెలుగునఁ జదివెను. మేను ఝల్లున్నది. గుండెలు కొట్టుకొనఁ బొడంగినవి మనసు నీరైనది. అదివరకా మదిరాక్షి పైగల కోపమంతయు నటునటుపైపోవ నిందించిన వాక్యములు దలంచికొని నేలం జతికిలపడి యేడువఁదొడంగెను. అంతలోఁ బొందర పుట్టినది. ఆగదిలోనికింబోయి

చూచినంత నామె అందుఁ గనఁబడలేదు. వేగముగా మేడమెట్లుదిగి పశువునసాలకడ కరిగెను. అప్పుడు యాచిన్నది రాజు చెంత కరిగినది. ఆమె నందుచూచి గురుదత్తుఁడు కాచికొనియుండెను.

పద్మిని పాదధ్వని విని రాజు తొందరఁజెందు డెందముతో సుందరీ! యిందు రమ్ము. నేనిందు వేచియుంటి గడియ యుగమగుచున్నది. అనిమెల్లగాఁ బిలిచెను.

పద్మిని దాపునకుఁబోయి తడుముచు నెడమచేతితో వానిశిరము పట్టుకొని వంచి గురిచూచి కుడిచేతనున్న పెద్దకత్తితో వానికంఠముపై పెద్దవ్రేటు వైచినది. హా! చచ్చితిని. హా! చచ్చితిని. అని వికృతస్వరముతోఁబలికి యాపాపాత్ముఁడు గిలగిల కొట్టికొని ప్రాణములు విడిచెను. అయ్యార్తధ్వనివిని గోమిని భయపడుచుఁ దలుపుతీసికొని లోపలికి వచ్చి దేవా! దేవా! అనిపిలిచి అతండు కొట్టుకొనుచుండఁ బరికించి తన్నుఁగూడ జంపుదురని వెరచి కాలికొలఁదిపారి యింటికిం బోయినది.

గురుదత్తుఁడు భార్యచేసిన సాహసము కన్నులారా చూచి వెరగుపడుచుఁ దటాలునవచ్చి కౌఁగిటవానిపట్టి కత్తిలాగికొని ప్రమాదము ప్రమాదము చేసితివని గద్గదస్వరముతోఁ బలికెను.

భర్తంగురుతుపట్టి యాశెట్టిపట్టి అయ్యో! మీరిక్కడి కెట్లువచ్చితిరి? నాయుద్యమమున కంతరాయము గావించితిరేల? విడువుఁడు విడువుఁడు. ఈక్రూరుని శిరంబు ముట్టితి జీవనముల విడిచెదనని పలికిన అతఁడిట్లనియె.

ప్రేయసీ! ఆత్మహత్య మహాపాతకముగాదా? యిట్టి కృత్యమున కుద్యోగించితి వేల? వీఁడెవ్వఁడు? ఇక్కడికెట్లువచ్చెను. వీని నేమిటికిఁ జంపితివని యెరుఁగనివాఁడుఁ వలె నడిగిన జరిగిన కథ అంతయుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పి అప్పుడంతి తన్ను విడువుఁడని బ్రతిమాలినది.

అతండు నవ్వుచుఁ బుష్పబోడీ! లోకకంటకుండగు వీనిఁజంపి యుప కారముఁ జేసితివి. ఇది నీకు పాపము కానేరదు. కీర్తికే హేతువగును. తొల్లి ద్రౌపది సింహబలుని జంపించలేదా? దాననామె కేమిపాపము వచ్చినది. ఉరుగుము. పదపద అని పలికిన నక్కలికి నాథా! మనమీతనిని జంపినవార్త విదితముకాకమానదు. రాజ పురుషులు మనల విడుతురా? నేనిందుఁకు బరియయ్యెద. మీరు సుఖింపవచ్చునని చెప్పిన నతండు చాలు. జాలు. నీవులేని సుఖము నేననుభవింతునా? భయము విడువుము. మనము దేశాంతరమరిగి సుఖింతము అని యేమేమో యుపాయముఁ జెప్పెను. ఆమెయు నంగీకరించినది.

అప్పు డిద్దరు రాచపీనుగను సాయముబట్టి వీథిలో దూరముగా బారవైచిరి.

అపుడా దంపతు లిరువురు తెల్లవారకమున్న యెవ్వరికిం జెప్పకయే యేకాంతముగా నిల్లు విడిచి దేశాంతర మఱిగిరి.

కుముదాంగదుఁడు వాడుకప్రకారము పెందలకడలేచి ప్రాతఃకృత్యములు నిర్వర్తించి అల్లునితో ముచ్చటింప నతని గదిలోనికిం బోయెను. తలుపులు మూయఁ బడి యున్నవి. గురుదత్తా! లెమ్ము లెమ్ము ప్రొద్దెక్కినది. నేను ఆస్థానమున కరుగు చున్నాను. రాజు రేపువచ్చునప్పుడు నిన్నుఁగూడ నగరికిఁ దీసికొనిరమ్మని చెప్పి యున్నాడు పోవుదము అని చీరియు నెంతసేపటికిని ప్రతివచనము గానక తలుపు త్రోసి లోపలికిఁబోయి నలుమూలలు వెదకి యెందునుం గానక తొందరపడుచుఁ బడక గదిలోనికిం బోయి కొమరితం బిలిచెను.

ఆమెయుం గనపడలేదు భార్యంబిలిచి మనవాళ్ళు మేడమీఁద లేరేమి? నీతోఁ జెప్పి యెక్కడికైనం బోయిరా? అని అడిగిన నా యిల్లాలు అయ్యో! నాకేమియుం దెలియదు. ఎందుఁబోవుదురు? అమ్మాయి యింత ప్రొద్దెక్కుదనుక లేవలేదని శంకించు కొనుచుంటి చూఁడుడు అని తొందరగాఁ బలికినది. ఇరువురు మేడయన్నియు వెదకిరి ఎందునుం గనంబడలేదు. భార్య దుఃఖించుచుండ నూరడింపుచు నాకు రాజసభకుఁ బోవువేళయైనది. రాజుతోఁజెప్పి సెలవుతీసికొని వత్తును. తొందరపడకుము. రాత్రి పండుకొనిరిగదా? మన యెల్లమని చెప్పకుండ బుట్టినింటికిఁ దీసికొనిపోయెనేమో? ఎద్దులును, బండియు నేకమైన మనమేమి చేయగలము. అని పలుకుచుఁ దాను రాజ సభకుఁబోయెను.

నాఁడు రాజు సభకు రాలేదు. మంత్రులు అత్యవసరకార్యములకై రాజు నిమిత్తము వేచియుండి శుద్ధాంతరక్షకుల రాజువార్త నడుగుటయు వాండ్రు రాత్రి యుద్యానవనములోఁ బండుకొనిరి. యింటికి రాలేదని చెప్పిరి.

కొందఱుమంత్రులు కేళీవనమున కరిగిరి. అందురాజు లేడనువార్తఁదెలిసి కొని శంకాకులితస్వాంతులై వితర్కపూర్వకముగా వెదకింపఁబొడంచిరి. కరటు నడుగుటయు నతండు నాకేమియుం దెలియదు. గోమిని నడుగుఁడని మంత్రులకుఁ జెప్పెను. విమర్శింప రాత్రి గోమినియు నృపతియు నాయుద్యానవనములో నేకాంత మాడినట్లు తెలియ వచ్చినది.

గోమినిని రప్పించి నీవు రాత్రి రాజుతో మాట్లాడినట్లు తెలిసినది. అతం డెందుఁ బోయె నెఱిగింపుమని యడుగుచుండ నది సందియమందు దెందముతో నాకేమియుం దెలియదని యుత్తరమిచ్చినది. అంతలో రాజభటులు హాహాకారధ్వనులతో వచ్చి సురూపునెవ్వరో కత్తితో నరికి పెంటకుండులోఁ బారవైచిరి. పురసమ్మార్జన కారులా

పెంటకెత్తుదుండ నడుగున నాథయని శవము గనంబడినది. పౌరులెల్లను గుమిగూడి చూచుచుండిరి. కుముదాంగదునియింట ముంగలకుండులోఁ గనంబడెనని మంత్రుల కెరింగించిరి.

మంత్రులందఱు దండనాథపురస్సరముగా నచ్చటికిఁబోయి కంఠము నరకఁబడి యున్న రాచపీనుఁగునుజూచి మంత్రులు విలపింపఁబొడఁగిరి. మేనంతయు మణిమ యాలంకారములచే నలంకరింపఁ బడియున్నది.

ఆశవమును పల్లకిపై నెక్కించి నగరిలోనికిం దీసికొనిపోయిరి రాజభార్యలు బంధు వులు విలపింపఁబొడంగిరి. కారణమెవ్వరికిందెలియదు. మంత్రులు గోమినిని నిర్బంధించి యడుగుటయు నది యథార్థముఁజెప్పినది అప్పుడు మంత్రులు రక్షకభట యుక్త ముగాఁ గుముదాంగదుని యింటికిఁ బోయి ముట్టడించిరి. పశువులశాలలో రక్తచిహ్న ములన్నియుం గనంబడినవి ఇల్లుశోధింపఁ బడ్మిని వ్రాసిని యుత్తర మొకటి దొరికి నది.

రాజు చేసిన దుర్నయమే రాజుంజంపినదని మనంబులఁ దలంచియు మంత్రులు దండనీతిప్రకారము కుముదాంగదుని నిర్బంధించి మీవారెందుఁ బోయిరో చూపింపు మని అడిగిరి.

అతడు తనకావిషయము మించుకంతయుఁ దెలియదనియు వారిజాడఁ దెలిసి కొనుటకే సెలవు కోరుటకై రాజసభకు వచ్చితిననియు లోనగు మాటలు చెప్పి దృష్టాంతములఁజూపి చెరసాలఁ బెట్టకుండఁ దన్నుఁ గాపాడు కొనియెను.

మంత్రులు సురూపున కపరసంస్కారములు నిర్వర్తింపఁజేసి సామంతచక్ర వర్తియగు గజేంద్రవాహనుని యాజ్ఞానుసారము తామే రాజభారమువహించి పాలిం చుచు గురుదత్తునిఁ బద్మినినిఁ గనంబడిన వెంటనే పట్టుకొని తీసికొనివచ్చునట్లు నానా దేశములకు దూతలం బంపుచు నాయాభూపతులకు వారు చేసిన రాజద్రోహాపరాధ మును బ్రకటించిరి. మరియు గూఢచారులు బెక్కండ్ర నియమించిరి. కుంభీనసపు రంబునకుఁ గొందఱు రాజభటులు పోయి అందున్న రాజు నానతిఁగైకొని రత్నా కరుని యిల్లుముట్టడించి వారిం బరీక్షించిరి. కాని యందునుఁ గనంబడలేదు.

రత్నాకరుఁ డావార్తవిని పిడుగు మొత్తినట్లు నిశ్చేష్టితుండై కొంతవడికి తెప్పి రిల్లి గదాధరుని రప్పించి యిట్లనియె.

గదాధరా! నీవు మావానిం దీసికొనిరాక యుత్తవారింటి కడ విడిచి వచ్చితివి. వానిభార్యను రాజువలచుటచే వానిం గడదేర్చి యిరిద్దరు పారిపోయిరఁట పట్టుకొనుటకు రాజభటులు దేశములు తిరుగుచున్నారు. దొరికిన వారిం బ్రతుకనీయరుగదా భయపడి

బలత్కారంబున నమసిరో తెలియదు. మీ శాస్త్రపాఠమువలనఁ గలిగిన ఫలమిది పద్మిని జాతి నిస్త్యం బెండ్లియాడినందులకు నీరీతిఁ బరిణమించినది. తిరుగా నాకన్నులం బడ లేదు. ఇప్పుడేమిచేయుదు? ఈధనమంతయు నెవ్వరి వశము చేయుదును. నీసహవాసంబుచే మాకీ ముప్పువాటిల్లినదని విలపింపఁ దొడంగెను.

అప్పుడు గదాధరుఁడు పెద్దగ దుఃఖించుచు రత్నాకరా! నీకోడలు మూడులోకములు మెచ్చుపని చేసినది. అందులకు వగవఁబని లేదు. నలదమయంతులవలె వారు ప్రచ్ఛన్నముగా గొంతకాలము సంచరించి తిరుగా వైభవము ననుభవింపకమానరు ధర్మకవచభూషితులకు నాపదలంటవు. నీవు పెండ్లియాడి శ్రీఘ్రము రావలయుఁజుమీ! అలసించితివేని మేము నిలువలేమని చెప్పిన మిత్రుని వెంటనే చూచు భాగ్యము నాకు లేకపోయినది.

శెట్టీ! నీకోడలు గుణంబులు బుద్ధివిశేషములు పొగడ శేషుఁడు చాలఁడుగదా! ఆమహాపతివ్రతను చెరపఁదలంచిన నీచుఁడు సమయక నిలుచునా? మీరు విచారింపవలదు. నేను దేశములు తిరిగి వారిని వెదకి తీసికొనివచ్చెదను. కొంతకాలము సగతించిన నీయపరాధము మాసిపోవఁగలదు. బాలికేమియు భయములేదని బోధించి మంచి ముహూర్తమున నిల్లువెడలి రామదుర్గనగరమునకుఁ బోయెను.

అప్పురంబునఁబద్మినిం బొగడుచు సురూపునినిందింపని వారులేరు. రాజభటులకుఁ దొఁగచు రూపము మార్చుకొని కుముదాంగదుని యింటికింబోయి గదాధరుఁడు తన్నెఱింగించుటయు నావైశ్యదంపతులువానిం గౌఁగలించుకొని బిట్టువాపోవఁ దొడంగిరి.

గదాధరుఁడు తదీయశయనాసన భజనాదులఁ జూచి పరితపించుచు నలుమూలలు వెదకినంత నొక పుస్తకములో గురుదత్తునిచేఁ బ్రాయఁబడిన యీపద్యము గనఁబడినది.

క. నలుఁడును రాముఁడు పాండవు
లిల విధి గతి వెతలఁ బడయరే! మనమును వా
రలకన్న ఘనులమే! యిది
దెలిసిన వగమాని ముక్తి దెరవెఱుఁగ వాకో.

అను పద్యము జదివికొని గదాధరుఁ డించుక యాలోచించి మే మడవిలో దాగి యుండెదము తెఱవు తెలిసికొని నీవురమ్మని యభిప్రాయముతో వ్రాయఁబడినది. కావున నేనరణ్యవిశేషములే వెదకఁదగినవని యాలోచించి ఆవైశ్యదంపతులతోఁ జెప్పి యుత్తరాభిముఖుండై అరిగెను.

అని యెఱింగించి,

# 125 వ మజిలీ

## పద్మిని కథ

రామదుర్గమున కుత్తరమున కొన్ని యోజనముల దూరములో దుర్గమారణ్య మధ్యంబునఁ గొన్ని కోయపల్లెలు గలవు. ఆపట్టణములకుఁ జుట్టును బెట్టనికోటలై యున్నతములైన పర్వతములు పెక్కువలయముగా వెలయుచున్నవి. ఆపల్లెలకుఁ బదియోజనముల దూరము వరకు మహారణ్యమేకాని గ్రామమేదియును లేదు. అందున్నవారిని శబరులనియు, వనచరులనియు, బోయెలనియుఁ గోయలనియుఁ బిలుచుచుందురు. వాండ్రకు నాగరిక మించుకయుఁ దెలియదుకాని అడవి యాకులతోఁ జాపలు, బుట్టలు, తట్టలు లోనగు నుపకరణము లల్లుటయందు నేరుపు గలిగి యున్నది.

తేనె, పునుఁగు, జవ్వాది, కస్తూరిలోనగు వనవివస్తువులను దామల్లిన బుట్టలను గాడివలపై నెక్కించి గ్రామములయందమ్మి సొమ్ము తీసికొని పోవుచుందురు. అమ్మహారణ్యంబునకుఁ దరుచు జానపదులుగాని, పౌరులుగాని యెన్నఁడు పోవరు. కోయవాండ్రుతప్ప నప్పల్లెలందున్నవని యెవ్వరును నెఱిఁగినవారులేరు.

మృగములబాధ తలంపక కంటకములవెత లెక్కింపక రాళ్ళకస్తి గణియింపక రాజద్రోహాపరాధభయంబున గురుదత్తుఁడు భార్యయు నహోరాత్రంబు లేకరీతిఁ బయనము సాగించి మారువేషములతో యెట్లో కొన్నిదినముల కాకోయపల్లె జేరిరి.

దారిలో నొక శబరునితోఁ బరిచయముజేసి యాపల్లెవృత్తాంతముఁ దెలిసికొని వానివెంట నాదంపతులా కొట్టిక కరిగిరి. లేనిచో నత్తెరవెరుంగుట దుర్ఘటమే ఆకొండ పల్లెకు నాలుగు దండలను పెనుకొండలు కోటలవలె నొప్పుచున్నవి. అనడుమనున్న సమభూమి మనోహర నానాఫలతరులతావృత్తమై తృణకాష్ఠజలసమృద్ధిఁగలిగి యుద్యానవనమువోలెఁ గ్రాలుచుండెను. కొండలనుండి ప్రవహించు సెలయేరులకుఁ గాలువలుగట్టి కోయలు తరులతాగుల్మాదులఁ బెంచుచు సస్యములఁ బండించుచుందురు.

ఒకశబరుని వెంట నాదంపతులా కొండపల్లెకుఁ బోయి యందలి వింతల కచ్చెరువందుచు నందుండుటకు నిశ్చయించికొనిరి. వారిభాష స్వభాషయేయైనను వికృతముగా నుండుటచేఁ దెలిసికొనుట దుర్ఘటముగా నుండెను. మొదట వారింజూచి యాపల్లెలోని వారందరు నాశ్చర్యపడఁజొచ్చిరి. గురుదత్తుఁడు మాటలుగలుపుకొని కొంతసొమ్మిచ్చి వేరుగ నొక పర్ణకుటీరమువైపించుకొని యందు నివసించి కాలక్షేపము చేయుచుండెను.

ఒకనాఁడు పద్మిని గురుదత్తునితో మనోహరా ! నాకతంబుననఁగదా మీకీయిడుములు వచ్చినవి. ఆగర్భశ్రీమంతులై సమస్త విద్యలం జదివి యుత్తమరూపసంపన్నులైన మీకు మహారణ్యములలోఁ గొండలోయలలోఁ గోయలతోఁ గూడికొని గుడిసెలలోఁ గాపురముచేయవలసి వచ్చినది. అన్నన్నా ! విధిపరిపాకము ! అపాపాత్ముని౯జంపి నేనుఁ గూడ మడసితినేని మీకీకష్టము గలుగునా ? మఱియొక కన్యకం బెండ్లియాడి సుఖింతురుగదా అయ్యో ! నామూలమున మీతల్లిదండ్రుల కెడమైతిరి. ఎప్పుడో గొప్పవేడుకతో నత్తవారింటికిఁ బోవలయునని తలంచికొనియుంటి ఏయదృష్టమును పట్టినదికాదు. అడవులలోఁ గాపురము చేయుమని మనకు విధి విధించెను. కాఁబోలు. ఆసీచుఁడు నాకు సందేశము పంపినతోడనే మీకుఁజెప్పి యుశీనరపురంబున కఱిగిన నీయాపదరాక పోవునుగదా ? అని మగని తొడపై శిరంబిడుకొని దుఃఖించుటయు గురుదత్తుం డిట్లనియె.

సాధ్వీ ! సాధ్వీతిలకమగు నీతో నిందు వసియింప నాకేమియుఁ గష్టములేదు. ఈయరణ్యమే యుద్యానవనమైనది. ఈ కొండలు క్రీడాశైలములుగా నున్నవి. కాని నీవు గర్భభరాలసవై పనులు గావించుచుండఁ జూచి పరితపించుచున్నవాఁడ ఇంటి కడనున్న నిన్నుఁ దలిదండ్రులు నత్తమామలు నరచేతిలోఁ బెట్టుకొని కాపాడక పోవుదురా ! ఎందరుబంధువు లింతేసి నూడిదలు పంపుదురో ! ఏ ముచ్చటయును లేక కిరాతయువతులతోఁగలసి తిరుగుచుండ నిన్నుఁజూచి నా హృదయము భేదిల్లుచున్నది. కానిమ్ము కాల మొక్కరీతి నుండునా ? వినుము.

శ్లో. సుఖస్య దుఃఖస్య నకోపిదాతా
పరోదదాతీతి కుబుద్ధిరేషా
అహం కరోమీతి వృథాభిమానః
స్వకర్మసూత్ర గ్రథితోహి జంతుః

తొల్లి హరిశ్చంద్రాది నృపతులు పడిన బన్నములువిని కథలను కొంటిమిగాని యథార్థములు. కర్మసూత్రవశను మీరినవారు లేరు. ఇంద్రాది దేవతలకు దప్పినది కాదు. దైవమెట్లునడపిన నట్లు జేయఁదగిన వార మంతకన్న మనకేమియు స్వతంత్రము లేదని యోదార్చెను.

ఒకరికష్టమునుగురించి యొకరు పరితపించుచు నొండొరుల నోదార్చుకొనుచుఁ బూర్వచరిత్రలను నుగ్గడించుచు నందున్నకోయబాలురకుఁ జదువుజెప్పుచు వినోదముగాఁ గాలక్షేపముచేయుచుండిరి. మఱియు పద్మినికి నల్లికపనియందు మంచి నేర్పరితనము గలిగియుండుటం బట్టి యక్కిరాతులల్లెడి చాపలు, బుటలనుజూచి

యంతకన్న విచిత్రముగాఁ దానల్లఁజొచ్చినది. దినమునకొక వింతగా నల్లుచు మగ నికిఁగూడ నాపని నేరిపినది. వారిరువురుంగలిసి మృగరోమముతోను, నరవియాకులు తోను, కడునద్భుతములైన తివాసులును, చాపలును, పెట్టెలును మంచ ములు లోనగు గృహోపకరణములు అత్యాశ్చర్యకరములైనవి, అల్లి వానిపై వెలలువైచి కోయలకిచ్చి గ్రామములకంపి అమ్మించుచుందురు. అవింతవస్తువులు జూచి జానపదులును బౌరులును మూఁగి మూఁగి వేగముగాఁ గొనుచుండిరి. దానం జేసి యాపల్లెలోని వారెల్ల నావస్తువులమ్మి పెద్దగా ధనము సంపాదించుచుండిరి. వారందఱు తమకుఁ బరిచర్యసేయుటతప్ప మఱియొక ప్రతిఫలము వానివలన నాదం పతులు కోరుటలేదు.

అందున్న కోయలెల్ల నాదంపతులను గురువులుగా దైవములుగాఁ బ్రభువు లుగాఁ దలంచి భయభక్తి వినయవిశ్వాసములతో సేవించుచుండిరి. అవ్వనవాసము యౌవనవిలాసములలో నొక వినోదము వారికిఁ గూర్చుచుండెను. పద్మినికిఁ గ్రమం బున నెలలు నిండుచుండెను. తల్లిదండ్రులు వారిరువుర సుపచారముల నా మోదింపుచుండెను. గురుదత్తుండు హృదయంబునఁ బట్టికొని యామెం గాపాడుచుండెను.

ఒకనాఁడు గురుదత్తుండు వింతయగు నొకతివాసీ నల్లుటకు అందమునకై మృదు వులగు పిట్టరెక్కలు కొన్ని కావలసి వనచరులం గూడుకొని యాప్రాంతారణ్యమున కరిగెను. వలదు వలదు మనము క్షత్రియులముకాము. వేట మనకుఁ దగదు నోరు లేని పక్షుల మృగములఁ గొట్టవలదు. ఆకులతోఁ బూర్తిఁజేసెదనని పద్మిని బోధించు చున్నను వినక వస్తులోభంబునంజేసి అతఁడా అరణ్యములన్నియు దిరిగి తిరిగి అలసి యొక చెట్టుక్రిందఁ గూర్చుండి యలయికలు దీర్చుకొనుచుఁ బిట్టల రెక్కలకై తోడివారిని నలుమూలలకుఁ బంపెను.

విధి చలపట్టి పట్టినవానినే మొట్టుచుండునుగదా? అంతలో నావృక్షాంతము నుండి యొకపాము నేలకుఱికి లతనిం గఱచి పారిపోయినది. తద్విష విశేషంబట్టిలో నిమిషములోనే అతండు తెలివితప్పి నేలంబడిపోయెను. అతనిదాపుననున్న వనచరు లదిచూచి యడలుచు నొకఁడు మందుచెక్కలకై పరుగిడెను. ఒకఁడింటికిఁ బరుగన వచ్చి యూర్పులదరఁ దివాసినేయుచున్న పద్మినింజూచి తల్లీ! తల్లీ! మా అయ్యగారు పాముగఱచి నేలఁబడిరని చెప్పుటయుఁ బద్మిని గుండెలు బాదికొనుచు అయ్యో! అయ్యో! యెక్కడరా బాబూ? బ్రతికియుండిరా? హా! దైవమా? ఇంతటితో మమ్ము విడువవా? అని యరచుచు నేలంబడి మూర్ఛిల్లి అంతలోఁ దెప్పిరిల్లి భిల్లుఁడా! యెంత దూరములో నుండిరి! మాట్లాడుచుండిరా! నామాట యేమైన జెప్పిరా చెప్పుము

చెప్పుము తండ్రీ! మందులకొఱకు మీవారు పోయిరంటివి. బ్రతికించు మందులున్న వియా! నాయనా! యెఱింగింపుము నీ వెంటవత్తును నన్నక్కడికిఁ దీసికొనిపొమ్ము. పుత్రా! అని పిచ్చిదానివలె అడలుచుండ వాఁడు తల్లీ! వారికేమియు భయములేదు. మాకొండలలో పాము చెక్కలు చాలఁగలవు గాలిలేకపోయెనను గంధను రాచిన బ్రతుకఁగలఁడు. రమ్ము పోవుదము. నీవు ఏడువకుము. అని యోదార్చుచు నా కిరాతుఁడా నాతిని గురుదత్తుఁడున్న తావునకుఁ దీసికొని పోవుచుండెను.

ఒకచోట నొక చిన్న మెట్టయెక్కుచుండ నయ్యండజయానకుఁ బ్రసవవేదన యావిర్భవించినది. నేలం జదికిలఁబడి యోరీ! నేనిక నడువలేను. కడుపులో నేదియో బాధగా నున్నది. నీవు పల్లెకుఁబోయి యాఁడువాండ్రం గొందఱఁ దీసికొనిరమ్ము. వడిగా రమ్ము అని చెప్పి వానినంపినది. క్రమంబున నొప్పు లధికమగుచుండెను. ఒదార్చువారు లేరు. భర్తసర్పదష్టుడై పడియున్నవాఁడను వార్త వినియుండెను. అద్ది తరి నత్తలోదరి చిత్తమెట్లుండునో యూహింపవలయును.

ఆకుసుమకోమలి ప్రసవాయాసము సైరింపలేక యొడలెఱుఁగక నేలం బడి పోయినది. అంతలో నాకాంతా రత్నమున కొక కుమారరత్న ముదయించెను. గాని యా మానవతి యేమియు నెఱుఁగదు. మఱిరెండు గడియలలో నాకిరాతుఁడు కొందఱ నాఁడువాండ్ర వెంటఁబెట్టుకొని అచ్చటికి వచ్చెను. శిశువు వారికిఁ గనంబడ లేదు. తొందరపడి కిరాతస్త్రీలు పద్మినిం బట్టుకొని తుడిచి కట్టులుకట్టి కాచి చెక్కరసము పూసి యుపచారములు చేయుచు నెత్తుకొని తమపల్లెకుఁ దీసికొనిపోయి పండుకొనఁ బెట్టిరి.

పెద్దతడవున కామెకుఁ దెలివివచ్చి హా! ప్రాణనాథా! హా! మనోహరా! అని విలపింపఁ జొచ్చినది కిరాత వధూటులూరడింపుచుఁ దల్లీ! నీవు గన్నపుత్రుఁ డేమయ్యెను నీవు ప్రసవమైతివే మాకు గనంబడలేదని అడిగిన నప్పడఁతి అమ్మయ్యో! నేనేమియు నెరుఁగను. అయ్యాకశము భగ్నమైనదా! దైవా! కాలమహిమ! పోనిండు. నాభర్తయెడీ! జీవించియున్నవారా? అని అడిగిన వాండ్రిట్లనిరి. అమ్మా అక్కడి వాండ్రింకను రాలేదు. నీకొఱకై మేము అడవికి వచ్చితిమి. మేము వచ్చునప్పటికి నీవు వివశవై పడియుంటివి. నిన్ను మోచుకొనివచ్చి చికిత్సలఁ జేసిన బ్రతికితివని యావృత్తాంత మంతయుం జెప్పిరి.

అప్పుడు పద్మిని మిక్కిలి అడలుచుఁ దానుగనిన శిశువు నేమృగమో యెత్తికొని పోయినదని నిశ్చయించి తచ్ఛోకము హృదయమునంటనీయక పతిపాదాయత్త చిత్తయై యవ్వార్తకొఱకు నెదురు చూచుచుండెను. అంతలో నచ్చటిచారులువచ్చి దైవ

ముతో బద్మినింజూచి చింతించుచు నామెయడుగ నమ్మా! నీభర్త సర్పదష్టుండగుట విని మందువేరులకై తలయొకదెసకుఁబోయితిమి. మందులందీసికొనిపోవునంత నతండా చెట్టుక్రిందలేడు. అడవియేనుగు పాదములచిహ్నములు గనంబడినవి అవి మనుష్యుల నమాంతముగా నెత్తికొనిపోఁగలవు విషకుండగు నతని నాయేనుఁగుదీసు కొనిపోయినది. తల్లీ! మేమేమియు జేయలేక పోయితిమని దుఃఖింపఁదొడంగిరి.

ఆమాటలవినియా బోఁటియూహచెడినేలంబడి యడలుచుండుటయు నెఱుఁగదు పిచ్చిమాట లాడఁదొడంగినది కొంతసేపు వింతవింతగాఁ జూచుచుండెను. చెంచెతలు మంచిమాటలనూరడించుచు అమ్మా! నీమగని కేమియు భయములేదు ఏనుఁగనెక్కి- రాఁగలఁడు. నీయొడలు పచ్చిది దుఃఖించినఁ జెడకమానదు మానుము మానుము అని బ్రతిమాలుచుండిరి. వారిమాటలు పద్మినికి వినఁబడవు విపరీతముగా నుత్తరములు చెప్పుచుండును. పూర్వమువలె వారితో మాట్లాడదు పనులుచేయదు. అభిమానంబునఁ బద్యపానములిచ్చి కొన్నిదినంబులామెకు బరిచర్య చేసిరికాని క్రమంబున నామెకు వెర్రియెక్కువైనకొలఁది తప్పుకొని తిరుగుచుండిరి. ఆమె కుడుచుటయుఁ గట్టుటయు నెరుఁగదు. వెఱ్ఱిదానివలె మాట్లాడుచుఁ గొన్ని నెలలా పల్లెలో నుండెను ఆమె స్వయముగా వండికొనితినుట యెరుఁగదు ఎవ్వరయినఁ బిలిచి తిను మనినఁ దినును. లేకున్న నుపవాసమేచేయుచుండును గురుదత్తుని జాడయేమియుఁ దెలియక అతండు చచ్చెనుకా నిశ్చయించి బోయలు పద్మిని నంతగా విమర్శింప మానివేసిరి.

పద్మినియు దన్ను మన్నించువారు లేమింజేసి యొకనాఁ డొక అరణ్యమార్గంబునంబడి నడువసాగెను. పులులకు వెరవదు. చీకటికి జడియదు. ఎండకళంకదు, వానకు భయపడదు ఆహారసుఖము కోరదు ఆకులలములు తిని యాకలి యడంచుకొనఁగలదు.

నడుమనడుమ తెలివివచ్చినప్పుడు మనోహరా ? గురుదత్తా నాకీజన్మమునకుఁ గనంబడవా ? ఇప్పుడేవత్తునని పోయితివే యెందైనం దాగితివా ? అని పలుకుచు పెద్దయెలుంగున నోగురుదత్తా! అని పిలుచుచుండును. ఈరీతిఁ గొంతకాల మున్మత్తవ్యాపారమున నయ్యడవుల సంచరించి యేబాధం బొరయక యొకనాఁడు ప్రాతఃకాలమున నొక పట్టణము జేరినది. అప్పటికిఁగొంచెము ప్రొద్దెక్కినది. పద్మిని పిచ్చివేషముతో నొక వీథింబడి పోవుచుండెను.

ఆవీథిని రత్నాంగి యను బోగముది తనయింటిముంగల నిలువబడి నీళ్ళుతెచ్చు పనికత్తెకై యెదురుచూచుచుండెను. ఎప్పటికినిఁబనికత్తె వచ్చినది కాదు. పద్మిని నొక గమ్యస్థానము లేమింజేసి యావీథినిటు నటు మూడుసారులు తిరిగినది.

చిక్కి మలినయై వికృతముగా నుండుటచేఁ బద్మిని సౌందర్యము సామాన్యులకుఁ దేటగాదుకాని నిదానించి చూచిన బుద్ధిమంతులకుఁ దెలియఁబడకమానదు. రత్నాంగి పద్మినిం జూచి రూపమునకు వెరగుపడుచుఁ దాపునకుఁ జీరి, అమ్మీ ! నీదే యూరు ? ఎవ్వరికొఱకిటు పలుమారు తిరుగుచుంటివి. నీ పేరేమి ? నాకొక యుపకారము చేసిపెట్టెదవా ? తప్పుగా గణింపకుమీ ? ఈ కడవతోఁ గడివెడునీళ్ళు తెచ్చిపెట్టెదవేని నీయుపకారము మఱువను. అదియే తటాకము. మేము స్వయముగాఁ దెచ్చికొనిన మాకులములో వెలవేయుదురు. అని కడవ నందిచ్చుచు బ్రతిమాలికొన్నది. పద్మిని సహజముగాఁ బరోపకార పరురాలగుట విని ప్రతివచన మేమియు నీయకయే కడవగైకొని తటాకమునకుఁబోయి స్నానముచేసి కడవతో నీళ్ళుతెచ్చి అమ్మా ! యెక్కడఁ బోయుదును చెప్పుమనుటయు నది తొందరపడుచు సంతస మభినయించి యింటనున్న బిందెలసద్ది వీనిలోఁబోయుమని చెప్పినది.

విసుగులేక పదికడవలనీళ్ళు తెచ్చి గంగాళములు నింపించినది దొడ్డిలోని చెట్లకుఁ బోసినది. పలుమారు స్నానముచేసినది. రత్నాంగి యామెను వెట్టిదానిగా గ్రహించి అమ్మీ ! నీకుఁ గూడును గుడ్డయు నిచ్చెదను. మాయింట నేపనియుఁ జేయనక్కరలేదు. అనుదినము పది బిందెలు నీళ్ళు తెచ్చిపెట్టెదవా యని యడిగిన నట్లే తెచ్చెదనని తల త్రిప్పినది.

రత్నాంగి యట్టి పనికత్తెకొఱకు చాల యిబ్బంది పడుచున్నది. కావున నప్పుడు మిగుల సంతసించుచు నామెకుఁ గట్టుకొన మంచిపుట్టములిచ్చి భోజనము పెట్టి పోషించుచుండెను.

పద్మిని పూర్వపుస్మృతిలేక యున్మత్తవికారముతోనే రత్నాంగి మెచ్చునట్లు పనులుచేయుచుఁ గొంతకాలము దానియింటిలోనుండెను. అప్పుడప్పుడు తెలివివచ్చి తన వృత్తాంతము దెలిసికొని దుఃఖించుచు మరణింపవలయునని నిశ్చయించుకొనుచుండును. కాని యంతలో నా మాట మరచిపోవుటచే యథాప్రకారము పనికత్తెయై పనులు చేయుచుండెను పాండవులంతవారిని దాసిసలనుజేసినవిధి పద్మిని నొక వారాంగనకుఁ బనికత్తెగాఁ జేయుట యబ్బురము గాదు.

మ. ఎట నెవ్వానికి నెన్ని రేల్సుఖముగా • నీ దుఃఖమున్ గానివి
స్ఫుట పూర్వా చరితాత్మకర్మవశతన్ • భోక్తవ్యమైయుండునో
ఘటనాచాతురిఁ బ్రాళ్ళగట్టుచు బలా • త్కారంబుగా వానిన
చ్చోటికిందోడ్కొనివచ్చి దా ననుభవిం • చున్దైవమన్నాళ్ళగిన్

అని యెఱింగించి.

# 126 వ మజిలీ.

## మృగదత్తుని కథ

గురుదత్తుఁడును బద్మినియు వసించిన కోయపల్లెకు నాలుగు క్రోశముల దూరములో మఱియొక కొండపల్లెగలదు. అందును గోయలు, చెంచులు బోయెలు లోనగు నటవిజాతివారు కాపురముచేయుచున్నారు. వారును జాపలు, బుట్టలు, తట్టలు మొదలగు నుపకరణములల్లి గ్రామములమీఁదికిఁ దీసికొనిపోయి యమ్ముచుందురు.

పద్మిని యల్లిన వస్తువులు కతంబునఁ గోయపల్లెలోని వారందఱికి భాగ్యము గలుగుటఁ దెలిసికొని యందలి పెద్దలు గుమిగూడి యొకనాఁడు అయ్యో! కోయపల్లెవాండ్రందరు వింతచాపలు, బుట్టలునల్లుచుండిరి. మన కాపని తెలిసినదికాదు. మనమేడాది యల్లిన వస్తువులకెల్ల వచ్చిన వెల వారొక తివాసినమ్మి తెచ్చుచున్నారు. వాండ్రా పని నెక్కడనేర్చికొనిరో తెలిసికొనవలయు మనముగూడ నేర్చుకొందమని తలంచి యాలోచింపుచుండ వారిలోనొక కిరాతకుమారుఁడు పదమూఁడేడుల ప్రాయముగలవాఁడు ముందరకువచ్చి నాకావస్తువులఁ జూపుఁడు నేనల్లెదనని చెప్పెను.

ఆమాటలు విని కొందఱప్పుడే యాపల్లెకుఁబోయి చుట్టముల యొద్దనున్న వింతవస్తువులఁ గొన్ని తెచ్చి వానికిం జూపిరి. బుద్ధిమంతుఁడగు నాబాలుఁడు వానివి విప్పి మరల నల్లి అందలి మర్మముల గ్రహించి యాయాకులఁ దెప్పించి తానుగూడ నాయుపకరణముల నల్లుచుండును. వానిపేరు చిరుతపులి పులిపులిఅని అందరు వానిం బిలుచుచుందురు. ఆచిరుతపులి యొకనాఁ డల్లిన చాపలును, బుట్టలును మఱియొకనాఁ డల్లుటలేదు. అంతకన్నఁ జాలవిన్నాణముగా నల్లుచుండును. సంవత్సరములో నాపని యందాబాలునికి కనన్యసామాన్యమైన నైపుణ్యము గలిగినది. గురుదత్తుఁడు పద్మిని అల్లినవి వాఁడల్లిన వానికుంచఁ జాలతేలికగాఁ గనంబడుచుండెను ఆపని యందాబాలురకు నేరుపయత్నించెను. కాని యొక్కనికి నాపద్ధతియే దెలిసినదికాదు. వాడుకగా నల్లుచుండు తాడియాకులు, నీతాకులు, ఖర్జూరపాకులు లోనగు నాకులతోఁ నల్లెడుచాపలు ౨
మాత్రమే వాండ్రు అల్లుచుందురు.

సిట్టరెక్కలతోను, వింతమేకబొచ్చుతోను, మృదుదళములతోను తివాసులను గొన్నిటినల్లి వానికి మిక్కిలి వెలవచ్చునని తలంచి తండ్రినడిగి కోయపిల్లవాండ్రు సహాయముగా గాడిదలపై వానిని మఱికొన్ని యుపకరణముల నెక్కించి చిరుతపులి యొకనాఁడు ఉదయార్కుఁడను మహారాజుచేతఁ బాలింపఁబడుచున్న యర్యమపురంబున

కఱిగి యూరిబయటఁ గుటీరములఁబన్ని గాడిదలపైనున్న వస్తువులందింపి గ్రామములోనికి కమ్మకమునకుఁ దీసికొనిపోయెను.

దేనికెంత వెలవేయవలయునో తెలియక తక్కువవెల వేయుటచే నొక యామములో నావస్తువులన్నియు నమ్మకమైనవి. ఆవస్తువులఁ గొనుటకై పల్లీలు కోలాహలముగా గుమిగూడి వచ్చుటఁ జూచి యాబాలుండు గ్రామంబున నావస్తువుల దరలు హెచ్చు చెప్పుచుండెను. అట్లే అమ్మకమైనవి చివరకు నొకవింతయగు నాస్తరణము మిగిలియున్నది. అది మిక్కిలి శ్రేష్ఠమగు మంచి వస్తువులతో వింతగా నల్లఁబడినది పల్లీల యాతురతఁజూచి యాతివాసి వెల వెనుకటి వానికంటె బదిరెట్లెక్కువ జెప్పుటచే నెవ్వరు కొనలేకపోయిరి. రత్నాంగి అను వేశ్యారత్నము చక్కగా నలంకరించుకొని నాఁటి సాయంకాలమున జిరుతపులి అల్లిన రత్నకంబళము తెరగు పరిచారికవలనఁ దెలిసికొని వానిం దీసికొనిరమ్మనిపంపి తాను తన మేడవీథియరుగుపై నిలువంబడెను. ఇంతలో నాపరిచారిక యక్కిరాత కుమారునిం దీసికొని అచ్చటికి వచ్చినది.

వానింజూచి యావెలయాలు విస్మయమందుచు నౌరా! వీఁడెక్కడికోయవాఁడు ఆటవిక వేషముతోనున్న వీనిసౌందర్యము ఆసేనకంటె యొప్పుచున్నదిగదా! కానిమ్ము వీని వలపులం జిక్కఁజేసి టక్కరితనంబున నీతివాసి వెలయీయకయే లాగివేసెదనని తలంచి వాని తనమేడకుఁ దీసికొనిపోయినది. అందలి వింతలన్నియుఁ జూపినది. చిట్టకములచే వానిమనసు గరగఁజేసినది. ప్రేమ వానిబుగ్గలపై ఎరచి యోహో? గట్టిమనసువాఁడవే లేకున్న నాప్రేళ్లు చప్పుడుకాకుండునా? ఏదీ నీకంబళము విప్పి చూపుము. అని పలికినవాఁడు ముసి ముసి నగవులు నవ్వుచు దాని లీలలకు లోఁబడి దానింబరచి చూపెను.

కడు మృదువై పలురంగులతో నొప్పుచు మస్పృణంబై రత్నప్రభలవలె వెలుగుచున్న యాయాస్తరణం జూచి తలయూచుచు రత్నాంగి బాపురే! సొగసు కాఁడా! యిది యెవ్వరల్లిరి? దీని వెలయెంత చెప్పుమని అడిగిన వాఁడు నేనే యల్లితిని. ఒరులల్లినది నేనేలతెత్తును దీని వెల నూరుమాడలని చెప్పెను.

బాలుఁడా! మే మెవ్వరమో యెఱుఁగుదువా! వెలయాండ్రము మేమొరులకు వెల యియ్యము అన మఱియేమిత్తువని అతం డడిగెను. ఏమి కావలసినను నియ్యగలము. నీకేది యభీష్టమో అదియే తీసికొనుము అని నవ్వుచు నుత్తరము చెప్పినది.

నాకు నీవు కావలయునని అతండనిన అందులకు సంసిద్ధురాలనై యుంటి. నేఁడి యుండుమని రాత్రి రమ్ము అని పలుకుచు జేయిపట్టుకొని మెట్టికలు విప్పినది.

వాని మేను ఝల్లు మన్నది. పులకలు పొడమినవి. సాత్వికవికారములు తోచినవి యౌవనాంకురము పొడసూపుచున్న తరి స్త్రీసంపర్కము పురుషులకు వికారములు కలిగించుట సహజముగదా! తద్విలాసములకుఁ జొక్కి-వాఁడు మొలక మీసములపైఁ జేయివైచి దువ్వుచు నీవు భోగము దానవుగదా? నిన్ను హాస్యమాడవచ్చునని మా వాండ్రు చెప్పుదురు. రాత్రివచ్చెద నీకిడియూరక యిచ్చివేసెదఁ బుచ్చికొమ్ము. మరి యొకటి యల్లఁగలను. అని పలుకుచు దానితోఁ జెప్పి తన బసకు బోయెను.

తోడివారలా తివాసి నమ్మితివా? యని అడిగిన వాఁడు నవ్వుచు వింతలు. చూచి వచ్చితిని. రేపంతయుఁ జెప్పెద రాత్రి మరల బోవలయుఁ బెద్ద పెద్ద మిద్దెలం గంటి. అబ్బబ్బా అవి మన కొండగుబ్బలుకన్న మిన్నగా నున్నవిసుమీ! యెన్నియో బొమ్మలు గోడల ప్రక్క-లక్క-గా వేలంగట్టిరి. ఆయందము చూచి తీరవలయు భోగముది మంచి కులాసాపనులు చేసినది. ఇంకనుం జేయఁగలదుఁ అని తన చెలి కాండ్రతో జెప్పుచు మూపు లెగరవైచుచు రాత్రి సమయ మరయుచుండెను.

ఇంతలో సూర్యాస్తమయమైనది. పూవులు, నాపలు, వక్క-లు దెప్పించి పెంద లకడ భోజనము చేయవలయునని ప్రయత్నించుచుండ రత్నాంగికిఁ దలనొప్పియుఁ జలియుజ్వరము వచ్చి బాధింపదొడఁగినది.

ఆయ్యో కిరాతపుత్రుని రమ్మంటిని. వాఁడు వచ్చువేళయైనది దేహ మస్వస్థత నొందియున్నది మాటాడుటకైన నోపికలేదు. రత్న కంబళి యూరక పోఁగలదు. ఏమి చేయుదునని చింతించుచు రత్నాంగి తనయింటనున్న పెళ్లిదానిం బిలిపించి యాయాస్తరణ జూపుచు నిట్లనియె.

పద్మినీ! యిది మిక్కిలి వెలగలది యెంత వింతవింతగా నున్నదియో చూచి తివా! మన చావడికిఁ గ్రొత్త అందము తెచ్చుచున్నది. యొక బాల విటుఁడు దీనిం గానుకగాఁ దీసికొనివచ్చెను వాని నీ రాత్రి రమ్మంటి నింతలో నాకు మేడివచ్చినది బాధకుఁ దాళ లేకున్నదాన నీవొక యుపకారము సేయవలయును వినుము. వాఁడు కుర్రవాఁడు మీసకట్టయైన బాగుగరాలేదు. మాటలచేతనైన సంతోషపెట్టవచ్చును ఈరాత్రి వానినిఁ బడకకు రమ్మంటి రెండుగడియలెట్లో వానితో ముచ్చటలాడి సాగ నంపుము. నీవుమాత్రమాడుదానవుగావా? మంచి వస్తువు దక్కఁగలదు! ఈమాత్ర ముపకారము జేయుమని బ్రతిమాలినది.

పద్మినికా తివాసిచూచినతోడనే పూర్వపుస్మృతి యంతయుం గలిగినది. ఆ యల్లికచూచి యోహో! యిది నాభర్త అల్లియుండవలయును. మాకుఁగాక యొరు లకీ పనిరాదు. ఇది తెచ్చిన పిల్లవాఁడెవ్వఁడో తెలిసికొని వానిమూలమున నాభర్త

వృత్తాంత మరసెదంగాక. ఈలంజపడఁతి యింటనుండ దుష్క్రియలకు ప్రేరేపకుందునా! ఇందుండుట నాతప్పు కానిమ్ము రేపే మఱియొక చోటికిం బోయెదనని తలంచి దానికేమియు సమాధానము జెప్పక యూరక యాయాస్తరణపై చిత్రము చూచుచుండెను.

అమృతకాళిని మెత్తబడినదని తెలిసికొని రత్నాంగి బోఁటీ ఇటురా! అదిగో యా పెట్టెలో నగలున్నవి ధరింపుము. అచీరగట్టుము. అరవికెతొడుగుము. మేడమీఁది గదిలోనికింబొమ్ము. తలదువ్వుకొనుము హారములు దాల్పుము. చమత్కారముగా మాట్లాడుము. వేడుక గలిగింపుము లేనివలపు లేనిప్రీతి ప్రకటింపుము అని వేశ్యా ధర్మములన్నియు బోధించినది.

పద్మిని యాపలుకులు వినక యలంకరించుకొనక యా వైరివేషముతోనే మేడమీఁదిగదిలోనికిబోయినది. రత్నాంగి జ్వరపీడిత యగుట నంతగా విమర్శించినదికాదు. అంతలోఁ చెంచుపట్టీ కాశకోకగట్టి తలరుమాలుబిగించి యందుఁ బిగిలి పిట్టరెక్కల కుచ్చుజొనిపి వెండి మొలత్రాడు మురుగులు వింతఅందము తేరనొయ్యారముగా నడుచుచు రత్నాంగి యింటికి వచ్చెను.

అంతకుముందు ద్వారమున వాని సమిత్తము వేచియున్న దూతిక వానినా మేడమీఁదికిఁ దీసికొనిపోయినది అతండా గదిలోఁ బ్రవేశించి నలుమూలలు సూచి యొకమూలనొదిగియున్న పద్మినిం జూచి తలయూచుచు నందొక పీఠముపైఁ గూర్చుండెను.

పద్మిని వాని యాకారము చూచి మొగమునందు గురుదత్తుని చిహ్నములుండుటఁ బరిశీలించి యొదలు ఝల్లుమని పాలుచేపురా వానితో నిట్లు మాట్లాడినది.

పద్మిని—బాలుఁడా ? నీకులమెయ్యది ? తలిదండ్రులెవ్వరు! కాపురమెచ్చటఁ ఇచ్చటికెప్పుడు వచ్చితివి ?

చిరుతపులి—నీవెవ్వతెవు సాయంకాలమున నాతో మాటాడిన బోగముదానవు కావా ?

పద్మిని—అప్పా! అది యిప్పుడే రాఁగలదు. నామాటల కుత్తరమిమ్ము.

చిరు—మేము చెంచువాండ్రము. మాదికోయపల్లె కాపురము. నాకుఁదల్లిలేదు. దండ్రి చెంచుఁడు చాపలమ్ముటకై మొన్ననీయూరు వచ్చితిమి ! నా పేరు చిరుతపులి.

పద్మిని—ఈ తివాసి నెవరలినది.

చిరు—నేనే అల్లితిని.

పద్మిని—ఈపని నీకెవ్వరు నేర్పిరి.

చిరు—నాబుద్ధిబలముచేత నేనే నేర్చుకొంటిని.

పద్మిని— కోయపల్లియన నా కొండల నడుమనున్న కొండపల్లి కెంత దూరము.

చిరు— నాలుగుక్రోసుల దూరమున్నది దానినీవెట్లెరుగుదువు.

పద్మిని— ఒకప్పుడక్కడికి వచ్చితిమిలే. నీకి చిరుతపులి పేరెట్లు వచ్చినది.

చిరు—అదిరహస్యము మాతండ్రియెవరికిం జెప్పవలదన్నాడు.

పద్మిని—బాబూ. మీయూరిలో జెప్పఁగూడదు. ఇక్కడఁ జెప్పిన దోసమేమి?

చిరు — లేకున్న జెప్పెదవినుము ఒకనాఁడు మాతండ్రిచెంచుఁడుకొండలోయలోఁ దిరుగుచుండ నన్నొక చిరుతపులి నోటఁ గరచుకొని నేనేడ్చుచుండఁ బరుగెత్తుకొని యెక్కడకో పోవుచుండెను. మాతండ్రిదానిం జూచి వెరువక విండికోలతో నేసి కడతేర్చి నోటినుండి నన్ను మెల్లగఁదీసి యెత్తికొని తన పల్లెకుఁ బోయి పెంచుకొనియెనట. ఒకప్పుడు నాకీకథజెప్పి యెవ్వరికిఁ జెప్పవలదనిచెప్పెను. తెలిసినదియా? చిరుతపులి నోటినుండి రక్షింపఁబడిన కతంబున నాకుఁ జిరుతపులియని పేరుపెట్టెను.

పద్మిని—హా! పరమేశ్వరా! అని పలుకుచుఁ గోలుగోలున నేడువఁదొడంగినది. ఏమమ్మా! నామాటలువిని అట్లు ఏడిచెదవేమి! నీకింత కష్టముగా నున్నదియా యని యడిగిన నాయనా! నాకు నిన్నుఁ జూచిన దుఃఖము వచ్చుచున్నది. నీకువిధి యిట్లు వ్రాసెనా? అయ్యో! అని మఱియుఁ గన్నీరుగార్చుటయు నాబాలుండిట్లనియె.

తల్లీ! నీకు నన్నుఁజూచిన దుఃఖమేమిటికి రావలయు? నాకువిధి యేమి వ్రాసెనో చెప్పుము. నేను ముచ్చటపడివచ్చిన దుఃఖము చూపెద వేమిటి కనవుడు పద్మినిపుత్రా! మఱియేమియుంగాదు. నీవు చిన్నవాఁడవు ముక్కుపచ్చలారనివాడవు చదివికొనఁదగినవాఁడవు. నీతినేరుచుకొనఁదగినవాఁడవు. ఈ ప్రాయంబున నీదుర్వృత్తిఁ బూనుకొంటివని దుఃఖించుచుంటినని యుత్తరమిచ్చినది.

ఇది దుర్వృత్తియా! భోగమువాండ్రతోఁ గలసిన దప్పులేదని మాపల్లెలోఁ జెప్పుకొనియెదరు. వీండ్రు ఆటలు, పాటలుబాగుగానేర్పియుందురఁట తప్పుకాదనియే వచ్చితిని. తప్పు పనిచేయుట నాకిష్టములేదు. ఎట్లుతప్పో చెప్పుమని యడిగిన నప్పడఁతి యిట్లనియె.

క. జార భట చోరచేటక
చార నట ప్రభృతి నీచజననిష్ఠివా

ధిర శరావము వార

శ్రీ రమ్యాథరము సంస్మరింతుర కులజుల్.

పుత్రా! వేశ్యయన మన్మథాగ్నిసుమీ! రూపమను సమిధచే వృద్ధిఁబొందు చున్నది. కాముకులు తమ యౌవనములు ధనములు ఆ యగ్నియందు హోమము చేయుచుందురు గణికాసంగమము కడుదూష్యము. ఆయువుక్షీణించును. ద్రవ్యము నాశనమగును. రోగములు జనియును. కీర్తినశించును పురుషుఁ డప్పనియెన్నఁడును చేయరాదు. పట్టీ! నీవుమిగుల బుద్ధిమంతుఁడవు. వస్తువిచారముచేసిన నందేమియున్నది. కాకున్నఁ జక్కనియువతిం బెండ్లియాడి పిల్లలఁగని సుఖింపరాదా ఈ వస్తువు కై యూరార్తినిన్నుఁగారవించును, లేవువచ్చినఁదల్లి లేగెంటించును వీండ్రకు దయాసత్య ములులేవు. మరియొకతివాసి తెచ్చిన మరల గౌరవించును. ఎన్ని తేఁగలవు? భార్య యైన నట్లుచేయునా? బాబూ! ఇది దుర్వృత్తిసుమీ! యౌవనారంభమున నీవృత్తిగలిగిన మానిపింప బ్రహ్మశక్యముగాదు వలదు. వలదు. దోషము అని బోధించిన విని యాకుమారుండు లేచివచ్చి యామెపాదంబులఁబడి నమస్కరింపుచుఁ దల్లీ! నీవు నాకు మంచిమాటలుచెప్పితివి. నీపలుకులు నాచెవులు సోకి యపరిమితానందము గలుగఁజేసినవి. ఇది మొదలీపాటివనులకుఁ బూనితినేని దైవఘాతకుఁడని పిలువుము. నీవు జాల తెలిసినదానివలెనుంటివి. ఈభోగముది నీకేమికావలయును. ఇందుండియు నీ నీతి వచనంబులెట్లు చెప్పితివి? నీవృత్తాంతమెఱింగింపుమని అడిగిన నామె యిట్ల నియె.

పుత్రా! నాకి భోగముది యేమియుఁ జట్టముకాదు. నేనొక పాపాత్మురాలను. నావృత్తాంతముతో నీకేమిపని? నేను నీకొకరహస్య ముపదేశించెద నెవ్వరికిందెలియ నీయకుము నీవు తమవంశసంజాతుఁడవు.నీమాటవలన నీవు కిరాతకులమునఁ బుట్టినట్లు తెల్లమగుచున్నదికదా? నిన్నుఁ గన్నతల్లి యేమైనదో తెలియదు. సమసియే యుండును. నిన్ను జూచిన నాకుఁజాలి గలుగుచున్నది వినుము. నీకొకయుత్తరము వ్రాసి యిచ్చెదను. అజాడెవ్వరికింజూపకుము. తూరుపుదేశమునను న్న రామదుర్గ మను నగరమునకుంబోయి అందు గుముదాంగదుఁడను వైశ్యుని యింటికిం జని వానికే యీకమ్మనిమ్ము ఇతరులకుఁ జూపినఁ బ్రమాదము సుమీ! అతఁడు లేకున్న భార్యకిమ్ము. నీసుకృతవిశేషమునవారు సజీవులైయున్నచో నిన్ను గన్నఁకుమారుని వలెఁ జూచి పోషించి వారి సొమ్మంతయు నీకీయగలరు. నీవు సుఖింపఁగలవు. అని చెప్పిన విని యా బాలుండు సంతసించుచు నిట్లనియె.

అమ్మా! నీవే నాకు దల్లివి మాతల్లిని నేనెరుఁగనుగద. నేను గొప్పవంశము

గలవాఁడనని కూడఁజెప్పుచుంటివి నన్నెట్లెఱింగితివి. అనవు డామె ఆమాటలేమియు నడుగకుము. నిన్నుఁజూడ నాకిట్లు తోఁచినది. నాచెప్పిన చొప్పున నడిచెదవేని నీవు భాగ్య సంపన్నుఁడవు కాఁగలవని చెప్పిన వాఁడిట్లనియె.

అమ్మా! అకారణముగా సంపదగలుగఁజేయుచుండ వలదను వాఁడుండునా? రహస్యము వెల్లడింపను జాబు వ్రాసియిమ్మని అడిగిన నప్పడఁతి యప్పుడే యొక యుత్తరమిట్లు వ్రాసినది.

ఓపుణ్యాత్ములారా! ఈకమ్మ తెచ్చిన పిల్లవాఁడు మీ దౌహిత్రుఁడు వీనిపేరు మృగదత్తుఁడు. వీనింగాపాడి కులమభివృద్ధి జేసికొనుఁడు మీకూఁతురును అల్లుండును మృతినొందిరి. వారికొరకుఁ జింతింపఁబనిలేదు వీనికి విద్యాబుద్ధులు గరపి వృద్ధిలోనికిఁ దీసికొనిరండు. ఇదియే పదివేలు.

ఇట్లు మార్గదర్శకురాలు.

అనివ్రాసి యాయుత్తరమిచ్చి శిరము మూర్కొని ముద్దాడుచు దండ్రీ? ప్రమాదమునైనను వెలయాలి యింటికిఁ బోవకు సుమీ! పరులకు హింసగావింపకుము. ఈయుత్తర మొరులకుఁ జూపకుమని పలుమారుబోధించి నిద్రబుచ్చి తెల్లవారకమున్న లేపి అవ్వలికిఁ బంపినది.

ప్రొద్దుట రత్నాంగి పద్మసింజూచి మెచ్చుకొనుచు నోహో! నీవేమో వెర్రిదాన వనుకుంటిని. మంచిజాణవే వస్తువడుగకుండ విటుని సాగనంపితివి. మఱియేమైనను సొమ్ములాగితివా? యని అడిగిన విని మాటాడక లోనికిఁబోయి సీ! నావంటి మూఢురాలెందైనం గలదా? సర్వదుష్టుఁడైన మగనివార్తవిని చావక యిన్ని నాళ్ళేమిటికి జీవించితినో తెలియదు. ఆహా! వారకాంతయుగూడ ననిపించుకొంటినిగదా! చాలు. జాలు. కీడుకో మేలు నాకు మూడుంగంటి. హైహక్రమము వదలినది. అయ్యో! కొన్ని దినము లుండమనక నిజంబెఱింగింప పంపివేసితినేమి! ఔను జ్ఞాపకము వచ్చినది. నాయవస్థకు వాఁడు వగచుట యొకటి పుంశ్చలిగాఁ దలంచుట యొకటి. ఈవిచారము వానిం బాధించునని చెప్పితినికాను మంచిపనియే. ఇఁకదావక యేమిచేయవలసినది. అడవికిఁ బోయి యెట్లో మడిసెదఁగాక అని నిశ్చయించి అప్పుడే యెవ్వరికిఁజెప్పక యిల్లు వెడలి అడవిదారింబడి నడువఁ దొడంగినది.

ముల్లుకంపలు, రాళ్ళు, రప్పలు, దుప్పలు గణింపక తోఁచినట్లు నడుచుచు నొకచో దావాగ్ని మండుచుండ గుభాలునఁబోయి యామంటలోఁ బడినది. పాతివ్రత్యమునకు మెచ్చుకొని యగ్నిభట్టారకుఁడు మోక్షసామ్రాజ్యమునకు బట్టాభిషిక్తం జేయుచున్నవాఁడో యనఁగదవలతో గుమ్మరించునట్లు వర్షము గురియుటచే నా దావాగ్ని యంతయుఁ జల్లబడినది.

పద్మిని కించుకయు వేడి సోకినదికాదు. బూదిదరాచిన రత్నమువలె మెఱయుచుఁ జెక్కుచెదరక లేచి నలుమూలలు జూచి అయ్యో! నన్ను దైవము జంపకున్నాడుగదా! ఇంక నెన్నియిడుములు గుడువఁ జేయునో యని తలంచుచుఁ బోయి పోయి కొన్ని దినంబులకంటొక గొల్లపల్లి చేరినది.

అప్పటికి మరల బుద్ధిస్వాస్థ్యము తప్పుటచే అంటొక గొల్లవాని యింటిలో వాఁడు చెప్పిన పనులుచేయుచుఁ గొన్ని దినములు కాలయాపనము చేసినది.

అని యెఱింగించి,

## 127 వ మజిలీ

# ఉదయార్కుని కథ

అహా! ఆమె యెవ్వతెయో కానీ చాలమంచిది. ఆమెచెప్పిన మాటలు నాకెందమున బాగుగ నాటినవి. నేనీ భోగముదానియింటికి వచ్చుట తప్పుగా ఎఱుఁగక మోసపోయితినిగదా! మిక్కిలి వెంగలితివాసి గోలుపోయినను మంచిమాటలువినంబడినవి. అదియొకమేలే! మఱియు నేనుత్తమకులసంజాతుఁడనట. ఈజాబు రామదుర్గనగరంబునకుఁదీసికొనిపొమ్మని చెప్పినదిగదా! దీనివలనఁగొంతలాభము గలుగఁ గలదు అయ్యో! నాకుఁ జదువురాకపోవుటచే నిందేమివ్రాయబడినదో తెలియఁబడదు. ఒరులకుఁ జూపవలదనిచెప్పినది. కానిమ్ము ముందుగాఁ జదువ నేర్చికొని యాయుత్తరము జదివికొనిన తరువాత బోయెద నింక నీకోయల సహవాసము విడిచెదనని తలంచుచు మృగదత్తుఁడు వేశ్యాగృహము వెడలి కనుచీఁకటి యుండఁగనే యూరిబయటనున్న గుడిసెలయొద్దకుఁబోయెను.

అందున్న కోయలు వానింజూచి యోరీ చిరుతపులీ! నీవురాత్రి యెందుబోయితివి? నీకొఱకుఁ బురమంతయు వెదకితిమి. తివాసినమ్మితివా? మనతివాసులు చూచి రాజుగారు మెచ్చికొని నిన్నుఁదీసికొని రమ్మనిరఁట. పెద్దతివాసి తామే కొనియెదరఁట. రాజభటులు పలుమారువచ్చి పోవుచున్నారు నీ అదృష్టము మంచిదాని వారలు పలికిన విని అతండు నన్నుఁ బులియని పిలువవలదు నాపేరు మృగదత్తుఁడని పిలువుఁడు పెద్దతివాసి నమ్మితిని. రాత్రియెంటో పోయితినని పలుకుచుండఁగనే రాజభటులు కొందఱువచ్చి తివాసులమ్మిన పిల్లవాఁడు వచ్చెనా? అని కేకలుపెట్టిరి.

వచ్చెనని చెంచులు కొందరుత్తరము చెప్పిరి నేనే అమ్మినవాఁడను అని మృగదత్తుఁడు ముందరకువచ్చి నిలువంబడుటయు రాజభటులువానింజూచి నీనిమిత్తము రాత్రినుండి తిరుగుచుంటిమి. ఎందుబోయితివిబాబూ! పెద్దతివాసియున్నదా! అమ్మి

తివా? పదపద. రాజుగారు నిన్నుఁదీసుకొని రమ్మనిరని చెప్పి అప్పుడే వాని రాజసభకుఁ దీసికొనిపోయిరి.

మృగదత్తుని దేహచ్ఛాయ వలుపైనను నింద్రనీలమువలె మెఱయుచుండును. కన్నులు ఆకర్ణాంత విశాలములై యున్నవి. వెడదయురము ఎగుబుజంబులు దీర్ఘబాహులుం గలిగి యొప్పుటంజేసి వానిరూపు చూచినవారి కచ్చెరువు గొలుపక మానదు. మఱియు గోయకులంబునం బుట్టినవాఁడగుట వింతగా వానింజూడక మానరు. ఉదయార్కుఁడు నిండుకొల్వుండఁగా వాని రాజభటులకనియొద్దకుఁ దీసికొనిపోయి యెఱింగించిరి.

రాజువానింజూచి వెరగుపడుచు వీఁడు కోయవాఁడా? ఔరా? యెంతవిచిత్రము. అనిపలికి వానింజూచి—

రాజు—ఓరీ! నీపేరేమి?

మృగ—మృగదత్తుఁడండ్రుసామీ!

రాజు—వింత తివాసులనల్లినవాఁడవు నీవేనా!

మృగ—నేనే సామి

రాజు—ఈపని నెక్కడ నేర్చుకొంటివి?

మృగ—నాకెవ్వరుమ నేరుపలేదు నాబుద్ధిబలముచేతనూహించి అల్లితిని సామి.

రాజు—నీవు చదివికొంటివా?

మృగ—లేదు. సామి లేదు.

రాజు—ఏమిటికి నేర్చుకొనవైతివి.

మృగ—చెప్పువారులేక సామి!

రాజు—నీవు తరుచు ఎందువసింతువు?

మృగ—కొండలనడుమ సామి

రాజు—నీతలిదండ్రు లిక్కడకునచ్చిరా?

మృగ—లేదు సామి లేదు.

రాజు—నిన్న నద్భుతమైన తివాసి తెచ్చితివట యేమిచేసితివి?

మృగ—రత్నాంగియను భోగముది తీసికొన్నదిసామి.

రాజు—ఏమి వెలయిచ్చినది?

మృగ—ఏమయు నీయలేదుస్వామి! యూరకయే హరించినది.

రాజు—ఏమికతన?

మృగ—(సిగ్గుచే తలవాల్చుకొని) ఏమో తెలియదు.

రాజు—తెలిసినది యిటుండవైయరిగితివికాటోలు ప్రతిఫలము ముట్టఁజెప్పక పోవదే.

మృగ—లేదు సామి లేదు.

రాజు—లేకున్న నిజము చెప్పుము తప్పున్న దానిందడించితిరిగి తెప్పెంచె దను.

అనిరాజు వానితో సంభాషించుచున్న సమయంబున రత్నాంగి అచ్చటికి వచ్చి నమస్కరింపుచు నపరాధనిరూపణ పత్రిక యొకటి రాజునకర్పించినది వాచ కుఁడు దాని నిట్లు చదువుచున్నాడు.

మహారాజా! నిన్నరాత్రి చిరుతపులిఅను కోయవాఁడు మాయింటికి విటధర్మ మున వరుగుదెంచి తానల్లిన తివాసి నొకటి యిచ్చి నాకూఁతునను భోగినిగా నభిల షించి రాత్రి మాయింటఁ బండుకొని తెల్లవారకమున్న సకాలాలంకార భూషితయగు నాయోషామణిం దీసికొనిపోయెను. ఎందు దాచెనో తెలియదు ప్రొద్దుటనుండి వెదకించు చుంటి దేవరవారు కటాక్షించి వాని దండించి నాపుత్రిక నిప్పింపఁ బ్రార్థించుచున్న దాన. అని చదివెను.

అపత్రికా వృత్తాంతము విని రాజు మిక్కిలి వెరగుపడుచునోహో! చిరుత పులి నీకూతునెత్తికొనిపోయెనా అందులకు మేమేమి చేయుదుము భక్షించియుండు నేమో యని పరిహాసమాడుచు వోరీమృగదత్తా! యిట్టి తివాసులల్లువాండ్రు మీలోఁ బెక్కురుగలరాయేమి యని యడిగిన వాఁడు స్వామీ! నాకుఁగాక యీపని మఱి యొకరికిఁ దెలియదని చెప్పెను.

మహాప్రభూ! వీఁడే రాత్రిమాయింటికివచ్చి నన్ను మోసముజేసి నాకూఁతు నెత్తికొనిపోయిన ద్రిమ్మరి అని రత్నాంగి పలికినది. వీనిపేరు చిరుతపులియా! మృగదత్తుఁడా! అని రాజడుగఁ జిరుతపులియని నాతోఁజెప్పెనని రత్నాంగి చెప్పినది.

రాజు వాని మొగముజూచి మృగదత్తా! నీకు రెండుపేరులు గలవాయేమి! నిజమైన పేరేది యనఁడు నాకు మొదటిపేరులు చిరుతపులియేకాని తరువాత మృగ దత్తుఁడని చెప్పుకొనుచున్నాను. దానికి వేరొకకారణముున్నదని చెప్పెను.

అప్పుడురాజు మిగుల వింతగాఁజూచుచు నీవీరత్నాంగిమాటలు వింటివా! దానికూతు నెత్తుకొనివచ్చితివఁట యేమిటికి? నిజము చెప్పుమని అడిగిన వాఁడు రామ రామ నేనేమియు నెరుఁగను అది బొంకుచున్నదని చెప్పెను. అడవివాండ్రు అసత్య ములాడరు నీవేటొంకుచుంటివి. వీని తివాసి నన్యాయముగా హరించితివఁట. తీసికొని

రమ్ము లేకున్న నిన్ను శిక్షింతునని రాజు కోపముగాఁ బలికినఁ జికియచు రత్నాంగి వాని నిట్లడిగినది.

రత్నాంగి—ఓరీ నీవు నిన్న సాయంకాలమున

మృగ—నిలు, నిలు నేను గోయవాఁడనుకాను. ఉత్తమకులస్థుడ ఓరీ అని నన్ను నీవు పిలువఁదగవు అందరు నవ్వుచున్నారు.

రత్నాంగి—ఓయీ తివాసి తీసికొని మాయింటికి వచ్చితివా?

మృగ—వచ్చితిని. వచ్చితిని.

రత్నాంగి—నీపేరు చిరుతపులియని చెప్పితివా

మృగ—చెప్పితిని. నాపేరు అప్పటికిఁ జిరుతపులియే.

రత్నాంగి— రాత్రి మాయింటికిఁ బదకకు వత్తునని చెప్పితివా?

మృగ—నేనుఁ జెప్పలేదు. నీవు రాత్రి రమ్మని పిలిచితివి.

రత్నాంగి—ఎట్లయిన నేమి నీవు రాత్రి మాయింటికి వచ్చితివా? లేదా.

మృగ—వచ్చితిని.

రత్నాంగి—సరే. నాకూతుఁరును నీయొద్దకు బంపితినా లేదా?

మృగ—కూఁతురో యెవ్వరో తెలియదు. ఒకతె నాగదిలోనికి వచ్చి కూర్చున్నది.

రత్నాంగి—అది నీయిష్టము చొప్పున మెలఁగినదియా?

మృగ—లేదు. లేదు.

రాజు—మఱియేమి జేసినది.

మృగ—దేవా! వినుండు. ఆమెకడుయిల్లాలు సామీ! ఆమెనన్నుఁ జూచినా వృత్తాంతమడిగి తెలిసికొని యూరక కన్నీరుగార్చుచుగొంత సేపటికిఁ బిల్లవాఁడా నీవుయుత్తమకుల సంజాతుఁడవు కోయవాఁడవు కావు ఈబోగముదాని యింటి కేమిటికి వచ్చితివి! దీనివలనధనముపోవును. రోగములువచ్చును. కీర్తిచెడును. తెలిశకలుగునని యెన్ని యోచదివి ఈపని తప్పని చెప్పినది. అంతదనుక నాకామాట తెలియదు. చదివికొని బుద్ధికలిగి న్యాయముగ వర్తింపుమని యెంతయో బోధించినది. నాపుట్టు పూర్వోత్తరమువిని నీపేరుమృగదత్తుఁడని చెప్పుకొనుమన్నది. అప్పటినుండియుఁ బేరు మార్చుకొంటిని ఆమెచెప్పిన మాటలన్నియు నాకునచ్చినవి. అప్రకారమే నడుచుకొనుచు నియమించుకొంటిని. తెల్లవారక పూర్వమే నన్నుఁ బొమ్మన్నది. లేచివచ్చితిని ఇంతకన్న నాకేమియుం దెలియదు. సామీ! అని వాఁడు చెప్పెను.

రాజు—రత్నాంగి! వానిమాటలువింటివా? అచిన్నదినీకూఁతురేనా సత్యము చెప్పుము.

రత్నాంగి—కడుపునఁ బుట్టినదికాదు. పెంచుకొంటిని

రాజు—ఎన్నియేండ్లు ప్రాయమప్పుడు పెంచుకొంటివి?

రత్నాంగి—వివరము జ్ఞాపకములేదు. ఏడెనిమిదేండ్లయినది.

రాజు—దాని తలిదండ్రు లెవరు?

రత్నాంగి—(ఇంచుకయాలోచించి) ఎవ్వరోనాకుఁదెలియదు.

రాజు—మఱియెక్కడనుండి తీసికొని వచ్చితివి?

రత్నాంగి—వీధిఁబడి పోవుచుండఁ బిలిచి అన్న వస్త్రము లిచ్చి పోషించుచుంటిని.

రాజు—దానికి వివాహమైనదేమో యెఱుఁగుదువా?

రత్నాంగి—ఎఱుఁగను.

రాజు—ఎప్పుడును అడుగలేదా?

రత్నా—వట్టి వెఱ్ఱిదిబాబూ! ఏమాటయుం దెలియదు. చెప్పినపని మాత్రము చేయుచుండునది.

రాజు—అంతకుమున్నెన్నఁడైన లంజరికమునకు నియమించితివా?

రత్నా—లేదు. లేదు. దానియవసరము లేకపోయినది. నిన్న నాయొదలిలో స్థిమితములేమింజేసి దానిం బంపవలసి వచ్చినది.

రాజు—అలంకరించియే పంపితివా?

రత్నా—అయ్యో! పదివేలు విలువఁగలనగలచేనలంకరించితిని.

మృగదత్తుఁడు—లేదు సామి లేదు. ఒక్క నగయైన లేదు. మాసినగుడ్డ కట్టుకొన్నది. మూలఁ గూర్చున్నది. వెఱ్ఱిదిగాదు. ఏలాటి పురాణములు చెప్పినదను కొంటిరి?

రాజు—నీవిమాట యసత్యమా? అది సింగారించుకొనఁగా నీవు చూచితివా! నిదానించి చెప్పుము.

రత్నాంగి—నాకు జ్వరముగా నుండుటచేఁ బరిశీలింపలేను. అలంకరించుకొని పొమ్మని చెప్పితిని.

రాజు—నీవీపత్రికలోఁ బదివేల వెలగల నగలతోఁ దీసికొని పోయెనని వ్రాయించితివిగదా? చూడక యెట్లు వ్రాయించితివి.

రత్నాంగి—(భయపడుచు) నగలు ధరించినదని తలంచి యట్లువ్రాసితిని.

రాజు—నీమాటలలోఁ బరస్పరవిరుద్ధములు చాలగలవు. నీవు చెప్పుచున్నవి అంతయు నసత్యము. ఉత్తమాంగనను చెడుకార్యమునకు నియోగించితివి. లేనియెడ

రాధము నిరూపించితివి ఈయపరాధద్వయమునకు నీవు దండ్యురాలవు. వేయి నిష్కము లిచ్చుకొనునట్లు నీకుశిక్ష విధించితిమి. ఈయనితో రెండేడులు కారాగార ములో నుండవలయు నీతివాని తీసికొనివచ్చి వీనికిచ్చివేయవలయును. అనిమంత్రులతో నాలోచించి యారాజురత్నాంగికి శిక్షవిధించుటయు దబ్బాసనానుసారముగా రాజ భటులు పసపదయని గెంటుచు దానివెంట దాని యింటికింబోయి శిక్షాధనముతోఁ గూడ దివాసిని తీసికొనివచ్చి రాజునకు సమర్పించిరి.

ఓహో! ఈరాజు పక్షపాతముజేసి నాకపరాధము విధించెను. తిఁవాసి తాను దీసి కొనుటకై యింత పన్నెను. కానిమ్ము వీరితోనే యయ్యెనా యేమి? పైయధికారులు లేరా? భూమియంతయు నీతఁడొక్కఁడే పాలించుచుండెనా? పైవారియొద్దకుఁ బోయి న్యాయము బొందివచ్చెదనని నిశ్చయించి రత్నాంగి దర్వ్యనష్టమునకు మిక్కిలి విచా రించుచు నుదయార్కునిపై నధికారముగల గజేంద్రవాహనుఁడను రాజునొద్ద కఱిగి నది.

న్యాయవాదుల సహాయముమూలమున రత్నాంగి యుదయార్కుఁడు తనకుఁ గావించిన యక్రమమును గజేంద్రవాహనునకుఁ దెలియఁ జేసినది అమ్మహారాజు అయ్యభియోగమునను విమర్శించుటకు దనకు సామంతరాజుగానున్న సుమేధునొద్దకి, బంపెను.

అని యెఱింగించునప్పటికి ... ... ...

## 128 వ మజిలీ.

## సుమేధుని కథ

గజేంద్రవాహనుఁడు సామంతచక్రవర్తి. అప్పుడీవీపతి యధికారముక్రింద నేబదియార్గురు సామంతరాజులుగలరు. సామంతరాజులు చేసిన న్యాయాన్యాయముల విమర్శింప గజేంద్రవాహనునికి నధికారముగలదు. తానుచేసిన శిక్షావిధులు సమంజస ములు కావని తోచినచోఁ ద్రిప్పివేయుచుండును. అయభియోగమునెల్ల విమర్శించి యందలి యదార్థము లెఱింగింప మిక్కిలి బుద్ధిమంతుఁడగు సుమేధుఁడనుసామంత రాజును నియమించెను. సుమేధుఁడును గజేంద్రవాహనునిచే నీయఁబడిన నూఱు గ్రామ ములు గలవాఁడగుట రాజని పిలువఁబడుచుండును. సుమేధుఁడు తెలివిగలవాఁడు. ధర్మానకుండని యెఱింగియుండుటచే గజేంద్రవాహనుఁ డతఁడుచేసిన తీరుపుల విమ ర్శింపకయే స్థిరపరచుచుండును.

రత్నాంగి తన యభియోగమాసుమేధునొద్దకుఁ బంపబడినదని విని యతనిచేఁ బాలింపఁబడుచున్న విద్యానగరమునకుఁ బోయినది. రత్నాంగి మధ్యయౌవనమందు

న్నను వస్త్రధారణ మాధుర్యము లోనగు విశేషములచేఁ బాలిప్రాయమందున్నట్లు కనం బడుచుండును. రత్నాంగి యాటపాటల నంతనైపుణ్యము లేనిదైనను విటవిత్తాపహరణ మందు మంచి నేర్పుగలిగియున్నది. యువకులరంజించు వగలు, టక్కులు దానికే గలవు. విద్యానగరంబునఁ బుష్పవేణిఅను వారకాంతయింటఁ బసజేసి దానితోఁ దన వృత్తాంతమెఱిఁగించి కన్నీరుగార్చుచు నిట్లనియె.

ఉదయార్కుఁడు వస్తులోభంబున నాకన్యాయముగా శిక్షవిధించెను. ఈయప రాధము మాపుకొననేని నేనాయూరిలోఁ గాపురము జేయఁజాలను. ఈసుమేధుఁ డెట్టి వాఁడో తెలియదు. నీవెప్పుడైనఁ జూచితివా? భార్యాపుత్రులు గలరా. ఎన్ని యేండ్ల వాఁడు? రసికుఁడగునా! కాదాయెఱింగింపుమని యడిగిన బుష్పవేణియిట్లనియె సుమేధుఁడు ధర్మస్వరూపుఁడని చెప్పుదురు. మిక్కిలి చక్కనివాఁడు. విహారార్థ మరుగుచుండఁ బెక్కుసారులు చూచితిని. పరస్త్రీలఁ గన్నెత్తిచూడఁడు. న్యాయా న్యాయ విమర్శనమం దతనికిఁ గలనేర్పు బృహస్పతికి లేదని చెప్పుకొనుచున్నారు. ధర్మసూక్ష్మము వానికే తెలియునఁట. కావున నీవు విచారింపనవసరము లేదు. న్యాయమే చేయును. మగవగ లతనిమదికిఁ దగులవు ఆశ్రయించిన ప్రయోజనములేదని చెప్పినది. కానిమ్ము మంచిమాట వింటిని ఎల్లుండి నాయపరాధము విమర్శింతురఁట. సాక్షులతో రమ్మని నాకు నాజ్ఞాపత్రికఁ బంపిరి. పరిచారిక నొకసాక్షిని దీసికొని నవచ్చితిని. రెండవసాక్షివిగా నీవు రావలెను. నాగౌరవము గురించియు నీతినిగురించియు నీవు జెప్పవలయును. అని బ్రతిమాలిన నది అంగీకరించినది.

నిరూపణదివసంబున రత్నాంగి యిరువుర సాక్షులతో రాజసభకుఁ బోయినది. రాజభటులు రత్నాంగీ! అని పిలిచినతోడనే సుమేధునియెదుటకుఁ బోయి నమస్క రించినది. సుమేధుఁడు దానిం జూచి రత్నాంగీ! నీవేనా? ఉదయార్కుఁడు నీపై నపరాధద్వయము నిరూపించి నీకుశిక్షవిధించెను. నీ వాయపరాధములు చేయలేదని యెట్లు చెప్పెదవు? అని యడిగిన నది యిట్లనియె.

దేవా! నేను వారకాంతను. నాయందు వారికొక కోపము గలిగియున్నది. ఒకప్పుడు నాకువర్తమానము చేయగాఁ బోలేకపోయితిని. దేవరవా రెఱుఁగనిధర్మ మేమిగలదు. మఱియు నేనకొన్న తివాసిని వారూరక తీసికొనిరి. వస్తులోభంబున నాయందపరాధము నిరూపించి శిక్షించిరి. దేవరవారు ధర్మస్వరూపులు. నాకుల వృత్తి ప్రకారము జేసితిని. అది తప్పని శిక్షవిధించిన మే మేమిచేయఁగలము. అని కన్నీరు గార్చుచుఁ జెప్పిన వారించుచు నతం డిట్లనియె.

నీవు అడిగినమాటకే యుత్తరము చెప్పవలయునుగాని యితర ప్రసంగము

జేయఁగూడదు. వినుము. నీవులంపట త్తికప్పని యశం దనలేమ నీవు యోగ్యమైన చిత్తవృత్తిగం యొక్ స్త్రీని ఇష్టములేనిదే వ్యభిచారమునకు నియమించితివట అది యొక తప్పు సుగుణసంపన్నుఁడగు కోయబాలునిపై వస్తువులతోఁగూడఁ దన కూతురను దీసికొని పోయెనని యసత్యాభియోగము దెచ్చితివట అది రెండవతప్పు ఈ యపరాధద్వయమునకై నిన్నుదయార్కుఁడు శిక్షించెను. ఇందులకు నీవేమి చెప్పెద వని అడిగిన నది యిట్లనియె.

దేవా! భోగమువాండ్రు ఇతరజాతులబాలికల దెచ్చికొని పెంచుకొనుట వాడుకయైయున్నది. అట్లే నేనొక కూతుం బెంచుకొంటిని. దానికా క్షురవాఁడు తివాసి సుంకువగా నిచ్చి కలసికొని మరునాఁడు మాయిల్లు దాటించెను. అందులకై యాకోయవానిపై నిజమైన యపరాధమే మోపితిని. తివాసిని వారు తీసుకొను తలంపుతో నీశిక్ష నాకు విధించిరి తండ్రీ అని మొరపెట్టుకొన్నది.

సుమేధుఁడు న్యాయావాదులతో నాయభియోగమును గురించి కొంత చర్చించి తివాసితోఁగూడ నాకోయపిల్లవాని నిచ్చుటకిఁ బంపుమని వ్రాసియుంటిమి పంపిరా? అని అడిగినఁ గ్రిండియుట్లోగి యొకపత్రికను విప్పి చదివి దేవా! పిల్లవాఁడు రాలేదు. తివాసిపంపిరి వాఁడాతివాసి నమ్మి యానాఁడే కొండలలోనికిఁ బోవుటచేతఁ బిలి పించుట కాలస్యమగుచున్నది. కొంచెము కాలవ్యవధినొసంగిన పంపఁగలను అని యుదయార్కుఁడు వ్రాసియున్నాఁడని వినిపించెను.

అప్పుడు సుమేధుఁడు, చిత్రాసన మెందున్నది. తెప్పింపుఁడని అడిగిన నొక పరిచారకుఁ డాచుట్టను తీసికొని యందు విప్పి పరచెను. అయల్లిక, యారంగులు, నాదట్టన, యామెఱుఁగు, అవన్నె, యాతళుకుఁచూచి సుమేధుఁడు మిగుల వెరగుపడుచు నల్లిక విమర్శించి వస్తువులు వితర్కించి విప్పివిప్పి గుచ్చిగుచ్చి నిదానించి మఱియు మఱియుఁజూచుచుఁ బెద్దతడవుఁ దాని గుణించియే వితర్కించుచుండెను.

కన్నులు మూసికొని యొక్కింతసేపు ధ్యానించి రత్నాంగి మొగముఁ జూచి మృగదత్తుఁడీ రత్నాసనము తానల్లెనని నీతోఁ జెప్పెనా? యీపని తనకెవ్వరు జెప్పిరో? యడిగితివా యనిపలికిన అవ్వెలఁది దేవా! అది వాఁడల్లినమాట వాస్తవము పనియెట్లు నేరుచుకొనెనో నాతోఁ జెప్పలేదు. ఉదయార్కునితోఁ జెప్పెనేమో తెలియదని యుత్తర మిచ్చినది.

అప్పుడతండాపత్రికలన్నియు మఱలఁ జదివెను. వానిలో కోయపల్లెలో నల్లిన చాపం జూచి నాబుద్ధిబలముచే నాయల్లిక నేరుచుకొంటినని చెప్పినట్లున్నది. అప్పుడు తలయూచుచు నా పుడమిరేఁడు మృగదత్తుని సాధ్యమైనంత వేగముగా నిక్కడికిఁ

బంపవలయును వాని వలనఁ గొన్నిసంగతులు తెలిసికొనవలసియున్నదని వ్రాయించి సుమేధుడు గజేంద్రవాహనుని ముద్రికలువైచి యుదయార్కునొద్దకనిపెను. మఱియుఁ గొన్నిదినములు గడువిచ్చితిమి. మృగదత్తునిఁ వలన సాక్ష్యము తీసికొన వలసియున్నది. వాని రప్పించుట కుత్తరము లిచ్చితిమి. యప్పటికి నీవు రమ్ము, పొమ్ము. అని యెఱింగించి గడువుచెప్పి సుమేధుఁడు మృగదత్తునిరాక నరయుచుండెను. ఉదయార్కుఁడు గజేంద్రవాహనుని శాసనపత్రికం జదివికొని తొందర పడుచు మృగదత్తుడు గనంబడినతోడనే పట్టుకొని తీసికొని రావలయునని చెప్పి పలువురఁ దూతల నలుమూలలకుఁ బంపెను.

అని యెఱింగించి —

## 129 వ మజిలీ కథ

# గదాధరుని కథ

అహా! విద్యయం దెట్టిమహిమయున్నది.

ఉ. విద్య నిగూఢగుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్యయశస్సుభోగకరి విద్యగురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము విద్యకుసాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే.

చదివికొనక యెంతమూర్ఖుఁడ నైతిని. నాకా యిల్లా లీమాట చెప్పక పోయినచో నేమియుం దెలియదుగదా? ఇప్పుడు చదివికొనుటచే గ్రంథములు చూచుటకు శక్యమగుచున్నది నాలుగుమాసములలోనే వ్రాయుటయుఁ జదువుటయుఁ దెలిసినది. ఆమె చీకటిలో వ్రాసిన విషయములు తెల్లమైనవి. నాతల్లిదండ్రులు మృతినొందిరఁట అందున్నవారు నాతల్లికిఁ దల్లిదండ్రులఁట ఆమెకు నావృత్తాంతమెట్లు తెలిసినదియో? ఆమె యెందుఁబోయెనో తెలియదు. ఇఁక నేను రామదుర్గనగరమునకుఁ బోవుట కర్జము. బంధువులం గలసికొనియెద అయ్యో! నన్నుఁ గోయవాఁడని నిరసింతురేమో వేషము మార్చెదనని మృగదత్తుఁ డొకనాఁడు తలంచుచు నార్యవేషముతో బయలుదేరి యొక మార్గంబునంబడి నడుచుచుండెను.

ధ్యానించుచుండుటచేఁ దారిలో పాషాణకంటకాదులు అతని నంతగా బాధించినవి గావు. పోవంబోవ మధ్యాహ్నమున కొక గ్రామము జేరెను. అందు భోజనసదుపాయ మెందుఁగలుగునని యరయుచు సత్రముండుటఁ దెలిసికొని అక్కడికిఁ బోయెను. అందు నాలుగు వర్ణములవారికిని భోజనము పెట్టుచుందురు. కుడిచి కూర్చున్న

పిమ్మట నొక బ్రాహ్మణుఁడు మృగదత్తునిఁ జూచి నీ వేయూరి కరుగుచుంటివని యడిగిన నతఁడు రామదుర్గ నగరంబునకుఁ బోవుచుంటినని యుత్తరము జెప్పెను.

బ్రాహ్మణుడు—రామదుర్గనగరముతో నెవ్వరింటికిఁ బోయెదవు.

మృగదత్తుఁడు—కుముదాంగదుని యింటికి.

బ్రాహ్మ—అతండు నీకుఁ జుట్టమాయేమి?

మృగ—చుట్టమే.

బ్రాహ్మ—ఏనుగును?

మృగ—మాతల్లి తండ్రి.

బ్రాహ్మ—(విస్మయముతో) మీతల్లి పేరేమి?

మృగ—నాకుఁ దెలియదు.

బ్రాహ్మ—మీ తండ్రిపేరు?

మృగ—అదియుం దెలియదు.

బ్రాహ్మ—వారెందున్నారు?

మృగ—తెలియదు. మృతినొందిరని యొకతె చెప్పినది.

బ్రాహ్మ—(దుఃఖముతో) వారికి నీ వెందుఁజనించితివి.

మృగ—నాకేమియుం దెలియదు. పోనిండు. నావృత్తాంతములో మీకేమిపని మీరెవ్వరు?

బ్రాహ్మ—నేను మీతండ్రికి మిత్రుఁడను. మీతల్లి దండ్రుల నిమిత్తమే వెద కుచు దేశాటనము చేయుచుంటిని.

మృగ—మీపేరు.

బ్రాహ్మ—గదాధరుఁడండ్రు.

మృగ—వారెందుబోయిరి?

బ్రాహ్మ—వెల్లడింపరాదు. మెల్లగా మాట్లాడుము. మహాపతివ్రతయగు మీతల్లి రాజుం గామాపచారాపరాధంబునఁ బొమార్చినది దానంజేసి యిరువురు కానన ములంబడి యెండోఁగాగిరి. అని వింటిని వారినరయుచుంటిని. బాబూ! వారు మృతి నొందిరని నీకెవ్వరు చెప్పిరి. అని కన్నీరుగార్చుచు నడుగుటయుఁ నతఁడు వేశ్య యింటిలోనున్న పరిచారిక చెప్పినదని యాకథయంతయు నెఱింగించెను. నమ్మక తోచిన పిమ్మట నామె వ్రాసియిచ్చిన యుత్తరము చూపించెను.

గదాధరుఁడా యుత్తరము చదివికొని శిరముపట్టి అయ్యో! ఈయుత్తరము వ్రాసినది పద్మిని తెలిసికొనలేకపోయెను. భర్తతో వియోగము పొందియుండవచ్చును.

విరక్తితో వ్రాసినదని తలంచెదను అక్కడికిఁబోయి చూతమా? అని యాలోచించి బాలుఁడా! ఆమె యిప్పుడెందున్నదని అడిగిన నెక్కడికో పోయినది. అందులేదని యాబాలుండుత్తరము జెప్పెను.

మృగదత్తుఁడు రహస్యముగా గదాధరునివలనఁ దనతలితండ్రుల వృత్తాంతము సాంతముగాఁ దెలిసికొని పరితపించుచు దుర్గానగరంబునకుఁ బోవుటకు సహాయము రమ్మని కోరికొనుచు.

గీ. సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్చు
గౌరవ మొసంగు జనులకుఁ గలుషమడఁచు
గీర్తిఁబ్రకటించు ధైర్య విస్ఫూర్తిఁజేయు
సాధుసంగంబు సకలార్థసాధకంబు.

అనిస్తుతియించుటయు నతఁడక్కడి అధికారుల శాసనము కడుక్రూరముగా నున్నది. మీవారియింటికిఁ జుట్టునుగాపు పెట్టిరి. క్రొత్తవారువచ్చిన బరీక్షించుచుందురు. వారినెచ్చటికిఁ బరీక్షింపపోవనీయరు. నీవృత్తాంతము దెలిసినఁ బట్టికొనియెద రేమో మీపితామహుని యూరికేగుదమన్నను వారినినట్లే నిర్బంధించుచున్నారు. కావునఁ బ్రచ్ఛన్నముగా బోయిచూడవలయునని గదాధరుఁడుపలుకుటయు మృగదత్తుండిట్లనియె.

మనమేమి అపరాధము జేసితిమి? నిరపరాధుల రాజపురుషులు బట్టికొనియెదరా? మఱియు రాజు చేసిన అక్రమమును నిందింపక మావారి నపరాధులుగా నెన్నుల తప్పుగాదా? ఎట్లయినను దుర్గానగరమున కరుగక తప్పదు. ఈయుత్తరము చూపవలయునని పలికెను.

వారట్లు మాట్లాడికొనుచుండఁగాఁ బ్రచ్ఛన్నముగాఁ దిరుగుచున్న యొక్క పురుషుఁడు వారిమాట లించుక యించుకవిని వారి వెనువెంట దిరుగుచుండెను.

వారుగూఢముగారామాదుర్గనగరమునకుంబోయిరి. కావలివారి నెట్లో తప్పించు కొని యిరువురు గుముదాంగదుని యింటిలోని కరిగిరి. గదాధరుని గురుతుపట్టి కుముదాంగదుఁడు నమస్కరించుచు భూసురోత్తమా? మావారి జాడ యేమైనం దెలిసినదియా? అయ్యో మేమిక్కడ బద్ధప్రాయులమై యుంటిమి. యీబాలుఁడెవ్వఁడు యుశీనర నగరంబున కేమైన వార్తలు తెలియవుగదా యని కన్నీరు గార్చుచు అడిగిన అతండిట్లయె.

శెట్టీ! చలపట్టి విధి మనలనట్టు వేయుచున్నాడు కీడులోమేలు విను మీ బాలుండు పద్మిని కొడుకు వీనిపేరు మృగదత్తుఁడు దైవికముగాఁ వీఁడు నాకన్నులఁ

బడియెను. పద్మిని పినింగనుటయేకాని మద్దు ముచ్చటలు చూచి యెఱుంగదు. వారు మడిసిరని వార్త వ్యాపించినది. కాని యది అసత్యము దేశములపాలై తిరుగుచున్నారు. రాజపురుష భయంబున వెల్లసికాకున్నారని లానెఱిగిన వృత్తాంతమంతయుంజెప్పి వారికి సంభ్రమము గలుగఁజేసెను.

అప్పుడు కుముదాంగదుఁడు వాని తెఱంగు భార్యకు తెలిగించి కౌఁగలించు కొనుచు నానందబాష్పములచే వాని శిరంబు దడిపెను. అతని భార్యయుఁ గూఁతు చిహ్నములు వాని యందుండుట డిలకించి శోకింపఁ దొడంగినది

తాను కొండపల్లిలో నుండుటయుఁ గోయపల్లెలో అల్లినచాపల జూచి తానంత కన్నఁ జిత్రముగా నల్లుటయుఁ నుదయార్కుని నగరమున కరుగుటయు నొక వేశ్య యింటి కరుగుటయు అందుఁగల యొక చేడియ బుద్ధులు గరపుటయుఁ చీటి వ్రాసి యచ్చుటయు రాజునొద్దకు బోవుటయు రత్నాంగి తనపై నేరమారోపించుటయు లోనగు వృత్తాంతమంతయుఁ గ్రమ్మర వక్కాణించి యామె యిచ్చిన చీటి కుము దాంగదునికిఁ జూపెను.

అకమ్మ జదివికొని లిపి గురుతుపట్టి అయ్యో నాయనా! అదియే నీతల్లి. వేశ్య యింటిలో నేమిటికుండవలయును. ఏమన్నది బాబూ చెప్పుము. చెప్పుము. అని మఱియుమఱియు అడుగుటయునతఁడిట్లనియె.

అయ్యా! ఆమె అలంకరించుకొనక యొకగదిలోఁ దలపుమూల నిలువంబడి యున్నది. ఆమెం జూచి నీ వెవ్వతెవు ప్రొద్దున్న నాతో మాటాడిన బోగముది యేదీ? అని యడిగితిని. అది యిప్పుడే వచ్చును. నీవెవ్వఁడవు అని యడిగిన నేను నా వృత్తాంతము జెప్పితిని. అప్పుడు గోలుగోలున నేడ్చుటయు నేను శంకింప నీవు చిన్న వాఁడవై దుర్వృత్తిలోఁ బ్రవేశించినందులకు దుఃఖించితినని చెప్పినది. అప్పా! అప్పుడు నాకామె చెప్పిన నీతులకు మేరలేదు. మేనంతయు నాకు నీరు గ్రమ్మినది. ఈలాటి పను లెన్నఁడును జేయవలదని బోధించుచు నీ యుత్తరము వ్రాసి యిచ్చినది.

అప్పటికి నాఁకు జదువురాదు. ఏమి వ్రాసినదో తెలియదు. పిమ్మటఁ జదివి కొని యా యుత్తరము తెలిసికొని యిందు వచ్చుచుండ దారిలో గదాధరుఁడు గనం బడెను.

ఇరువురమువచ్చితిమని యాకథయే పదిసారులు చెప్పెను. ఎన్నిసారులు చెప్పినను తనవినసనకమరలమరలనడుగుచుండు. వారట్లుమాటలాడుకొనుచుండరాజపురుషులుకొం దరులోపలికివచ్చి ఈ క్రొత్తవారెవ్వరు? గురుదత్తునిచేఁబంపఁబడిరని యనుమానము గలిగి యున్నది. నిజము చెప్పుమని యడిగిన గుముదాంగదుఁ డదలుచు వారెవ్వరో నాకుఁ

తెలియదని యుత్తరము జెప్పెను. వీరపురుషులు వారిం బట్టుకొని రాజసభకుఁ దీసికొనిపోయిరి. రాజప్రతినిధి వారిని విడదీసి మీరెవ్వరు? వీరింటి కేమిటికి వచ్చితిరని యడిగిన గదాధరుఁ డొకరీతిని మృగదత్తు డొకరీతిం జెప్పిరి.

అంతకుమున్న కుముదాంగదుని మేడలో నతఁడెరుంగకుండ ధ్వనిగ్రాహిణి యను యంత్రము నొకదాని నమర్చియుంచిరి. ప్రతినిధి యప్పుడా యంత్రమును దెప్పించి పరీక్షించెను.

దానిభాగము మృగదత్తుఁడు చెప్పినమాటలు గదాధరుఁ డాడిన మాటలు నాయంత్ర మాకర్షించినది. అభిముఖముగాక విముఖముగాఁ జెప్పినమాటలు గొన్ని దానిలోఁ జేరలేదు. వారిసంవాదమంతయు నవి యాకర్షించినచో వారు నిరపరాధులని తెల్లమేయగును వారికిఁ బ్రతికూలమైన మాటలే యందుఁ జేరినవి. విధిప్రేరితము కడు విచిత్రముగదా? మృగదత్తుఁడు గుణదత్తుని కొడుకైనట్లును గదాధరుఁడు మిత్రుఁడైనట్లును అతం డడవులోఁ గాపురముండి వీరిక్కడి కనుపుచున్నట్లు తెలిసికొని రాజప్రతినిధి వారినెల్ల నపరాధులుగానెంచి బద్ధులంజేసి చెరసాలఁ బెట్టించెను.

మఱియొకనాఁడు సామంతచక్రవర్తియగు గజేంద్రవాహుని క్రొత్త శాసన ప్రకారము వారికి స్థిరమగు దండన విధించుటకుఁ దన కధికారము లేమింజేసి వారి ముగ్గురను రక్షకభటులతోఁ గూడ గజేంద్రవాహునియొద్ద కనిపెను.

సీ. ధన నిమిత్తమున కాదా! మేదినీపతుల్
 బంధువులై ప్రజఁ గాపాడుటెల్ల
ధనముపార్జింపఁగాదా విప్రులఖిల వి
 ద్యాసంగ్రహస్ఫూర్తిఁ దనరుటెల్ల
ధనము గూర్చుటకె కాదా? బేరులూరఁ
 దిఱిగి వ్యాపారముల్ దీర్చుటెల్ల
ధనలాభమునకె కాదా? పాదభవులు క్షే
 త్రాజీవులై భూమి బ్రబలుటెల్ల

గీ. ధనముఁగోరనివారలీ ధరణిలేరు
దైవమైనకైనఁ గావలె ధనము ధనము
వలనమెచ్చుచు దైవంబు వరములిచ్చు
ధనమఖిలలోకలోక మోహనముసూవె

క. దైవంబునకే ధనమునఁ
 గాఁ వేడుక బొడముచుండగా దారుణమో

హా విలమతులగు మనుజులు
భావంబున ధనవిరక్తి బడయంగలరే.

ధనమునకు వశులుగానివారు లేరు మృగపత్తుని గదాధరుని గుముదాంగదుని రక్షకపురుషులు పదుగురు చుట్టునుం బరివేష్టించి గజేంద్రవాహుని యొద్దకుఁ దీసికొని పోవుచుండిరి. నడుమనప్పుడుమార్గమధ్యంబున రాజభటుల నుద్దేశించి గదాధరుఁ డిట్లు పన్యసించెను.

కింకరులారా! లోకంబున ధర్మాధర్మంబులు న్యాయాన్యాయంబులు మంచి చెడ్డలు పాపపుణ్యంబులు అని చెప్పుకొనుచుందురు పర్యాయపదంబులు వీనిభావం బొక్కటియే ఒకప్పుడు న్యాయమన్యాయముగాఁ బరిగణింపఁబడుచుండును. వీనికిఁ బూర్వకర్మంబులు హేతుకంబులని పెద్దలు వక్కాణింతురు. తొల్లి మాండవ్యుండను మహర్షి నిరపరాధియయ్యుఁ జోరుండువోలెఁ గొఱతవేయఁబడిన భారతమునందలి కథ యిందులకు నిదర్శనముగా నున్నది. దుర్మరణమునొందిన మీరాజుగారి కృత్యము లెట్టివో మీ రెఱుంగనవి కావు. పస్మనిచేసిన పని యథార్థమని మనమిక్కడ నను కొనక మానము. ప్రజలు చాటున మంచిమంచిగను చెడ్డచెడ్డఁగను చెప్పికొనకమానరు. అది యెట్టిదైనను నపరాధము విమర్శింపఁ బ్రతినిధికి విధియైయున్నది కాని యేమియు నెఱుంగని మమ్మిట్లు బాంధించుట కేవలమక్రమము. అధర్మము ఈతండు గురుదత్తుని కుమారుడని యూహించితిమి. అసంపతు లెందుండిరో మాకుఁదెలియదు వీఁడుమునుపే యెఱుంగఁడు జారలంబట్టి సంబంధముగలుపుకొనిరి ఇదిమాకుఁ బూర్వకర్మయుగాక మరియొకటికాదు సజ్జను లందరిలో నుందుస. క్రూరమృగంబులలో సైతము స్వాతిక విశేషంబునఁబట్టి సాధుత్వము బొడగట్టుచున్నది. గోటీశ్వరునికి మనమండె యాతం డీరీతి నిడుములగుడుచుచున్నవాఁడు దైవము నేమనఁ దగినది. వీని సిరికి మీరాజు రాజ్యమంతయుఁ బదియారవ పాలునకు సరిపడదు. అని యుపన్యసించుచు జాలిపొడము నట్లు వారి మొగములు జూచుటయు వారిలో.

ఒకడు—బ్రాహ్మణుఁడా! మేమేమి జేయగలము.

గదాధరుఁడు—మీరు జేయఁగలిగినపని మహారాజుచేయలేడు

మరియొకడు—విడిచిపెట్టుమనియెదవా? యేమి.

ఒకడు—అట్లయిన మాశిరంబులు ఖండింపరా.

గదాధరుఁడు—అయ్యో! అట్లనుటకు నేనంత మూర్ఖుఁడనను కొంటిరా! మీకృత్యములు నేనెఱుంగనివి కావు.

వేరొకఁడు—మాకు బాధకములేసిరీతి నేదియైన నుపకారము చేయఁగలము చెప్పుడు.

గదాధరుఁడు—వినుండు. శ్రీనగరపురంబున వీనితాత రత్నాకరుఁడు గలఁడు వానికివీనింజూపి తీసికొని పోవుఁడు ఇదియే నాకోరిక అతండు కోటీశ్వరుండగుట మీకు మంచి పారితోషిక మీయఁబడునని ప్రార్థించెను.

ఆమాట వినినతోడనే వారి హృదయంబులు సంకల్ప శతంబులచేఁ బూరితంబు లగుట నామార్గంబున నడిపింపఁబోదంగిరి. గదాధరునితో మంచిమాటలు సెప్పుచు గౌరవింపంబోదఁగిరి కతిపయప్రయాణంబుల నన్నగరంబునకుఁ జనిరి. సంకెళులుదీసి ప్రచ్ఛన్నముగా దాచి రత్నాకరుని యింటికి గుప్తముగాఁ దీసికొనిపోయిరి. గదాధరునిఁ జూచి రత్నాకరుఁడు తొందఁపాటుతో మావారిజాడ యేమైనం దెలిసినదా? అని యడుగుటయు నించుక జనాంతికముగా విను మీతండు నీమనుమఁడు ఆయడవిలో జనియించెను. తల్లిదండ్రుల నెఱుంగఁడు దైవికముగా దారిలో దారసిల్లెను. దుర్గానగరంబునకుఁ బోయితిమి విధివశంబునం బట్టువడితిమి పెద్దశిక్షకై కొంపోఁబడుచుంటిమి అని యా కథ యంతయుం జెప్పెను.

రత్నాకరుఁడు మనుమని గౌఁగలించుకొని దుఃఖింపఁబోదంగెను. రాజభటులు అయ్యా! చూచితిరిగదా ఇఁక పోవలయును. లెంతు లెండని తొందరపెట్టుటయు గదాధరుఁడు రత్నాకరునితో నేకాంతమాడి వారితో నిట్లనియె.

భటులారా! మీవేతనము కడు స్వల్పములు అధికారము పెద్దది దండనవిధి అంతయు మీచేతిలో నున్నది దా మఱియు మాకొక యుపకారము మీరు జేయవలసి యున్నది. తత్ఫలము? ఈ ధనము గైకొని అట్లు కావింపుఁడని పలుకుచు నేబదివేల దీనారముల వారి ముందర రాశిగాఁ బోయించెను. కనులకు మిఱుమిట్లు గొల్పుచున్న యాకనకరాశిం జూచి వాండ్రు విభ్రాంతిపడి యెక్కింత సేపేమియు మాటాడనేరక మిన్నకచూచు చుండిరి. గదాధరుండు మీరుపిఁమూటగట్టుఁడు తరువాతఁ జేయఁదగిన కృత్యము బోధింతునని పలుకుటయు వాండ్రు సగ్గుత్తికతో స్వామీ! మీయనుగ్రహమునకు సంతసించితిమి. మాశిరంబుల నిలుచున్నట్లుచేయుఁడు! మీరేమిచెప్పిన నట్లు నడుచువారమని పలికిన విని గదాధరుఁ డిట్లనియె.

మీకేమియు భయమురాదు. అపాయములేని యుపాయం బెఱింగించెద. వినుండు. మామువ్వురనింద విడువుఁడు. మాకుమారుగా మీకు మఱియొకరిని ముప్వురనప్పగించెదము, మా పేరులే చెప్పగలరు. దీన మీకేమియుఁ గొరతయుండదు. అక్కడివారలు మమ్ముఁజూచిన వారు కారుగదా! మీపత్రికలలోఁ బేరులే వ్రాయఁబడి యున్నవి. వానిం జదివికొని వారికే శిక్షవిధింతురు. వారికినిఁ దగిన యుపాధుల మే మేరుపరుతుము అని చెప్పినవిని వాండ్రు ఆలోచించుకొని యందుఁదమ కేమియుఁ బ్రమాదములేదని నిశ్చయించుకొని యప్పని కంగీకరించిరి.

రత్నాకరుని పరిచారకులలోఁ దగినవారి మువ్వుర కప్పులుకులు బోధించి విశేష ధన ప్రదానంబున వారి సంతోషపరచి రక్షక పురుషుల వెంట నామువ్వురిం బంపి వేసెను.

రత్నాకరుఁడు వారిం దనయింటనుండ నిర్బంధించెనుకాని గదాధరుఁడు అంగీకరింపఁడయ్యెను. మేమిక్కడ నుంటిమేని విదితము కాకమానదు. గుట్టు బయల్పడెనేని ప్రమాదము గలుగును. కొన్ని దినములు ప్రచ్ఛన్నముగా రహస్యస్థలంబుల వసించి కొంది కాలములలో గ్రమ్మర ననుదెంతుమని బోధించి యతని నొప్పించి యిల్లు విడిచి యేకాంతముగా నుత్తరాభి ముఖముగాఁ బోవఁదొడంగిరి.

మనకిప్పుడు గమ్యస్థాన మేదియని యడిగిన గదాధరునకు మృగదత్తుండు ఆర్యా! నేజనించిన కోయపల్లె కడు రహస్యమైనదని మీరు వినియేయుంటిరి. మనమక్కడికిఁ బోవుదము. మనల నెరుఁగఁజాలరు. కొన్నిదినములుండి వత్తము. జన్మభూమిజూడ నాకును వేడుకగానున్నదని పలికి అయ్యరణ్యమునకుఁ బ్రయాణము చేసెను.

అతికష్టములపాలై కాలినడక నెట్టకే సమ్మెట్టల నడిభాగము జేరిరి. మృగదత్తుని కొందఱు గురుతు పట్టలేకపోయిరి. గురుతుపట్టిన వాండ్రు చిరుతపులియని కేకలు వైచిరి. ఇంటికివచ్చిన మృగదత్తుని జూచి తండ్రి యేమిరా! పెద్దవాఁడవై యింటి యొద్దకురాక దేశముల పాలై తిరుగుచుంటివి. వీఁడెవఁడు? చాపలమ్మినసొమ్మేమి చేసితివని యడిగిన మృగదత్తుండు వాని పామరత్వమునకు వెరగందుచుఁ గొంతిసొమ్ము వానికిచ్చి నాయనా! కారణముండబట్టి తిరిగితిని. అమ్మినసొమ్మిమ్మనియే తీసికొనుము. మిమ్మెప్పటికిని మరువను. అని అప్పటికిఁ దగిన మాటలాడి వాని సంతోషపరచెను.

ఆసొమ్ము పుచ్చుకొని వాఁడు మిగులఁ జిఁగుచు బాబూ! నీకొఱకీనడుమ పదుగురువచ్చి వెదకిరేమిటికి? ఎంటోటోయెనని చెప్పితిని. పలుమారు మాయిల్లు శోధించిరి. కారణ మేమని యడిగిన విని నాకేమియుఁ దెలియదని చెప్పెను.

గదాధరుఁడా మాటలు విని శంకించుచు నెన్నిదినము లైనదని యడిగి గడువు దెలిసికొని కారణము తెలియక యాలోచించుచుండెను. చిరుతపులి వచ్చెనని యా గ్రామము లన్నియుఁ బ్రచురమైనది. చాపలవాని నేరపువాని పెక్కండ్రువచ్చి సేవించుచుండిరి.

మరియొకనాఁ డొక కోయవాఁడు నలువుర రాజకింకరుల వెంటబెట్టుకొని యక్కడికివచ్చి వీఁడే చిరుతపులియను మృగదత్తుఁడు. అని చూపి వారి యధీనము గావించెను.

ఆరాజకింకరులు వానింజూచి ఔరా! నీనిమిత్తమెన్ని దేశములు తిరిగితిమి.

ఎన్నియుడుములం బడితిమి. పదపద. అడవులలో దాగిన విడుతుమనుకొంటివా! అని అదలించుచు వానిం బంధించిరి. మృగదత్తుఁడు తెల్లతెల్లపోయి చూచుచుండ గదాధరుఁడించుక యాలోచించి యిది యెవ్వరియాజ్ఞ వీఁడేమిఅపరాధము జేసెనని అడిగిన వాండ్రు అది మాకుఁ దెలియదు. గజేంద్రవాహనుని యానతిని వీనింబట్టితిమి. మేముకాక పెక్కండ్రు రాజభటులు వీని నిమిత్తము తిరుగుచున్నారని చెప్పిరి.

అందలికారణము పలుతెరంగులఁ దలంచుచు గదాధరుఁడు, ఏమియైనను లెస్సయే మేముగూడవత్తుము. పదుఁడని పలుకుచు వతనివెంట నడువసాగెను. గొన్ని దినంబులకు నా రాజకింకరులు వారి నుదయార్కునిపీటికిఁ దీసికొనిపోయి రాజు ముందర నిలువఁబెట్టిరి.

ఉదయార్కుఁడు వారిం జూచి, ఏమిరా! నీకతంబున మాకుబైవారివలనఁ జాల యవమానములు వచ్చుచున్నవి. మాచక్రవర్తి నిన్నుబంపుమని యిరువదిసారులు ఆజ్ఞాపత్రికలఁ బంపిరి. నీ జాడ యేమియు మాకుఁ దెలియదు. రత్నాంగి పైవారింబట్టికొని తనయపరాధము మాపికొనఁదలంచుచున్నది. నీవుపంబోయి గట్టిగా వాదించి గెలుపు కొనిరమ్ము. పొమ్ము. నీ వెంట రాజపురుషులువత్తురు. వెఱవకుమని పలికిన విని సంతసించుచు మృగదత్తుఁడు గదాధరునితో మనమక్కడికిపోయి వాదింపవలసియున్నది.నీవు బుద్ధిమంతుడవు ఎట్లు చెప్పవలయునో యాలోచింపుమని పలికెను. గదాధరుఁడును గ్రమ్మర నాకథయంతయుచు విని విమర్శించుచుండెను. రాజభటులు విచారించు దివసమున వారిని విద్యానగరమునకుఁ దీసికొనిపోయిరి.

అని యెఱింగించి ... ... ... ...

# 130 వ మజిలీ

## అపరాధవిచారణకథ

అయ్యో, అయ్యో! మృగదత్తా! మనరహస్యము వెల్లడియగునట్లున్నది. అన్నన్నా? విధిసంఘటనము కడు విపరీతముగదా. రామదుర్గనగరమునుండి రాజప్రతినిధియంపిన యభియోగ మిదినమే విచారించునంట అప్పుడే పిలుచుచున్నారు. గురుత్తాయనియు గుముదాంగదా యనియు గదాధరా యనియు మూడేసిమారులు పిలుచుచున్నారు. ఇప్పుడు మన మేమిచేయవలయును కన్నములో దొరికిన దొంగ చెప్పినమాటల నెవ్వరైన నమ్ముదురా! మన మట్లే దొరకితిమి. ఇప్పుడేమి చేయఁదగినది? రాజభటులు పారిపోవనీయరు. నిన్నుఁ విడిచి మేము పోవఁజాలము అని భయ మభినయించుచుఁ బలికిన విని యతండులికిపడి అహా! మనదినము లెంకచెడ్డవి. మనకన్న ముందుగా శనిచారమువచ్చి పీడించుచున్నది కదా. కానిమ్ముఁ ఏమిచేయుదును. చంపినఁ

జంపుదురుగాక. ఎట్లు విచారింతురో నీవు సభలోఁగూర్చుండి యాకర్ణింపుము. కాకున్నది కాక మానదుగదా యని చెప్పిన విని వాని ధైర్యమునకు సంతసించుచు గదాధరుఁడు సభలో నొక మూల గూర్చుండి వారివిచారణ వినుచుండెను.

దివ్యరూపసంపన్నుఁడై సుమేధుఁడు పీఠ మలంకరించెను. పార్శ్వములయందు న్యాయవాదులు సముచితాసనంబుల నుపవిష్టులైరి. యుపసభ్యులచేతను ప్రేక్షకులచేతను సభాభవనము క్రిక్కిరిసి యుండెను.

సుమేధుఁడు తొలుతగనే రామదుర్గనగరమునుండి పతినిధి యంపిన యభియోగము విచారింపఁ బ్రారంభించెను. పిలిచిన తోడనే పీరభటులు మృగదత్తగదాధర కుముదాంగదుల నెదురకుఁదీసికొనివచ్చి నిలువంబెట్టిరి. దాపునకు రమ్మని వారిని రాజు నిరూపించి చూచుచుఁ బ్రతినిధిపక్షమున వచ్చిన న్యాయవాది మొగముజూచి వీ రేమి యపరాధముజేసిరో సవిమర్శముగా వక్కాణింపుమని యడుగుటయు నతండు లేచి యిట్లు చెప్పదొడంగెను.

దేవా! కొన్నియేండ్ల క్రిందట రామదుర్గనగరాధీశుం డగు సురూపుండను సామంతరాజును, కుముదాంగదుఁడను వైశ్యుని కూఁతురును అల్లుఁడును బలవంతముగాఁ జంపి కుండులోఁ బారవైచి పారిపోయిరి. వారిఁబట్టికొని తీసికొనివచ్చుటకై నానాదేశములకు నాజ్ఞాపత్రికలు బంపఁబడినవి. వారిజాడ యేమియుం దెలిసినదికాదు. వారిం బట్టికొనుటకై రాజభటులు గ్రామములు దిరుగుచునే యున్నారు. ఆరహస్యము దెలిసికొనుటకై కుముదాంగదుని యింటిలో ధ్వనిగ్రాహిణియను యంత్ర మమర్పఁబడినది.

ఈ నడుమ గురుదత్తునికొడుకు మృగదత్తుఁడును స్నేహితుఁడు గదాధరుఁడు కుముదాంగదుని యింటికివచ్చి మాట్లాడికొనిరి. యంత్రమూలమున వారి మాటల తెరంగంతయుఁ దెల్లమైనది. మృగదత్తుఁడును భార్యయు నడవులలో నెక్కడనో వసించి రహస్యముగాఁ దమవారి వారింట కనుచున్నారు. కావున వీరు మువ్వురును శిక్షాపాత్రులైరి. వీరిని శిక్షించుటకు మునుపా సామంతరాజునకే యధికారముండునది. దేవరయే యట్టియధికారము తగ్గించిరి. దానంజేసి రాజప్రతినిధి యాయభియోగమును మనయొద్ద కనిపెను. వీరి ముగ్గురిని శిక్షింపవలయునని యాన్యాయవాదియుక్తి యుక్తముగా నుపన్యసించెను.

రాజు—సురూపుడి వీరేమిటికి బలవంతముగఁ జంపిరి

న్యాయవాది—పలువురు పలువిధముగాఁ జెప్పుదురు నిశ్చయమైన హేతువెద్దియుఁ దెలియదు.

రాజు—ఒందు రెండు భేదములం జెప్పుడు.

న్యాయ—మృగదత్తుని భార్య చక్కనిదట. సురూపుఁడును మిక్కిలి చక్కని వాఁడట ఆమె యతనిని మోహించి సాంకేతిక మేరుపరచి తనయింటికి రమ్మనినదట ఆ గుట్టు మృగదత్తుఁడు గ్రహించినంతదన్ను బలవంతము చేయుచున్నాఁడని మగనికిఁ జెప్పి చంపించినదని చెప్పుదురు. కాంతలు బొంకులకు నెలవులుగదా?

రాజు—మఱియొక విధమెట్టిది?

న్యాయ—రాజే దానిని బలవంతపరచెనని కొందరుచెప్పుదురు. నిజము భగవంతునకుఁ దెలియును విన్నమాటగాని నేనుఁజూచిన మాటకాదు. ఎట్లయిన వారు రాజుం జంపినమాట వాస్తవము రాజద్రోహాపరాధము వారి నెత్తిపై నున్నది.

రాజు— సురూపునకు సంతతిలేదా?

మృగ—లేదు. లేదు. చక్రవర్తియే ప్రతినిధి నేర్పరచిరి. అదియుఁ మీయధికారములోనే జరుగునని వినియుంటిమి.

రాజు—కానిండు. ఇందు మృగదత్తుఁడెవ్వఁడు?

న్యాయ—(ముందరికివచ్చి) నేను సామి నేను.

రాజు—నీతండ్రి పేరేమి?

మృగ—గురుదత్తుఁడు సామి.

రాజు—గదాధరుడెవ్వఁడు?

గదా—(ముందరికివచ్చి) నేను.

రాజు—కులమేమి?

గదా—బ్రాహ్మణులము?

రాజు—నీవేమి చదువుకొంటివి?

గదా—మాతండ్రి నిచ్చమెత్తికొనుటచే నాకు విద్యవచ్చినదికాదు.

రాజు—అటు నిలువుము. కుముదాంగదుఁడవు నీవేనా.

కుము—(ముందరకు వచ్చి) నేనే దేవా?

రాజు—నీయల్లుఁడును గూతురును సురూపుని జంపిరఁట నిజమేనా.

కుముదా—సురూపుఁడెవ్వఁడు బాబూ?

రాజు—మీరాజు

కుము—అదియా? నాకుఁ దెలియదు తండ్రి.

రాజు...సరే. మీరవ్వలకుఁ బొండు. రేపు విమర్శింతుము అప్పటికి రండు అని యాజ్ఞాపించెను.

అప్పుడు న్యాయవాది లేచి దేవా! ధనిగృహిణీయంత్రము సందలి విషయములు జ్ఞాపకముంచుకొనవలయును ఆసాక్ష్యమేవీని అపరాధము ధ్రువపరచుచున్నది. సావధాన మనస్కులై చిత్తగింపవలయునని పలికిన అతండు సరే యిందు వ్రాయఁబడియున్నదిగదా? పిమ్మట జూచెదంగాక రేపురండు. అని చెప్పి ప్రతీహారితో రత్నాంగి అభియోగములో వాది ప్రతివాదులఁ బిలువుమని యాజ్ఞాపించెను. ద్వారపాలఁడు హజారమునకుఁ బోయి పేరువరుసఁ బిలిచెను

రత్నాంగియు మణికొండయు సాక్షులును రాజు మ్రోలకువచ్చిరి రాజభటులు మృగదత్తుని సుమేధుసంతికమునకుఁ దీసికొనిపోయి నివేదించిరి. గదాధరుఁడును గుమందాంగదుఁడును వాని వెనుక బోయి యోరగా నిలువంబడిరి.

అప్పుడు రాజు మృగదత్తుని జూచి విస్మయము జెందుచు నొక్కింతసేపు కన్నులుమూసికొని ధ్యానించుచు మొదట వానిట్లు బ్రశ్నలువైచెను.

రాజు—మృగదత్తుఁడవు నీవేకాదా?

మృగ—నేనే సామి.

రాజు—నీతండ్రిపేరు.

మృగ—గురుదత్తుండు.

రాజు—కులము.

మృగ—వైశ్యులము.

రాజు—వెనుక చెంచులమని చెప్పియుంటివే!

మృగ—అది దెలియక చెప్పినమాట సామి!

రత్నాంగి—వీఁడు గడియకొకపేరు చెప్పుచుండును. దేవరవారదియే పరీక్షింపవలసిన విషయము.

రాజు—నిలు నిలు. నీవు మాటాడవలదు నీన్యాయవాది లేడా? అతఁడే చెప్పును.

న్యాయవాది—దేవా! ఇది కడువిపరీతముగా నున్నదిగదా! ఇందాకవచ్చిన వాఁడును, గురుదత్తుని కొడుకుననియు దనపేరు మృగదత్తుఁడనియుఁ జెప్పికొనియె వీఁడునట్లే చెప్పుచున్న వాఁడు వీరిలో నిజమైనవాఁడెవ్వఁడు?

రాజు—మృగదత్తా! ఈ తివాసి యెవ్వరల్లిరి!

మృగ—నేనే సామి.

రాజు—ఈపని యెందు నేర్చుకొంటివి?

మృగ—కొండపల్లిలో నల్లియున్న యాస్తరణలం జూచి వాని విప్పిచూచి నేర్చుకొంటిని. నాకెవ్వరును జెప్పలేదు సామి.

రాజు...కొండపల్లిలో నేమిటికుంటివి?

మృగ...నాకది జన్మభూమి.

రాజు...నీతల్లిపేరు.

మృగ...నాకుఁదెలియదు సామి.

రాజు...ఇతరులు చెప్పగా వినలేదా

మృగ...తఁయొకమాటయుం జెప్పిరి సామి.

రాజు...తండ్రి గురుదత్తుఁడని చెప్పితివిగదా। తల్లిపేరుమాత్రమేమిటికిఁ దెలియదు.

మృగ...పద్మిని అని కొందఱు చెప్పిరి.

రాజు...(పీఠముపైఁ జేరఁబడి యొక్కింతతడవు ధ్యానించి మరల ధైర్యమంది) నీవీరత్నాంగి నెరుఁగుదువా?

మృగ...ఎరుఁగుదును.

రాజు...దానియింటిలోనున్న యొక పరిచారికం దీసి కొనిపోయితివఁ సత్యమేనా?

మృగ...లేదు. లేదు. అది వట్టిమాట చెప్పుచున్నది.

రాజు...దాని యింటికిఁ బోయితివా?

మృగ...పోయితిని. అందున్న యామె కడునిల్లాలు సామి.

రాజు...ఎట్లు గ్రహించితివి.

మృగ...భోగమువాండ్రు కడు చెడ్డవారనియు వారింటికివచ్చుట తప్పనియు నాకుఁ జాల బోధించినది సామి. మఱియు ననేక నీతులు బోధించినది. అప్పటి నుండియు నట్టిపనులు మానివేసితిని. నా వృత్తాంతము విని పేరు మార్చుకొమ్మని చెప్పినది. యుత్తరము (అనబోయి మానివేసెను.)

రాజు...ఉత్తరమేమి చెప్పుము. చెప్పుము. యదార్థము చెప్పిన దోషము లేదు.

మృగ...ఏమియో యుత్తరము వ్రాసియిచ్చినది.

రాజు...ఎవ్వరికిమ్మని.

మృగ...(సంశయించుచు) మా బంధువులకే.

రాజు...బంధువులనగా నెవ్వరో సరిగా జెప్పుము.

మృగ...రామదుర్గనగరంబున నున్న కుముదాంగదునకు.

రాజు...చూపితివా?

మృగ...అందువలననే కాదా? ఇన్ని యిక్కట్టులు వచ్చినవి.

రాజు...ఏమి వచ్చినవి.

మృగ...గదాధరుని దృష్టితైక్ష్యము గ్రహించి సవరించుకొని మఱేమియుం గాదు మూరదేశమునుండి యిక్కడికి వచ్చుటలోనుగాఁగల ప్రయాసము.

రాజు...గదాధరుఁ నెరుఁగుదువా?

మృగ...ఎరుంగుదును. ఊ. ఊ. ఎరుఁగను.

రాజు...తబ్బిబ్బు పడుచుంటివేమి? భయములేదు. నిజము చెప్పుము. ఇంతకు ముందు వచ్చినవారిలో మృగదత్తుఁడను వాఁడుండెను వాని నెరుంగుదువా.

మృగ...గదాధరుని మొగము చూచుచున్నాడు.

రాజు...ఆదెస జూచుచున్నావు అందెవ్వరున్నారు.

మృగ...మావారున్నారు.

రాజు...వారినిట్లెదురకు రమ్మనుఁడు.

గదాధరుఁడు...ముందరికివచ్చి దేవా! నేనితని తండ్రికి మిత్రుఁడను. నాపేరు గదాధరుఁడు.

రాజు...వీనితో నీకెందుఁ బరిచయమైనది.

గదా...దారిలో.

రాజు...(రత్నాంగింజీరి) వీనిమాటలు వింటివా?

రత్నాంగి...(న్యాయవాది మొగముజూచుచు) వింటినిదేవా! వింటిని. అన్నియు నసత్యములే!

న్యాయవాది...ఔహాసు దేవా! నాయుపన్యాస మించుక వినవలయును. ఇది యొక విచిత్రనాటకమువలె నున్నది. మొదటి యభియోగములో మృగదత్తుఁడు, గదాధరుఁడు, కుముదాంగదుఁడు అని ముగ్గురు ప్రతివాదులు వచ్చియుండిరి. వారి యపరాధముగురించి రేపు విమర్శింతుమని దేవర సెలవిచ్చియున్నారు. రెండవ మృగదత్తుఁడు మాయభియోగమున సాక్షియైయున్నాడు. విమర్శింప నతఁడు నితఁడును నొక్కఁడే యైనట్లు తెలియఁబడుచున్నది. అట్టికంత జేసియు దేవరయేమిటికో విరమించితిరి. వీనిమాటలలోఁ దబ్బిబ్బులుగనంబడుచున్నవి. ఇందలి నిజమేమిదియో తెలిసికొనవలసియున్నది. మొదటి యభియోగమునందు గదాధరుఁడును అపరాధియైయున్నాడు. ఈతఁడు వాని నెరుంగుదుననియు నెరుంగననియుఁ జెప్పుచున్నాడు. అయ్యపరాధుల ముగ్గుర మరలఁ బిలిపింపుఁడు. ఎదుర(బెట్టి విమర్శింపవచ్చునని పలికిన నాసుమేధుఁడొక్కింత యాలోచించి యంతయు రేపు విమర్శింతుము. కాలాతీతమైనదని పలుకుచుఁ బీఠమునుండి లేచెను.

సభ్యులెల్లరు లేచి మరునాఁడా వింతఁజూచుటకై వేడుకపడుచుఁ దమతమ నివాసములకుం బోయిరి.

మృగదత్తుండు గదాధరుండును నాఁటికి దాటినది మరునాఁటికి వేరొక యుపాయము దొరకకపోవునా? యని సంతసించుచు నివేశదేశమున కఱిగిరి. రత్నాంగియు సుమేధుఁడు పక్షపాతముగా విమర్శించుచున్నవాఁడని తన న్యాయవాది చెప్పుటచే మిక్కిలి విచారించుచు నెలవునకుం బోయినది.

అయ్యభియోగము విచారించుటచే సుమేధునకు మనంబుననేదియో విచారమంకురించినది. ఆరాత్రి నిద్రయేపట్టినదికాదు. ఏదియో యాలోచించుచుండఁగనే తెల్లవారినది. ఆరాజునకుఁ బ్రతిదినము పొద్దుట గుఱ్ఱమెక్కి కొంతదూరము పోయి వచ్చుట వాడుకయై యున్నది. నాఁడుత్తరముగా యున్న యొక రాజమార్గమునంబడి పోవుచుండెను.

తఱుచు పట్టణప్రాంతమందలి పల్లెవారందఱు పెందలకడ లేచి పాలును, పెరుగు, నెయ్యి, పుల్లలు, కసవు, కాయఁగూరలు, ఫలములు లోనగు పదార్థములన్నియుఁ బట్టణమునకుఁ దీసికొనివచ్చి యమ్ముకొనిపోవుచుందురు. మోయలేనిబరువు మోసుకొనుచు నడుమనడుమఁ దింపికొని యెత్తువారికొరకు నెదురుజూచుచు విడిపోయిన కట్టల సవరించుచు వెనుకఁ బడిన వారిం జీరుచు బలుకష్టములతోఁ వచ్చుచుండెడిజానపదులం జూచుచు సుమేధుఁడు నాఁడు తనదృష్టి దైవికముగా వారిపై వ్యాపించుటచే వారి శ్రమలకు వగచుచు వినోదముగా వారిం బరామర్శించుచు గుఱ్ఱమును మెల్లగా నడిపించుచుండెను.

గుఱ్ఱపువాఁడు ముందునడుచుచుఁ దొలఁగుఁడు తొలఁగుఁడు. ప్రభువువారు ప్రభువువారు అని యెదురువచ్చు జనుల బెదిరింపుచుండ వాండ్రు జడియుచు నెత్తినుండి గంపల దిగవిడుచువారును దొందరగా నోసరిల్లి నేలంబడువారును, దద్దరిల్లి వెనుకకుఁ బరుగిడువారునునై యిక్కట్టులఁ జెందుచుండ జూచి రాజు గుఱ్ఱపువానిని మందలించుచు మాటాడనీయక గుఱ్ఱమువెనుక రమ్మని మెల్లగాఁ దన వారువమునకు నెదురువచ్చు వారికడ్డముగాకుండ నడిపించుచుండెను.

ఆహా! కడుపుచిచ్చునకుఁగదా? వీండ్రిందరు మోయలేని బరువు మోచికొని వచ్చుచున్నారు. అయ్యయ్యో! దైవమందఱను సమముగా భాగ్యవంతులఁ జేయక కొందఱఁ గటికి దరిద్రులను జేయుచున్నాడే.

శ్లో॥ అభిమత మహామాన గ్రంథిప్రభేదన పటీయసి
గురుతర గుణగ్రామాంభోజ స్ఫుటోజ్జ్వల చంద్రికా

విపులవిలసల్లతావల్లీ వితాన కటారికా
జఠర పిఠరీ దుష్పూరేయం కరోతి విడంబనా.

అక్కటా! వీండ్రింత కష్టపడిసంపాదించిన ద్రవ్యమొక్కపూటకైనఁ బూర్తిగాఁ జాలదు. ప్రతిదినము వీరిట్లు కష్టపడుచుండవలసినదే. వీరికి నిష్కృతియెప్పుడో తెలియదు. అని కూలివాండ్రంజూచి యూరక జాలిపడుచు నోపినసహాయము గుర్రపువానిచేఁ జేయించుచుండెను. అప్పుడు

ఉ॥ మాసిన మోటుకోక జడిమంబున మేనికిఁ జుట్టఁబెట్టి య
భ్యాసము లేనిరీతిఁ దలపైనిడి తక్రఘటంబు పాదవి
న్యాసమ బన్వమోసెడు ప్రయాసము దెల్పఁగ గొప్పవీథియా
యాసముతోడవచ్చెడు ప్రజాంగనయొక్క తెయూర్పులేర్పడన్.

ఒకగొల్లభామ పట్టణాభిముఖముగా వచ్చుచు శిరంబుననున్న చల్లకుండ బరువగుట భరింపఁజాలక మార్గపార్శ్వమందు మొలబంటియెత్తుగానున్న తూము గోడపైఁ జుట్టకుదురుతోఁ గూడఁ జల్లకుండ డింపి నిస్సురని నిట్టూర్పునిగుడించుచు మోము తమ్మిం గ్రమ్మిన చెమ్మటను దుడిచికొనుచుఁ బ్రొద్దుసంక జూచి వేగిరపాటుతోఁ గుండ యెత్తికొనఁబోయియు నది పైకిలేవమి వగచుచు బాటసారుల కొఱకిటు నటు చూచుచుండెను.

సుమేధుఁడు గుఱ్ఱము నిలువఁబెట్టి యాగోపికంజూచి యాహా! యాకోమలాంగి యవయవములు మృదువులయ్యుఁ గఠినక్రియలు చేయుటచే మోటెక్కినట్లు కనంబడుచున్నవి. అలంకారశూన్య యయ్యు నయ్యువతి శోభాజనకంబుగాఁ దోచఁబడుచున్నది.

అయ్యయ్యో! ఇట్టి కలకంఠిని నీచకులంబునం బుట్టించెనేమి? పాపము మోయలేని బరువు మోచికొని పోవుచున్నది. పొద్దెక్కినదమ్మకముగాదని కుండ నెత్తికొనఁబోయియు నాపలేకపోయినది. దీని మగఁ డెంతకఠినాత్ముఁడో కదా ఇట్టి కష్టపుపనులను జెప్పవచ్చునా! నిరూపించి చూచినంగాని దీని చక్కఁదనము దెల్లముగాదు. గోపికవలె నొప్పుచున్నది. అని మెచ్చుకొనుచు గుఱ్ఱపువానిం జీరి యోరీ! నీవామె కడకుఁబోయి కడవనెత్తిరమ్ము. పాపమాచిన్నది యెత్తువారి కొఱకు నిరీక్షించుచున్నది అని నియమించుటయు వాఁడు హసాదుసామీ! యని యల్లన యాముద్దరాలియొద్దకుఁ బోయి అమ్మా! రాజుగారి సెలవైనది. కుండయెత్తెద లెమ్మని పలికెను.

అయిల్లాలించుక శంకించుచు రాజు నోరజూపులఁ జూచినది. వీక్షణవైచిత్రమున కతండు వెరగందుచు నయ్యిందువదన యుత్తమ కులసంజాతురాలని నిశ్చ

యుండెను. అప్పుడప్పురంధ్రి పురుషసాన్నిధ్యంబునకు వెరచుచు నుపాయాంతరము లేమింజేసి కుండ యెత్తుమని యొడఁబడి కట్టువస్త్రంబు సవరించుకొనుచు వాఁడు సహాయము చేయుచుండ నాకుండఁ దన రెండు చేతుల నాని యెత్తికొనినది.

పురుషసాన్నిధ్యంబునకు, గొంకుచు నప్పంకజాక్షి కుండ యెత్తుకొనునప్పు డించుక యోసరిల్లుటయు గడవయొరిగి యందున్న చల్ల సగము నేలపాలైనది. సుమేధుఁ డందులకుఁ బరితపించుచు గుఱ్ఱము దిగివచ్చి వానిం దిట్టుచు అయ్యో! సాధ్వీ! వీఁడు తిన్నగా నెత్తకపోవుటచే నీచల్ల నేలపాలైనది మగువా! వగవకుము. దీనింబదిలముగా నెంతయో దూరమునుండి తెచ్చుచుంటివి. నాకతంబున నిది నేలపాలైనది కావున దీనివెల నేనిచ్చివేసెద నీకదన కెంత సొమ్ము వచ్చునో చెప్పుము. విచారింపకుము. అని యూరటంబలికిన విని యక్కలికి యిట్లు చదివినది.

ఉ. శ్రీపతి కప్పువెట్టు సిరిచేఁదులఁ దూగెడు శెట్టిపట్టినై
రూపునఁ బేరుపొంది యనురూపపయోగుణరూపశీల వి
ద్యాపరిపూర్ణుఁ డాత్మహితుఁడైన మనోహరు చెట్టఁబట్టి మో
రాపయశంబులెందుచుఁ బరాంగనలం జెరఁబట్టుచున్న మా
భూపతి జంపితి న్మగఁడు భూరిభుజంగము చేతఁ జచ్చెఁ బై
నాపద లెండిచెంది యుదయార్కుని పట్టణమేఁగి వేశ్యనై
పాపము గట్టికొంటి నటఁ బట్టి విటత్వముఁ బూని రాగ సం
తాపముఁ జెంది యగ్గిఁబడి దగ్ధముగాకిటు గొల్లభామనై
యీపని కొప్పుకొంటి నృపతీ వగసేటికి? చల్ల చిందినన్.

ఆపద్యమును విని సుమేధుఁడు హా పరమేశ్వరా! యని పలుకుచు నేలంబడి మూర్ఛిల్లెను. గుఱ్ఱపువాఁ డదిచూచి, అయ్యో అయ్యో గొల్లభామా? ఏదియో చదివి మాతేని మూర్ఛ ముంచితివి? నీ వెవ్వతెవు? తల్లీ! యుపకారము చేయఁబూనిన వానినే యిట్లు పడవేయుదువా? అని వాఁడు పలుకుచు శైత్యోపచారములు సేయఁదొడంగెను.

ఆ గొల్లభామయుఁ దెల్లతెల్లపోయి జూచుచుఁ గుండడింపి బాబూ నేనేమియు నెఱుంగను. నాకే మంత్రములు తంత్రములు రావు. పాపాత్మురాలనగు నాకుపకారము సేయవచ్చి మీరాజు నేలం బడియెను. నేనేమి జేయుదునని దుఃఖించుచుఁ గుండలో మిగిలియున్న చల్ల నతని మొగమునఁ గొట్టినది.

అప్పు డించుక తెప్పరిల్లి మంథరములగు దృష్టులచే నామెం జూచుచు నారాజు గుఱ్ఱపువాని నీళ్ళు దేర దూరముగాఁ బంచి హాహా ప్రేయసీ! ప్రేయసీ! ఎన్నినాళ్ళకుఁ గనంబడితివి. ఎట్టి యిడుమలం గుడుచుచుంటివి. అయ్యో! నీ వెక్కడ ఈచల్లకుండ

అమ్మట ఎక్కడ అహహా పాడుదైవమా! యింత భర్తృద్రోహిణిం జేసిన గాని నీ కసి దీరినది కాదేమి? అని పలుకుచు నా కలికిం గౌగలింపబోయెను.

అప్పుడయ్యింతి రవుడవుల కోసరిల్లుచు నిలు నిలు మహారాజా! నాపతి పరలోక గతుడయ్యెను. నేనన్యపురుషుని ముట్టను. నన్నంటరాదు న్యాయము కిట్టిదియే యని పలికిన అతండు మఱియుంగుందుచు గర్భభరాలసవై యున్న నిన్ను నట్టడవిలో విడిచి పోయిన గుణసత్తుఁడ దయావిహీనుఁడ నేనే యని పలికిన నా యిల్లాలించుక యాలోచించి యేమీ! నీవు గుణసత్తుఁడవే యెట్లు బ్రతికి వచ్చితివి? పరమార్థ మెఱింగించి నాసందియము దీర్పఁ బ్రార్థించుచున్నాను. ఈ మాట సత్యమగుంగాక యని పలికినది కాని దుఃఖపరవశమై యుండుటచే నేమియు నెరుంగదు.

అప్పుడతండు కొన్ని రహస్యవిశేషము లెఱింగించి యుమెకు నమ్మకముగలుగఁ జేసి బోటీ! దైవమిప్పటికి మన కనుకూలుఁడైనట్లు తెలియుచున్నది. నీకుమారుఁడును సీతంద్రి గథాధరుఁడు నిందే వచ్చియున్నారు. నిన్ననే వారింజూచితిని. నేనని వారెరుంగరు. నచర్యలు విచారములో నున్నవని సంక్షేపముగాఁ జెప్పెను.

అప్పుడా ప్రోయాలు గోలన నేడ్చుచు నతని పాదంబులం బడి ప్రాణేశ్వరా! నిన్ను గురుతుపట్టక ప్రశ్నజేసినందులకు నాతప్పుమన్నింపుము మనము విడిచిపోయి పదునెనిమిది సంవత్సరములైనది. ఆహా! దైవమహిమ యెట్టిది నాకు మతిపోయినది నేడే యంతయు స్ఫురించుచున్నది. అని కన్నీరు గార్చుచు నతనిం గౌఁగలించుకొనియెను.

ఆతం డామెను నక్కునం జేర్చికొని తదీయశీలమునకు మెచ్చు కొనుచు దైవ మహిమ వర్ణనాతీతముకానిచో నేడీ నాబుద్ధి యీమార్గమున నడుచు వారింజూచి విమర్శన పూర్వకముగా జాలిఁజెందనేల? ప్రతిదినము నీమార్గంబున విహారమునకు వచ్చుచునే యుంటిని. మార్గంబున వీరందరు గనంబడుచుండిరి.

పరీక్షించి వాండ్రనెన్నఁడు చూడలేదు. ఈదివమున నాకట్టి బుద్ధి పుట్టుట భగవచ్చర్యగాక మనుష్యయత్నమే. మనుష్యున కించుకయు స్వతంత్రముగలదా? అంతయుఁ దాను జేయుచున్నట్లు కనంబడును. ఏడియుఁ జేయంజాలఁడు. అదిగో పరిచారకుఁడు వచ్చుచున్నాఁడు ఊరకుండుమని పలికెను.

గుఱ్ఱపుఁ వాడింతలో నీరుదెచ్చెను. వానితో నోరీ యీగుఱ్ఱమును తీసికొని నీవు పొమ్ము. నేను వెనుక వచ్చెదనని చెప్పి వానింబంపివేసెను. తరువాత నామెతో గూడఁ బ్రచ్ఛన్నముగాఁ దన బసలోనికిం బోయెను.

అని యెఱింగించి.

# 131 వ మజిలీ.

## పద్మినీ గురుదత్తుల సమ్మేళనము

పుష్పవేణి—రత్నాంగీ! నీయభియోగ మీదినమున విచారింతురా! పాపము పెక్కుదినములనుండి తిరుగుచున్నావుగదా!

రత్నాంగి—ఛీ! ఛీ! ఎఱుఁగక దీనిలో దిగితిని సొమ్ముపోతే పోయినది. రామరామ ఒక్కనికి జాలిలేదుగదా న్యాయవాదివచ్చినప్పుడెల్ల సొమ్ము తెమ్మనిమే పీడించును. వానిక్రిందివారు డబ్బు చేతిలో వేసినంగాని కాగితమే వ్రాయరు. ఈ బంట్రోతుల కియ్యలేక చేతులు కాయలు కాచిపోవుచున్నవి. అధికారులు త్రిప్పి త్రిప్పి చంపుచున్నారు. అబ్బబ్బా! నాలంజరికపుసొమ్మంతయు వీరి లంచముల క్రింద సరిపడిపోవుచున్నది. సుమేధుఁడు మహాజితేంద్రియుండని పొగడితివి. అతఁడుఁ స్త్రీలోలుండని తెల్లమైనదిగదా!

పుష్పవేణి—ఆమాటకు మాత్రము నేనొప్పుకొనను. అతండు పరస్త్రీవర్జితుఁడని నేను శపథము జేసి చెప్పఁగలను.

రత్నాంగి—చాలుచాలు నీమాటనమ్మియే నేన్నాప్రయత్నము చేసితినికాను. లేకున్న ఏపాటికివాని నాకౌఁగిటలో వేసికొని నాపక్షమున తీర్పు చెప్పించుకొనక పోవుదునా!

పుష్ప—నీవెట్లు తెలిసికొంటివి?

రత్నా—వినుము. ప్రతిదినము అతఁడు గుఱ్ఱమెక్కి ప్రొద్దున విహారమునకై పోవుచుండును. గుఱ్ఱము వాఁడొక్కఁడుమాత్రము వానితోఁబోవును. సమయము వచ్చినప్పుడు నామాట జెప్పుమని వానికి లంచమిచ్చియుంటిని వానివలన నిజము తెలిసినది.

పుష్ప—వాఁడేమి చెప్పెను.

రత్నా—మొన్న ప్రొద్దున్నఁ బోవుచుండఁగాఁ ఒక్కని గొల్లది పెరుగుకుండ నెత్తిమీఁదబెట్టుకొని యమ్మవచ్చుచుండఁగా దాని మోహించి వానిఁబొమ్మని దాని తనయింటికిఁ దీసికొనిపోయెనఁట. వాఁడీరహస్య మెవ్వరికిని జెప్పవలదని నాతోఁ జెప్పెను. ఈమాటైన నమ్మెదవా!

పుష్ప—వాఁడెందులకుఁ జెప్పెనో కాని నేను నమ్మజాలను.

రత్నా—ఇంతయేల విచారణలోఁ బక్షపాతము చేయుచున్నాడని మా న్యాయవాదియే చెప్పెను.

పుష్ప—న్యాయవాదులు తనపక్షముఁ జెప్పిన సత్తమురందురు. లేకున్న ననుత్తముఁడందురు. మనకును వారికిని భేదములేదు.

రత్నాంగి—పోనిమ్ము. ఏమిచేసినను సరే. ఏదో యొకటి తెలిసినం బాగుండును. రేపురేపని త్రిప్పి చంపుచున్నారుగదా।

పుష్ప—తిరుగా నెప్పుడు విచారింతుమనిరి.

రత్నా—ఎప్పుడో తెలియకయే న్యాయవాది యింటికి దూతిక నంపితిని. అదిగో అది వచ్చుచున్నది.

దూతిక—(ప్రవేశించి) అబ్బా! న్యాయవాది యింటికి వెళ్ళువరకు నాకాళ్ళు ముక్కలగుచున్నవి. అయనయే వేగము మాట్లాడును గాని వారి గుమాస్తాలు తల యెత్తి చూడనే చూడరు. అభియోగము తెచ్చుటకంటె పాపములేదుకదా।

రత్నా—ఏమైనది? ఎప్పుడని చెప్పిరి.

దూతిక—మనవ్యవహారము చక్రవర్తిగారు స్వయముగా విచారింతురఁట. ఉదయార్కుని గూడ రమ్మన్నారఁట ఎల్లుండి విచారింతురట. ఎల్లుండి పెందలకడ రమ్మని న్యాయవాదిగారు చెప్పినారు. సరేకదా వారికియ్యవలసిన సొమ్ముకూడా తెమ్మన్నారు. సొమ్ము తేకుంటె తాను రాడఁట. గుమాస్తాల బహుమతులు కూడా ఇవ్వాలట.

రత్నా—సరిలే ఇయ్యకేమి చేస్తాము.

పుష్పవేణి—ఇంతకు మీపక్షమయ్యేటట్లున్నదా।

రత్నా—చక్రవర్తి విచారించునంట. ఈసారి న్యాయముచేయవచ్చును.

పుష్ప—మృగదత్తుఁడువచ్చి సాక్ష్యమిచ్చినాఁడుగదా? వారి సాక్ష్యమెట్లున్నది.

రత్నా—వాఁడుబలుటక్కరి. గడియకొక పేరు చెప్పుచున్నాడు. రామదుర్గ నగరమునుండి వచ్చిన బంట్రోతులు ఏడ్చుచున్నారు. ఏదియో బ్రతిమాలుకొను చున్నారు వివరము నాకుఁ దెలియదు.

దూతి—నాకుఁదెలిసినది అందులకే చక్రవర్తి స్వయముగా విచారింతురఁట వినుము. ఈమృగదత్తుఁడు మఱియేదో యపరాధముచేసి శిక్షింపఁబడి తనపేరుతో మరియొకరిని వారి కప్పగించెనఁట ఈసమయముననే యా యభియోగము విచారణకు వచ్చినది. ఒకే పేరుగలవారు రెండువిధములుగా వచ్చుటచే నందరు వింతగాఁ జెప్పు కొనుచున్నారు. ఇప్పుడు న్యాయవాదిగారి యింటికడ బలువురు కూర్చుండి యా మాటయే చెప్పకొనుచున్నారు. అని వాండ్రు ముచ్చటించుకొనుచుఁ దత్కాలము నిరీక్షించియుండిరి.

దుర్గానగరమునుండి వచ్చిన రాజభటులు దైవికముగా దారసిల్లిన గదాధర ప్రముఖుల మువ్వురంజూచి వెరగందుచు బాబూ మాకుఁ జీవిత హానిదెచ్చిపెట్టితిరి. మీరుగూడ నేఁడేవచ్చితిరి. మీయభియోగమున్నదని మాకు జెప్పితిరికారు. నిన్నను సభ్యులందరు వింతగా మన కథలు చెప్పుకొనుచున్నారు. మీకొరకు వెదకుచుంటిమి. చక్రవర్తి స్వయముగా మన యభియోగములు విచారింతురఁట. ఈవ్యత్యాసములు దెలిసికొనుటకే యని తోచుచున్నది. సుమేధుడు గట్టిగాఁ బ్రశ్నలు వైచినచో మొన్ననేవెల్లడియగును అయన యేమిటికోచల్లగానూరకున్నాఁడు. మాపని యేమిచేయుదురని దుఃఖించుచుఁ బలికిన రాజభటులు నూఱడింపుచు గదాధరుఁ డిట్లనియె.

మాకీవిషయమేమియుఁ దెలియదు. రత్నాంగి తెచ్చిన యభియోగములో మృగదత్తునకు సాక్ష్యమున్నదని మేమరుఁగము. మేమడవిలో దాగుటకై పోయిన నందీశని బట్టుకొని తీసుకొని వచ్చినారు ఇంతవట్టు నిజము. ఈమార్పు మాకునుఁ బ్రమాదమే ఉదయార్కుని రాజప్రతినిధిగూడ రమ్మని యాజ్ఞాపత్రికలు పంపిరఁట అందులకే విచారించుటకు నాలుగు దినములు వ్యవధియైనది. నిజము వెల్లడియైనచో మనమందరము కారాగారములో నుండవలసిన వారమే భగవంతుని యెత్తికోలు తెలిసికొనఁజాలము. కానిమ్ము. రేపు నేను సుమేధునింజూచి యాశీర్వదించి యాచించి యింతును. అతండు కరుణాళుండని తోచుచున్నది. నిజముచెప్పి తప్పుగావుమని ప్రార్థింపఁదలంచుకొన్నాను. వానికేమాత్రము పాండిత్యమున్నను రంజింపఁజేసి వశపరచుకోగలను. అని పలికి వాండ్ర నూరడించెను.

వాండ్రును జేయునది లేక తమ్ము తప్పించుమని గదాధరుని పాదములమీఁద బడి ప్రార్థించిరి అతండు వారినూరడించి యామరునాడుస్నానముచేసి యొడలెల్ల విభూతినలఁది బ్రహ్మతేజము మూర్తీభవించునట్లుమెఱయుచు ఫలములందీసుకొని సుమేధునింటికిం బోయెను.

నాలుగు దినములనుండి సుమేధుఁడు ప్రాతఃకాలమున నశ్వమెక్కి విహరింప నరుగుటలేమింజేసి అప్పుడింటిలోనే యుండెను.

సింహద్వారమున నిలువంబడి వేదముచ్చరింపుచు నాలుగు శాస్త్రములయందుఁ బాండిత్యముగల పండితుండొకండు దేవరదర్శనార్థమై వచ్చియున్నాడని పద్యములతో వ్రాసియిచ్చి వర్తమానమంపెను.

శ్లో. గదాధరారాధన తత్పరోహం
గదాధరారాధన తత్పరస్త్వం

గదాధరారోహం సుగదాధరస్త్వం.
సమానధర్మాత్త్వ వదంతిసఖ్యం.

క. బోధపద నేరడించుక
సాధులకేగాని మా ప్రసంగంబులు సుమే
ధా ధారిత భువనధరా
సాధితపంచేంద్రియ ప్రచార సుమేధా!

క. కోరఁ గనకాంబరాలం
కారధరా వాహనాది కామ్యములనినా
భూరమణ! యాత్మముక్తి వి
చారేచ్ఛ వచ్చినాడ సందర్శనకా.

సుమేధుఁడా పద్యంబులఁ జదివికొని పరమానంద పూరితహృదయుండై యర్ఘ్యపాద్యాదికములఁ గైకొని యెదురువోయి పాదములు గడిగి శిరంబునఁ జల్లికొనుచు మహాత్మా! నేఁ డాత్మదార గృహయుక్తముగా భవదాగమనంబునఁ గృతకృత్యుఁడనైతి. నిన్నుఁ బరమమిత్రునిగాఁ దలఁచుచున్నాఁడ దయఁజేయుఁడు. మీతో నాత్మరహస్య విశేషంబుల ముచ్చటింపవలసియున్నది యేకాంతప్రదేశమున కరుగుదము రండు. అని పలుకుచు సౌధాంతరమునకుఁ దీసికొనిపోయి సుఖాసనాసీనుం గావించెను.

సముచిత వస్త్రాలంకారశోభితుఁడగు సుమేధుం జూచి గదాధరుఁ డెగాదిగ జూచుచుఁ గురుదత్తుఁడు కాఁడుకదా యను భ్రాంతి హృదయంబున నంకురింప నేమనిన నేమి అపరాధమో యని వెరపుగదుర నేమియు మాటాడకూరకుండెను.

కొంతదనుక సుమేధుఁడును మౌనముద్రవహించి పండితప్రవరా! నీయాగమనకారణమెఱింగింపక ధ్యానించుచుంటివేమని యడుగుటయుఁ గ్రమంబునఁ దన యనుమానము వృద్ధిఁబొంద నిట్లనియె.

దేవా! నాకు మొదటగలిగిన సందియముకన్న మిమ్ముఁజూచుటచే వేరొక సందేహముఁగలుగుచున్నది వినుండు జీవులకు సఖిత్వాంగకరంబుగలిగినను నాత్మభేదము గలుగదుకదా? దానంజేసి మన యిరువుర మనమొక్కటియేయని నాయభిప్రాయము అనియుపన్యసించిననతండిట్లనియె

మీరు శాస్త్రవేత్తలుగదా! మీయభిప్రాయమునకు సత్యమునకు భేదముండదు, మీమాటయే యదార్థమని నేను నొప్పుకొనియెదననపుఁడు నవైన నున్న రూపు దెలుపుట కేమికొదవ అని చెప్పెను.

మీయభిప్రాయము తెలిసికొంటిని గదాధరత్వము మరియొకని యందారోపించి రూపభేదమున్నను క్రియాభేదము లేదని సూచించుచు నాత్మాపరాధము మరుగుపరచ నేతెంచితికిగాదా సత్యము జెప్పుఁడని యడిగిన సుమేధునకు గదాధరుం డిట్లనియె.

సుమేధశబ్దము విశేషణపదముగాని విశేష్యపదముగా మీయందుఁ బరిగణింప బడదు, అట్టిమానవు దేవరయందుఁగలదని అస్మదీయ గురుదత్త వరప్రదానంబునఁ దెలిసికొంటిని. సత్యముకాదా అవసరమును బట్టి భగవంతుఁడు నామరూపభేదంబులు వహింపలేదా! నన్నేమిటికిఁ బరితపింపఁ జేసెదరు? నిక్క మెరింగించి కృతకృత్యుం గావింపుఁడని ప్రార్థించెను.

అప్పుడు సుమేధుఁడు కన్నీరు స్రవింప హా! మిత్రమా! గదాధరా! యింత కాలమునకు గలసికొంటిమిగదా! యని పలుకుచుఁ గౌఁగలించుకొని దుఃఖింపఁ దొడంగెను.

ప్రహర్ష పులకితగాత్రుండై గదాధరుఁడు ఔరా! ఎంత చిత్రము దైవసంఘటన మెంతచోద్యమైనది. అని యూరక యరుచ్చెవందుచ నీకిట్టి యౌన్నత్య మెట్లుకలిగినది? ఇంతకాలము మమ్ముఁ జూడకయేమిటి కుపేక్షించితివి? నీభార్య పద్మిని దేశములపై తిరుగుచున్నది నీకుమారునితో నేను గలిసికొని తిరుగుచుంటినని తన కథ యంతయుం జెప్పెను.

సుమేధుఁడు, మొన్ననే మిమ్ముల గురుతుపట్టితిని మీమార్పులు నీబుద్ధిబలము చేతఁ గలిగినవని ప్రశ్నించితినికాను దైవోపహతులమగుట నీవియోగముఁ జెందితిమి మంచికాలమున నన్నియు సమకూడును. పద్మినితో మొన్ననే కలసికొంటిని లోపల నున్నది అని యామెఁజీరెను సముచితాలంకారధారిణియై పద్మిని వచ్చి గదాధరునికి నమస్కరించి కన్నీరు గార్చుచుఁ దనపడిన యిడుమలన్నియుం జెప్పకొనియెను.

ఆమె నొదార్చుచు నీకుమారునికి నీవువ్రాసియిచ్చిన యుత్తరముచూచి నీవే యని గ్రహించితిని. మీనిమిత్తమై తిరుగుచుంటినని తానుపడిన కష్టములన్నియుఁ జెప్పికొనియె అప్పుడుసుమేధుండు తనవృత్తాంతంబిట్లని చెప్పం దొడంగెను.

గర్భభరాలసయైయున్న ప్రియురాలినివిడిచి కోయలతో గూడఁ విచిత్ర పత్రములకై యడవికిం బోయితి. అందు సర్పదష్టుండనైపడియుండఁ గోయలు నలుమూలలకుం బోయిరి. నేను వివశుండనై పడియున్న సమయంబునఁ నొక యడవి యేనుగ యక్కడికి వచ్చినది. అదినన్నుఁ దొండముతో మూర్కొని మూర్కొని యాపాదమస్తకము తడిపినది. అప్పుడు సర్పవిషముతగ్గి నాకుఁ దెలివివచ్చినది

యేమిచేయుటకుం దోచక నేను బడియుండ తొండముచేఁ దడిమి తడిమి యది నన్ను బట్టి నీపు పైకి విసరినది. ఆవిసురునకు దానిపైఁ బడితిని. నాకుఁ నేనుగ నెక్కుపాటవము గలిగి యుండుటంబట్టి కాళ్ళను బిగబట్టి మెల్లగా గుంభము దాపునకుఁ బోయితిని.

ఆమతంగము నేను తనపైనున్న విషయమెఱిఁగి యుండదనుకుందును వేగముగా అటునిటు తిరుగుచు వృక్షలతాదులఁ దొండమెత్తి విరచుచు వక్కానలో క్కానలో దారుణవిహారముఁ గావించుచుండెను.

పర్వతశిఖరములెక్కుచుఁ బల్లములకు దిగుచుఁ గొమ్మలవిరచుచు నీరీతి చిత్ర సంచారముచేయుచు గ్రమంబునఁ గొండలోయఁ లోనికిఁబోయినది. నేను దానిపంతము విడువక యొంటిప్రాణముతో నుంటిని.

గజేంద్రవాహనుఁ డను చక్రవర్తికి నేనుఁగుల వేటయందుమంచిపాటవము గలదు. అతండా యడవికి వేటకై వచ్చి పొంచఁలొగ్గియుండెను. అతండొక చెట్టుపై నున్న యతని నెట్లోచూచి వడివడిగాఁ బరిగిడిపోయినది. ఆవృక్షశాఖలు సమున్నత విశాలములైయున్నను అవి యన్నియు విరచి మోడుగావించినవి. అప్పుడు గజేంద్ర వాహనుఁడున్న కొమ్మ విరువబూనినప్పుడతండు తనచేతనున్న కఠారి గురిజూచి తొండముపై వ్రేసెను. ఆవ్రేటుతప్పి గండ స్థలముపైఁగ్రుచ్చికొనినది. నేనొక కత్తిపందు కొని చేతనమర్చికొనియుంటిని. అంతలో నాకుంజరాలము గండుకొని తరుశాఖపై నున్న గజేంద్రవాహనుని బట్టఁబోయఁ బ్రయత్నించుచు నాకొమ్మ విరచి నేలపాలు గావించి యతని తొండముతోఁ బట్టుకొని పైకెత్తి వ్రేయఁబోవు సమయంబున నాచేత నున్న కత్తితో నాతొండము నరికివైచితిని. అట్లుచేయనిచో నప్పుడే యారాజు పిండియై పోవును. రాజు తొండముతోఁగూడ నేలంబడి వివశుండయ్యెను. అంతలో రాజభటులు పలువురువచ్చియా దెబ్బ౦బొడిచి శరములనేసికరకరూన్యమగుట దానిఁ నేలపాలుగావించిరి.

రాజును సేదదేర్చిరి రాజులేచి నన్నుఁజూచి నీవెవ్వఁడవు నాప్రాణములు గాపాడితివి. నన్ను రక్షింపవచ్చిన భగవంతుఁడవు. నీవృత్తాంతముఁజెప్పుమని ప్రార్థించెను. నానిజకథ చెప్పక వేరొకరీతిఁ జెప్పితిని.

అతండు నన్ను దనయందలముపై నెక్కించుకొని తనరాజధానికిఁ దీసికొని వచ్చి ప్రాణమిత్రునిగాఁ జూచుకొని కాపాడుచుండెను. అదియేమియో కాని పూర్వ స్మృతియంతయు నశించినది. కలలోవార్తవలె నున్నది. కొన్ని అభియోగములలో నతనికి సందిగ్ధముగానున్న విషయముల నిజముగ్రహించి నేను తీరుపులు వ్రాసితిని. దానుమెచ్చికొని అతండు నాకిట్టి అధికారమిచ్చుటయేకాక ప్రాణదాతనను విశ్వాసముతో నూఱుగ్రామములకు రాజుగావించెను.

నేనీ ప్రజల బాలించి అతఁడు విచారింపవలసిన అభియోగముల విచారించుచుఁ గాలము గడుపుచుంటిని.

రత్నాంగి యను భోగముదాని అభియోగములో మృగదత్తుకల్పిన తిరాసి జూచినతోడనే వెనుకటిస్మృతి అంతయు జ్ఞాపకము వచ్చినది. ఆ విచారణములోనే పద్మిని జాడయుం దెలిసినది. దాని సాక్ష్యము నెపంబున రప్పించుట కాజ్ఞాపత్రికలఁ బెక్కు వ్రాసితిని. ఇదియే నావృత్తాంతము. దైవానుకూలమున నందఱము చేరుకొంటిమి. పద్మిని పడరాని యిడుములం బడినది. మొన్న దీని యవస్థ దలంచికొనిన గుండెలు పగిలిపోవుచున్నవి. అక్కటా! గొల్లదానికి దాసియయి నిత్యము పెరుగును నీపట్టణమునకు మోసికొనివచ్చి అమ్ముకొనిపోవుచుండునది. పెరుగు, పాలు, చల్ల అమ్మి మధ్యాహ్నమున కింటికిఁ బోవునఁట. సాయంతనముదనుక నింటిపనులు చేయుచుండెడిది యఁట. కటకటా! ఆమాటలు వినిన నాడెందము చివికిఁ గుళ్ళిపోవుచున్నది. భోగముదానియింట నీళ్ళుమోయుచు దరవుఁడు తనంబున మెలఁగినదట, అని యామెబడ్డ బాములన్నియుం జెప్పిగోలున నేడువఁదొడంగెను.

తనపయ్యెదచేఁ గన్నీరు దుడుచుచుఁ బద్మిని ప్రాణేశ్వరా! అది కాలమహిమ గాక మఱియొకటికాదు. దమయంతి, సీత, చంద్రమతి లోనగు రాజభార్యలకన్న నేనధికురాలనా? యేమి చివరకు మేలుచేసిన భగవంతునకు గృతజ్ఞులమై యుండవలయును. గతచరిత్రము స్మరింపవలదు నాకుమారునిఁ జూడవలయునని యున్నది. వేగమురప్పింపుఁడు అని వేఁడుకొనినది. అప్పుడేపోయి గదాధరుఁడు వారిద్దఱిం దీసికొని వచ్చి చూపి యన్యోన్యవృత్తాంతములు చెప్పెను.

అప్పుడు వారిహృదయంబుల గల యానంద మిట్టిదని వర్ణింప నాకు శక్యము గాదు. మనసుచేతనే దెలిసికొనఁదగినది.

ఆ రాత్రియెల్ల నిద్రబోక తమపడిన యిడుములెల్ల నొండొరులకుఁ జెప్పికొనుచు సంతోషశోకము లభినయించుచు నోదార్చుచు దృఢిగా వెళ్ళించిరి

సుమేధుడు నాటి ప్రాతఃకాలమునఁ జక్రవర్తియొద్ద కరిగి తన వృత్తాంతమంత యుంజెప్పి అతని నాశ్చర్యపారావారములో ముంచివేసెను. అతండు కోరినప్రకారము విద్యానగరమునఁ బేరోలగము గావించెను. తన సామంతులనెల్లనందు రా నియమించి నిండుకొల్వులో గురుదత్తుని చరిత్రమంతయుఁ గాథగా జెప్పి సభ్యుల నచ్చెరువు పడజేసెను.

రత్నాంగి తెల్లతెల్లబోయి చూచుచుండెను. రాజప్రతినిధి హృదయముకంపింప దొడఁగెను, ఉదయార్కుని ముఖపద్మము వికసింప దొడగెను. సామంత

రాజుల వాక్యములు పద్మిని పాతివ్రత్యము గొనియాడుచు సుహూపుని నిందింపఁ దొడఁగినవి.

అప్పుడు చక్రవర్తి సభ్యుల కలకలము వారించుచు ప్రతినిధిని తగ్గించి మృగదత్తుని రామదుర్గనగరాధీశుని గావించితిమనియు సుమేధునికి మఱి నూరుగ్రామముల కధికారమిచ్చితిననియుఁ బద్మిని చరిత్రము గ్రంథముగా వ్రాయించి దేశమున వ్యాపింపఁ జేయ నాజ్ఞాపించితిమనియు రత్నాంగి తప్పు మన్నించి దాసికైన ఖర్చులన్నియు నిప్పించితిమనియు నున్నతస్వరంబున నుపన్యసించి సభ్యుల కానందము గలుగఁ జేసెను. జయజయధ్వానములతో సామాజికులు కరతాళములు వాయించిరి. అంతటితో సభ ముగిసినది

శుభముహూర్తమున మృగదత్తుని సామంతరాజులతో గూడుకొని చక్రవర్తి రామదుర్గనగరమునకు పట్టభద్రుని గావించెను. గుహదత్తుఁడు తల్లిదండ్రుల రప్పించి విద్యానగరమున వసించి రాజ్యపాలనము గావింపుచుండెను.

గోపా॥

ఉ. భూపతిజంపితిన్మగఁడు భూరిభుజంగముచేతఁజచ్చెఁ బై
నాపదఁ జెందిచెంది యుదయార్కుని పట్టణమేగి వేశ్యనై
పాపము గట్టికొంటి నటఁబట్టి విటత్వముబూనిరాగ సం
తాపముజెంది యగ్గిపడి దగ్ధముగాకిటు గొల్లభామనై
యీపని కొప్పుకొంటి నృపతీ! వగపేటికి? చల్ల చిందినన్.

ఇందు మంచికథ పొడగట్టుచున్నది. తద్వృత్తాంత మెరింగింపుమని యడిగితివి విమర్శింపనట్టి కథయే యున్నది. తెల్లముగాఁ దెలిసినదియా అని యడిగిన వాఁడు స్వామీ! మీదయవలన నాకు గ్రహణశక్తి పెరుగుచున్నది. ఈకథ నామనసున కెంతేని వింతగా నున్నది పద్మిని పాతివ్రత్యము సర్వయువతీజన స్తుత్యమై యున్నది. ధర్మమును విడువనివారెన్ని యిడుములు గుడిచినను తుదకు సుఖింపక మానరు. అను నీతి దీనివలన దెల్లమైనదని పలుకుచు గురువుతోఁ గూడ నా శిష్యుండు కావడి మోచుకొనుచుఁ దదనంతరావసథంబు జేరెను.

# కుశలవులకథ

అయ్యా వసథంబొక పట్టణము అందలి వింతలం జూచివచ్చి గోపకుమారుండు మణిసిద్ధునకు నమస్కరించుచు స్వామీ! యిన్నగరంబున నొక చతుష్పథంబున నొక శిలావిగ్రహము గలదు. దాని ఫాలభాగంబున వికటసంతుండని వ్రాయంబడియున్నది. దంతములు నిమ్నోన్నతములుగా నుండుటంబట్టి యట్టిపేరు పెట్టియుందురు. అది యొకవింతగాదు వినుండు. ఆవీధిని వచ్చుచుపోవువారెల్ల నావిగ్రహముపై నుమిసి పోవుచుందురు. అందుల కారణమేమియో తెలిసినదికాదు. మీవలన దెలియంగోరి వేగముగా వచ్చితిని. తత్కారణంబరసి యావృత్తాంత మెఱింగింపుడు నేడింతకంటె వేరొకవింత గనంబడలేదని ప్రార్థించిన నాయోగిపుంగవుండు మణిప్రభావంబునం దత్కథావిశేషంబాకలించుకొని యిట్లు చెప్పందొడంగెను.

వత్సా! విను మిప్పురంబునకుం బూర్వము కాంచీపురంబని పేరుగలదు. ఇందుం బూర్వము చంద్రగుప్తుండను రాజు ప్రజలం బాలింపుచుండెను? అతనికి ధర్మపతి యను భార్యగలదు ఆమె సుగుణంబులు గణనాతీతంబులు సంతతము వేదాంతగోష్ఠి జేయుచుండెను. మిక్కిలి చక్కనిది. సౌభాగ్యమునకే యలంకారప్రీతి భోగేచ్ఛబూనదు. భర్త ప్రవృత్తి నిరతుండగుట నతని మనసు రంజించునట్లు మాట్లాడును.

ఒక వసంతకాలమున నానృపాలుండు భార్యతోఁ గూడ బహువిధ కుసుమఫల దళ విలసితంబగు నుద్యానవనంబున కరిగి యందలి విశేషంబులు భార్య కెఱింగించుచు విహరించెను.

చ. వరలు వియోగినీ విరహవహ్నికి నాహుతివేల్పం బొల్పు భా
సుర సహకారమంజరులఁ జూచి మదించెఁ బికంబు లిత్తరిన్
సురత పరిశ్రమాతిశయ సూదనముల్ విహరించెఁ బాటలీ
పరిమళ బారచోరములు బంధుర చందనశైలవాతముల్.

మనోహారిణీ! యీ వసంతకాలములో నీవెన్నెల రాత్రులందు మలయమారుతములు మేనికి హాయిసేయ విలాసాలసలగు కిసలయ పాణులతో లతామంటపములం గ్రీడించు పురుషుల కిందఁ భోగములేమిటికి? అనుటయు నాతరుణి చిఱునగవు మొగమునకు నగయై మెఱయ భర్తకిట్లనియె.

శ్లో. రమ్యాశ్చంద్రమరీచయ స్తృణవతీ రమ్యావనాంతస్థలీ
రమ్యం సాధుసమాగతసుఖం కావ్యేషు రమ్యాః కథాః

కోపోపాహితబాష్పబిందుతరళం రమ్యం ప్రియాయా ముఖం
సర్వం రమ్య మనిత్యతాముపగతే చిత్తైన కించిత్పునః.

మనోహరా? వెన్నెలరాత్రులు మలయమారుతములు లతామంటపములు శృంగారచేష్టలు కథలు ప్రియురాండ్రమొగములో నగునవి యన్నియు రమ్యము లనియే చెప్పఁదగినది. కాని భూతములయొక్క యనిత్యత దెలిసినచిత్తమునకివి యేమియు రుచింపవుసుమీ అని పలికిన నాఁడేఁడు చాలు చాలు వృద్ధులాడు మాటలాడు చుంటివేమిటికి? వికసించియున్న యీపలాశకుసుమ మెట్లున్నదియో యుత్ప్రేక్షింపుము అనుటయు నవ్వనితారత్నము విద్యారహితుం సౌందర్యము దర్శనీయమైనను స్తోత్ర పాత్రము గాదని పరిమళశూన్యములగు నీపూవుల దెలుపు చున్నవని యుత్తరము జెప్పినది.

లతందప్పుడు ఔరా? నీదాతి మాఱిపోవుచున్నది. వినుము "సీ. పూచె మోదుగులు సొంపుగఁగానఁ జిక్కెఁ జైత్రుఁడుంచిన నఖక్షతములనఁగ" సరిగానున్నదియా? అని యడిగిన నప్పడఁతి యప్రతిహత ప్రతిభగల మీ వాక్యమునకుఁ దప్పులు పట్టువారెవ్వరు? అని యుత్తరముఁ జెప్పినది. ప్రేయసీ! పండుటాకురాలిచి క్రొత్త చిగురు ధరించిన యీ గున్నమామిడిచెట్టు శోభయెట్లున్నదియో చెప్పుమనుటయు నాలవరాలు—

గీ. తను విపాలంబుగాఁగ నుత్పత్తి మరల
గలుగు దేహాంకిట్లని తెలుపుచుండె
పండుటాకులు రాలినపట్ల మరల
చిగురులెత్తుట సృష్టివైచిత్ర్యమిదియె.

అని పలికిన విని నవ్వుచు నానృపాలుఁ డట్లుకాదు వినుము.

గీ. పండుటాకు రాల గన్పండువుగను
మొలకలెత్తెడు పల్లవములు నెలంత
ప్రాతనగలను విడిచి పొంబట్టు క్రొత్త
భూషణంబుల గైసేయు పొలుపుతోచె.

అట్లు భర్త శృంగారలీలాతరంగిణీ తాంతరంగుండై పలుకుచుండ నయ్యింతయాన వైరాగ్యోదయ సూచకములగు మాటలచే నుత్తరము జెప్పుచుండియు నొచ్చునేమోయని కమ్మర నమ్మనుజపతి సమ్మోదమందునట్లు సంభాషించుచుండెను.

నృపతియుఁ దన సతి విరక్తియెఱింగి అయ్యో! యీతొయ్యలి యనన్యసామాన్య సౌందర్యాభిరామయయ్యు శృంగార విలాసలాలస గాక విరాగిణియైయున్నది దీనిబుద్ధి మరల్పవలయుననితలంచి శృంగార ప్రబంధములు దెప్పించి చదివింపు

చుండును. అమ్మత్తకాశినియు భర్త చిత్తవృత్తియరసి అయ్యో! యీతండు సకలవిద్యా పారంగతుడయ్యుఁ బ్రవృత్తి మార్గనిరంతుండయ్యెఁ గొంతకాల మరిగినంగాని వీరిబుద్ధి మరల్పవశముగాదు అని తలంచుచు నతని మనసు దెలిసి క్రీడింపుచుండెను.

అట్లుండఁగా క్రమంబున నయ్యంబుజాక్షికి నిరువురు మగపిల్లలును, నిద్దరాఁడుపిల్లలును జంటగా నుదయించిరి. మగవారికిఁ గుశలవులనియు నాఁడువారికి రతివిరతులనియుఁ బేరులు పెట్టిరి. అందు లవునకును, విరతికినిఁ దల్లి పోలికయుఁ గుశునకుఁ రతికినిఁ దండ్రిపోలికయు వచ్చినది.

దివ్యాకారభాసురులగు పిల్లలంగాంచి భూవల్లభు డుల్లమున నానందంబు వెల్లివిరియఁ దదీయక్రీడాలాపములతోఁ గాలక్షేపము జేయుచు యుక్తకాలంబున వారి నందఱం జదువవేసెను.

అక్షరజ్ఞానము గలిగినది మొదలు కావ్యములు, నాటకములు, శాస్త్రములు, సంగీతములు, దండనీతి, వ్యాయామము ధనుర్విద్య లోనగు విద్యలెల్లఁ జెప్పుటకు నారాజు వారికి వేరువేర గురువుల నిరూపించెను. గంటకొక గురువు వారికి విద్యలం గఱపుచుండెను. సూక్ష్మబుద్ధి గల పిల్లలు నొజ్జలవలన గళావిశేషముల నతిలాఘవముగా గ్రహింపుచుండిరి.

రాజపత్ని భర్తకుఁ దెలియకుండ వారికి వేదాంతవిద్య నుపదేశింప వేరొక గురువును నియోగించినది. తత్త్వశాస్త్రము నాతనియొద్ద నలువురు జదివికొనిరి. కాని లవునకును విరతికిని లెస్సగాఁ బట్టుబడినది. కుశుఁడును రతియు అందలి విషయంబులఁ బరిహసింప మొదలుపెట్టిరి.

ఒకనాఁడు గురుఁడు ప్రబోధచంద్రోదయమను వేదాంతనాటకము వారికిఁ బాఠకముగాఁ జెప్పి అందలి విషయంబు లుపన్యసించుచుఁ గామక్రోధాదులు పరమ శత్రువులనియు శమదమాది గుణములచే వాని నడఁగఁద్రొక్కి వివేకముగలిగి వర్తించినచో మోహముడిగి యాత్మపరిబోధమువలన ముక్తులయ్యెదరని యెఱింగించిన నవ్వుచుఁ గుశుండిట్లనియె.

ఆచార్యా! మీరెఱింగించిన విషయంబులు చెప్పుటకు వినుటకును జాల నింపుగా నుండును. అట్లాచరించువా రెవ్వరునులేరు. దేహధారు లాచరింపనులేరు, శరీరికిఁ గామక్రోధాదులు ముఖ్యముగా నుండవలసినదే? సృష్టికర్త వస్తువును సృష్టించునప్పు డుపయోగశూన్యమైన గుణమేమిటికి జేసెడివి చెఱకునకుఁ దీపిగలిగించినట్లే వేమునకుఁ జేదుగల్పించెను. మేము స్వయముగా నాగుణము సంపాదించుకొనలేదు సహజంబైన యాగుణమును వదలనులేదు. అట్లై కామక్రోధాదులు సహజములు అవి లేక దేహి యుండ

నేరఁడు మఱియు రాజునకుఁ బరిచారకులు లేనిచో వ్యాపారము లెట్లుసాగవో దేహికిఁ గామక్రోధాదులువిడిచినచో దేహయాత్రయే సాగదు. కోపములేని వాని నెవ్వరుమన్నింపరు. కోపమనునది యాయుధమువంటిది దానిని దేశకాలానుగుణ్యముగా వినియోగింపవలయుంగాని విడువమనుట యసామర్థ్యమును సూచించెడిని కామము లేకున్న జన్మమే నిరర్థకము.

మఱియొక విశేషంబు వినుండు. కామ క్రోధాదుల విడచినవారు పూర్వముకాని యిప్పుడుగాని యెవ్వరేని గలరేమో నిరూపించి చూపుఁడు పురాణములు శాస్త్రములన్నియు విడువవలయు ననిమాత్రము ఘోషింపుచున్నవి. ఆకలములు దినియెడి మునులు విడిచితిరా? పరాశర మహర్షికథ యించుక విమర్శింపుఁడు యమునానదిని దాటునపుడు ఓడనడిపెడు పల్లెదానిజూచి కామాతురుండై క్రీడింపఁడే అందులకుఁ గారణమాచిన్నది యొంటరిగా నుండుటయేగదా! దాని కితరవరము లెన్నేని యిచ్చెనుగాని తనకామ మడంచుకొనలేక పోయెను. వారువ్రాసిన ధర్మశాస్త్రము కామక్రోధాదుల విడువుమని యిప్పుడు ఘోషింపుచున్నవి. వ్యాసుని చరిత్ర మనము వర్ణించిన బరిహాసాస్పదమే భాతృభార్యలవిశ్వస్థల సంతానవతులఁగావించి మహాభారతము రచించెను. విశ్వామిత్రాదుల కామక్రోధములు లోక విదితములేకదా? వసిష్ఠునందుఁగల వైరంబునంచేసి హరిశ్చంద్రుని నానాకష్టములంగుడిపించెను రాజ్యాభిలాషులగు నృపులమాట చెప్పనేల? తండ్రీ! యింతయేల? తత్వశాస్త్రమంతయు సాంగముగాఁ జదివిన మీరు కామక్రోధాదుల విడిచితిరా? వేషము బుచ్చుకొని మాకుపదేశము జేయుచుండిరి. ఇఁక మేమెట్లువిడుతుమో చెప్పుఁడు. మాతల్లి వెఱియె కాని మాకిప్రాంబున నీయుపదేశ మేమిటికి? బాపురే! అద్వైతమఁట. అదియెవ్వరికైనం దెలియునదియే? అది దేహియాచరించుటయెట్లు? శాస్త్రకారుల కేమియుం బనిలేక ప్రజలం బాధించుట కిట్టిని వ్రాయుచుందురు. అందఱు వేదాంతులై జన్మరాహిత్యమునే కోరినచో నీప్రపంచకము శూన్యమైపోవును సూర్యచంద్రాదులు పంచభూతములు మఱి యెవ్వరి కుపయుక్తములు? సృష్టికర్తచేసిన పనులన్నియు వ్యర్థములై పోవునుగదా? కావున మాకిట్టి యుపదేశమెన్నఁడును జేయకుఁడు, లోకోపకారములగు గ్రంథములుపదేశింపుఁడు అని గురుని వాదము ఖండించుచుఁ బెద్దగా నుపన్యసించెను.

ఆరాజకుమారుని యుపన్యాసము విని తెల తెల్లబోవుచు లవుని మొగము జూచి నీయభిప్రాయమేమని యడిగిన నతఁడు గురునకు నమస్కరించుచుఁ గురు నుద్దేశించి తమ్ముడా! నీవిట్లు చార్వాకమతము ననుసరించి వాదించుచుంటివేల? కామక్రోధాదుల విడువుమని చెప్పిన శాస్త్రకారులంత మూఢులా? ఏమి నీయవివేకము! వినుము. అజ్ఞానమువలన శరీరము గలుగుచున్నది.

శ్లో. క్రోధోహర్షో విషాదశ్చ జాయతేహి పరస్పరం
పంచభూతాత్మ కేదేహే సత్వే రాజస తామసె
చక్రవత్పరివర్తంతె హ్యాజ్ఞానాజ్ఞంతవోఖిలం
తస్మాత్స మ్యక్పరీక్షేత దోషా నజ్ఞాన సంభవాన్,

పంచభూతాత్మకమగు దేహంబున సత్వరజస్తమోగుణానుగుణ్యముగా నజ్ఞానంబునఁ గామక్రోధాదులు జనించుచుండును వానిని శమదమాది గుణవిశేషములచే నణఁచుకొన వలయును. దానికే జ్ఞానమనిపేరు. అహంకార మమకారములే సంసారమునకు మూలమగుచున్నవి.

శ్లో. కామక్రోధశ్చ లోభశ్చ వైరిణో బలవత్తరాః
కృతా కృతం నజానంతి ప్రాణినస్తద్వశంగతాః

కామక్రోధాదులు బలవత్తరములగు నాంతరంగిక శత్రువులు తద్వసులు కృతాగృతములఁ దెలిసికొనఁజాలరు.

శ్లో. ముచ్యతె లోహనిగళైః బద్ధః కాష్టమయైస్తథా
అహంకార నిబద్ధస్తుసకదాచిద్విముచ్యతె.

ఇనుము దామవు మొగలగుసంకెళ్లచేఁ గట్టఁబడినవాఁడు విడువఁబడును కాని యహంకార మమకారములచేఁ గట్టఁబడినవాఁడు ఎన్నటికిని విడువఁబడఁడు. కామ క్రోధాది దుర్గుణములలో నొక్కొక్క గుణము విడిచినవానికిఁ గలుగు సుఖమను భవైకవేద్యము. మహానుభావుఁడైన ప్రబోధచంద్రోదయ నాటకకర్త కామక్రోధాది దోషగుణంబులకు విరుగుడుగా శమదమాది గుణంబుల శత్రువులుగా నిరూపించి వ్రాసెను. ఆగ్రంథము జ్ఞానోదయమునకు మంచి సాధనముగానున్నది. నీవు దానిని గురువును పూర్వులను గూడ నాక్షేపించుచున్నావు. మహర్షుల ప్రభావములు మన మాక్షేపింపరాదు. వారు త్రికాలవేదులగుట భవిష్యచ్చర్య ననుసరించి వ్యాపారములు సేయుచుందురు. అంతియకాని జితేంద్రియులగువారి మదులకు వికారములులేవు. పరాశరప్రభృతి మునుల దుర్గుణమువలె నిరూపించితివికాని వారిప్రభావముల వర్ణించితివా వు సృష్టికి ప్రతిసృష్టిజేసిన విశ్వామిత్రుని సామర్థ్యము నీమది కేమిటి కచ్చెరువు గొలిపినదికాదు? అయ్యయో! అద్వైతతత్వమునఁగూడఁ బరిహసింపుచుంటివే! మహానుభావుడైన శ్రీశంకరగురుం డతనిగూఢ మగు నామార్గమును వెల్లడించెను.

శ్లో. ప్రబుద్ధోహం స్వప్నాదితి కృతమతి స్స్వప్నమపరం
యథామూఢస్స్వప్నె కలయతి తథామోహవశగాః
విముక్తిం మన్యంతె కతిచిదిహతో కాంతరగతిం
హసంత్యేయన్ దసాన్తగపగళిత మాయాః పరగురొ.

స్వప్నమందుండియే మేల్కాంచితినని తలంచుచు వేరొకస్వప్నమునఁ గాంచు మూఢుని పగిదిఁ గొందఱు లోకాంతరగమనమే ముక్తియని తలంతురు. అట్టివారిం గాంచి అద్వైతవాదులు నవ్వుచుందురుగదా. అనిమందనమిశ్రుఁడు అద్వైతబోధనయైన పిమ్మట శంకరాచార్యుస్తుతియించెను. తెలియనివాఁ దండజీ నాక్షేపించును. నీవు గ్రంధముల బాగుగా విమర్శించి శాస్త్రరహస్యముల గ్రహింపుము. గురువుల నాక్షేపింపకుము. మన తల్లి వినినఁ గోపించునని పలికిన విని నవ్వుచు గుశుం డిట్లనియె.

అన్నా! నీకేమన్నను గోపము వచ్చునఁ కాని నామతము దెలిసికొనఁ లేకున్నావు. గ్రంధములలో వ్రాయలేదని నేజెప్పలేదు. అట్లునడచువారు లేరని చెప్పుచుంటిని. నడిచినం బ్రయోజనములేదు. దేహసుఖంబులనుభవింపక యీనాలుగుదినములు పురమువిడిచి అడవులం డిమ్ముగుమనియెడవాయేమి? ఆకాశ కుసుమమువలె దేహానంతర మేమిజరుగునో యెవ్వఁడు చూచెను. మరణానంతరమండిట్లు జరుగునని నిశ్చయముగాఁ జెప్పినవాఁడులేడు పూర్వగ్రంథములలో నిట్లువ్రాయఁబడియున్నదని ప్రతి మహర్షియు నుదాహరణములు చూపుచుందురు. కావున నీవు వెఱ్ఱివేదాంతము పెట్టుకొనక స్వేచ్ఛగా నింద్రియ సుఖంబు లనుభవింపుము. మనకీసమయమున వేదాంత మవసరములేదని యుక్తియుక్తముగా వాదించెను.

లవుఁడు...ఓహోహో! నీబుద్ధిబలము కొనియాడఁ దగినదే క్షణభంగురమైన యీశరీరమునకు సుఖంబేదియో నిరూపింపుము.

కుశుడు...ఏయింద్రి యమేసుఖంబనుభవించుటకు భగవంతుఁడు సృజించెనో యా యింద్రియముద్వారా నాసుఖం, బనుభవింపవలయును. తెలిసినదియా!

లవుఁడు...సుఖంబననేమి?

కుశుడు...ఇంద్రియానందము.

లవుఁడు శ్లో. అవిక్రాంత మినాలంబ మపాథేయ మదైశికం
తమకాంతా రమధ్వానం కథమేకో గమిష్యసి
సహిత్వాం ప్రస్థితంకశ్చి త్పృష్ఠతోను గమిష్యతి
సుకృతం దుష్కృతం చత్వాంయాస్యంత మనుయాస్యతి.

మూఁఢుఁడా! విక్రాంతి శూన్యమైపాదేయరహితమైయనంతమై యొప్పు మార్గంబునం బడి నీవు పోవుచుండ నీవెంట నెవ్వరును రారుసుమీ! నీవొక్కఁడవె పోవలయునప్పుడు నీయింద్రియములు నిన్ను రక్షింపఁజాలవు. నీవుజేసిన సుకృతదుష్కృతములు మాత్రము నీవెంటవచ్చును. కావున సుకృతములాచరింపుము. చెడుబుద్ధి విడువుము.

కుశుఁడు...అన్నా! నీవు చెప్పినదంతయుఁ బుస్తకములలో వ్రాయఁబడి యున్నది. నిజము చూచినవారెవ్వరును లేరు. సుకృత మనియు దుష్కృతమనియు బెదరింపుమాటలు సత్యములుకావు. వెఱ్ఱి ఛాందసము విడిచి సుఖింపుము.

లవుఁడు...ఛీ: బాలిశా నాస్తికా! వాదము చేయుచున్నావు. నీతో సంభాషింప రాదు.

కుశుఁడు...(పకపకనవ్వుచు) అన్నా కోపము వదలమని చెప్పుచు నిప్పుడే కోపము జెందుచుంటివేమి? ఇట్లే అందఱు జెప్పుచుందురు కాని చేయువారు లేరనియే నే ననుచుంటిని వినుము.

శ్లో. కామః క్రోధశ్చ లోభశ్చ సర్వేదేహగతాగుణాః
రాగద్వేషా దయోభావాస్స్వర్గేపి ప్రభవంతిహి

కామక్రోధాదులు రాగద్వేషాదులు స్వర్గమందున్ననువిడుచునవికావు. దేవతం లవి పోయినవియా!

లవుఁడు—అక్కటా! నిక్కము దెలియక నీవిటు దుర్మార్గము ననుసరించు చుంటి వేమిజేయుదును.

కుశుఁడు— నీదియే దుర్మార్గము. నాదికాదు తెలియ కట్లను చున్నావు.

అని యీరీతి అన్నదమ్ములిద్దరు పెద్దతడవు వాదించిరి. విరతిలవునిపక్షము రతి కుశునిపక్షము జేరినది. తగవులు చివరకుఁ దండ్రికిం దెలిసినవి. కుమారుం నిరువుర రప్పించి వారి సంవాదప్రకారమంతయు విని పండితుం రప్పించి సభజే యించి యెవ్వరివాదము న్యాయమైనదో చెప్పుఁడని కోరుటయు ద్రవ్యలాలసులగు నీపండితులు కుశుని దుర్బోధచేఁ గుశుని వాదమే సత్యమైనదని నిర్ధారణచేసిరి.

దానంజేసి లవుండు కోపించుచు దుర్జనభూయిష్ఠమగు దేశంబున నుండఁగూడ దని తలంచి యెవ్వరికిం జెప్పకుండ నొకనాఁడు దేశాంతరము లేచిపోయెను.

కొన్నిదినంబులకు నృపతి యవ్విధం బెఱింగి యంతిపురి కరిగి భార్యతో నావిషయము ముచ్చటించుచు నీవు బిడ్డల సన్యాసులంజేసితివి, లవుఁడు విరక్తుడై తమ్మునితో వెఱ్ఱివాదముజేసి యెంటో పోయెను. వానికొఱకు దేశమంతయు వెదకించు చున్నాను. వానివృత్తాంతము నీవేమైన నెఱిఁగుదువా అని అడిగిన విని ధర్మపత్ని నిట్టూర్పు నిగుడించుచు నేమియు మాటాడినదికాదు. విరతి తండ్రితో బాబా! చిన్న న్నయు అక్కయుఁ బెద్దన్నతో నాస్తికవాదము జేసిరి. నీవును వారితోఁగలిసి పండితులచే నావాదమే యుక్తమైనదని నిర్ధారణచేయించితివి. దానంజేసి వానికిఁ గోపము వచ్చి యిందుండుట కిష్టములేక లేచిపోయెనని చెప్పిన విని తండ్రి యోహో!

నీవును వేదాంతురాలవే కాఁబోలు చాలు చాలు మీయమ్మ శిక్ష చక్కఁగానున్నది. అని యాక్షేపించుటయు నాచిన్నది తండ్రీ! దేహములు క్షణభంగురములు పుట్టినది మొదలు జంతువులకు మృత్యువు నెత్తిమీఁదనుండి యెప్పుడో గుటుక్కున మ్రింగి వైచును. కావున మంచిమార్గము గ్రహించుటకు నొక సమయము లేదు. చిన్నతనము నుండియే యభ్యసింపవలయును. కామక్రోధాదుల నడఁచుకొని జ్ఞానము గలిగియుండ వలెను. ఎన్నఁడో వృద్ధాప్యమునఁ దత్త్వవిచారణ చేయుదమన్న నంతదనుక మృత్యు దేవత కబళింపక యుండవలదా? మీవాదముసమంజసముకాదని పెద్దగా నుపన్యసించిన రాజునకుఁ గోపమువచ్చి యేమియు మాటాడక వెళ్ళిపోయెను. అతండు మరికొన్ని దినములకు కూతుంరకు వివాహ ప్రయత్నము గావించుటయునావిషయమునై వకుళా ముకుళలకును పరిచారకల కిట్టి సంవాదము జరిగినది.

వకుళ...ముకుళా! నీసఖురాలు విరతిని వీర్యవంతుని కుమారుఁడు వత్సున కిచ్చుటకు నిశ్చయించిరఁట. విరతి యంగీకరించినదియా? ఆమెకుఁ దగినమగఁడే దొరకెనులే!

ముకుళ...ఏమి? నీపరిహాసము. అప్పుడే పెండ్లియైనట్లే వెక్కిరించుచుంటివి. మావిరతి వాని నంగీకరింపదు మీరతని కేయూరదత్తుని కుమారుఁడు సుకుమారుని కిచ్చుటకు నిశ్చయించిరా?

వకుళ—అవును సుకుమారుని సౌందర్య మెట్టిదో యిదిగో చిత్రపలకము చూడుము. పరాక్రమమున సర్వుఁడే విద్యచే బృహస్పతిని మించియున్నవాఁడు. అన్నిటికి రతికిఁ దగియున్నవాఁడు రతి నతనికిచ్చి సహాయముగా నిందే యుంచు కొందురఁట పాపము విరతికే మంచి మగఁడు దొరకలేదు.

ముకుళ—పోనిమ్ము నీరతిపతితో సుఖించినంజాలు మా విరతి యవధూతయై పెండ్లియే యాడక యద్వైతానంద మనుభవించును.

వకుళ— మీవిరతి యోగురాలనియే యామెకు మంచి సంబంధమేదియు రాకున్నది. శృంగారలీలాతరంగి తాంతరంగుఁడగు రాజకుమారుఁడు వైరాగ్యప్రవృత్తి గల వత్తకాశిని నెట్లు వరించును? వత్సుఁడు గుణహీనుఁడు కావున నంగీకరించెను.

ముకుళ—నీవు కంఠశోషము జూచికొని మురియుచుంటివి. శృంగారలీలలు బుద్బుదములవంటివి. వైరాగ్యమే నిలుచునది తినఁగూడులేక యత్తవారింట నిల్లరిక ముండుటకు సిద్ధపడుచున్న సుకుమారునాదరింపఁగఁ బొగడుచు రతినభినందించుచు విరతి నాక్షేపించుచుంటివి చాలు జాలు. నోరుమూయుము.

వకుళ—ఏమి! సుకుమారుఁ డన్నములేనివాఁడా! ఈమాట జ్ఞాపకముంచుకో.

పెండ్లికాసిమ్ము వానిచే నీముక్కును జెవులును జెక్కింపకున్న నన్నీపేరఁ బిలువ వద్దు.

ముకుళ — అట్లా? నీయరచేతికిఁ బొడ్లువచ్చినప్పుడు చూతుములే. విరతిని జోగురాలని యాక్షేపించితివికాదా? ఆమాట జ్ఞాపకముంచుకొనుము. ఆజోగురాలి మగనిచేతనే నిన్ను విరూపను జేయింపకపోవుదునా?

వకుళ — ఛీ రండా! ప్రేలకుము.

ముకుళ — అని యామాటయే యనిపించుకొనిన గౌరవమేమి.

వకుళ — అమ్మగారి యూతజూచికొని నోటికివచ్చినట్లు ప్రేలుచుంటివి. కానిమ్ము నీవును విరతియు వత్సునివలన నీడుసులం గుడుచునప్పుడు నామాట పథ్యముగాఁ దలంపక పోవుదువా.

అని యిద్దఱు పెద్దగాఁ గ్రుద్దులాడిరి, వకుళ రతియొద్దకు ముకుళ విరతి యొద్దకుం బోయిరి. కన్నీరుగార్చుచుఁ దనయొద్ద కరుదెంచిన ముకుళం జూచి విరతి ఏమేయిట్లు వెక్కి వెక్కి యేడ్చుచుంటివి? నిన్నెవ్వరవమానపరచిరి. చెప్పుము చెప్పుము అని గన్నీరు దుడుచుచు నడిగిన విని అది యిట్లనియె.

అమ్మా! కుశుఁడు తండ్రిని వశపరచుకొని విద్యారూపపరాక్రమవంతుఁడగు సుకుమారుఁడను రాజకుమారులకు రతినిచ్చి వివాహము చేయుటకు నిశ్చయించెను. వీర్యవంతుఁడను వాని కుమారుఁడు వత్సుఁడనువాఁడు. వట్టికుంత. దుర్వ్యసనాసక్తుండు కోపశీలుఁడు విద్యాగంధరహితుఁడు రూపహీనుఁడు అట్టివానికి నిన్నిచ్చుటకు నిశ్చయించిరట రతి సఖురాలు వకుళ గరువముతో మిమ్మాక్షేపించినది. అందులకై మాయిద్దఱికిని బెద్దజగడము జరిగినది. తల్లీ! యేదియెట్లైనను వత్సుని నీవంగీకరింప వలదు. అని యావృత్తాంత మంతయు తెలింగించినది.

విరతి నవ్వుచు ముకుళా! నీకు నాయందుఁగల యభిమానము జూపితివి, మన మెట్టికర్మబీజము నాటుదుమో తదనుగుణమైన ఫలమనుభవింతుము. అంతియకాని మంచిచెడ్డలకు నొరులు హేతువులు కారు. వారి గరువము వారినే చెరుచును. మనల నేమియుం జేయఁజాలవు. ఊరకొనుమని యోదార్చినది. అంతలోఁ దల్లి యచ్చటికి వచ్చి ముకుళ వలన నావృత్తాంతమంతయు విని ఛీ ఛీ వత్సుఁడు నిర్భాగ్యుఁడు వాని కిచ్చుటకు నేనంగీకరింపనని పలికినది. అట్టిసమయమునఁ జంద్రగుప్తుఁ డంతః పురమున కరుదెంచి సుఖాసనోపవిష్టుండై భార్యం జూచి యిట్లనియె.

ప్రేయసీ! పిల్లలిద్దరికిని వివాహములు నిశ్చయించితిని. వినుము కేయూర దత్తుని నాలుగవకుమారుఁడు సుకుమారుఁడనువాఁడు విద్యాబలరూపశీలములలో నన

వద్యుఁడు రతిని వానికిచ్చుటకు నిశ్చయించితిని. అందుల కంగీకరించెను. విరతిని వీర్యవంతుని కుమారుఁడు వత్సుఁడను వానికిచ్చుటకు నిశ్చయించితిని వీర్యవంతుఁడు మంచిబలశాలిధనికుఁడు పలుకుపడిగలవాఁడు వత్సుఁడతని కేకపుత్రుఁడగుట గారాముగాఁ బెరిగెను చదువంతగా వచ్చినదికాదఁట. రూప మొకమాదిరిగానుండును. సర్వగుణములు కాంచనము నాశ్రయించి యుండును వాని కేకొదవయును లేదు కావలసినంత ద్రవ్యమున్నది. సుముహూర్తము యెల్లుండియే నిశ్చయించితిని ఈవార్త నీకు జెప్పుటకువచ్చితినని చెప్పినవిని అతనిభార్య సంభ్రమశోక క్రోధవశయై యొక్కింత తడవూరకొని భర్తతో నిట్లనియె.

మనోహరా! వత్సుని చరిత్రము మీరెఱింగిన నంగీకరింపరు. వాఁడు విద్యాగంధరహితుఁడనియు దుష్క్రియాచరణ నిరతమతిఅనియు ఘాతకుఁడనియు నెల్లరుం జెప్పుకొనుచున్నారు. సప్తవ్యసనములు వానిపాలఁట. వానియం దొక్కసుగుణ మైన లేఁదట చూచి చూచి రత్నమువంటి పిల్లను వాని కెట్లీయఁదగును? దుష్టునిం బెండ్లియాడి యిడుములం గుడుచుటకంటె నాబిడ్డ యోగినియై యిట్లే యుండును. పెండ్లి అక్కరలేదని చెప్పిన విని యారాజు వెండియు నిట్లనియె.

కామినీ! వాని గుణంబులు నీవు విన్నవన్నియు నసత్యములు విద్యలేని లోప మొక్కటియే యున్నది. విరతి వేదాంతురాలుగదా ఎట్లున్నను సవరించుకొనఁగలదు. దేశమంతయు తిరిగితిని మరియొక సంబంధమేదియును లేదు. అదియునుంగాక వీర్యవంతునకుఁ దరలి రమ్మని శుభలేఖ వ్రాసి యంపితిమి. ఇప్పుడు వలదన్న నతఁడు కోపింపఁడా! ఎట్లైన నాసంబంధ మంగీకరింపుమని బతిమాలికొనియెను. ఆమె అంగీకరించినదికాదు. ఆవిషయమై భార్యాభర్తలకుఁ బెద్ద సంవాదము జరిగినది. బిచ్చగానికిచ్చినను సంతోషింతును గాని వత్సునకిచ్చుట కంగీకరింపని కచ్చితముగా నుత్తరముజెప్పిన రాజిట్లనియె.

కానిమ్ము నీవన్నమాట నిలఁబుకొనుము. ఇకసంబంధములకు దేశములు తిరుఁగ జాలము ఎల్లుండియుదయమునఁ నుత్తరగోపురము దాపునకుఁబోయి తొలుత నెవ్వఁడు వీటిలోనికి వచ్చువాఁడు గనంబడునో వానికి విరతినిచ్చెద నంగీకరింతువా అని అడిగిన నామెతప్పక అట్లే చేయుఁడు దైవమేతీసికొని వచ్చునని పలికినది. ఆమాట వారిద్దరికింగాక మరియెవ్వరికిం దెలియదు.

ఆమాటయే నిశ్చయించుకొని భూపతి అంతఃపురమునుండి యీవలకు వచ్చునంతఁ గుహుఁడుగలిసికొని తండ్రీ! శౌర్యవంతుఁడిప్పుడే శుభలేక వ్రాసి అంపెను. రేపురాత్రికే వత్తురఁట. విడుదల నెందు నియమింతుము కేయూరదత్తుదనకుఁ బెద్దమేడ

యిచ్చుటకు నిశ్చయించితిమి అని యేమేమో చెప్పఁబోయిన నలుకమెయిఁ జాలుఁజాలు నీకతంబున నీముప్పు వాటిల్లినది శౌర్యవంతుని సంబంధము దెచ్చినవాఁడవు నీవు వత్సుఁడు వట్టి నిర్భాగ్యుఁడట. ధర్మరతి విరతిని వానికిచ్చుట కంగీకరించినదికాదు. ఇప్పుడు శౌర్యవంతుని రావలదని ప్రత్యుత్తరము వ్రాయుము.

అనుటయుఁ గుసుఁడు తండ్రీ! యిట్లు వ్రాసిన నతనికిఁ గోపము రాదా? వాఁడలిగిన మనము నిలువఁగలమా? వాని కుమారుఁడు శూరుఁడని చెప్పినవారు శత్రువులు వాఁడు శౌర్యముఁగలవాఁడు మంధుఁడుగాదు దానంజేసి తీవ్రచిత్తుఁడువలెఁ గనంబడునని మందస్వరముతోఁజెప్పిన విని చంద్రగుప్తుఁడు హోహో! నీకపటమంతయుం దెలిసినది. పెద్దవాని దేశముల పాలుఁజేసితివి. విరతికి నీచుం దెచ్చితివి. తెలియక నీమాయలకుఁ జిక్కితినని పలుకుచు వానిమాటలు వినిపించుకొనక తాను జేయఁదలచుకొనిన పని యొరులకుం దెలియనీయక విచారముఖముతో నిజనివాసమునకు బోయెను.

అని యెఱింగించువఱకు వేళ అతిక్రమించుటయు మణిసిద్ధుండు తదనంతరోదంతం బవ్వలిమజిలీయం దిట్లు చెప్పందొడంగెను.

## 133 వ మజిలీ.

# జంగమ దేవర కథ

తెల్లవారి యెనిమిది గడియలకు ముహూర్తము నుంచఁబడినది. నిరూపించిన వత్సున శౌర్యవంతుని రావలదని యుత్తరములు వ్రాసిరి. వారెవ్వరును రాలేదు. రతిం బరిగ్రహింప సుకుమారుఁడు మహావైభవముతో నూరేగుచున్నవాఁడు మంగళవాద్యములచేఁ బట్టణమంతయుఁ బ్రతిధ్వనులలిచ్చుచున్నది. విరతింగూడ బెండ్లికూతుం జేసిరి. పురోహితులు వివాహవేదికలపైఁ బెండ్లిపీటలు రెండునువైచి మంగళసంస్కారములు గావించుచున్నారు విరతికి వరుఁడెవ్వఁడో తెలియదు. విడిది యెఱుకపడదు. ఊరేగింపు జాడఁ గనంబడదు ఇది కడువింతగా నున్నదని పరిజనులు బంధువులు ఆప్తులు గుజగుజలాడుచుండిరి. కొందరు అడుఁగబోయి. నృపతి ముఖవైలక్ష్యము గనిపెట్టి యూరకొనిరి. కొందరు తొందరయేల పెండ్లివేళ చూడమాయని యుపేక్షించు చుండిరి.

అరుణోదయమైనది. దెసలు చీకటులంతరించుచున్నవి. పక్షులు గూయుచున్నవి హజారమున కాలసూచకములగు భేరీధ్వనులు మ్రోగుచున్నవి. అట్టితరి జంద్రగుప్తుఁడు స్నానముజేసి నిత్యకృత్యములు దీర్చుకొని తురగారూఢుండై మంగళవాద్యములతో రత్నాలపల్లకి దనవెనుక వచ్చునట్లు నియమించి యుత్తరగోపురము దెసకరిగెను.

ఎక్కడనుండియో క్రొత్తపెండ్లివారు రాఁగలరని వారిం బోటితేర రాజరుగుచున్నాడని నిశ్చయించి తమ్మెవ్వరిం బిలువకున్కి శంకించుకొనుచుఁ గొందరు బంధు

వులు చూచివత్తముగాక యని పల్లకికి వెనుక వెనుకగాఁ జనుచుండిరి. అమ్మహారాజు సూర్యోదయమునకు నుత్తరగోపుర సమీపమున గుఱ్ఱముపై నిలువంబడి యామార్గముపైఁ జూడ్కులు వ్యాపింపఁ జేయుచున్నంత.

సీ. కంచుఘంటికయు శంఖంబు లంకె దగిల్చి
మూపునఁ ద్రేలాడ ముందువెన్క
నెమలియీకెలవన్నె లమరంగ మకుటంబు
వలెఁదల మెలిపాగ వాసిఁజెంద
శంభులింగాంక భాస్వరమలో నిత్తడి
బిళ్ళలంగరములందెల్ల మెఱయ
మూఁడరల్ బిగిజాలు మూతి గల్గినగంత
గడ్డ జోలిని జంకకునఁ దగిల్చి
గీ. భూతిపైఁ బెద్దగంధపు బొట్టుపెట్టి
పిలికలతోడి మేలియంగీలు గ్రాల
బ్రాయమెట్టిదొ తెలియంగఁబడనియట్టి
జంగ మొక్కఁడు పీటఁబిచ్చంబు గొనఁగ.

పట్టణాభిముఖుండై వచ్చుచుండెను. ఆజంగమువానిం జూచి రాజు గుండె ఝల్లుమన హా! విరతీ! నీకెట్టిగతి పట్టినది. మహారాజు కడుపునం బుట్టియు నీవీభిక్షగానిం బెండ్లి యాడవలసివచ్చినదా? ఇది యంతయు నీతల్లి కలనం గలిగినముప్పు దానికిశాస్తి కావలసినదే. అయ్యో! ఒకరిపైఁ గోపమున నొకరికి నపకారము తలంపవచ్చునా అక్కటా! ఇందులకు నేనేమిచేయువాఁడ విధిపరిపాక మిట్లున్నది కాబోలు , చేసిన నియమము తప్పుట మహాపాతకముగదా. ధర్మరతియు నిందులకు వ్యతిరేకమునకు సమ్మతింపదు, కానిమ్ము! అట్లే చేసెదనని యారాజు కొంతసేపు శోకము, కొంతసేపు పరితాపము కొంతసేపు క్రోధము. అభినయించుచుఁ దన్నుసమీపించియున్న పరిజనులతో నావచ్చు జంగమదేవరను పల్లకినెక్కించి యూరేగింపుచుఁ బెండ్లి పందిరికిఁ దీసికొని రండని నియమించి దీనముఖుండై యానంతఃపురమునకుఁబోయి భార్యంగాంచి జరిగిన కథ యెఱింగించి యిప్పుడేమి చేయుమనియెదవు? వానికి విరతినిచ్చి పెండ్లి చేయుదువా? అని యడిగిన కన్నుల బొటబొట నశ్రువులుగారఁ బరితాప మభినయించుచు నిట్లనియె మహారాజా! విరతి సన్యాసురాలు దానికెట్టిమగఁడైన నేమి? వత్సునికన్న నెవ్వఁడైన లెస్సయే యని చెప్పితినిగదా. ఏసిందు మీ సంకల్పమట్లో యట్లే జరిగినది. దానికి మంచి మగనిఁ దీసికొనిరాదలంపు మీకుఁ గలిగియున్న నిట్టిప్రతిజ్ఞ యేమిటికిఁ

జేయుదురు? ప్రొద్దుటఁ బురిలోనికి వచ్చునాఁడు చక్రవర్తి కుమారుఁడగునాయేమి. కానిండు జంగమదేవర మంచివాఁడే పరమేశ్వరుఁడట్టి వేషమునవచ్చి నాకూఁతు నేలఁ దలఁచుకొనెనేమో. యెవ్వరిపుణ్య మెవ్వ రెఱుఁగుదురు? వానికే పెండ్లి చేయుఁడని నతనిష్ఠురముగా నెత్తిపొడిచినది.

ఈలోపలఁ బరిజనులు రాజాజ్ఞ వడువున సుగతుండను పేరుగల నా జంగమ కుమారుని బల్లకినెక్కించి నగరిలోనికిఁ దీసికొనివచ్చిరి.

రాజు రతిసుకుమారుల వివాహము మహావైభవముతోఁ గావించెను. విరతికి లోపలనగరిలో గుప్తముగా సుగతునకిచ్చి పెండ్లిజేసెను. అట్టితఱి బంధుగులందఱు కన్నీరుగార్చుచు విరతిని వానికిచ్చిన కారణము తెలిసికొనజాలకపోయిరి. నీమగఁడు జంగము జంగము అని రతియు గుహుఁడును బాలురచేత నాక్షేపణ చేయింపఁబొడంగిరి. మాట మాటకు వెక్కిరింపుచుండిరి. జోగురాలు జంగము వేదాంతులు బిచ్చమెత్తుకొనుచు దేశాటనము చేసికొనవచ్చునని నిత్యము పరిహసించుచుందురు.

ఆమాటలువిని విరతి యించుకయు మతిచెదరనీయక పాంచభౌతిక వికారమగు కాయమునకు సౌందర్యమననేమి. కులమననేమి? పరమేశ్వరుఁడే భర్త యతఁడే రక్షింపఁగలఁడు. అని తలంచుచు నోరులకేమియుఁ బ్రత్యుత్తరమీయదయ్యెను.

రతియొకనాఁ డశ్వశకట మెక్కి వచ్చి విరతీ? పూవులతోటకు విహరింపఁబోవుదము వత్తువా? నీమగఁ డెందుఁబోయెను? గ్రామముల మీఁది కరిగెనాయేమి? గంట వాయించగలవా? శంకుబూరింతువా! వేదాంతురాలవు. నీమడికి సరిపడిన మగఁడు దొరికెనులే వేదాంతాభ్యాసమున కిదియే ఫలము అని వెక్కిరించిన విరతి నవ్వుచు నీది జవ్వనము క్రొవ్వు. యుక్తాయుక్త వివేకము గలుగనీయదు అక్కా ఈ యౌవనము ఈసంపదలు ఈదేహము జూచుకొని మురిసెదవేమిటికి? ఇవి క్షణభంగురములని తెలిసిన నిట్లు విఱ్ఱవీఁగవుగదా! అయ్యో అమ్మ పాలుద్రావియు మీరిద్దరు నింత దుష్టస్వాంతులైతిరేమి? జ్ఞానలవశూన్యలై ప్రాజ్ఞుల నాక్షేపించుచున్నారు. వేదాంతముమీకు హాస్యాస్పదమైనదా అక్కటా! మీకొరకే నేను బొక్కుచుంటి పోపొమ్ము. మగనితో నీవు సుఖించుట నాకుఁ బరమసంతోషము అని పలికిన నులుకుచు నక్కలికి మఱల మఱల నెత్తిపొడుపుమాట లాడజొచ్చినది. ఇరువురకు వాదము జరిగినది.

అప్పుడు రాజపత్ని రతి నాక్షేపించుచు నవ్వినయూళ్ళె పట్టణములగును ఎవరినొసట నేమి వ్రాసియుండినదో యెవ్వరికిఁ దెలియును? తొల్లి శర్యాతికూతురు సుకన్యయను పతివ్రత శతవృద్ధుడైన గ్రుడ్డితపసిం బెండ్లియాడి యింద్రభోగంబుల నందలేదా విరతి యునట్లె సుఖింపఁగలదు నీవు వేగిరపడకుమని రతి నాక్షేపించి మంద

లించినది. మఱియొకనాఁడు కుశుఁడు సుకుమారు నేకాంతముగా జీరి బావా! యీజంగమదేవర మూలమునమనకపకీర్తి గలుగుచున్నది. ప్రతిసభకు వచ్చిమనతో సమముగాఁ గూర్చుండును. మాతండ్రికి వానియందు బ్రేమగలుగుటంబట్టి యేమాట యనుటకు వీలుపడకున్నది. యీయవమాన మెట్లయినవదలు నుపాయమాలోచింపవా? అని అడిగిన సుకుమారుండిట్లనియె.

అయ్యో! నీవు రాఁబోవు ననర్థమెఱుంగక సమాన ప్రతిపత్తిఁ గలుగుచున్నదని వగచుచున్నావు. వినుము మీతండ్రి విరతికి మగనికి సర్వరాజ్యము వ్రాసియిచ్చుటకు నిశ్చయించుకొనియెను. మొన్న పండితుల రప్పించి ధర్మశాస్త్రములు విప్పించి యా ప్రశంస దెలిపెను. వారు కూఁతున కెంత యిచ్చినను నీయవచ్చునని చెప్పిరి. ఈప్రశంసను నీకుఁ దెలియకుండఁగనే చేయుటకు నిశ్చయించుకొనియెను. లవునిభాగము జంగమదేవరకిచ్చునఁట తెలిసినదియా? అని చెప్పినఁ గుశుఁడు విభ్రాంతుడై యేమీ! మీరాజ్యమవిభాజ్యముగాదా? ఒకరికిచ్చుటకుఁ దనకేమి అధికారమున్నది? అందులకు ధర్మశాస్త్రములొప్పుకొనునా! అని అడిగిన నతండు చట్టములు చూచియే యిచ్చుటకు నిశ్చయించుకొనెను. అతండిచ్చిన నీవేమియుఁ జేయజాలవని చెప్పెను.

అప్పుడించుక యాలోచించి కుశుండు బావా! ఇందులకు నీవు సహాయము జేయవలయును. ఈపని జరుగకుండ వేరేదియేని యుపాయము జెప్పవలయును. మాయన్న లవుని మాయజేసి దేశాంతరమనిపితిని పీండ్రంగూడనట్లు చేసితిమేని మన కోరిక యీడేరును. ఇందులకుపాయమాలోచించుమని సూచించిన విని సుకుమారుం డిట్లనియె.

నీకుఁదెలియని యుపాయములుఁలేవు అన్నను సాగనంపినట్లె వీరిద్దరిని దేశముల పాలుసేయుము. రాజు విరక్తుఁడై యేమిజేయఁగలఁడు? రాజ్యమంతయు నీకే దక్కఁగలదని చెవిలో నేదియో చెప్పెను. కుశుఁడు మిగుల నానందించుచు నట్లు చేయుటకు సమ్మతించెను.

మఱికొన్నిదినముల కొకనాఁడు విరతి మహారణ్యమధ్యమున నొకచెట్టు కింద పరుండి లేచి కన్నులఁదెరచి అహో? ఇదియేమిమాయ అంతఃపురమేమైనది? ఇది కల కాదుగద అడవిలో నుంటినేమి? అని వెరగుపాటుతో నలుదెసలు పరికించెను. సూర్యుఁడు నాలుగుబారలు పైకిఁ బ్రాకెను ఇంకను వసుణకాంతులగానే యుండెను. డి గృహమెండి అయ్యబాబో యోహో ఇది స్వప్నముకాదు. పరమేశ్వరుని యింద్రజాలము. ఇదియే మహామాయ. యేమైన నాకేమి? వినోదములు జూచెదంగాక పరమేశ్వరుని సృష్టివైచిత్ర్య మమ్మహాత్మునిశక్తి విశేషమును దెలుపుచున్నది. అని

తలంచుచు విరతిలేచి నాలుగడుగులు దూరము నడిచినంతఁ గొంతదూరములో సుగతుఁడు తనకభిముఖముగా వచ్చుచున్నట్లు గ్రహించినది

ముక్కుపై వ్రేలిడుకొని జగదీశ్వరా! వింతలపై వింతలు చూపుచుంటివే మాకద్దాంతమే కాంతారమైనదా! మా తల్లియేది? ఆమెయే ఈమాయ నాకుఁ జూపుచున్నదా. ఏదియెట్లయినను సరియే చూచుచుండెదనని తలంచుచుండ నతండు ఆమె దాపునకు వచ్చెను. అతండు మంగళసూత్రము కట్టుటయేకాని అంతకుమున్నామెతో మాట్లాడియుండలేదు. కావున బెదరుగదుర రాజపుత్రీ మనమిక్కడికెట్లు వచ్చితిమని యడిగెను. ఏమో తెలియదు భగవంతుని విలాసమని హస్తసంజ్ఞ చేసినది. కాని యేమియు మాటాడలేదు. ఆసన్న గ్రహించి యతండు మరుమాటపలుకక యామెతో నడుచుచుండెను. పోయినకొలంది మహారణ్యమేకాని తెరిపి యేమియుఁ గనంబడలేదు గ్రామసంచార యోగ్యములైన పశువులు, పక్షులును, మృగములు నందేమియుఁ గనంబడలేదు. విరతిమతి భీతి యున్నట్లే లేదు. విరతి యెటుపోయిన సుగతుండటుపోవుటయే గాని తాను మార్గదర్శికాఁడు ఇరువురకు సంభాషణలేదు. మూఁగవాండ్రవలె నడుచుచుండిరి. అట్లు పోవంబోవ దినమణి గగనార్ధం బాక్రమింప నెండవేడిమి సైరింపక నిలువఁదగునీడతలం బరయుచుండ నొకదండఁదారి దఘ్నంబైన హ్రదంబొండువారి కన్నులం బడినది.

పిపాసాలసులైన యాదంపతులకు యరసినంతనే జీవనప్రదమైనది జీవనప్రదమైన నెట్టి యానందముగలుగునో తెలియదు. ఆకూపంబు తొంగిచూచిరి జలంబులు లోతుగానున్నవి. అత్తోయంబు ద్రావు నుపాయంబుగానక తొట్రుపడుచున్న సుగతుని దైన్యంబు విలోకించి అక్కలికి యందున్న చిటితాటియాకుఁ జీరి త్రాడువలెగూర్చి యతని చెంతనున్న గంటచిప్పి యచ్చుబిగించి నీటఁదోడి వానికి బోసినది.

అతండు పడిగంటల నీరు ద్రావెను. ఆమెయు దప్పిదీరునట్లు జలపానము గావించినది. పిమ్మట నానూతిచుట్టు తిరిగి అందలి వితలం జూచుచుండఁ బిశాచభాషతో నొకశిలపై నీక్రిందిరీతిశాసనము చెక్కఁబడియున్నది. పిశాచభాష విరతి చదివియున్నందున నాశాసనము నందలి విషయంబుల నిట్లు చదివినది.

ఈ ప్రాంతమందున్న కీలకపర్వతమందు చండవేగుఁడను భూతరాజు భార్యతోఁ గాపురము చేయుచున్నాఁడు. అతం డర్ధరాత్రంబున నిందలి శిలాఫలకంబునం గూర్చుండి మాంసాహారము భుజించి కూపోదకమంతయు దృప్తిగా గొట్టుకొనగ్రోలెడివి. జలశూన్యమైన నూతిలో మెట్లు గనంబడును. వానిదిగిపోయినఁ బాతాళలోకమునకుఁ బోవుదురు. మనుజుఁ డుదయమునకు యథాప్రకారము జలమూరి నూయి

నిండును. అప్పటప్పుడీ భూతదంపతులు పాతాళమున కీదారిం బోవుచుందురు. ఈ ప్రాంతమందు రాత్రుల మనుష్యులు నిలువఁగూడదు. నిలుతురేని వారలకు కబళము లయ్యెదరు.

అని పిశాచభాషలో వ్రాయఁబడియున్నది. ఆలిపిఁజదివి యమ్మదవతి ముదము జెంది యా ప్రాంతమందున్న యొక చెట్టుక్రిందఁ బండుకొని తత్సమయ మరయుచుండెను. సుగతుండును వెలగపండ్లు కొన్ని కోసికొనివచ్చి తాను దిని కొంతయాకలి యడగించుకొనియెను.

విరతి యొక్కటియుఁ దిననదికాదు. సుగతుఁ డామె వసించిన చెట్టుక్రిందనే దానును వసియించెను. సుగతునకు శిలాశాసనవిషయము లేమియుం దెలియవు. క్రూరమృగములేవైన వచ్చునప్పుడు గంట వాయించి శంఖమూదువాఁడు. అందుకు జడిసి యవిపారిపోవుచుండునవి.

అవి చీఁకటిరాత్రులగుటఁ గాటుకపూసినట్లు దెసలెల్ల నంధకారమయమై యున్నవి. సుగతుండు వెంటనే నిద్రపోయెను. విరతి నక్షత్రగమనము పరీక్షించుచు నిద్రపోక భూతాగమనకాల మరయుచుండ రెండుజాములైనది. అప్పుడు పొలసు కంపుగొట్టినది ఆవాసన తగిలినంత నాకాంతకు స్వాంతమునఁ బెదురుపోవనది మనంబున బెక్కులూహలు తోచినవి. అయ్యో! ఈసుగతుఁడు నావలన నించుకయు సుఖ మెరుంగకున్నను విశ్వాసముగలవాఁడుంబోలె వెనువెంటఁ దిరుగుచున్నాఁడు. వీనికి లోకానుభవ మంతగానున్నట్లు తోచదు. నావలెఁ దానును మౌనముద్రయె బూని యుండెను. కాని నన్నేమియు బల్కరించదు. నాచావునకు నేను వగవను గాని నాకతంబున నీకడిందు సమయగలఁడు. అది నామది నొవ్వఁజేయుచున్నది. ఆభూతము నన్నుఁ జంపి వీనిని విడిచినఁ గడు సంతసింతును. అట్లుచేయఁడు. అయ్యో! వీనికి సంగతియైనఁ జెప్పితినిగానే పాపము గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచున్నాఁడు. ఆ భూతమునచ్చి కంఠము నులిమి చంపును గాబోలు హాహా! ఎంత పాపాత్మురాల నైతిని. అని పరితపించుచు మఱియు నిట్లు తలంచెను.

ఇసిరో! నేనెంత వెఱ్ఱియూహ చేయుచుంటిని. విధికృతములు నాపైనారోపణ చేసికొనుచుంటినేమి? ఈ కల్పన జేసినవాఁడెవ్వఁడు? నన్నీ అరణ్యమధ్యమునకుఁ దీసికొనివచ్చినవాఁడెవ్వఁడు? వాని యుద్యమమేమియో తెలియదు. మాచరిత్రమింత టితో ముగించునో పెంచునో యెఱుక పడదు. జరుగునది చూచుచుండుటయే నాపని. అని తలంచుచు మొదటఁ గలిగిన భయమును జింతయుఁ బాపికొని యా పొన్న కొమ్మ కొమ్మల సందునుండి వానిరాక నరయుచుండెను.

అంతలో నాపర్వత ప్రాంతమునుండి గండశిలవంటితలయు గిహ్వారమువంటి వదనబిలము గుహాబిలమునుండి ప్రవహించుచు రక్తప్రవాహమోయను భ్రాంతి గలుగఁజేయు నాలుకయు వాడికోరలు జుంజురు వెండ్రుకలు పొట్టిచేతులుంగలిగి తాళద్వయో చ్ఛాయకాయముతో బొబ్బలిడుచు వచ్చుచున్న యాభూతరాజు విరతి కన్నులం బడియెను. చీకటికి వాని మేనికాంతికి నించుకయు భేదములేదు. కోరల తెలుపును, నాలుక యెఱుపునుంబట్టి శిరంబు గ్రహింపఁబడినది వాని వికృతాకారము జూచి యాచిన్నది కన్నులుమూసికొన్నది. అంతలో మరలఁజూచినంత నావికృత రూపము కొంతతగ్గినది. చేరువకు వచ్చినకొలంది వానియాకారము హ్రస్వమగు చుండెను. తుదకా శిలాఫలకము చెంతకు వచ్చునప్పటికా భూతమొక సామాన్యమాన వుఁడువలెఁ గనంబడెను.

అభూతరాజు శిలాఫలకముపైఁ గూర్చుండి ప్రేయసీ! ప్రేయసీ! యెందు న్నావు ఇంకను వచ్చితివికావేమి యని పిలిచెను. నూతిలోనుండి వానిభార్య గొట్టము పైనున్న మెట్లెక్కివచ్చి ప్రాణనాథా! నేడు జాగు చేసితిరేల? మీరు రాలేదుగదా! ఊర కుండనేల? జలజంతువులేమైనం దొరకునేమోయని నూతిలోనికిం బోయితిని. ఏమి యుం దొరికినదికావు మీరాహార మేమి తెచ్చిరి? నరమాంసము లభ్యమైనదియా? యని యడిగినది

అతండు పక్కున నవ్వుచు అవ్వసీ! నేకు ఒట్టుపెట్టినట్టేమియుం దొరికినది కాదు. నరమాంసమటుండనిమ్ము. కుక్కమాంసమైనదొరకలేదే! ఇదియేమిచిత్రము; నీవేమైన సంగ్రహించిన మాంసమున్నదేమో తీసికొనిరమ్ము కడుపు మండిపోవు చున్నది. ఇట్టియాకలి యెప్పుడు వేయలేదు. రామరామ యేతాటిచెట్టు చెంతకుఁబోయి నను వట్టికుండలే దా? నాలుక తడుపుకొనుటకైనఁ గల్లుచుక్క దొరకినదికాదు అని చెప్పిన వాని భార్య నిట్టూర్పు నిగుడించుచు నిట్లనియె.

అయ్యో! మీరు ఆహారము తీసికొనివత్తురనిగంపెడాసపెట్టుకొని యుంటిని, అదియేమిపాపమో నాకును నేడే యాకలి పెద్దగానున్నది. ఏదియును దొరకక పోవు టచేతఁగాఁబోలు ఏమి చేయుదము? నూతిలో నీళ్ళుగలవుగదా కడుపునింద గ్రోలుదము అనియుత్తరమిచ్చినది.

అక్కటా! వరగడుపున వట్టి నీరు నోటికిఁ బోవదుగదా! మట్టి యేమాంసమైన వెదకి తీసికొనివత్తు. నీపుణ్యము అని దీనస్వరముతోఁ బ్రతిమాలికొనిన విని యాభూత కాంత మనోహరా! మనభయంబున పశుపక్షిమృగాదులీయడవిలో వసింపవుగదా! ఇం దెక్కడ మాంసము దొరకును? మీకంతగా నాకలియగుచున్నచో నన్నుఁజంపి నామాంసము భక్షింపుడు అని పలికినది.

ఆమాటవిని ఛండవేగుఁడు చెవులు మూసికొని ప్రేయసీ! అట్టిమాట పలుక వచ్చునా? నీ రక్తంబున శరీరము నిలుపుకొని పిమ్మట నేనేమిచేయుదును? ఎవ్వరిఁ జూచి సంతోషింతును? ఇట్టిమాటయెన్నడును బలుకకుము. ఒకరేయికే తాళలేమా యేమి? అని చెప్పుటయు నాభూతకాంత పోనీ! మాయడవిఫలములు చాలగలవు తీసి కొని వత్తునా! అనుటయు నతఁడు సీ! మునులవలె ఫలములుతినమా! అవి జీర్ణము కావు వాని దినిన నాకు వమనము వచ్చును వలదు వలదు. విశ్రమింపుము నీయాకలిమాట యేమి? అందులకు వగచుచున్నాను గదా రెండు దినములెట్లో దాటుము నరమాంస రక్తసముద్రము పొంగిరాఁగలదు. అప్పుడు కడవంతో రక్తము ద్రావవచ్చును. అని నొడివిన విని యాభూతవనిత యిట్లనియె.

మనోహరా! అట్టి సంతర్పణము మనకెట్లు కలిగెడిది? పుడమి జనక్షయకరమగు నుత్పాత మేదియైనఁ బొడమఁగలదాయేమి అని యడిగిన నతండు కాదు కాదు. ఒక తరుణి మూలముగా నిరువురు మహారాజులు సంగరమున కాయత్తపడుచున్నారు. ఉభయసైన్యములు వ్యూహములఁబన్నియున్నవి. ఎల్లి శుభముహూర్తంబునం గలియఁ బడఁగలవు వేనవేలు జనులు చత్తురు మనకుఁ గావలసినంత రక్తమాంసమేదస్సంచ యము దొరకగలదు! అని నోరూరఁ గంతులువైచుచుఁ జెప్పుటయు భూతకాంత మగనిహస్తములు గైకొని సంతోషముతో వింతగా నాట్యము చేయఁదొడంగినది. ఇరువురు కొంతతడవు గంతులువైచి కూర్చుండిరి.

అప్పుడు భార్య భర్తతో మనోహరా! ఆహారములు లేకపోవుటచే నేఁడు మన కేమియుఁ బనిలేదుగదా ఒక యువతి మూలమున రాజులు పోట్లాడుచున్నారని చెప్పి తిరి. ఆకాంత యెవ్వతె? ఏమిటికిఁ బోట్లాడవలసివచ్చినది? అరాజులెవ్వరు? వివర ముము నాకథ యెఱింగింపుడు సావధానముగా నాకర్ణించెద నుబుసుపోకున్నదని యడిగిన నతఁడు బోఁటీ! ఇది కడువిచిత్రమైనకథవినవలసినదే చెప్పెద వినుము. అని చెప్పఁదొడంగెను.

## 134 వ మజిలీ కథ

## సురసకథ

దేవయజనమను అగ్రహారమున అగ్నివర్మయను బ్రాహ్మణుఁడు గలడు. అతండు వేదవేదాంగములం జదివి విధిక్రమంబున అనేక యాగములుజేసి శ్రోత్రి యులలో నుత్తముఁడని పేరుపొందెను. అతనికి లేకలేక సురసయను కూఁతురొక్క రితె వార్ధక్యంబున నుదయించినది ఆ చిన్నది మిక్కిలి చక్కనిదగుట దగిన వరుని కొఱకు అగ్నివర్మ అధిక ప్రయత్నము జేసిజేసి విద్యారూప యౌవనధన సంప

న్నుఁడైన ప్రియవరుఁడను విప్రకుమారునికిచ్చి వివాహముగావించి యల్లునిఁ దన యింటనే యుంచుకొనియెను.

కాలక్రమంబున సురస మేనయౌవనము పొడసూపినది. నాళికశరుండు ప్రీతి కంబులం బ్రవేశించి వింతకాంతి గలుగఁజేసెను. వదనేణీధరంబునఁ బూర్వకాయంబు గ్రింనం బొడిముముడతలోయన వళిత్రయంబు చిత్రగతిం బ్రకాశించెను. స్తనజఘనం బులు ఘనంబులై విజృంభింప మధ్యంబితరాభివృద్ధి జూచి యోర్వక స్రుక్కెనోయన దృశ్యాదృశ్యంబై యొప్పె. నెప్పుడు నితరులంజూచి యోర్వనివారు క్షీణింపకుందురా? సర్వావయవసుందరయగు నమ్మగువ తొలి జవ్వనంబునఁ బూవిల్లుని వలికెవోలె సర్వజన మోహనంబై పిరాజిల్లెను.

సురస మనోహరుండగు ప్రియవరుండు రసిక ప్రియవరుండగుట నిజవధూ ప్రవేశ మదన ప్రవేశం బరసి యాసరసిజాననం గూడ దొందరపడుచుండెను. అగ్నివర్మ యుఁ బుత్రికాగాత్ర వికాసఁ దెలిసికొని విధిక్రమంబున శుభముహూర్తమునఁ బ్రథమ క్రీడామహోత్సవంబు గావించెను.

నాఁటిరేయి సురసను గనగ్రైవేయ మణి భూషాంబర విశేషంబుల నలంకరించి సఖీజనంబు శోభనగృహంబున కనిపి పూసెజ్జం బతి పజ్జం గూర్చుండఁబెట్టి గంధ ములు పూయించుటయుఁ మాలికలు వైపించుటయు నత్తరు రాయించుటయుఁ బన్నీరు జల్లించుటయుఁ దాంబూలముల నిప్పించుటయు లోనగు శృంగారలీలల గావింపఁజేసి తలయొక నెపంబున నవ్వలికిఁబోయి తలుపు బిగించిరి.

సురసయుఁ దటాలున శయ్యనుజికి తలుపుమూల దాగినది. తోడనవచ్చి ప్రవ రుం డచ్చిగురుఁబోడింకౌఁగిటఁ గ్రుచ్చి తల్పంబునంజేర్చి చిట్టకంబులంగావింప నిట్టట్టు కొనుచుఁ గన్నీరు గారవెక్కి వెక్కి యేడ్చుచు సురస విరసత్వంబు జూపిన నలిగి అతండు విడుచుట యునప్పుడతిఁబుడమిబండుకొనియేడ్చుచుండెనింతలోఁ దెల్లవారినది.

చెలులు మూగికొని కసరుచుఁ జాలుదాలు నీయల్లరియంతయుం దెల్లమైనది నీయాగడము తల్లికిం జెప్పెదముసుమీ?

చ. చదివితి వెంతయేని నెఱజాణవు పెద్దరికంబుమీర నా
ప్పిదముగ మాటలాడి వెరపించెద వౌండ్లను దప్పుజూపి తె
ల్పెదవు పతివ్రతా సుగుణవృత్తుల నింతకుఁ బూర్వ మిప్పుడో
మదపతి యెందుదాచితివి మాకడఁ జెప్పెదు నీతులన్నియున్.

క. చెలినీవు నిన్నరాతిరి
చెలువునికడఁ జేసినట్టి చేష్టలనెల్లన్

వెలినుండి చూచితిమి యే
పొంతుఁక యిటువంటి రట్టుటొందిరొ చెపుమా.

చ. రసికుఁడుగాడొ సద్గుణ విరాజితుఁడై తగఁడో కళాసము
ల్లసితుఁడుకాడొ యౌవనవిలాస విహీనుఁడొ కామశాస్త్ర లా
లసమతికాడొ నీపతి విలాసవతీ! మఱిరాత్రి నేమిటన్
గుసుమశరాసనక్రియలఁ గూడక యొంటిఁ బరుంటి వుర్విపై.

క. ఇల్లరికముండె మగఁడని
యెల్లిదముగఁజూచితేమొ యెఱుఁగము భళిరే
వాల్లభ్యము మేల్ సరసపు
టిల్లాలవు దొరికితివిగదే యాతనికిన్.

గీ. సిగ్గుపెంపున నేనిటు చేసినందు
వేని యది హద్దుమీరిపోయినది ఎందు
తెగినదాకచే ముడివెట్టి తిగియఁదగునె
విఱిగినమనంబు గూర్ప నెవ్వఱితరంబు.

గీ. చిన్నదానవొ నీకంటెఁ జిన్నవార
లెంతలెంతలు గావించి రిట్టివేళ
ముచ్చటయ్యెఁడుగాదె యేమూలవైె
తంగభవశాస్త్ర వేత్తృత్వభంగియెల్ల.

అని మందలించిన సఖురాండ్రనదలించి ప్రత్యుత్తరమీయక యాకుటిలాలక చీకటి సదనంబునం బండుకొనినది. నాఁటి రాత్రి సఖురాండ్రు చక్కఁగా నలంకరించి బుద్ధులుగఱపి యంపిరి కాని యాఁజవరాఁలు తొలిరేయింటోలె వల్లభునిఁజూడక యతని చేష్టల నంగీకరింప విరసత్వంబు జూపిన గోపించి ప్రవరుండు పలుకరింపదయ్యెఁ జెలికత్తె యల్లత్తెరం గరసి యెత్తెరవఁ బలుతెరంగుల మందలించి తల్లికెరింగింప నామెయు నేకతముగాఁ బుజ్జగించియు లాలించియుఁ గినిసియుంజెప్పి ప్రతివచనంబు బడయనేరక యలిగి మూఁడవరాత్రి నల్లునికిం జెప్పవలసిన మాటలంజెప్పి ప్రక్కఁ కనిపినది. ప్రవరుండు తన విద్యాపాటవం బంతయు నాటోటియెడఁ జూపెనుంగాని నించుకయుఁ బతిచెయ్యుల మన్నించినదికాదు.

శ్లో॥ సహసావాప్య పత్నీకాంతా కన్యాచిత్తమ విందతా
భయంత్రాసనం సముద్వేగం సద్యోద్వేషంగచ్ఛతి.

సురసతల్లి కూఁతురు విరథిత్వంబు పతికెరింగించుటయు సతండు అల్లున

కాక శ్లోకము వ్రాసి యంపెను. అతండా శ్లోకము జదివికొని మామగారి యభిప్రాయము గ్రహించి మఱియు నీక్రింది శ్లోకము వ్రాసియంపెను.

శ్లో. ప్రథమ పరిగతాయాం బాలికాయాంచ చేష్టాం
తమశిరహసిబాహూః సంస్తుతాయాంతరుణ్యాం
క్షణమిహపరిరక్ష్యం పూర్వకాయేన కుర్యాత్
ముఖమభివదనేన స్వేసతాంబూలదానం.

ఆశ్లోకము జదివికొని యగ్నివర్మ ప్రపరుండు కన్యావిస్రంభణ ప్రకరణ మెఱింగినవాఁడు వానిలోపములేదు. సురసచిత్తంబునఁగామప్రవృత్తి గలిగినదికాదు. కొన్నిదినములు దనుక దానికి భర్తృసంపర్కము మానిపింపవలయును.

క. వలరసము సతికిఁ బుట్టకఁ
బలిమిని బురుషుండు కదఁగిపై కొనుచెల్లన్
మలయజము సానమీఁదను
జలముంచక తీసినట్టి చందము సుమతీ.

అని భార్యకు జెప్పుటయు నామెయుఁ గొన్నిదినంబులు నిరీక్షించి నడుమ నడుమఁ బుత్రికకు బోధించియు నదుత్తరంబు బడయజాలక నొకనాఁడు భర్తతో నిట్లనియె.

మనోహరా! మన సురసకుఁ బదునెనిమిదేఁడులు దాటవచ్చినవి అవయవ స్ఫూర్తి బూర్తిగా గలిగినది. పురుషాపేక్షయించుకయుఁ బొడమునట్లు తోఁచదు. అల్లుఁడు చాలమంచివాఁడు. ఎన్నిదినములుపేక్షించి యుండును. అతఁడు వేరొకతెం బెండ్లియాడునని నయమున భయమునంజెప్పితిని. అనురక్తియేమియుం గలుగలేదు. ఇంక గలుగునట్లును దోఁచదు. అల్లునిం దెచ్చి యింటఁ బెట్టుకొంటిమి. దౌహిత్రలాభ మాకాశకుసుమమైనది. కూఁతునెట్లు మందలించుకొందురో చూచుకొనుఁడు. అని పలికిన విని శ్రోత్రియుఁడు ఇంచుక ధ్యానించి యిట్లనియె.

ఇఁక మనమెన్ని జెప్పినను దానికిఁ గామగుణము గలుగదు. రూపమా మోహజనకము. ప్రాయమా మొదటిది. బుద్ధియా కడుచురుకు విద్యయా అనపత్యము. ఇట్టి యువతి మగఁడనిన బెగడంపుచుండ నేమనుకొనవలయును.

అది స్వయంప్రభవలె బ్రహ్మచారిణియై యుండును. ఎఱుఁగక పెండ్లి చేసితిమి. పరివరునిం బ్రతిమాలికొనియెదను. మఱికొన్ని దినంబులుపేక్షించి చూడఁ గలఁడు. మనమెట్లు చెప్పిన నట్లు చేయువాఁడే సురసను మందలింపవలదని చెప్పిన నామె యిట్లనియె.

కేవలము విరక్తురాలనైన నేనొప్పుకొనను. మగఁడుతక్క నన్నిటియందు నాసక్తురాలే. దానికిఁ దెలియనిపనిలేదు గ్రంథములన్నియు నన్వయించును. పురాణ గాథలు చక్కఁగా బోధించును. ఒరులకుఁ బతివ్రతాధర్మములు జెప్పును. ఈపురుష ద్వేషత్వము మనప్రారబ్ధము గాఁబోలునని చింతించిన నాబ్రాహ్మణుఁడు పోనిమ్ము దానినేమియుననవలదు. నాకది యారవప్రాణము. అని యుగ్గడించెను. ఆప్రతిత గ్రామమంతయు వ్యాపించినది. సురసకుఁ బురుషవాంఛ లేదని యాఁడు వాండ్రందఱు నిశ్చయపరచిరి.

ప్రవరుఁడు అత్తమామల యాదరము తలంచియు సురససౌందర్యము దలంచియు నాయూరు విడువనేరక యెప్పటికైనను దానికి బుద్ధి తిరుగునేమోయను నాసతో సురస వెనువెనుక దిరుగుచుఁ గాలక్షేపము చేయుచుండె.

అని యెఱింగించి.

## 135 వ మజిలీ.

## అల్పుని కథ

అగ్నివర్మయొకనాఁడు తన వీధిచావడిలోఁ గూర్చుండి కొందఱు శ్రోతలు చుట్టును బరివేష్టింప భారతము శాంతిపర్వము చదువుచు నర్థము చెప్పుచుండెను. అట్టితరి బదియాఱేండ్ల ప్రాయముగలిగి సర్వాంగసుందరుండగు నొక యువకుండు ప్రచ్ఛన్నముగా భూసంచారము చేయుచున్న మదనుండో అన నొప్పుచు ధూళిధూసరిత శరీరుండైనను నలినాంబరధరుడైనను దేజము తొలంగక అచ్చటికివచ్చి అందొకచోటం గూర్చుండి శ్రద్ధాళుంతోఁ బురాణము వినుచుండెను. అందు,

శ్లో॥ గార్హస్థ్యస్యచ ధర్మస్య యోగధర్మస్యచోభయోః?
అదూరసంప్రస్థితయోః కింస్విచ్ఛ్రేయః పితామహ॥

గృహస్థుని ధర్మమునకును యోగిధర్మమునకుఁ జాల వ్యత్యాసము గలిగి యున్నది ఒండొంటికిఁ జాలదూరము వానిలో మోక్షమునకు ముఖ్యమైన మార్గమేది. పురుషుఁడు దేనినాచరించి శ్రేయస్సునఁ బొందునో చెప్పుమని ధర్మరాజు భీష్ము నడుగుటయు నతండిట్టు చెప్పెను.

శ్లో॥ ఉభౌ ధర్మౌ మహాభాగౌ వుభౌ పరమ దుశ్చరౌ
ఉభౌ మహాఫలౌ తౌతు సద్భిరాచరితావుభౌ॥
అత్రతే వర్తయిష్యామి ప్రామాణ్య ముభయోస్తయోః

ధర్మరాజా! గార్హస్థ్యము యోగధర్మముగూడఁ బరమోత్తమములైన ధర్మములు

ఆరెండును మోక్షమునకు ముఖ్యమార్గములు రెండును గష్టపడి యాచరింప దగినవి. రెండును మహాఫలముల నిచ్చునవి. సత్పురుషులు రెండిని నాచరించి ముక్తిని బడసి యున్నారు ఒకదాని కొకటి తీసిపోవదు. అని వానిగుఱించిన యుపాఖ్యానముల నెరింగించి భీష్ముఁడు ధర్మరాజు మనస్సంశయమును బోగొట్టెను.

ఆకథ అంతయు విని యాచిన్నవాడు లేచి అగ్నివర్మకు నమస్కరించుచు మహానుభావా! నేఁడు నామనంబునంగల సందియమంతయుం దీర్చితివి. నేను గృహస్థ ధర్మముకన్న యోగధర్మ మధికమని తలంచువాఁడ. అమృతప్రాయమైన పురాణ వాక్యము వినిపించి నా సందియముదీర్చితివి. సంతోషమైనదని స్తుతియించుచున్న వానింజూచి అగ్నివర్మ బాలుఁడా! నీదేయూరు? నీపేరేమి? కులమెయ్యది? ఎందుబోవు చున్నాడవని అడిగిన వాఁడిట్లనియె.

అయ్యా! నాపేరల్లుఁడందురు. నాతలిదండ్రులెవ్వరో యెఱుంగను. కులగోత్ర ములు మునుపే తెలియవు. ఏకాకినై తీర్థయాత్రలు సేవింపుచున్నవాఁడ. నేఁడు మంచి వాక్యము లుపదేశించి శ్రోత్రానందము గావించితివి. కృతార్థుఁడనైతినని పొగడుటయు నాభూసురుండు వానిసుగుణసంపత్తికి సంతసించుచు బాలుఁడా. నీమాటలు విన విర క్తుండవుపలెఁ గనంబడుచుంటివి. నీకుత్సాహమేని కొన్నిదినంబులిందుండి పురాణము వినుచుండుము మఱియు నీమనస్సందియములన్నియుఁ దీరఁగలవు. మాయింటఁ గుడు చుచు నీయిచ్చవచ్చినన్ని దినములుండుమని పలికిన విని సంతసించుచు నా అల్లుఁడు వారింటనుండి పురాణమువినుచు శ్రీశుకుఁడోయనఁ జూపునారలకుఁ బోచుచు గొన్నిదిన ములు గడిపెను.

ఒకనాఁ డగ్నివర్మ కూఁతురు సురస కుతపకాలంబున నెండలో నూరుచ కించుకయెడముగానున్న నూతికి నీరుదేరనరిగి కొంతసేపటికిఁ దలవిరియఁబోసికొని యొడలు జీరికలతో భీభత్సవేషముగాఁ గోలున నేడ్చుచు నింటికివచ్చి తండ్రి పాదం బులంబడి గద్గద స్వరముతో నిట్లనియె

తండ్రీ! నీవుపండితుఁడవే కాని లోక జ్ఞానము లేనివాఁడవు అల్లుని కులశీ నామంబులు దెలిసికొనక యింటం బెట్టికొంటివి. అల్లుఁడల్లుఁ డేయయ్యెను. వాఁడు పట్టిటక్కరి ఆసిచుఁడు నన్నుఁ గామించి తిరుగుచున్న వార్త నాకుఁ దెలియదు. నేను బిందె తీసికొని మంచినీటిబావికిఁ బోయితిని నావెనువెంటవచ్చి నేను నీరుతోడుచుండ జవ్వనీ నీవుమృదువైనదానవు. నీచుతోడిన నీచేతులు కందఁగలవు నేను దోడెదఁ జేద నిమ్మని అడిగెను. నేనామాటవిని విశ్వాసమున కట్లనుచున్నాడని తమ్ముఁడా వలదు. నాకు దీనశ్రమలేదు ఎండలోవచ్చితివేల? ఇంటికిబొమ్మని చెప్పితిని.

వాఁడు కదలక యిటునటు చూచుచు నెంతలో నితరులం దెవ్వరు లేకపోవుట నవసరమెఱింగి తరుణీ! నీమగఁడిందున్న వాఁడుగదా. నీకతనియం దిష్టములేదని విన్నాను. శుష్కోపవాసములచే నీ యౌవనమిట్లు పాడుచేసికొనుచుంటివేల? నిన్నుఁ జూచఁజూచి నాయెడద జాలిగలుగుచున్నది. గతించినయౌవనము తిరిగి రానేరదు. ఈపరువ మంతయు రిత్తవోసి చెడిరక్తిఁ దిరుగుట లెస్సగాదు. అని యేమేమో యసంబద్ధ ప్రలాపములాడి తుదకుఁ దన్నుఁగూడుమని పలుకుచు దాపునకువచ్చి చేదఁబట్టికొని గౌఁగలింపఁబోయెను.

తండ్రీ! పైవార్త నీతో నేమనిచెప్పుదును కొప్పుపట్టుకొని నడుమువిరిగి చేతుల లాగుచుఁబెక్కుచిక్కులం బెట్టెను. కేకలువైచితిని. దాపుననెవ్వరునులేరు. పెద్దతడవు నకుఁ జేతిపట్టుకప్పించుకొని యెట్లో పారిపోయివచ్చితిని. నాయొడలంతయు నెట్లు చీరెనో చూడుము నాప్రారబ్ధము, పరపురుషునిచే నిట్టియలయిక బొందింపఁబడితిని. ఇఁక నాదేహము కాల్పనా అని పలుకుచు నేకువఁబొరలంగినది.

ఆమాటలువిని అగ్నివర్మ ఆ? ఏమి? అల్పుఁడే నిన్నట్లుచేసినది? ఔరా? ఎంత టక్కరివాఁడు. భారతమువినుచు వేదాంతగోష్ఠి వచ్చినప్పుడు కన్నులు నానందబాష్పములఁ గార్చుచుండునే. సెబాసు అల్పుఁడా! గురుపుత్రినే పట్టనెంచితివిరా! కృతఘ్నా! అని తిట్టుచు తల్లీ! ఈఎండలో నొంటిగా దూరముంచున్న నీటికేమిటికిఁబోయితివి? నీవఱిగినది మీయమ్మయెఱుఁగదఁటే. కానిమ్ము ఆతుచ్ఛుఁడెందున్నవాఁడో చెప్పుము. వానినిప్పుడే కట్టి అధికారి కప్పగించెదనని అడిగిన నాపడఁతి యిట్లనియె.

తండ్రీ! వాఁడు నన్నుఁ బరిభవించి నాచేఁ దిరస్కరింపఁబడి యాతోఁటదెసకుఁ బారిపోయెను అప్రాంతమందే యుండునని యెఱింగించిన విని అతండట్టిలేచి దుడ్డుకఱ్ఱ చేతంబూని విద్యార్థుల వెంటఁబెట్టుకొని యాతోఁట వైపునకఱిగి నాలుగుదెసలు పరికించెను.

ఒక పొలములో నొకచెట్టుక్రిందఁ గూర్చుండి యేదియో ధ్యానించుచున్న అల్పునింజూచి యగ్నివర్మ కోపావేశముతో కృతఘ్నా! ఇన్నిదినములు మాయింటఁ గుడిచి నాపుత్రికఁబట్ట నుద్యోగించితివిరా. ఛీ! ఛీ! నీమొగము జూచిన మహాపాతకము రాఁగలదు. మన్మథునివంటి పెనిమిటి మొగమే చూచినదికాదు. ఆజన్మబ్రహ్మచారిణి నాకూఁతు నియమము నీవేమెఱుంగుదువు నిన్నువలచు ననుకొంటివిరా మూఢా! నీనక్క వినయమునుజూచి నిన్ను విరక్తుఁడవనుకొంటి ద్రోహుఁడా! అని యెన్నియో నిందావాక్యములాడిన విని యల్పుఁడేమియు మాటాడక తలవంచుకొని కన్నీరు విడువఁ దొడఁగెను

బెల్లము గొట్టినరాయివలె మాట్లాడక యేడ్చుచుంటివా! అని అగ్నివర్మ దుడ్డుకఱ్ఱతో వానినెత్తిమీదగొట్టిన గాయమై రక్తముగారఁజొచ్చినది. విద్యార్థులు భయపడుచు నారక్తమద్దియద్ది కట్టుకట్టి వెలి యెట్లో యాగకుండునట్లు మాటుపెట్టిరి. అల్లుఁడు గంటుబాధ యెక్కుడుగానున్నను లెక్కసేయక వారిమాటలకేమియు సమాధానము జెప్పక మౌనముద్రవహించి యుండుటఁజూచి అగ్నివర్మ యానతిపై విద్యార్థులతని జెక్కలుగట్టి గ్రామాధికారియొద్దకుఁ దీసికొనిపోయి వాఁడు చేసిన యపరాధమంతయుం జెప్పి వానికి దగిన శిక్షవిధింపుమని కోరిరి.

అగ్రహారాధికారి తనబుద్ధిబలమంతయు వినియోగించి యాయభియోగము విచారించి డోలాయితహృదయుండై యేమిచేయుటకుం దోచక యేదియో తీరువ్రాసి తనపై అధికారియగు మండలాధిపతి యొద్దకనిపెను. ఆమండలాధిపతియు నాయభియోగమంతయు విమర్శించి కర్తవ్యాంశము గ్రహింపనేరక అప్పుడు రాజుగానున్న దేవవర్మ అను నృపతియొద్ద కనిపెను.

ఆదేవవర్మ యొకసామంతరాజు మణిచక్రమను నగరంబున కధినాయకుండై న్యాయంబునఁ బ్రజల బాలింపుచుండెను.

అతనిదేశము చిన్నదైనను దాను సామంతరాజైనను బ్రజాపాలన కౌశల్యంబునంజేసి అతనికీర్తి దిగంతవ్యాప్తమైనది. అతండు దండ్యులవిడువకుండ నదండ్యుల శిక్షింపకుండ నపరాధముల విమర్శింపుచుండెను. స్వల్పాపరాధమైనను బెద్దగా విచారించి నిజముదెలిసికొని శిక్షలు విధింపుచుండును.

ప్రభువ ననుసరించియే క్రిందియధికారులు జాగరూకతతో నభియోగములు విచారించి యపరాధులనేకాక యసత్యసాక్షులఁ గూడ శిక్షింపుచుందురు. దానంజేసి అసత్యాభియోగములు సాధారణముగా న్యాయస్థానములకుఁ దేనేరరు తెచ్చినచో దాని మూలకందకముత్రవ్వక యధికారులు విడువరు.

ఒకనాఁడు దేవవర్మ పేరోలగంబుననుండి అభియోగము విచారింపుచుండెను. మంత్రి అగ్నివర్మదెచ్చిన యభియోగపత్రికలఁ జేతంబూని చిరునగవుతో రాజుంజూచి దేవా! ఇదియొక వింతయగుతగవు గ్రామాధికారియు మండలాధిపతియు, నిందలి నిజంబు దెలిసికొనలేక వారు తీరుపుజెప్పక మనయొద్ద కనిపిరి. దేవర చక్కగా విచారించి నిజము దెలిసికొనవలయునని పలికిన విని రాజు విస్మయ మభినయించుచు న్యాయవేత్తలిరువురకును దెలిసినదికాదా. దాని ప్రచారమెట్టిదో చదువుమని అడిగిన నతండిట్లు చదువుచున్నాడు.

దేవయజనాగ్రహారము కాపురము. పవిపరునిభార్య సురస (వాది) అగ్నివర్మ (అనువాది) అల్లుఁడనువాఁడు (అపరాధి)

అగ్నివర్మ తనయింట భారతము జదువుచుండగాఁ నల్పుఁడను వాఁడువచ్చి వారింటనుండుటయు సురసను వరించి బావియొద్ద బలవంతము జేయుట నల్పుని బలవంతమునగట్టి గ్రామాధికారి యొద్దకు దీసికొనివచ్చి వానియపరాధ మెఱింగించుటయు లోనగు విషయంబులన్నియుఁ జదివి వినిపించెను.

గ్రామాధికారి తీరుపు.

వాది ప్రతివాదులిద్దరు చక్కనివారు. యౌవనవంతులు ఇరువురు శృంగారలీలా విరతులగుట కేమియు సందియములేదు. వాదిమాట నిటుండనిండు. అనువాదియగు నగ్నివర్మ శ్రోత్రియుఁడు. అసత్యమాడువాఁడుకాడు. అతని మాటలన్నియు నమ్మఁదగినవియే. మఱియు సురస ఆజన్మశుద్ధురాలని గట్టి ప్రతీతి గలదు. ఇన్నియుం దలంచి యాచిన్నవాని మొగముజూచినంత నాస్వాంతమున వాఁడు నిరపరాధి యని గట్టిగాఁ దోచుటంజేసి పుత్రియపక్షపాతియగుట నగ్నివర్మ అందుకు స్త్రీస్వభావమగుట సురసయందును దోషమాపాదించుకొని వాని శిక్షించుటకు నిర్ధారణ చేసికొన లేకపోయితిని. అపరాధియగు నల్పునకెదెస సాక్ష్యమేమియు లేకపోవుటచేత వాని విడిచి సురసను శిక్షించుటకు వీలుపడినదికాదు. కావున నీయభియోగమున సత్యాసత్యముల నిశ్చయించు సామర్థ్యము నాకు లేకపోయినది దేవర విచారించి చిత్తానుసారము గావింప ప్రార్థించుచున్నవాఁడ అని వ్రాసి యాగ్రామాధికారి మండలాధిపతియొద్దకా అభియోగమును బంపివేసెను.

అని చదువుటయు దేవవర్మమొగము జేవురించి గ్రామాధికారి యింత బుద్ధి సూన్యుఁడయ్యెనేమి? అగ్నివర్మ సత్యసంధుఁడనియు సురస ఆజన్మశుద్ధురాలనియు వ్రాయుచు నల్పుని మొగము జూచినంతనే వాఁడు నిరపరాధియని తోచినట్లు వ్రాసి యున్నవాఁడు వానికెదెస సాక్ష్యమేమియు లేదట నిరపరాధత్వము మొగమున వ్రాయఁబడి యుండునా యేమి? ఛీ, ఛీ, గ్రామాధికారి శుద్ధబుద్ధివిహీనుఁడు శ్రోత్రియపుత్రికం గవయదలంచిన పాపాత్ముని చేతులు తఱిగింపక కాలయాపనముగాఁ బై అధికారి యొద్ద కనిపెనా! చాలుఁజాలు ఏవీ అల్పుని వాంగ్మూల మెట్లున్నదో తీసి చదువుము. అని చెప్పిన విని బాంత్రి చిత్తము చిత్తమని యాపత్రికనెత్తి యిట్లుచదువుచున్నాడు.

నాకులగోత్రములు నాకుఁ దెలియవు. నాతలిదండ్రు లెవ్వరో నేనెరుఁగను నాజన్మభూమి తెలియదు. నేనొక సన్యాసివంటివాఁడ నాకు నల్పుఁడను పేరు తలిదండ్రులు పెట్టినదికాదు. నరమృగ పశుపక్షి క్రిమికీటకాదుల కంటె నల్పుండనని తలంచి యల్పుఁడని నేనేపేరు పెట్టుకొంటిని. భారతమువినుచు నీవిప్రునింటఁబదిదినములు నివసించితిని. ఆ బ్రాహ్మణుని తండ్రి యని పిలుచుచుంటిని. తరువాత వృత్తాంతము నే

జెప్పఁజాలను. యౌవన మన్నివికారములం గలిగించును. వావులు దెలియనీయదు. ఇంద్రియగుణంబులు విద్వాంసునైన మోసముజేయును. నేనీయపరాధము జేయుటకుఁ జేయకపోవుటకు నావశమా? దైవమేయట్టి బుద్ధి పుట్టించును. నన్నుఁ దప్పక శిక్షింపవలసినదే సురసగురుండించుక దోషములేదని నేనొప్పుకొనుచున్నాను. అని చదువుసంతనమ్మహీకాంతుఁడు నిలు నిలు పిమ్మటఁ జదువనవసరములేదు. అన్నిటికి వాఁడొప్పుకొనుచుండ గ్రామాధికారికి సందియమేలఁ గలుగవలయును. అని యాక్షేపించిన నృపతికి మంత్రి యిట్లనియె

దేవా! గ్రామాధికారియొక్కఁడే పొరపడలేదు మండలాధిపతియు నాసిబుద్ధితో నేకీభవించెనే? అని చెప్పిన నయ్యొకిపిఁడు బౌను. ఆమాట మరచితిని. వాని వ్రాఁతఁ గూడఁ జదువుము. అజాల్కుల కధికారమిచ్చినవాఁ డెవ్వఁడు? అని వారిం దిట్టుటయు నణచివైచి మంత్రి మఱల నిట్లు చదువుచున్నాడు.

అగ్నివర్మ శ్రోత్రియుఁడగుగాక సురస మహాపతివ్రత యగుఁగాక అప్పసిదెస సాక్ష్యము లేకపోవుఁగాక నాకును గ్రామాధికారికిం బోలెఁ జిత్తము దోలాయితమగుచున్నది అవరాంధ్ర చిత్తములు క్షణక్షణమునకు మారుచుండునని శాస్త్రములు చెప్పుచున్నవి. మగనియందు ద్వేషముగలవారే పరపురుషునియం దనురాగము గలిగియుందురు. వ్రాయవలసి వ్రాసితినిగాని ఆమాటయు నేను ధ్రువతరచను, దేవర చిత్తానుసారముగావింపఁ బ్రార్థించుచున్నవాఁడ. అని మంత్రి మండలాధిపతి వ్రాసిన తీరుపుచదివి వినిపించెను.

రాజుముక్కుపై వ్రేలిడుకొని ఔరా! నిస్సంశయమైన విషయమందు వీరికి సందియమేల గలుగవలయును? స్త్రీలకంటె మగవాండ్రే చంచలులు కులగోత్రాదులు దాచి మారుపేరు పెట్టికొని దుర్జనులు గూఢముగా సంచరించుచుందురు. నాకుఁ జాతవాడట్టివాఁడుగాఁ దోచుచున్నవాఁడు. కానిమ్ము ఇద్దఱిబుద్ధియు నొక్కత్రోవం బోయినదిగదా! అందేదియో విశేషముండకమానదు. ప్రతికంటజూచి తీరుపుఁ జెప్పగూడదు. మొదటినుండియు నీయభియోగము విచారించవలసియున్నది. అందఱిని రప్పింపుము. జాగు సేయఁగూడదు. మనదేశమున బ్రాహ్మణులు విచారింపఁగూడదు. ఇందులకు మూఁడుదినములు గడువిచ్చితినని చెప్పి యారాజుకొలువు చాలించి యంతఃపురమున కరిగెను.

మంత్రియామూఁడవనాఁటి యుదయమునకే వారి నందఱిధర్మస్థానమునకు వచ్చు నట్లాజ్ఞాపత్రికలఁ బంపుటయు నందరు నట్లైవచ్చి హజారమున నేచియుండిరి. ఆవిచిత్రాభియోగ వృత్తాంతము విని ప్రజలు పెక్కండ్రువచ్చి సభ నలంకరించిరి.

నాఁడు దేవవర్మ కొల్వుకూటమునకు వచ్చినతోడనే ప్రధాని మొగముజూచి యాబ్రాహ్మణులు వచ్చిరా? వారియభియోగము విచారింపవలయు. సర్వము సిద్ధముగా నున్నదియా? యని యడిగిన నతండు దేవా! అందరువచ్చియున్నారు. విచారింపవచ్చు ననియుత్తరముచెప్పెను.

అప్పుడా మహారాజు తొలుతనేయల్లునిఁ బిలిపించెను. అల్లుడు రాజునెదుటకు వచ్చి నమస్కరించెను.

రాజు—నీవెవ్వఁడవు?

అల్లుడు—శ్లో. నాహందేహో నేంద్రియాణ్యంతరంగః
నాహంకార ప్రాణవర్గో న బుద్ధిః
దారపుత్రక్షేత్ర విత్తాదిదూరః
సాక్షినిత్య ప్రత్యగాత్మా శివోహం.

రాజు—స్వగతము. ఆహా! వీని సౌందర్య మాసేచనకమై యున్నది. మాటలు మిక్కిలి ప్రగల్భముగా నున్నవి. మనోహరమైన వీనిమొగము జూడ నాకును బుద్ధి మారిపోవుచున్న దేమి? గానిమ్ము ప్ర॥ మాయెదుట వేదాంతములు పనికిరావు యదార్థము చెప్పవలయును.

అల్లుఁడు—నేజెప్పినదే యదార్థము

రాజు—సరే అటుండు (అని చెప్పి సురసను అగ్నివర్మను పిలిపించి) సురసంజూచి స్వ॥ అబ్బా! ఇబ్బిట్టోకవతియు వింతరూపున నొప్పుచున్నదిగదా! వీరిరువురుఁ జూడదగినవారే ఒండొరులువరింప దగియుండిరి ప్ర॥ ఈచిన్నదాని తండ్రియెవ్వరు?

అగ్ని—మహాప్రభూ! నేను.నాపేరు అగ్నివర్మయందురు. అగ్నిహోత్రములు సేయుచు సత్కాలక్షేపము సేయుచుండు నాకి ముప్పు వాటిల్లినది దేవా! యెన్నఁడు రచ్చకెక్కి యెరుఁగను. నాకు లేక లేక యీబిడ్డపుట్టినది మీరు తండ్రులుగనుక చెప్పు చున్నాను. దీనికి మగవాళ్ళనిన నసహ్యము సిగ్గువిడిచి చెప్పుచున్నాను. పురుష వాంఛ యేలేదు. ఆజన్మశుద్ధురాలు, మాగ్రామాధికారికి మాయందు విరోధము. అతుడ్పుడు మంచివాఁడనియు నాబిడ్డ చెడ్డదనియు వ్రాసి పంపినాఁడట. మండలాధిపతి యతఁడే మనిన నట్లే వ్రాయుట వాడుకయఁట స్వామీ! మమ్ము వృథాచిక్కులుపెట్టి త్రిప్పి త్రిప్పి చంపుచున్నారు? ధర్మస్వరూపులైన యేలినవారు మాకు న్యాయము దయచేయఁ బ్రార్థించుచున్నాను.

రాజు—భూసురోత్తమా! మీరు పండితులుగదా! సాక్షియనఁగానేమి?

అగ్ని—సాక్షాద్రష్టసాక్షి. కన్నులారా చూచినవాఁడు సాక్షియనియర్థము, వ

రాజు—సరిగానే చెప్పితిరి. మీకుఁతు నల్లుఁడు గోరుచుండఁగా జూచినవా రెవ్వరు?

అగ్ని—సరి. సరి అది అబద్ధమాడునా! సత్యసంధులు స్వామీ! దానిమాట శిలాశాసనమువంటిది తప్పక నమ్మదగినదే అదియునుంగాక నే నెన్నఁడైనను బొంకి యెఱుఁగుదునా నామాటయెందైన దమకు విశ్వాస ముండనక్కరలేదా!

రాజు—మీరు చూసితిరా!

అగ్ని—ఆ. చూచినల్లె.

రాజు—'నట్లు' పలికిరాశ్శి. చూడవలయు.

అగ్ని—అగ్నిహోత్రసాక్షిగా నిజమని చెప్పఁగలను

రాజు—ఇప్పుడు వీని నేమిచేయమందురు?

అగ్ని—శిక్షాస్మృతిలోఁ జెప్పినట్లు చేతులు తరుగవలయు బ్రాహ్మణపుత్రికను అధమకులుఁడు కామించిన నేమి వాఁయఁబడినటో చూఁడుడు. వీఁడు మహాపాపాత్ముఁడు పది దినములు మాయింటఁగుడిచి పురాణము వినువాఁడుంటోరె నటినయించిన నిజమను కొంటిని రాజా!

రాజు—అల్లుఁడా! నీవేమనియెదవు?

అల్లుఁడు—న్యాయశాస్త్రప్రకారము తప్పుజేసిన వానినిశిక్షింపఁమనుచున్నాను.

రాజు—నీవు తప్పుజేసితివా?

అల్లుఁడు—సందేహమేలా?

రాజు—నిన్నుఁ దండింపవలసినదేనా?

అల్లుడు—సందేహమేమిటికి?

రాజు—ఏమిటి కట్టితప్పు జేసితివి.

అల్లుఁడు—ప్రారబ్ధ శేషంబునంబట్టి.

రా—దేవీ! నిన్ని యల్లుఁడు గామించినమాట వాస్తవమే?

సురస—(తలవంచుకొని) వాస్తవమే?

రాజు—వీనిని శిక్షింపనచ్చునా?

సురస—దేవర చిత్తము.

రాజు—సురసా! నిన్నితఁడెట్లు కామించెనో చెప్పుము.

అగ్ని—తరచితరచి మీరట్లడిగిన సిగ్గువిడిచి యేమిచెప్పెడిని ఆడువాండ్రు సభలలో మాటాడగలరా! నావంటి వానికే వణఁకు వచ్చుచున్నదిగదా!

రాజు—జరిగిన యదార్థము చెప్పక తీరదు.

అగ్ని—అమ్మా భయమేల నిజము చెప్పుము.

సురస—(తలవంచుకొని నేల బొటనవ్రేల వ్రాయుచుఁ నేను నూతికిఁబోవుచుండగా వెనుకనేవచ్చి నోటితో సీలవేసిన నేడియో కూయుచున్నాడని వెనుకతిరిగి చూచితిని వీఁడు నావెనుక వచ్చుచుండఁ జూచితిని.

రాజు—తరువాత.

సురస—మరల అటుతిరిగి జరుగుచుండ బాలా! నిలు నిలు మను ధ్వని వినఁబడినది అప్పుడు భయపడి వడిగా నూతి యొద్దకు బోయి నీరుతోడుచుండ వీఁడు నా దాపునకు వచ్చి ముద్దియా ముద్దియ్యవా! అని యడిగిన అర్థము జేసికొనలేక ముద్ద యనగా నేమియని అడిగితిని.

రాజు—అంతకు ముందుఁ బురాణము వినుచుండ మీయింట నెప్పుడైన వీనిం జూచితివా?

సురస—చూచిన జ్ఞాపకములేదు.

రాజు—వీఁడు నిన్నెరుఁగునా!

సురస—ఎరుగబట్టియే వెంటవచ్చెను.

రాజు—నీవీ యగ్నివర్మ కూతుఁరవని యెరుఁగునా!

సురస—ఎరుఁగునో యెరుఁగడో నాకు దెలియదు.

రాజు—నీమాట విని వీఁడేమి జేసెను.

సురస—ముద్దగాదు ముద్దు అదియిమ్మని అడిగితిని. ఇత్తువా? యని యుత్తరము జెప్పెను.

రాజు—తరువాత నీవేమంటివి?

సురస—నీచా! నిన్నేమి జేయింతునో చూడుము. నాశీలము దెలియక యిట్లు పలికెదవా! అని పలికి అందు నిలుపక పారిపోయి వచ్చి మాతండ్రితోఁ జెప్పితిని.

అగ్ని—అమ్మా! గౌఁగిలిమాట జెప్పుము.

రాజు—ఆ. ఆ మీరేమియు మాటాడఁగూడదు.

అగ్ని—నాతోఁ జెప్పినది లెండి అందుమూలమున జ్ఞాపకము చేయుచున్నాను గ్రామాధికారి దగ్గిర కూడ జెప్పినది వ్రాసినాఁడు చూడుఁడు.

రాజు—మీరు ఛాందసులు, ఏమాటనవలయునో తెలియదు ఊరకొనుఁడు పుత్రీ! పిమ్మట నేమిజేసితివి.

సురస—జ్ఞాపకమువచ్చినది, నేనింటికిఁ బోవుచుండగా నద్దము వచ్చి గౌఁగలింపఁబోయెను, తప్పించుకొని పారిపోయితిని.

రాజు—అప్పుడందెవరైన నుండిరా?
సురస—ఎవ్వరునులేరు. ఒంటరిగాఁ జూచియే వాఁడువచ్చెను.
రాజు—నీభర్తకు నీయందిష్టమేనా?
సుర—ఇష్టమే.
రాజు—నీకతనియందో?

అగ్ని—మహారాజా! గ్రామాధికారి యేదో వ్రాసినట్లున్నవాఁడు వారిమాటయే మన్నించుచున్నారుకాని మా గౌరవ మింతకయుఁ దలంచరైరి. బాల్యచాపల్యంబున మగఁడనిన్ బెదరుచున్నది. కాని యిష్టము లేకేమి?

రాజు—ఓహో! పండితుఁడవని గౌరవింపుచుండ సయుక్తముగా మాట్లాడు చుంటివే సైరింపను జుడీ! ఆమెయే చెప్పవలయును. మీరు మాటాడఁగూడదు.

అగ్ని—నాకుఁ దెలియదు క్షమింపుఁడు.

ఆమాటకు సురసయేమియుఁ బ్రత్యుత్తరమిచ్చినదికాదు. అప్పుడారాజు ఈ చిన్నది మిక్కిలి చక్కనిది. దీనింజూచి అతండు మోహింపవచ్చు వీఁడుచక్కని వాఁడు వీనింజూచి సురసయు మోహింపవచ్చు. సురసమాటల యందుఁ చాల వ్యత్యాసమున్నది పరస్పర విరుద్ధవిషయములు జాలఁ గలవు అల్పుఁడు నిశ్చయము తెలియకుండ అన్నిటికిఁ నొడంబడుచున్నాడు. వీనిమది వెరపున్నట్లే తోచదు.అతండు జాల విద్వాంసుఁడు విరక్తుఁడువలెఁ గనంబడుచున్నాఁడు ఏదినిశ్చయింపుటకు మనసు పోవకున్నది. వీరిద్దరిలో అపరాధి యెవ్వరో తెలియదు. నిక్కముగాఁ దెలిసి నంగాని శిక్షింపరాదు. అని పెక్కుగతుల నాలోచించి వెండియు జేపురివారింతు మనియు అప్పటికి వారందరని రప్పింపుమనియు నియమించి దేవవర్మ నాఁడుసభ చాలించి అంతఃపురమున కరిగెను.

అని యిట్లు చెప్పి

# 136 వ మజిలీ.

# యమునకథ

యమున—సఖీ! వినతా! నవ్వుచున్నావు. వింతలేమైన జూచితివాయేమి ఆచేతనున్న పత్రిక యేమి?

వినత...ఇది మీతండ్రిగారు ప్రకటించినది ఒక వింతయగు అభియోగంబున నిజము తెలిసికొనఁజాలక అందలి సత్యము ప్రత్యక్షముగాఁజూసి జెప్పినవారికి వేయి దీనారములు కానుకగా నిత్తునని ప్రకటించిరి.

యమున—అంత తెలియఁబడని అభియోగ మెక్కడనుండి వచ్చినది.అందలి విషయము నాకుఁ గొంచెము చెప్పెదవా?

వినత—నేను జెప్పనక్కరలేదు. అంతయు సంక్షేపముగా నిందే వ్రాయఁబడి నది చూచికొనుము. అని పత్రిక చేతికిచ్చుచున్నది.

యమున—(చదివి) విమర్శించి ఇందలి నిజము నేను జెప్పఁగలనుసుమా.

వినత—అట్లైన నాకానుక నీకేరాగలదు.

యమున—అల్లుడేపాటి చక్కనివాఁడో సురస యెంతయందగత్తెయో చూచి వచ్చి నాకుఁ జెప్పగలవా?

వినత—సరి, సరి ఇదివరకే చూచితిని అల్లుఁడురూపముసామాన్యమని చెప్పఁ జాలను. రాచబిడ్డలకైన నాసౌకుమార్యము అతేజము అచక్కఁదనము గలిగియుండదు. మన్మథునికైన లోపమున్నది కాని వానికిలేదు. వాని ముఖవిలాసము జూచిన చక్రవర్తి బిడ్డఁడని తోచక మానదు. ధర్మదారికా కులశీలాదులు తెలియమి ననఁగూడదు కాని వానింజూచిన నీవుగూడ మోహమందెదవు సుమీ!

యమున—సురసయో!

వినత—చక్కనిదే కాని వాని యందమునకు సరిపడదు.

యమున—అట్లైన సురసయే మోసకత్తెవలెఁ దోచుచున్నది నిజము తెలిసి కాని పారితోషిక మందనా!

వినత—అబ్బో! ఈలాదిమాట లంతయుఁ జెప్పగలరు. రాజుగారికిఁ బ్రత్యక్షము జూపవలయునఁట.

యమున—చూపకున్న నాబుద్ధిబలమును గొనియాడకుము.

వినత—అట్లైన నయ్యగారితోఁ జెప్పి తీసికొనిరానా?

యమున—పోయి చెప్పుము.

అనుటయు నది అతిరయంబునం బోయి పుడమిఱేని కత్తెఱఁగెఱింగించినది. నరపతి అపరిమితాసంతముతో గొమార్తె అంతఃపురమునకువచ్చి పట్టీ! వినతతో నీవేమో చెప్పితివఁట సత్యమే! అందెవ్వరిది అసత్యమో యదార్థము చూపగలవా అని యడిగిన యమున నవ్వుచు దండ్రీ! అఁడుదానిదే తప్పు మగవాని యందేదోషము లేదు. వాంగ్మూలము లనియుఁ జదివితినని పలికెను.

అప్పుడు జేఁడు అట్లనుట కవకాశము లేదు. సురస స్వభావమును గురించి అయ్యగ్రహారమందే కాక ప్రాంత గ్రామములందును బరిశీలింపఁ జేసితిని ఇంచుకయైన దోషారోపణ మెవ్వరును జేసియుండలేదు. పత్రికలం జదివి దోషగాలసిన నాకుఁ దృప్తిగా నుండునా? ప్రత్యక్షమ జూపవలయు అదియుంగాక అల్లుఁడు కులశీలా దులు తలిదండ్రులనఁజెప్పఁడు తప్పుజేసినట్లొప్పుకొనుచున్నాఁడు.వాఁడేయపరాధియని

మనమేల ప్రభువపరచరాదు. అని యడిగినఁ గుమారైదండ్రి అంతదనుక సురస నియమవంతురాలే వానిం జూచినతోడనే తత్క్షణమున దాని మనసు తిరిగియుండ వచ్చును. కావలసిన నీకు బ్రత్యక్షము జూపెద నేఁజెప్పినట్లు చేయింపుమని చెవులో నేదియో జెప్పినది. రాజు మిగుల సంతోషించుచు అప్పుడ కొల్వుకూటమునకుఁ బోయి మంత్రులతో నాలోచించి వాది ప్రతివాదుల రప్పించి అందరు వినుచుండ రాజ శాసన ప్రకారము ప్రధానమంత్రి అగ్నివర్మకిట్లనియె.

విప్రోత్తమా! మీరు తెచ్చిన తగవులో నిదమిద్ధమని నిరూపించుటకు నాలోచింపవలసియున్నది. కావునఁ బదిదినములు మీరందఱు సిందే యుండవలయును. మఱియు సురసయు అల్లుఁడును నీపది దినములు నొరులతో మాట్లాడఁగూడదు. పగలెల్ల వారిం వేరియొక గదిలోనుదిచి యొరులతో మాట్లాడకకుండఁ జేసెదము. రాత్రిలు వారియిష్టము వచ్చినట్లు పోవచ్చును. అది బందీగృహము కాదు. దివ్యభవనము అప్రాంతమందైనను నితరులుండ గూడదు. ఈ పది దినములు గడచిన పిమ్మటఁ దీరుపు జెప్పుదురు అంతదనుక గడు వేరుపఁబడినది అని యుపన్యసించిన విని అగ్నివర్మ కోపోద్దీపితమానసుండై యిట్లనియె.

దేవా! అపరాధుల శిక్షించుట న్యాయముగాని అనపరాధులనుగూడ నిర్బంధ మునుచుట న్యాయవిరుద్ధముగాదా? అల్లుని నిర్బంధవాసములో నుంచుఁడు సురస నుంచఁగూడదని చెప్పుచుండగనే రాజభటు లితని గెంటుకొనిపోయిరి. యేమిచేయుటకు శక్యముగాక తుదకట్లుచేయుట కంగీకరించి పూటకాపుగా సురస నప్పటి కింటికిం దీసి కొనిపోయెను.

మరునాఁడు రాజపురుషులు సురసను సగౌరవముగా బండిపై నెక్కించి యొక భవనంబునకుఁ దీసికొనిపోయి లోపలఁ బ్రవేశపెట్టి తలుపులువైచి పోయిరి. ఆయిల్లు మిక్కిలి అలంకార శోభితమై యున్నది. చదువుకొనుటకుఁ గావలసినన్ని పుస్తకము లున్నవి తినుటకు నాహారపదార్థములు గలవు గాన సాధనములు గలవు. రత్న పీఠ ములు, డోలికలు పుష్పమాలికలు నెన్నేని బరిమళద్రవ్యములు గలవు. ఆగదిలోఁ గూర్చుండి సురస గొంతసేపు సంగీతము పాడుచుఁ గొంతసేపు పుస్తకములు చదువుచు గొంతసేపు డోలికలనూగుచుఁ గొంతసేపందుగల చింతలం జూచుచు వినోద ముగాఁ గాలక్షేపము జేయుచుండెను.

సాయంకాలముకాగానే రాజపురుషులవెంట అగ్నివర్మ బండిమీఁద అక్కడికి వచ్చి పుత్రికం దీసికొనిపోవుచుండును. సురస సంతోషముతో అందుఁగల వినోదములఁ దండ్రి కెఱింగించుచుండును. ఈరీతి రెండుమూఁడు దినములు

గడచిన తరువాత నొకనాఁడు సురస యాగదిగోడలన్నియు విమర్శించుచు నొకదెస నొకగవాక్షము తలుపుండుటఁ జూచి దానితాళముఁ బట్టి లాగినది. అది యూడివచ్చుటచే దాని యరసీయుటకు శక్యమైనది. పిమ్మటఁ దలుపు తెరచినంతఅవ్వలి నిట్టిదే మఱియొకగది గనంబడినది. ఆగదిలోను దనగదిలోనున్న వింతవస్తువులన్నియు నొప్పుచున్నవి.

ఓహో! రాజభటులు దీని బీగమువైచుట మరచిరి. దానంజేసి నాకిది తెరచుటకు శక్యమైనది. ఇందేమి విశేషము లున్నవియో చూచెదంగాక యని దాని తలుపు పూర్తిగాఁ దెరచి తలయెత్తి లోపలికిఁ దొంగిచూచినది. ఆగదిలో నల్లుఁడు ఒక పీఠముపైఁ గూర్చుండి కన్నులు మూసికొని ధ్యానించుచుండెను.

వానిం జూచినంత సురసకు మేనఝల్లుమన్నది. రోమాంచ ముదయమైనది. చెమ్మటలు గ్రమ్మి కంపమావిర్భవించినది. ఒక్కింత తడవు ధ్యానించి కన్నులు మూసికొని తలయూచుచు పలుమూలలు పరికించి యితరుల కందుండుట సాధ్యము కాదని నిశ్చయించి యావరణ దాపున నిలువంబడి వానికి వినిపించునంతటి మందస్వరముతో నల్లన నిట్లనియె.

ఓసుందరపురుషా! నాఁడు నామాట వినకపోవుటచేత గదా! నీకీ యవస్థ వచ్చినది. నీవంగీకరించిన నిన్ను నా ప్రాణమునం బెట్టుకొని కాపాడక పోవుదునా! నాకుఁ బదివేల దీనారములు వెంగలనగలున్నవి. అవి యన్నియు నీకు దక్కిపోవును. నామనసింతదనుక నెవ్వరియందును వ్యభిచరింపలేదు. నీయందు సక్తమైనది. కారణమేమియో చెప్పఁజాలను. నిన్ను శిక్షింపవచ్చునాయని రాజు నన్నడిగినప్పుడు మీచిత్తమంటినికాని శిక్షింపమనుటకు నోరువచ్చినదికాదు అనన్యపూర్వనై నిన్ను వరించి కౌఁగిలి యాసించిన త్రోసివైచితివి. నీకంటెఁ గఠినాత్ముఁడుండునా! నీవు బురాణము వినుచుండ నిన్నుఁ జూచి విరాళి గుండెకుండి యాగలేక నీకుఁదెచ్చు నెపంబున నీవెనువెంట వచ్చితినికాదా నామాటకెదురు జెప్పినందులకుఁ గోపమువచ్చి యింత జేసితిని. నీవు నిజము చెప్పక నేరముఁజేసి నట్లొప్పుకొనుట నాయందుఁగల మక్కువ చేతనేయని గ్రహించితిని. కోపమంతయుఁ బోయినది. నీమదియుఁ దిఱిగియుండును ఏమిజేయుదును? అంటించిన తరువాత నార్పుట కష్టముగదా! కానిమ్ము గతము విచారింపరాదు. ఇప్పుడైనను నీవంగీకరించినచో నీయభియోగము దప్పించెద. మనము దేశాంతరముపోయి సుఖింతము ఇటు చూడుము నేను నీయందమునకు సరిపడి యుండలేదా యేమి? ఈగవాక్షము దావునకువచ్చి యొక్కసారి ముద్దువెట్టి వెళ్ళుము అని యేమేమో విరహాతురతయై సంభాషించిన విని

అల్లుఁడు కొంతసేపామెదెసఁ జూడక సారెసారెకు జీరుమంత విసిగి తలయెత్తి యిట్లనియె. తల్లీ! నీవు బ్రాహ్మణివి. గురుపుత్రికవు. పరకాంతవు తుచ్ఛ భోగములకాశించి శీలమేపిట బాడుజేసికొనియెదవు ఇంతవరకు శుద్ధురాలవని యెల్లరు చెప్పుకొన నొప్పి యిప్పుడీ తొందరయేమిటికి? మలమూత్ర పూరితమై మేదో మాంసరుధిరాస్థి నికాయంబగు నీకాయంబునఁ జక్కఁదనంబన నేమియున్నది. వస్తుతత్వం బింత విచారించిన నీమనయిట్టి చంచలము నొందదుగదా! నీభర్త విద్వాంసుఁడు రూపవంతుఁడు కులీనుఁడు యౌవనవంతుఁడు నీశృంగారలీలలన్నియు నతని యందుజూపక నిరయహేతువులైన చెయ్వులకుఁ బూనితివేమిటికి! చాలుఁజాలు చిత్తము మరలించుకొనుము మరణమైనను నంగీకరింతునుగాని దుష్కార్యమునకు నొడంబడనని పలికిన నక్కలికి పండ్లు పటపట గొరుకుచునిట్లనియె.

అల్లుఁడా? నీవు నీబుద్ధికి సరిపడిన పేరు పెట్టుకొంటివి. నీవు చదివితివిగాని అనుభవము లేదు. వినుము.

శ్లో. అభికామాం స్త్రియంయచ్చగమ్యాం రహసి యాచిత:
నోపైతి నచ ధర్మేషు భ్రూణహత్యుచ్యతే బుధై:

అత్యంతాసక్తితోఁ రహస్యమందు దన్ను వరించి యాసించివచ్చిన స్త్రీని బొందక నిరసించిన పురుషుఁడు భ్రూణహత్యను బొందునని ధర్మశాస్త్రములలోఁ జెప్పబడియున్నది నీవు నాచిత్తము నుత్సాహాయత్తముగావింపుము. దానంగలుగు దోషము నిన్నుఁ బొందకుండ నేనుభరించెదను. విరక్తుం మాటలాడకుము. రసాభావము చేయకుము నన్ను రక్షింపుము. అని మిక్కిలి దీనత్వమున బ్రార్థించిన నతండిట్లనియె.

అమ్మా! నీవు జదివిన శ్లోకమునకుఁ నర్థమిదికాదు గమ్యాం అని యున్న పదమున కర్థమేమి? పొందదగిన యువతి అని అర్థము నీవు నాకు గమ్యవెట్లగుదువు? కావున నీబుద్ధి మరలింపుకొనుమని యుత్తరమిచ్చిన నచ్చిన్నది నవ్వుచు నిట్లనియె.

సౌమ్యా! నేను జదువురాని దాననుగాను గమ్యాం అనగా ముసలిది. రోగము గలది. అందములేనిది. ఈలాటి దుర్లక్షణములు గలస్త్రీ గమ్యగాదు గనుక గమ్యాం అని వ్రాసినాఁడు. గమ్యాం అనగా అందమైనది యౌవనవంతురాలు తనకంటె చిన్నది. తనకునన్నిటను సరిపడినది. అని అర్థము అట్టి దానను నేనుగానా? నావిద్యా పాటవము నీకుఁ దెలియదు నన్నుఁ జిన్నగాఁ జూడనే చూడవు. నాసౌందర్యము నీకెట్లు తెలియు మఱియును.

శ్లో. రాజ్యే సారం వసుధా వసుధాయా మపిపురం పురె సౌథం
సౌధె తల్పం తల్పె వరాంగనాంగ సర్వస్వం
సంసారె సురతం సారం సర్వలోక సుఖప్రదం
తన్న కుర్వంతి యెమూఢా స్తైనరాః పశవః స్మృతాః.

రాజ్యమందు సారమైనది భూమి. భూమియందు సారమైనది పట్టణము. పట్టణమందు సారమైనది మేడ. మేడయందు సారమైనది తల్పము తల్పమందు సారమైనది నిండుజవ్వనమందుండి సర్వావయవ సుందరిఅగు పూవుబోణి అంగసర్వస్వమని చెప్పఁబడియున్నది సంసారమునకు సారము సురతము. అనుకూలమగు దాంపత్యము కుదిరినంగాని అదిసురస మనిపించుకొనఁదు. ఇప్పుడైనం దెలిసినదా? అని అడిగిన విని అతండు చెవులు మూసికొని నీవింతవడివితివే నిన్ను శృంగారసలాలసవు కావని యెల్లరు చెప్పుకొనుచున్నారు నీభర్త చక్కనివాఁడు గదా! అతనియం దేమిటకివిరక్తవైతివి సన్యాసిని నన్నేలగామించితివి అనుటయు నయ్యువతి అతనిని మెచ్చుకొని లెస్సగా నడిగితివి. ఇందులకు సమాధానము చెప్పవలసినదే వినుండు.

శ్లో. హరణీశశయోర్యోగె బడబావృష యోస్తథా
హస్తినీ హయయోశ్చైవ రతం సమరతంత్రయం.

అని వాత్స్యాయన మహర్షి వ్రాసిన విషయము మీరెఱింగియే యుందురు. అందు మాకు జాతిస్వభావ కాలాదులవలన వైషమ్యము గలిగినది దానంజేసి నాభర్త యెంతచక్కనివాఁడైనను నాకనుమతింపఁడు. నీవనుమతించితివి. కావున నన్నుఁ బరిగ్రహింపుము. అని కోరిన నతం డిట్లనియె.

శ్లో. నిరయమున వైచికాల్చినఁ
జెరసాలం బెట్టికొట్టి చీల్చినగానీ
పరకాంతఁ గూడనొల్లను
తెరవా! యిది మంచిసతుం తెరఁగా? చెపుమా?

నీవునాకుఁ దల్లివి. నీకుఁ బదివేల నమస్కారములు గావించుచున్నాడ నన్నిఁక బల్కారింపకుము నీ నేరమేమియు నెఱింగింపక రాజుగావించు శిక్షకుఁ బాత్రుండ నయ్యెద నవ్వల బొమ్మ అని పలికి పెదమోహము పెట్టి మాటునకుం బోయెను.

అప్పుడప్పడతి లజ్జాక్రోధవిషాదమేదురహృదయయై యేమియుం జేయఁజాలక భుజంగియుంబోలె రోజుచు నవ్వలబోయి హాని నెట్టైన కఠినశిక్షకుఁ బాత్రునిగా జేయఁదలంచి అందులకుఁదగిన కల్పనలాలోచించినది. ఇంతలో సాయంకాల

మగుటయు నగ్నివర్మ రాజపురుషులతో బండియెక్కి యాయిక్క కరుదెంచి తలుపులు తీయించినంత వెక్కి వెక్కి యేడ్చుచుఁ గూరుచుండెను.

అప్పు డగ్నివర్మ అమ్మా! ఒంటరిగా నుండ జడిసితివా? ఊరడిల్లుము, ఈఱేడు మనపై వైరముగట్టి యున్నట్లు పొడగట్టుచున్నది. కానిచో నిరపరాధినివగు నిన్నేల నిర్బంధవాసంబున నుంచెడిని అపరాధులతోఁగూడ వాదుల బాధించు నృపతులుందురా! ఇతండు గావించిన యన్యాయము సామంత చక్రవర్తియగు సూర్యవర్మతో జెప్ప కొనుఁడని కొందరు ప్రోత్సాహపరచుచున్నారు. ఆవిషయ మాలోచింతము పోవుదము రమ్ము. అని యూరడించిన విని యవ్వనిత కన్నీరు దుడిచికొనుచు నిట్లనియె.

తండ్రీ! నాకు రాజుగావించిన నిర్బంధమువలన మరియొకముప్పు వాటిల్లినది. అయ్యల్లుని నాగదిలో నుంచినది యెరుగక యీ గవాక్షము తలుపెత్తియోయని తెరచి చూచితిని వాఁడు నన్నుఁజూచి పొద్దుటనుండియు విరహార్తిగుందుచుఁ గొంతదనక స్వయముగఁ బ్రార్థించి యంగీకరింపమి నోటికిరాని దుర్భాషలాడి రాళ్ళురువ్వఁబోయిన తలుపు వేసికొంటిని గదియ పడకపోవుటచే మరియు మరియు ద్రోయుచు రట్టు గావించెను. వానికిఁ దగిన శిక్షవిధించినంగాని నేగుడవజాలనని పలికి యాగురుతులు జూపించినది.

అగ్నివర్మ తలుపు తెరచి యవ్వలిగదియం దల్లుని జూచిపండ్లు పటపట కొరుకుచుఁ గానిమ్ము నిన్నింతటితో విడువను. తుచ్ఛా! ఇప్పుడైన సిగ్గురాలేదా? ఇంకను దుర్భాషలాడుచుంటివిగా! ఇలాటి ధూర్తులు పాలించుచుండుటచే నీయాట లిన్నినాళ్ళుసాగినవి. అని నిందించుచు రాజపురుషుల కవ్విషయము బోధించి సాక్ష్యముగా నుండఁదనికోరి యప్పుడే సురసను నింటికిం దీసికొనిపోయెను.

అని యెఱింగించి చెప్పఁదొడగెను.

## 137 వ మజిలీ

# దేవవర్మ కథ

అమ్మా! నీ బుద్ధిబలము మిక్కిలి కొనియాడఁదగియున్నది. సంధిగ్ధాలియోగమున యధార్థము జూపి హృదయగ్రంధియగు సందియము పోగొట్టితివి. నాకి రితిలిపితివి సురస కౌటిల్యము అల్లుని సౌజన్యము మాటునసుండి కన్నులారాజూచితిని. చెవులారావింటిని. ఇప్పుడు సురసకుఁగావించుదండనము నల్లునికిఁగావించు గౌరవము నీవేనిరూపింపుము నీవెట్లు చెప్పినట్లు కావించెద. మరియు నీకేదియేని మనః ప్రియమగు కార్యంబు గలిగిన నొడువుము అకార్యమైనను గావింతునని యత్యుత్సాహముతోఁ బలికిన దేవవర్మకు యమున యిట్లనియె.

తండ్రీ! సురస యాజన్మశుద్ధురాలగుట నిక్కువము రూపైకపక్షపాతియగు మదనునిచే మోసపెట్టఁబడి యకార్యమునకుఁ బూనుకొన్నది. ప్రత్యక్షసాక్ష్యంబేమియు లేకపోవుటచేత నానాతిని శిక్షించుటకువీలులేదు అల్లుఁడిపనిఁ దాను జేయలేదనక చేసినట్లే యొప్పుచున్నాఁడు. సురసను శిక్షింపనిశ్చయించితివేని నీవుజూచిన విషయములు సాక్ష్యమిచ్చి చక్రవర్తి సూర్యవర్మచేతశిక్షింపఁ జేయుమునీకధికారములేదు. కావున నంతయేలవచ్చెనాఁడుడి కావున మన్నించితినని విడిచిపెట్టుము ఇదియొండునాకుఁ బ్రియంబు మఱియు నల్లుఁడమరకల్లుండు కారణాంతరమున నట్టి పేరుపెట్టికొనెను గాని సామాన్యుఁడుకాఁడు ఉత్తమకులుఁడు అట్టి సుగుణమణిని మీరు గౌరవింపఁ దలంచిరేని మీరాజ్యమున కధినాధుంజేయుటకన్న వేరొక కార్యంబనికి గౌరవము కాదు. ఇదియే నారెండవకోరిక ఇంతకన్న నాకేకోరికయు లేదని చెప్పినవిని యాజనపతి యమున బుద్ధిచాతుర్యము స్తుతియించుచు జిఱునగవుతో నిట్లనియె.

పుత్రీ! నీవాక్యనైపుణ్యము స్తోత్రపాత్రమైయున్నది. నీకోరికకడు నుత్తమముగా నున్నది. అట్లే కావించెద నప్పటినుండియు నిదియె నామనస్సులో నున్నది అని పలికి యమునకోరికయుఁ దనసంకల్పము నొక్కటియె యగుట యప్పుడే కొల్వుకూటంబునకుం బోయి యాయభియోగ సంబంధులనెల్ల బిలిపించెను.

అప్పుడు అగ్నివర్మ జేనియెదుటకు వచ్చి మహారాజా! నీవుపక్షపాతముజేయు చున్నావు, అల్లుఁడు తప్పులుపై తప్పులుజేయుచున్నాడు బందీగృహంబునకున్నతరి నొంటరిగా నుండుట తిలకించి గవాక్షము తలుపు తెఱచుకొని సురస నెట్టిమాటలాడెనో మీరా పురుషులనడుగుడు వేరే మాకు సాక్ష్యమక్కరలేదు. అని చెప్పిన విని రాజు అక్కడికిఁ బోయిన రాజపురుషుల రప్పించి మీరేమిజూచితిరని అడిగెను. వాండ్రు దేవా! మేమేమియుం జూడలేదు. తలుపు తెరచునప్పటికి నీబిడ్డది వెక్కివెక్కి యేడ్చుచున్నది. యేమని తండ్రి యడిగిన వాతాయనము తెరచి అల్లుఁడు తన్ను మరల నిర్బంధించెనని చెప్పినది. ఇదియ మాయెరింగించినది. అని చెప్పిన విని అగ్నివర్మ వింటిరిగద అల్లుని దౌర్జన్య మనవుఁడు రాజు పకపకన నవ్వుచు నిట్లనియె.

విప్రోత్తమా! అల్లుఁడు సురసను గవాక్షము తెరచి నిర్బంధింపఁ జూచినవారు లేరు. ఆమచెప్పినమాట నమ్మవలయుననియా నీ అభిప్రాయము అని అడిగిన నగ్నివర్మ సందియమేలా! నాపుత్రిక అనసూయవంటిది. దబ్బరలాడునదికాదు. అదికూడ నల్లునే అడిగి చూడుఁడు అనుటయు రాజు అల్లునింజూచి అయ్యా! మొన్న బందీగృహంబునకుంతఁ గవాక్షముతెరచి మీరామెనునిర్బంధించినట సత్యమే! అనిఅడిగెను.

అంతయు సత్యమే అని అతండుత్తరము జెప్పెను. చూచితిరా! మీరేమో

సురస నసత్యవాదినిగా భావించిపలికిరి ఇప్పుడైన నమ్ముదురా? అని అగ్నివర్మ పలుకుటయు నలుక చిత్తంబునం జిలుక యమున మాటలం దలంచి యదంచికొని చిరునగవు మొగంబున మొలకలెత్త భూసురోత్తమా? మత్తకాశినుల చిత్తంబులు మీకెరుకపడవు.

ఈ యభియోగమున సురసయే యపరాధినియై యున్నది. అసత్యాభియోగము దెచ్చుటచే సురస శిక్షాపాత్రురాలు అయినను లోకమునకు విదితమగు సాక్ష్యము లేమిం జేసి సురసన విడిచిపెట్టితిమి అల్లుఁడు నిరపరాధి. వంద్యుఁడు అని తీరుపు చెప్పి అగ్నివర్మాదులం బొమ్మని యాజ్ఞాపించి అల్లునకు నమస్కరించుచు రాజసదనమునకు సగౌరవముగాఁ దీసికొనిపోయి యుచితాసనాసీనుంగావించి యిట్లనియె.

మహాత్మా! నీబుద్ధినైర్మల్యముఁ విశదమైనది. నీకులము పరమోత్తమము కాక మానదు కారణాంతరమున ప్రచ్ఛన్నముగ దేశాంతరములు దిరుగుచున్నట్లు తోచుచున్నది. ఏదియెట్లైన నను సరే త్రిలోకాభిరామయగు యమున యను నా కూఁతురు నిన్ను వరించినది. ఆమెను నీకిచ్చెదను. రాజ్యముతోఁగూడ స్వీకరింపుము నాకొక్కరితయే కొమరిత అచిన్నది బుద్ధిబలమున బృహస్పతిని మించియున్నది. నీకులశీలాదులు వినవర్థంమేని మాకెఱిగింపుము కాకున్నను మాకు సందియములేదు. యమునతోఁగూడ రాజ్యలక్ష్మిం గైకొనుమని ప్రార్థించిన విని అల్లుండిట్లనియె.

దేవా! నేనన్నిట నల్పుండని యెఱింగియు మీరిట్లనుట వింతగానున్నది. ధనబలవిద్యాశూన్యుండనగు నన్ను యమున వరించుట యాశ్చర్యముకాదా? నాయందు వరునందరయఁదగిన సుగుణమొక్కండును లేదు. లెస్సగా విమర్శించుకొని మాటలాడవలయు నాకు రాజ్యమును యమునయు నక్కరలేదు. నాదారిం బోవనిండనిన విని దేవవర్మ అల్లుని వినయాభిరతుండై ప్రార్థించి యెట్టకే నతని నొడంబడఁజేసి యమున నిచ్చి మహావైభవముతో శుభముహూర్తంబున వివాహము గావించెను. యమున తన బుద్ధిబలంబున నల్లుని కులశీల నామంబులఁ దెలిసికొని పరమానంద భరితహృదయై స్మరలీలా విలాసాంబునిధి నోలలాడుచుండెను.

కొన్ని దినములుగడచినంత నొకనాఁడు దేవవర్మ పేరోలగమున్న సమయంబున సామంతచక్రవర్తియగు సూర్యవర్మ యొద్దనుండి యొకదూతవచ్చి సందేశపత్రిక యేదియో యందఁజేసెను. ఆ పత్రికవిప్పి ప్రధాని రాజు విన నిట్లు చదువుచున్నాడు.

నరమృగ పశుపక్ష్యాదులలో మనుష్యులుత్తములు. అందు బ్రాహ్మణులు పూజ్యులు అందువిద్వాంసులు వందనీయులు అందు శ్రోత్రియులు పరమోత్తములు. దేవయజనకాపురస్థుఁడా పరమశ్రోత్రియుఁడగు నగ్నివర్మకూఁతురు సురస ఆజన్మ

శుద్ధురాలని జగద్విదితమై యున్నది. అట్టిసాధ్వీరత్నమును మోహించి కలయరమ్మనిన దుర్మార్గు నీచు నల్లుని మాయావి నుత్తముఁడని పొగడ శిక్షింపక యల్లునిగాఁ జేసికొని యామెను నిర్బంధించి చిక్కులబెట్టి విడిచితివి నీ కూతురు స్త్రీచాపల్యంబున వాని వరించి నీకు సురసయందు నీరసబుద్ధిగలిగించినదని తెలిసినది. అందులకు నీచర్యయే దృష్టాంతముగా నున్నది. అంతలి గ్రంథమంతయు సాంతముగాఁ జదివితిని వృధాగా నపరాధిని విడిచి నిరపరాధినిఁ జిక్కులుపెట్టితివి. నీకుఁగలకీర్తికిఁ గళంకము దెచ్చికొంటివి. స్త్రీబుద్ధివిని చెడినవాడవైతివి బ్రాహ్మణులు శోధించిన దేశమునకే ముప్పువాటిల్లును. అల్లుఁడు మాయావియనియు నపరాధియనియు వాఁడు చెప్పినమాటలే చెప్పుచున్నవి. కులశీలాదులు తల్లిదండ్రులం జెప్పకున్న నూరకుండుగా పెక్కులేల అంతయుం దప్పుజేసితివి మాయొద్దనగ్నివర్మ అయ్యభియోగమునుమఱల విచారింపనాజ్ఞ వేడికొనియెను. కావున మేము స్వయముగా తిరిగి విచారింతుము. నీయల్లుని వెంటనేనాయొద్ద కనుపుము. ఇదియే ముమ్మాటికి నాజ్ఞాపత్రిక అని చదివిన విని దేవవర్మ క్రోధాక్రాంతస్వాంతుడై ఔరా! సూర్యవర్మ తాను జక్రవర్తియైన నగుంగాక నిజముదెలియక నన్నన్యాయముజేసితినని వ్రాయుట లెస్సయా? అల్లుని గుణమేమిదెలిసి యిట్లు వ్రాసెను. అని పలికి తనలోఁ దాను నిదానించుకొని ఔను. అయ్యభియోగము రీతి జదివిన నట్లే తోచును. గ్రామాధికారిని మండలాధిపతిని నేనిట్లనలేదా! ఇది వానితప్పుగాదు. నిజము తెలియజేసెదంగాక యని యాలోచించి తిరుగా నిట్లు ప్రత్యుత్తరము వ్రాసెను.

మహారాజా! తమ యాజ్ఞాపత్రికం జదివికొంటిని. అయ్యభియోగము నేను బూర్తిగా విమర్శించితిని. అల్లుఁడు కడు నుత్తముఁడు సురస స్మరవశయై తానుజేసిన తప్పంతయు నల్లునిపై మోపించినది. కన్నులారాఁ జూచితిని చెవులార వింటి. నేను న్యాయమే కావించితిని అల్లుని గుణసంపత్తియే నేనల్లుని జేసికొనుటకుఁ గారణమైనది నారాజ్యమున కల్లుఁడే యధిపతి. అతఁడు మీకు గౌరవనీయుఁడు, అపరాధివలె మీయొద్దకు రానర్హుఁడుగాడు తప్పులు మన్నింపవలయును. అని వ్రాసి సూర్యవర్మ యొద్ద కనిపెను.

మఱిరెండు దినములు గడచిన పిమ్మటఁ గ్రమ్మర సూర్యవర్మయొద్దనుండి మఱియొక కమ్మవచ్చినది. అందు అపరాధియైనప్పుడు నీ యల్లుఁడైననేమి? నీవైననేమి? తప్పక రాజభట బంధితుఁడై మా సభకు రావలసినదే. అంతలి నిజానిజంబులు విమర్శింతుము. నీకిప్పుడు పనిలేదు. అపరాధియని మాకుఁ దోచిన శిక్షింతుము. కానున్న గౌరవింతుము. కాని నీయల్లుఁడైనంత మాత్రముననే నీవు రాజ్యమిచ్చినంత మాత్రముననే యతండు పూజ్యుఁడు కాఁడు నీవు మాయాజ్ఞ తిరస్కరించినట్లు తలంచితిమి.

ఇది మొదటితప్పుగాఁ దలంచి క్షమించితివి. తక్షణము నీయల్లు నిచ్చుటకుఁ బంపవలయును. అట్లు పంపక యేదియో కల్పించి ప్రత్యుత్తరము వ్రాసితివేని నిన్ను మన్నింపను. నీపైదండెత్తివచ్చి నీపీచ మడంచి నీరాజ్యమంతయు మాయధీనము జేసికొందుము. ఇదియే మమ్మాటికిని శాసనము అని వ్రాయఁబడియున్న పత్రికం జదువుకొని దిగులు మొగముతో నేమియు మాటాడనేరక అప్పుడ యమున యంతఃపురమునకరిగి సఖులతో సరసగోష్ఠి వినోదమునఁ బ్రొద్దుపుచ్చుచున్న కూఁతుఁజూచి ప్రీతిపూర్వకముగా సూర్యవర్మ పంపిన సందేశప్రకారమంతయు బోధించి యిపుడు కర్తవ్యమేమి యని అడిగెను.

అమె యించుక ధ్యానించి తండ్రీ! మనమా విప్రుల కన్యాయమేమియుఁ జేయలేదు. చాటుననుండి సురస యల్లునితోఁ బలికిన పలుకులన్నియు వింటిమి అతండిచ్చిన ప్రత్యుత్తరము గ్రహించితిమి కన్నులారఁజూచి సురస మహాపతివ్రతయన నెట్లు సమ్మతింతుము అల్లునెట్లు దండింతుము ఈ రహస్యమా రాచపీనుగున కేమి తెలియును. తెలిసి తెలిసి అతం డపరాధియనినంతమాత్రమున నల్లుని నతని యొద్దక పరాధివోలె నంపమా? యింతకన్న నవమానమేమియున్నది. ఎప్పటికైనఁ జావు జంతువులకు విధియైయున్నది. క్షత్రియులకు సంగరంబునం జచ్చుటఁ బరమధర్మము జయించితిమా పేరు పొందుదుమని పలికిన విని దేవవర్మ సవినయముగా యిట్లనియె.

తల్లీ! సూర్యవర్మ చేతిక్రింద నలుపదిమంది సామంతరాజులు గలరు అతండు గోరినవారందఱు చతురంగబలముతో సహాయము వత్తురు. మనకు వజ్రదత్తుఁడుతప్ప వచ్చిన మిత్రుఁడొక్కరుఁడును లేడు. ఉన్నను చక్రవర్తికి వెరచి తోడ్పడరు. కావున మనము జయించుటెట్లు ఓటమియే నిక్కము ఎట్లైనను బోరక తీరదని చెప్పిన విని యమున యిట్లనియె.

దైవము ధర్మమందుండును. ధర్మముగలవానికి జయము గలుగును. బలగముతోఁ బనిలేదు. మనకు దైవమువచ్చి సహాయము చేయును. నీవు చింతింపవలదు. యుద్ధప్రయత్నము చేయింపుమని యుపదేశించెను.

అంతలో నల్లుఁడు అచ్చటికి వచ్చెను. అతనితో నావృత్తాంతమంతయుం జెప్పిన నతండు సంవర్తసమయ వలాహకంబువోలె గర్జిల్లుచు ఏమీ! సూర్యవర్మ కింత కావరమేల గలిగినది. మదీయ పరాక్రమ విధం బెరుఁగఁడు దేవవర్మ యసహాయుండని తలంచి యట్టి వ్రాఁతలు వ్రాసెను. కాని రణరంగమునఁ బశ్చాత్తాపంబు జెందఁగలడు అని పలుకుచు యుద్ధమునకు సన్నద్ధులమై యుంటిమని జాబు వ్రాయమని పలికెను.

నీవు మాపై యుద్ధము ప్రకటించితివి మాయందపరాధమేమియును లేదు. దైవమే మాకుఁ దోడుపడును. సన్నద్ధులమై యుంటిమి అని దేవవర్మ సూర్యవర్మకుఁ బ్రత్యుత్తరము వ్రాసెను. ఆయుత్తరము జూచికొని సూర్యవర్మ మంత్రులతో నాలోచించి దేవవర్మపై యుద్ధము ప్రకటించితి మనియుఁ బ్రతిసామంతరాజు నిరువుర మహావీరులను లక్షసైన్యమును బంపుమని యాజ్ఞాపత్రికలం బంపెను. తచ్ఛాసన ప్రకారము రాజులందఱు సైన్యముతో వీరుల నంపిరి.

దేవవర్మయుఁ దమ మిత్రులఁ గొందఱఁ దోడు రమ్మని కమ్మల వ్రాసెను. ఎవ్వరో యిద్దరు ముగ్గురు రాజులు మాత్రము ప్రచ్ఛన్నముగాఁ గొంతసైన్యమును సహాయముగాఁ బంపిరి.

ఇరువాగులును వ్యూహములను బన్ని యుద్ధమునకు నాయత్తపడి యుండిరి. రెండు మూడు దినములలో మహాయుద్ధము జరుగఁగలదు మనకుఁ దృప్తియగు నాహారము దొరకగలదని భూతరాజు భార్యకుఁ దద్వృత్తాంతమంతయు జెప్పెను.

ఆకథవిని భూతపత్ని అయ్యో! పాపము దేవవర్మ బలహీనుఁడగుట శత్రువునకు లొంగిపోవును కాఁబోలు, న్యాయమితనిదే కదా? ఇదిగో యేరాజుగాని నీదన్యాయము. యుద్ధము జేయఁగూడదని మందలింపక సూర్యవర్మ కోరినంతనే బలములఁ బంపదగునా! ఇది ధర్మవిరుద్ధము ధర్మవిరుద్ధమని పలుకగా భూతరాజు మనకేది విరుద్ధమైననేమి? పూర్తియదు నాహారము దొరుకుచున్నదిగదా! అబ్బా యీ కడుపు మంట నేను భరింపజాలకుంటినిగదా. అయ్యో ఇంకను రెండుయామములైన కాలేదే? ఎప్పుడు తెల్లవారును. ఎప్పుడు ప్రొద్దుగ్రుంకును మరలనెప్పుడు ఆహారము దొరకును. అని యాఁకట వేగుచుండ నతని భార్య అయ్యో! నీబాధ నేను జూడలేకుంటిని ఆహారమేదియుం దొరకదు నే నేమి జేయుదును. అని పరితపించుచుండెను.

వారి సంవాదమంతయు విని విరతి నిరతిశయ దయాకలితహృదయయై పాపము ఈ భూతదంపతులు ఆహారములేక మలమల వేగుచున్నారు. నేను వీరి కాహారమైతినేని నాజన్మసార్థక్యము నొందును. నేను వీరికి యేమిజేయుదును. అని తలంచి మెల్లగ లేచి వారియెదుటకు వచ్చి నమస్కరించుచుఁ బిశాచభాషతో నిట్లనియె

ఓ భూతదంపతులారా! మీరు ఆకలిచే మిక్కిలి బాధపడుచున్నారు. నేనొక మనుష్యకాంతను దైవికముగా మీచెంతకరుదెంచితిని. నన్ను మీరు భక్షించి మీయాకలి యడంచికొనుఁడు. నేను గృతార్థురాల నగుదును. భూతతృప్తి జేయుటకన్న నుత్తమపుణ్యములేదు. అని పలికిన ఆ దంపతులామె దిక్కు మొగంబై యబ్బురపాటుతో నెగాదిగజూచి నీవెవ్వతెవు? ఇవ్విపినంబున కెట్లు వచ్చితివి? మాభాష యెట్లు

తెలిసికొంటివి? ఇట్టి సాహసమేల జేసెదవు. చావునకు సమ్మతించువారుందురా? అని యడిగిన విరతి మరల నిట్లనియె.

నాచరిత్రము వినుటచే మీకును గొంతవిచారము గలుగును. దానితో మీకేమి పని ఆఁకలికి క్షణమోర్వలేని స్థితిలో నుంటిరి. ఎవ్వరైననేమి మనుష్యకాంతను మీకు భక్షింపఁదగినదానను వేగ భక్షించి నా దుఃఖమును బోగొట్టుఁడని వేడినది.

అప్పుడు భూతకాంతసాదరముగాఁ జేరదీసి, అమ్మా! నీవుమాయింటి కతిథివైతివి ఎంతయాఁకలిగా నున్నను నతిథిని భక్షించు పాపాత్ములుందురా? ప్రాణత్యాగ మొనరింపఁబోవుచుంటివి. అట్టి సుగుణ సంపన్నురాలవగు నిన్ను భక్షింతుమా? తుండైనను అతిథి పూజార్హుఁడు నీ కంటె యుత్తమురాలి సంగతి చెప్పనేల? నీవే డియో నాపస నొందియున్నట్లు తలంచఁబడుచున్నది. నీకంఠస్వరము మిక్కిలి మాధుర్యముగానున్నది. నీవుత్తమజాతి యువతివలె దోచుచున్నది. నీవృత్తాంతము చెప్పుమని యడిగినది నీ కథచెప్పనంగాని నీ మేని మాంసము మేము ముట్టమని భూత రాజు పలికెను.

శ్లో. భీమంవనం భవతి తస్య పురం ప్రధానం
సర్వోజన స్స్వజనతా ముపయాతి తస్య
కృత్స్నాచ భూర్భవతి కాంచనరత్నపూర్ణా
యస్యాస్తి పూర్వసుకృతం విపులం నరస్య

అప్పుడా రాజపుత్రిక తన చారిత్రమంతయుఁ బూసగ్రుచ్చినట్లు వక్కాణించి అదిగో అతఁడే నాభర్త చెట్టుక్రిందఁ బండుకొని గుఱ్ఱువెట్టి నిద్రబోవుచున్నవాఁడని చెప్పినది. భూతకాంత యయ్యుదంతమువిని యత్యంత విస్మయకృపాపరీతస్వాంతయై తల్లీ! నీవంటి యిల్లాలింజంపి తినుమనుచుంటివా? ఆహా! నీశీలము త్రిలోకజనస్తుత్యమై యున్నది. నీయక్కయు నీయన్నయు నైశ్వర్యమదమత్తులై నిన్నాక్షేపించియడవిలోనికి త్రోసివచ్చిరా? కానిమ్ము నవ్విన యూళ్ళేపట్టణంబులు కాకపోవునా? నీతండ్రి యింత కఠినాత్ముడయ్యెనా! రత్నమువంటి నిన్ను ముష్టియెత్తికొనియెడు జంగమునకిచ్చి పెండ్లి కావించునా! ఔరా! యెంతవింత యని వెరగుపడుచుఁ బతింజూచి ప్రాణేశ్వరా? యీచిన్నది కడు నుత్తమురాలని యీమె చరిత్రమే చెప్పుచున్నది. ఈపూతురాలి పాద రేణువు సోకిన మనము పవిత్రులమగుదుము. దీని మగఁడు వెఱ్ఱివాఁడు చెట్టుక్రింద బండుకొని యున్నవాఁడు వానికిమంచి ఐశ్వర్యము గలుగఁజేయవలయు నిందులకుఁ దగిన యుపాయమాలోచింపుఁడు. అని ప్రార్థించిన అతండు బత్నిమాట జవదాటని వాఁడగుట వల్లెయని యొప్పుకొని యందులకుఁదగిన యాలోచనను జేయుచుండెను.

అప్పుడు భూతపత్ని తల్లీ! నీవల్లభుని జూడవలయు అతనివృత్తాంతమెట్టిదో

యెరుఁగనని చెప్పితివి ఇది కడు విపరీతము ఇటు పిలువుము. అనుటయు విరతి సిగ్గభినయించుచు దేవీ! ఇదివరకు నేను బలుకరించి యెరుఁగను. నన్నతఁడును బలుకరింప లేదు. ఇప్పుడేమని పిలుతును, అని సంశయకలితమతియై పలికిన అక్కాలికింజూచి భూతపత్ని నవ్వుచు పద పద సిగ్గేల నేనుగూడ వత్తుననుటయు అతఁడు పండుకొనియున్న చెట్టుక్రిందకి నామె నామెందీసికొని పోయినది!

అంతకుమున్నె అతండులేచి ప్రక్కను విరతింగానక నలుమూలలు సూచుచు నింతలో వీరిద్దరు వచ్చుటజూచి దద్దరిల్లి అట్టెలేచి యోసిల్లి యేమియుమాటాడక వింతగా భూతకాంతంజూచుచుండెను.

అప్పుడు విరతి దేవీ! యితండే నేజెప్పిన యతండు చూడు మనవుఁడు భూతపత్ని దాపునకుఁబోయి చూచుచు నీవెవ్వఁడవు? నీవృత్తాంత మెయ్యది? నీదేకులము నిజము జెప్పుము చెప్పకున్న నిన్నుదండింతుము నిజముచెప్పిన గౌరవింతుము. ఇందులకే నిన్నీ చిన్నది మాయెద్దకు దీసికొనివచ్చినది. అతండే భూతరాజు నేనతనిపత్నిని మేమిద్దరము అపర్వతశిఖరమున వసింతుము. ధర్మపత్నియగు విరతి మూలమున నీతో నింత మెల్లగా మాట్లాడుచున్నదానను. లేకున్న నాభర్త నిన్నిపాటికి జీల్చి విడుచును నిజము చెప్పుము. అని యడిగిన అతండు విస్మయ సాధ్వసవివశస్వాంతుండై చీకాకు పడి నిజము చెప్పక తీరదని యిట్లు చెప్పదొడంగెను.

అని యెఱింగించి...ఇట్లని చెప్పదొడంగెను.

# 138 వ మజిలీ.

# సుగతుని కథ

అమ్మా! నీవు నన్నడిగినంతనే నావృత్తాంతమంతయు స్ఫురించుచున్నది. వినుము శ్రీకంఠనగరంబున వజ్రదత్తుఁడను రాజు గలఁడు. అతండు సంతానశూన్యుండై పెద్దకాలము పరితపించుచుండెను. సామ్రాజ్యవైభవసంతోషంబు నణఁగద్రొక్కి సంతానరాహిత్య పరితాపంబభివృద్ధి నొందుచుండెను.

ఇట్లుండ నొకనాఁడప్పిటికి అపరశివావతార మనందగు జంగమదేవర యొకండరుదెంచి శివాలయములో వసించెను. భూతిరుద్రాక్ష మాలికా విరాజితగాత్రుండు శంఖఘంటికాధారుండునై యొప్పుచున్న అతనివేషము జూచినవారికి మహానుభావుండని తోచక మానదు. అతఁడు త్రికాలవేదియనియు రసమూలికా సిద్ధుండనియుఁ బౌరులద్భుతముగాఁ జెప్పుకొనఁ దొడంగిరి.

ఆవాడుకవిని వజ్రదత్తుఁడొకనాఁ డయ్యోగికడకుఁబోయి స్తుతి పూర్వకముగాఁ దన యభిలాష నెరింగించెను. అయ్యోగి యానృపతి గృపావిలోకనములఁజూచుచు

జయశంకర! మృత్యుంజయ! యనియుచ్చరింపుచు రక్షరేకుతో మంత్రిభస్మంబిచ్చి మహారాజా! నీవీ భస్మంబు దాల్పుము. నీభార్యకీ రక్షరేకిమ్ము. నీకుఁ దప్పక కొడుకు గలుగును. వానికి జంగమదాసని పేరుపెట్టి పదియారవయేట జంగము వేషము వేయించి శ్రీశైలమునకుఁ దీసికొనిపోయి మల్లికార్జునస్వామివారికిఁ బేరప్పగింపవలయును. అట్లు జేయనేని ముప్పువాటిల్లఁగలదని చెప్పిన విని యానృపాలుండు స్వామీ! మీరిట్టి వర మిచ్చియుండగాఁ జెప్పినట్లు చేయుట యబ్బురమా? తప్పక తమ యానతి వడువునఁ గావించెదను.

అని పలికి అయ్యోగి కేదియో కానుక యీయఁ బోయిన అందుకొనక నిర సించెను. మహాత్ములకు ద్రవ్యాభిలాష యుండదుగదా! వజ్రదత్తుఁడయ్యోగికి నమస్క రించుచు నింటికింబోయి తత్ప్రసాదము భార్యకిచ్చెను.

ఆయ్యోగి జెప్పినప్రకారము వెంటనే యామె గర్భము ధరించి శుభముహూ ర్తంబున నొకపుత్రుంగాంచినది. అబాలుండు రూపంబున మిక్కిలి కొనియాడఁ దగి యున్నందులకు సంతసించుచు జాతకర్మాది విధుల నిర్వర్తించి వానికి జంగమదాసు అని పేరుపెట్టెను.

అజంగమదాసు దినదినాభివృద్ధి వహించి సర్వజన దర్శనీయుడై యొప్పు చుండెను. వాని నుచితకాలమునఁ జదువనేసి పెక్కండ్ర గురువులనియమించెను. వాని విద్యాగ్రహణశక్తి మెచ్చుకొనఁ దగినదియేకాని యెల్లవారిం దిరస్కరించుస్వభా వము వాని బుద్ధికిఁ గళంకము గలుగఁజేయుచున్నది. విద్యల గ్రహించుచు నొజ్జల వెక్కిరించుచుండును. పురాణములం జదువుచుఁ బూర్వుల నాక్షేపించుచుండును. శివకేశవుల యాలయంబులకుఁ బోవుచు శిలలని విగ్రహములఁ దిరస్కరించు చుండును. పెద్దల నవమానించును. ఈరీతి నారాజపుత్రుండు సర్వజనకంటకుండై సంచరించుచున్న రాజపట్టియగుట నెదుట నెవ్వరు నేమియుననలేక చాటున దిట్టు చుందురు.

రాజును వానిదుండగములు దెలిసియు లేకలేక కలిగిన సుతుండగుట నేమియు మందలింపనేరకవాఁడు కోరినట్లు చేసినట్లు యంగీకరింపుచుండెను. వాఁడు దుండగమునఁదిరుగుచు పెక్కువిద్యలయందుఁ బండితుండయ్యెను. పదియారేడుల ప్రాయమువచ్చినది. అప్పుడు రాజు యోగిమాటదలంచి యొకనాఁడు పుత్రుని లాలిం పుచు నిట్లనియె.

రాజు—వత్సా! నీవు ఒకయోగి వరంబున బుట్టితివి. నీకిప్రాయంబున జంగమవేషమువేయించి శ్రీశైలమునకుఁ దీసికొనిపొమ్మని చెప్పెను. పైడిగంటయు కాంచనశంఖమును పట్టుజోలియుం గట్టించితిని నీవు వానిం దాల్పవలయును.

పుత్రుండు—నీవెవరివరంబునం బుట్టితివో చెప్పుము.

రాజు—పరిహాసమాడకుము నేనెవ్వరివరంబునం బుట్టిననేమి ? నాకుఁ గాలము గడిచినదిగదా.

పుత్రుడు—నాకునుగొంత గడచినది. ఈలాటి వెఱ్ఱిమాటల నా యొద్దజెప్ప కుము. ఆయోగి యెవరిమూలమునఁబుట్టెను. జన్మమునకుఁ తల్లిదండ్రులేమూలము. వేరెవ్వరునుగారు.

రాజు—అయ్యో ! అయోగి అట్టివాఁడుకాడు మహానుభావుఁడు. ద్రవ్యాశలేని వాఁడు.

పుత్రుఁడు—ద్రవ్యాశలేనియట్లే అభినయించుచు బైరాగులు మీవంటివారిని మోసము చేయుచుందురు. మీరు పట్టి అమాయకులుగదా ?

రాజు—నాయనా ! నీవు చిన్నవాఁడవు పెద్దల నధిక్షేపింపకుము అట్లుచేయ నిచో మోసమువచ్చునని కూడ చెప్పియున్నాఁడు సుమీ ! తప్పక నీవా వేషము వహింపకతీరదు.

పుత్రుఁడు—చాలు. చాలు. ఇప్పుడు జంగమ వేషము వేయమనెదరు. రేపు మాదిగవేషము వేయమనగలరు. వానిమాట వరుసున నడువవలసినదా యేమి ?

రాజు—బాబూ ! మొదటనే యాయనచెప్పెను. నడువనిచో ముప్పువాటిల్లును సుమీ.

పుత్రుఁడు—అదియేమియో చూతునుగదా ?

ఇఁక జెప్పవలసినదేమియున్నది. తండ్రితో వాఁడు పెద్దతడవు వికటవాదము గావించి అట్టివేషము వేసికొనుటకు అంగీకరింపదయ్యెను. రాజు చేయునదిలేక విచా రింపుచుండెను. కొన్నిదినములు జరిగిన వెనుక దేశాటనము జేయుచుచేయుచు నాజంగమదేవర దైవికముగా నాయూరువచ్చి దేవాలయములో వసించెను.

ఆవార్తవిని భూభర్త అత్యంతభయభక్తి విశ్వాసపూర్వకముగా నతనియొద్ద కుంబోయి అడుగులంటి మహాత్మా ! నన్ను గృతఘ్నుఁగాదలంతురేమో అట్టి వాఁడనుగానుఁ మీరునాకు దుఃఖకుకొడుకుందయజేసితిరేం ! వాఁడు నాచెప్పినట్లు వినుటలేదు. ఏమికతంబుననో వికటవాదియయ్యె. మీ యొద్దకు రప్పింతు మందలింపుఁ డని వేడుకొనియెను.

ఆజంగమదేవర మందహాసముగావింపుచు నందులకు మీదంపతులు హేతు భూతులు చిత్తచాంచల్యంబునంజేసి వాఁడట్టి వాఁడయ్యెనని పలికి వాఁడు దనయొద్దకు వచ్చుట కెట్లకే నంగీకరించెను.

రాజు పుత్రు బ్రతిమాలికొని అతికష్టమున నయ్యోగియొద్దకుఁ దీసికొని పోయెను.

రాజపుత్రుఁడు రాజసభాభవనంబున నతనికి నమస్కరింపక తిరస్కార భావమున నందుఁ గూర్చుండెను.

జంగమదేవర—నీపేరెవ్వరు ?

రాజపుత్రుడు—గడ్డము పెంచినతోడనే సర్వజ్ఞత్వము బలియును ఎల్లవారిని నీవు నీవు అని పిలుచుచుండుచు గదా.

రాజు—బాబూ నీవు వీరివరంబుననే పుట్టితివి వారు నిన్ను పిలువవలయు పేరు చెప్పుము.

రాజపుత్రుఁడు—పేరా ? జంగమదాసి

రాజు—అయ్యో ! అట్లుకాదురా జంగమదాసురా

రాజపుత్రుడు—మీరుపెట్టినపేరది నేనుబెట్టుకొన్న పేరిది

రాజు—వీరికి నమస్కరింపుము

పుత్రుఁడు—మీరు నమస్కరించితిరి చాలదా. దానికతనమీకు వచ్చినలాభము మీరేకుడువుఁడు నాకుఁ బంచిపెట్టనక్కరలేదు

జంగమదేవర—నీకుఁ దగినఫలము నీకును బంచిపెట్టెదము కావలయునా !

పుత్రుడు—(పరిహాసముగా) ఏటోకొంచెము దయచేయుఁడు.

జంగమదేవర—చంకనుజోలియు నొకచేత గంటయు నొకచేత శంఖమును బూని జంగమవేషమునీచేతవేయించి బిచ్చమెత్తింతును చూడుము.

పుత్రుఁడు—అట్టి వేషము నాచేత వేయింతువేని నీవు నిజమైన జంగమ దేవరవే.

జంగమ—సరే. యింటికిఁబొమ్ము.

రాజు—మహాత్మా! వీనిమాటలు పాటింపవలదు. మీకు బుత్రుఁడీతడు. నయ శిక్షవిధింపవలయునుగాని భ్రష్టుఁజేయుఁదగనసుఁడీ

అని అతని నుతించుచుండెను. కుమారుఁడంతకుముందేయచ్చోటు వాసి నిజనివాసంబునకుఁబోయెను. ఉత్తములఁ దిరస్కరించినపాతక మూరకఃపోవునా? రాజపుత్రుఁడింటికిఁ బోయెనో లేదో అంతలో దుర్భరమగు శూలనొప్పి యావిర్భవించి గిలగిల కొట్టుకొనఁ దొడంగెను. పెక్కండ్రు వైద్యులువచ్చి చికిత్సలుగావించిరి. ఇంచుకయుఁ బ్రయోజనములేకపోయినది. అప్పటికి వానిచిత్తము పశ్చాత్తాపముజెందినది. జంగమదేవరమహిమవలనఁ దనకాబాధగలిగినదని నిశ్చయించి రాజపుత్రుఁడు తండ్రిని వేడికొనియెను.

యౌవన విద్యాధనగర్వములు బ్రతుకరాని యంతయాపద గలిగినప్పు డుఁడు గనని పెద్దలు చెప్పుదురుగదా అప్పుడు రాజు వాని మతి రాజసభావంబు విడచి సాత్వికంబువహించెదనని సంతసించుచు నాందోళిక మెక్కించి వాని నయ్యోగియొద్దకుఁ దీసికొనిపోయెను.

యోగి జంగమవేషమువేయించికాని నాయొద్దకుఁ దీసికొనిరావలదని చెప్పెను. అప్పుడు రాజువెనుక జేయించిన కనకఘంటికయు గాంచన శంఖము పట్టుబొంత జోలియు ధరియింపఁజేసి దీసికొనిపోయి మ్రొక్కించిన ఛీ, ఛీ ఈరాజసవేషము పనికిరాదు బిచ్చమెత్తుజంగము వేషము వేయింపవలయునని చెప్పుటయు రాజు జేగురుగుడ్డతో గుట్టిన బొంతజోలియుఁ, గంచుగంట, శంఖము రుద్రాక్షమాలికలు విభూతిరేఖలు ధరియింపఁజేసి తీసికొనిపోయి అతని పాదంబులంబడవేసెను.

అప్పుడయ్యోగి—ఓరీ! నీవెవ్వఁడవురా.

రాజపుత్రుఁడు—స్వామీ! నేను జంగమదాసును.

యోగి—ఈజంగమదేవర జంగమదేవరయేనా.

రాజపుత్రుఁడు—స్వామి! బుద్ధివచ్చినది. అపరాధిని రక్షింపుము. ఐశ్వర్యమదమత్తుండనై దుర్వర్తనముల మెలంగితిని. తమ శక్తిచే నాబుద్ధిచక్కఁజేసితిరి. సాధువర్తనముల మెలంగువాఁడ మీదాసుండను గనికరించి పాలింపుమని మ్రొక్కుచున్నాను.

యోగి—ఇప్పుడు నీకు శూలనొప్పియున్నదా.

పుత్రుఁడు—లేదు మహానుభావా! మీపాదరేణువు సోకినంతనే యటమట మైనది.

యోగి—నీవీవేషముతోఁ గొంతకాలము బిచ్చమెత్తుచుఁదీర్థాటనము గావింపుము. అప్పుడు నిష్కృతిగలుగును. సాధువర్తనుండవై మెలంగఁగలవు పిమ్మట సౌఖ్యము లందగలవు. అంతదనుక నీమతి వివశమైయుండును. పోపొమ్ము.

అని యానతిచ్చి యాయోగి జపధ్యాసక్తుండయ్యెను. రాజు ఎద్దియో ప్రార్థింపఁబోయెను కాని వినిపించుకొనలేదు. ఆరాత్రియే జంగమదాసు పురమువిడిచి బిచ్చమెత్తుచుఁ దీర్థాటనముగావింపుచుండెను.

అని యెఱింగించి యాతఁడో శ్రోతలారా! ఆజంగమదాసేయీ వ్యక్తియని తెలిసికొనుఁడు మీరడుగుటచే నిప్పుడయ్యుదంత మంతయు స్వాంతమున స్ఫురించినది. నాఁటినుండి నేఁటిదనుక మనసు వివశయై యున్నకతంబున వెఱ్ఱివానివలె మెలంగితిని. ఒకనాఁడొకపట్టణంబునకుం బోవుచుండ నన్నుఁ [illegible]బులపై నెక్కించుకొని తీసికొనిపోయియొకరాజు నాకిఁచిన్నదానినిచ్చి పెండ్లిచేసెను. అదియంతయు నాకుస్వప్నప్రాయమై యున్నది. అని అతండాత్మీయవృత్తాంత మంతయు నెఱింగించెను.

ఆకథ విని విరతి యబ్బురపాటుతో నతనిమొగము చూడఁ దొడంగినది. భూత పత్నియు విస్మయమభినయించుచు సాధ్వీ! నీవుగాజు యనుకొనునది రత్నమైనది. నీవు విచారింపవలదు. నీవు మంచి సౌఖ్యమనుభవింతువని పలుకుచు వారిద్దరిని దన భర్త యొద్దకుఁ దీసికొనిపోయి యావృత్తాంతమంతయు నాభూతనాధునితోఁ జెప్పినది.

అని యెఱింగించి...యిట్లని చెప్పం దొడంగెను.

# 139 వ మజిలీ కథ

# యుద్ధము కథ

చక్రవర్తియగు సూర్యవర్మ దేవవర్మపై యుద్ధముఁ బ్రకటించి తన యల్లుఁడగు సురూపునిఁ గుమారు కుశునిఁ గొంత సైన్యముతోఁ దోడునంపుమని చంద్రగుప్తునకు యాజ్ఞాపత్రిక పంపినపిమ్మట జంద్రగుప్తుండును శిధిలేక వారిద్దరిని జతురంగబలముతోఁ బంపి అనుదినము యుద్ధవార్తల దెలుపుటకు వేగులవారిని బెక్కండ్ర నియమించెను. వాండ్రు పోయివచ్చి రెండవదివసపు సంగరవిశేషము లిట్లు జెప్పందొడంగిరి.

మహారాజా! సూర్యవర్మ బలంబులు నాలుగక్షౌహిణీలు చేరినవి. అతిరథులు మహారథులు మహావీరులు రణాంగణమంతయు నిండియుండిరి. విచిత్రవ్యూహంబులు బన్ని నొవలెఱుంగక యోధులు యోధన మెప్పుడెప్పుడని తొందరపడుచుండిరి.

దేవవర్మబలము అక్షౌహిణియైనలేదు. యోధులు సందడి యించుకయుఁ గానరాదు. అయినను వెనుదీయక స్వల్పబలముతోనే సూర్యవర్మతోఁ బోర సన్నద్ధుఁడైన దేవవర్మ ధైర్యసాహసాదులు నరనాధులు కొనియాడఁ దొడంగిరి. ఉభయ సేనలలోని రణభేరుల మహాధ్వానంబులు భూనభోంతరాళంబులు బీటలుగావింపుచుండెను. శంఖ కాహళధ్వనులు యోధుల సింహనాదములతో మిళితములై బలములకేఁ జెవుడు గలిగించినవి.

సూర్యవర్మ యిప్పుడైన నీయల్లునిబట్టి యుపహారముగా నాయొద్దకుఁ బంపితివేని యుద్ధ మాపుజేయుదునని దేవవర్మయొద్దకు రాయబారము బంపెను. అతండు తిరస్కరించి రాయబారి నవమానించి పంపెను.

దానం గోపించి చక్రవర్తి యుద్ధమునకు నాజ్ఞ యిచ్చెనకోవనే వీరులార్చుచుఁ బేర్చిన క్రోధంబున నొక్కుమ్మడి శత్రుబలంబుపైఁ గలిసిరి. శత్రుబలంబును బరి కొనునలుకమెయిం గలియబడి మనసేనపై వాడిశరంబులఁ బ్రయోగింపఁ దొడంగిరి. ఉభయబలంబులకుఁ బెద్దయుద్ధము జరిగినది. సముద్రమువోలె విజృంభించి ప్రవాహంబునఁ బరబలంబుల వెనుకకు నెట్టుచుండెను.

అందు దేవవర్మ యల్లుఁడఁట. తురగారూఢుండై కరంబున గరవాలంబు బూని మెఱపుతీగెయుంబోలె ఖడ్గకాంతులు కన్నులకు మిరిమిట్లు గొలుప విచిత్ర గతులఁ బరిభ్రమింపుచుఁ దమబలంబుల నిలిపి శత్రుబలంబులఁ జెల్లెలికట్టవోలె నాపుజేసెను. మన యువరాజుగారు తత్తురగవల్లువిశేషంబు లరసి యందలిమర్మంబు దెలిసికొని నిజతురగమును వానిపైకిఁ దోలి కలియఁబడి యుద్ధము చేయుచుండెను. ఇరువురు పెద్దతడవు పోరిరి. తక్కినయోధులెల్లఁ బోరుమాని తద్విశేషములఁ జూచు చుండిరి. జయాజయంబులు తేలలేదు. ఇంతలో సాయంకాలసమయమగుటఁ బోరు చాలించి యిరువాగువారును నాయుధంబుల విడిచి కాల్యకరణీయంబులు దీర్చుకొనిరి. దేవా! యింతదనుక జూచి వచ్చితిమి. నేఁటివిశేషములివి. రేపు వేగువాండ్రువచ్చి చెప్పగలరు ఈపాటికి శత్రువులు లొంగియుందురు ఆవీరుని కతంబునంగాని కానిచో నిన్ననే కోట వశమైపోవును. రాత్రి గూడ మరల యుద్ధముచేయఁ బ్రయత్నించు చున్నారని యక్కడి కతలెల్ల జెప్పిరవిని చంద్రగుప్తుఁడు తదనంతర వృత్తాంతము విన మిక్కిలి తొందరపడుచుండె

మఱునాఁడు యథాకాలమునకు వార్తాహరులు వచ్చుటయు సంభ్రమముతో నాఁటేఁడు మనపక్షమునకు జయము గలిగినదియా! యని యడిగిన వాండ్రు దైన్యము తోప మహారాజా! అంతయు వ్యర్థమైనది భూమండలమున నిట్టివిపరీత మెప్పుడును జూచి యెరుంగము. వినుండు. పగలెల్ల పోరి యంతటితో విరమింపక క్రమ్మర రాత్రి యుద్ధము ప్రారంభించిరి. మనకు సేనలు చాలగావుగదా యనుగర్వమే యింత ముప్పుదెచ్చినది

రాత్రి యుద్ధము ప్రారంభించిన రెండుగడియలకు నొకమహాభూతంబు శత్రుసేనలోఁ జేరి సింహనాదంబు జేసినది. మనబలంబులన్నియు మూర్ఛవోయి కొంతవడికిఁ దెప్పిరిల్లి చూచినంత నాభూతంబు గొందగుహవలె భయంకరమైన నోరు దెరచుకొని యగ్నిజ్వాలవలె నాలుకవ్రేలాడ జీమలవలె మనబలంబుల బాదంబుల రాచుచు దోమలవలె జేతులం బరచి నోటవైచుకొనుచుండెను.

మహారాజా! కుంభకర్ణునిఁ జూచిన వానరులవలె సామంతరాజులు వీరయోధులు కాలుబంటులు పికాపికలై యాయుధములు విడిచి వాహనంబుల నుఱికి కిరీటములుజార బట్టలువీడ జుట్టులుగొట్టుకొనఁ నొకరికొకరు జెప్పక పలపరింపక గాలికొలఁదిపారఁ దొడంగిరి. శత్రుసేనలో నొక్కండును జెక్కుచెదరక యుక్కుమిగిలి మనయోధుల వెక్కిరించుచుండిరి. పెక్కేల అర్ధరాత్రమగునప్పటికి రణాంగణము శూన్యమై పోయినది కొందఱు మడిసిరి. కొందరు పారిపోయిరి. కొందరు వాని నోటిలోఁబడి

కబళములైరి. చక్రవర్తిం బట్టుకొని కాలిక్రిందవైచి నలిపి చంపెనను వార్త వ్యాపించినది.

ఎవ్వరు మడిసిరో ఎవ్వరు పారిరో లెక్కతెలియదు. వాఁడు బ్రహ్మరాక్షసుడో భూతమో దయ్యమో తెలియదు. అతి మహాప్రళయమువలెఁ బోదినది. రుద్రుండో భైరవుండో మృత్యువో యట్టి కార్యము గావించెనని చెప్పుకొనుచున్నారు. అర్ధరాత్రముదనుక సర్వసంహారముగావించి యాభూతమెందేని బోయెను. ఇంతవట్టు చూచి పారిపోయివచ్చితిమని చెప్పిరి.

ఆకథవిని పృథివీపతి యంతస్తాపముఁగావింపుచు కుశుఁడేమయ్యె సుకుమారుఁడు సేమమా? అని అడిగిన వాండ్రు దేవా! మాకెవ్వరును గనంబడలేదు. ఎవ్వరి నడుగుదుమా మాటాడిన వాఁడుపచ్చిమీఁదఁబడునేమో అని కిక్కురుమనక మెల్ల మెల్లన దప్పించుకొని పారిపోయి వచ్చితిమి. శత్రుసేనదెస వసియించిచూచుటచే మేము బ్రతికితిమిగాని లేకున్న మేమును నీపాటికి శమన లోకాతిథులమై యుందుమనిచెప్పిరి.

పోపొండు మనవారి సేమము తెలిసికొనక వచ్చితిరేల? వారేమైరో తెలిసికొని వేగమరండు అని నియోగించి రాజు ఆ వృత్తాంతము రతితోను ధర్మవతితోను జెప్పి పరితపించుచు దూతలరాకకు నాతురపడు చుండెను.

మరునాఁడు రెండుగడియల ప్రొద్దెక్కినప్పటికి సందేశహరులు వచ్చుటజూచి పౌరులు హాహాకారములు గావించిరి. వాండ్రు రాజనగరకిం బోయి ఱేనింజూచి యేమాటయుం జెప్పనేరక గోలుననేడువఁ దొడంగిరి.

రాజు హృదయము భేదిల్ల ఆ! ఏమీ! దైవమా తలఁచినట్లె జరిగినదియా యని యేడ్చుచుఁ జెప్పుఁడు చెప్పుఁడు నా కుమారుఁడును అల్లుఁడును అదుష్టరాక్షసునికిఁ గబళములైరా అని అడిగిన వాండ్రు దేవా! మానోటితో దేవరకు దుష్టవార్త జెప్ప వలసివచ్చినది. ఆపాడు భూతము కిరీటములు ధరించిన యోధుల నందఱనుఁ నేరిచదియ గొట్టి యిద్దరిద్దరిఁగలిపి కాళ్ళకుఁలంకెలుగట్టి గుదిగా మెడమీఁద వేసికొని తీసికొని పోయినఁదట మనవారినిద్దరింజంపి యొకేలంకెవైచి మెడమీఁదవైచి తీసికొని పోయినట్లు చెప్పినారు మహాప్రభూ! అని గద్గదస్వరములతోఁ జెప్పి యేడువఁదొడంగిరి. నృపాలుండు నేలంబడి యొడలెఱుంగక కొట్టుకొనుచుండెను. మంత్రులు సేదదేర్చి యోదార్చుచు నంతఃపురంబునకుఁ బంపిరి.

అతండు భార్యపైఁబడి వాపోవ ధర్మరతి నిరతిశయ ధైర్యావలంబిమతియై

మనోహరా! నీవిట్లేల పరితపించెదవు? సంసారము బూటకనాటకమని నేను మొదటనే చెప్ప లేదా? విషయభరసంబులు అంత విరసంబులు కావా? సంబంధులు ఋణసంబంధులు కారా? రతియుఁ గుణుఁడు సుకుమారుఁడును గపటముజేసి లవుని విరతింబురంబునాయఁ జేయలేదా? ఆపాతకమూరకపోవునా? విరక్తులగువారి వియోగమున మీకిట్టి చింతయేల గలుగలేదు. ఈరతియుఁ గుణుఁడు యౌవన మదంబున విఱ్ఱవీఁగుచు నామాటలు పాటింపక ప్రపంచకమేనిత్యమనియు, కామక్రోధాదులు జీవికిఁ దప్పక భరింపఁ దగినవనియు వాదించిరి. ఇప్పుడేమైనది? యేదినిత్యము ఇప్పుడు మీకుఁ బ్రపంచక మెట్లున్నది. అసహ్యముగాఁ గనంబడుచుండలేదా? నాఁడేమంటిరి సర్వదా అట్లే తలంచిన పరితాపము గలుగదుగా! ఇప్పుడైన వేదాంతావబోధము గావించుకొని వనంబునకుఁ బోవుదము రండు. రాజ్యభోగంబుల విడువుడు. ఇదిమనకు దైవము ప్రకారముగానే కావించెనని యుపదేశించిన విని యజ్ఞసతి యప్పలుకులు సరకుగొనక నేలంబడి పొరలుచున్న కూఁతునకిట్లనియె.

పుత్రీ! నీభర్త సుకుమారుఁ డసమానపరాక్రమశాలి అనియే విజయముగైకొని పేరుపొంది వచ్చుననియుం గుమారు జతజేసి పంపితిని. ఇట్టి అవస్థ పట్టునని యెఱుఁ గముగదా? వట్టి సేనలంబంపిన గాదనువారెవ్వరు? చక్రవర్తి మెచ్చుకొని మాకే కానుకలిచ్చునని మురిసితిని. అయ్యో! యే భాగ్యము పట్టినదికాదు. ఇప్పుడేమి జేయుదును నిన్నెట్లు భరింతును. ఎవ్వరిఁజూచికొని కాలము గడుపుదును మీ అమ్మ వట్టి వెఱ్ఱిది. మాట్లాడిన సర్వము మిథ్య అడవికిఁ బోవుదములెమ్మని పలుకుచుండును. హా! పరమేశ్వరా? అని విలపించెను.

అప్పుడు రతియు భర్తృసోదరుల గురించి పరితపించుచుఁ జెల్లెలిని, భర్తను నిష్కారణముగా అడవులపాలు సేసినందులకుఁ దనకిట్టి కష్టము గలిగినదని నిశ్చయించి పశ్చాత్తాపము జెందుచుఁ దల్లికి నమస్కరించి తనకు వేదాంతోపదేశము జేయుమని కోరికొనినది. అభావే విరక్తి యనేమాట నిక్కువముగదా!

వారట్లు దుఃఖసాగరమున మునింగి పరితపించుచుండ మరికొంత దినములు గడిచిన పిమ్మట మఱికొందఱు వేగులవారు వచ్చి యిట్లు విన్నవించిరి

మహారాజా! అద్భుతమంతటితో విడువక అమ్మరునాఁడొక యౌవనపురుషుని తీసికొనివచ్చి చక్రవర్తిసింహాసనమున గూర్చుండబెట్టినది.

క్రొత్తచక్రవర్తి మిక్కిలి తేజశ్శాలియై యున్నవాఁడట. హతశేషులైన సామంత రాజులు మంత్రులును అతనియానతి శిరసావహించి కార్యాకార్యములు చేయుచున్నారు. అతని యాజ్ఞానుసారముగా సహాయము వచ్చి యుద్ధములోఁ జనిపోయిన నృపకుమా

రుల పేరులు వ్రాయబడిన పత్రిక యొకటి కోటగోడకు తగిలింపఁబడియున్నది. ఆయా సామంతరాజులకుఁ దెలియఁజేయుఁడని చక్రవర్తియాజ్ఞ యిచ్చియున్నాడట. (దగుత్తికతో) నాపత్రికలో మనవారి యిద్దరి పేరులు వ్రాయఁబడియున్నవి స్వామీ! మేమనాథలమైపోతిమి మహారాజా! అని చెప్పి దుఃఖించిరి.

ఆవృత్తాంతము విని వారి మరణమునకు వగచుచు అపరసంస్కారములు గావించెను.

అని యెఱింగించి... ఇట్లని చెప్పఁదొడఁగెను.

## 140 వ మజిలీ.

# కుశసుకుమారులకథ

అయ్యో! కాలమా! నాకెంత చెడ్డదానవైతివి. మదీయ చరణసఖపసారిత కిరీటుం డగు వీరకేసరిచేత గాండీవునిఁగావించి భార్యాపుత్రికలతో నన్నిట్టులవనములపాలుగావింతువా? హా విశోకా! బాహుబలనిర్జిత సకల నృపకుమారుండగు సుకుమారుండును నిర్వక్రమ పరాక్రమ విశాలుండగు కుశుండును బ్రహ్మరాక్షసునివేఁటఁ బడుటంబట్టిగదా! నన్నిట్లు రాజ్యభ్రష్టుని గావించి పురినుండి వెడలఁగొట్టితివి! అక్కటా కుసుమసుకుమారవతియగు రతియు అత్యంతమృదుగాత్రియైయెప్పు ధర్మరతియుఁ గాళులు పొక్కులెక్క నూర్పుల నిగుడింపుచు నడుగామడ పడపున్నశ్రమయడర నడుచుచుండు నిడుసు జూచి నాయెదదకడు చిదుములై పోవుచున్నదిగదా! సీ! నావంటి అభాగ్యుఁ డెందును లేఁడు కొడుకు లిరువురుం బోయిరి. అల్లుఁడు గంతుగొనిరి. రాజ్యంబు శత్రునృపాక్రాంతమైనది. నగరసుఖంబు లాకాశకుసుమంబులైనవి. పరిజనులు వదలిరి. ఆశ్రితులు విడిచిరి జరతలకెక్కినది. ఇట్టివేళగూడ నేనెట్టి సుఖం బనుభవించుటకుఁ బోవుచుంటినో తెలియదు. ఇఁక మరణము కన్న నాకొండు శరణములేదు ధర్మరతి చెప్పినమాట లానాఁడు తలకెక్కినవి కావు. ఇప్పుడు స్మరణ వచ్చుచున్నవి. ప్రేయసీ! నాకిప్పుడు మంచిమాటలం జెప్పి యుల్లము నలువజెట్టుము పుత్రీ! రతీ! నీయవస్థ జూచుచుండియుఁ బ్రాణములుదాల్చియుంటి నాయెంటి కఠినహృదయుండెందైనంగలఁడా యని దుఃఖించుచు నొక్కచెట్టు క్రిందఁ జతికిలఁబడిన చంద్రగుప్తుని నూరడింపుచు ధర్మరతి యిట్లనియె.

ప్రాణేశ్వరా! కొడుకులును గోడండ్రును గూతుండ్రును మీరు బుట్టినప్పటి కుండిరా? నడుమవచ్చిరి. నడుమపోయిరి. వారికొరకు విచారమేమిటికి? మొదట నుండియు నేను వారి నస్థిరులుగానే తలంచుచుంటిని. నాకు మనుపుసంతోషమును

లేదు. ఇప్పుడు విచారమునులేదు ఒకరికొకరి సంబంధములేదు. సంబంధము లద్దివే కావున అస్థిరములని యెఱింగినఁ దద్వియోగము దుఃఖమునకుఁ గారణము కానేరదు. మనము తపోవనంబునకుఁ బోవుచుంటిమి. విచారింపవలదు. అడియునుంగాక మన పుణ్యము మంచిదైనచో నిందును మేలు గలుగ వచ్చునని యుపదేశించినది.

రతికి మతిపోయినది. తల్లిమాట లేమియు లక్ష్యము సేయదు అమె పిచ్చిదని యాయువతి అభిప్రాయము. అట్లు శోక సాగరమీదుచు వారు ముగ్గురు. అడవిమధ్యమునుండి పోవుచుండ నొకదండ సుకుమారుఁడును గుణుఁడును నెదురుపడిరి.

దూరమందుండగనే గురుతుపట్టి చంద్రగుప్తుఁడు అమ్మా రతీ ! అదిగో ! నీమగఁడు వాఁడే నీసోదరుఁడు వీరిద్దరు మృతినొంది పిశాచములై అడవులఁ దిరుగుచున్నారు కాఁబోలు. అయ్యో ! వీరు దుర్మరణము నొందుటచే వీరికిట్టి పిశాచత్వము వచ్చినది. ఇప్పు డేమి చేయఁ దగినది ఏమికావలసిన అది పెట్టగలము. మనమీదఁ బడి చంపరు గదాయని బెదురుగదురఁ బలికిన విని రతి నాయనా ? మనయందు వీరికి ప్రీతియుండదా ! వెనుకటి ప్రేమ యంతయు మరతురా యేమి మనము వచ్చితిమనియే వీరు చూచుటకు వచ్చిరని తలంచుదును. నాకేమియు భయములేదు. దాపునకుఁబోయి మాట్లాడెదను జూడుఁడు అని ముందరకు నడవఁబోయిన వారించుచుఁ దండ్రి అమ్మా తొందర పడకుము మృతినొందిన తరువాత ప్రేమలెట్లుండునో తెలియదు. పిశాచములైన వారికి వెనుకటిస్మృతి యుండదు. నిలునిలు నిదానించుమని పలుకుచు గదంత మెల్లగా నొక చెట్టుక్రిందఁ గూర్చుండెను.

ఇంతలో వారిద్దరును నాచెట్టు క్రిందకువచ్చి కూర్చుండి చంద్రగుప్తు మీదేయూరని అడిగిరి. అయ్యో ! బాబూరా ! మీకిట్టి యవస్థ పట్టినదా ! ప్రేతలైపోయితిరా ? మీకేమికావలయునో చెప్పుఁడు అని గద్గదకంఠముతో నడిగినవారు వారిం గురుతుపట్టలేకపోవుటచే నెందులకో యేడ్చుచున్నారని మఱేమియుఁ బ్రశ్న వేయకయందే కూర్చుండిరి.

రతి నిలువలేక హా ప్రాణనాథా నీవు గతాసుడవై పిశాచరూపము ధరించితివా మీ పాదము లిట్లు ముందరకే యున్నవేమి ? పిశాచములకు మడుమలు వెనుకకుండునని చెప్పుదురే! మీరిచ్చటికేల వచ్చితిరి. అని అడిగిన వారు మీరెవ్వరోముందు జెప్పిన మా వృత్తాంతము వెనుక జెప్పెదమనిన రాజు ఇట్లనియె.

అయ్యా ! భూతములారా ! నేనొక దౌర్భాగ్యుఁడను నాకు వెనుకటి జన్మమున రాజ్యము గలదు. అల్లుఁడును కొడుకు చక్రవర్తికి యుద్ధములో సహాయము వెళ్ళి బ్రహ్మరాక్షసునిచేఁజంపఁబడిరి. సైన్యముతో నావీరులిద్దరు సమయుట దెలిసి

కాని మాకు నాజన్మ శత్రువైన విశోకుఁడను రాజు మానగిరిపై దండెత్తి మమ్ముఁ బారఁదోలి రాజ్యమాక్రమించుకొనియెను తద్భయంబున బురము వెడలి యేకాంతముగా అడవులంబడి పోవుచుంటిమి ! నాపేరు చంద్రగుప్తుఁడు ఇది నా భార్య ధర్మరతి. ఇది నా కూఁతురు. మీరూపములు జూడ మావారి పోలికగానున్నవి. మీవృత్తాంత మెఱింగింపుఁడని పలికిన వారిద్దరు నేలంబడి మూర్ఛిల్లి అంతలోఁ దెప్పరిల్లి హా ! మీకెంతకష్టము వచ్చినది. అయ్యో ! మేమే వారము మీరూపములు మారిపోవుటచే మిమ్ము గురుతుపట్టలేక పోయితిమి. మేము జావలేదు. దైవికముగా బ్రతికితిమి ఇంటికి వచ్చుచుంటిమి. దారిలో మీరు గనంబడితిరని నొడివినఁ జంద్రగుప్తుఁడిట్లనియె

మిమ్ము బ్రహ్మరాక్షసుఁడు భక్షించెనని మాకుఁ జక్రవర్తి జాబు వ్రాసెనుగదా! మీరెట్లు బ్రతికితిరి ? నాకేమియు నమ్మకములేదు మీకథచెప్పి నమ్మించుఁడని అడిగిన వాండ్రిట్లనిరి.

అమ్మహాఘోరసంగ్రామములో నిలువరించి కుశుఁడును నేనుతురగారూఢులమై పోరుచున్న సమయంబున నొక మహాభూతంబద్భుత సాధ్వసావహంబగుచు వచ్చి సైనికుల గబళములభాతి మ్రింగుచు రథికులనేరి చదియగొట్టి గదులుగట్టి మెడపై వేసి కొని విట్టలివరఁదను నెలవునకుఁ దీసికొనిపోయి అందొకచెట్టు కొమ్మకు మా గుదిదగిలించి యితర శవముల రక్తమాంసముల భార్యతో నారగింపుచు నాట్యము సేయుచుండెను. మాకాయుశ్శేష ముండబట్టి వాఁడుమమ్ము జావగొట్టినను మా ప్రాణములు దేహమును విడిచినవికావు గింగిల గొట్టుకొనుచుఁ గొమ్మల వ్రేలాడుచుంటిమి. పుణ్యాత్ములన్నిచోట్లను గలరు. అందొక చిన్నది మాపరితాపము చూచిమెల్లగ వచ్చి మాకాళ్ళకట్లు విప్పి అవ్వలికిఁ బొమ్మని సంజ్ఞ జేసినది. అట్టి మహోపకారము గావించిన అమ్మించుఁబోఁడి కేడియేని యుపకారము చేయవలయునని తలఁచి నాచేతియుంగరమిచ్చి కోమలీ! మేమొక దేశమున నధికారులము నీకతంబునఁ బ్రతికితిమి. నీవెవ్వతెవో తెలియదు నీకుల శీలనామంబులు వినుట కవకాశములేదు. నీవెన్నఁడైన దెసపికి వచ్చినచో మాదేశమునకు రమ్ము. ఈయుంగర మానవాలిమ్ము దగిన మేలు గావింతుమని చెప్పుచు అందు నిలిచినవాఁడు దడవుగలఁడని వెరపుతో డొంకడొంకల సందు నడంగి వడిగనీవల బడితిమి మృత్యుముఖంబు దాటినట్లుగా సంతోషించుచు అది ఏదేశమో తెలియక అరయుచుఁ గొన్నిదినములకు నాప్రాంతమందలి యొక పల్లెజేరితిమి.

ఆ రాక్షసునిచేతి దెబ్బతో యమలోకము జూచివచ్చితిమి రక్తమాంసములు క్షీణించినవి. నడువశక్తి లేకున్నను నాభూతిభీతిచే నెట్లో అడవి దాటితిమి. అక్క

దక్కుడు బల్లెలయందు నివసించి దొరకిన యాహారమువలన దేహమును గాపాడుచు మకదేశమునకు దారి దెలిసికొని మెల్లగా నడుచుచు నీ మార్గమున వచ్చుచుంటిమి. ఇందుమీరు గనంబడితిరి ఇదియే మావృత్తాంతము మమ్ము బ్రేకంగానుండిమీరు బెదరితిరి. మేమట్టివారమని తలపవలసినదే కాని ఆరిష్టన్నది మాకు దైవములాగున వచ్చి విడిపించినది. అని యావృత్తాంత మంతయు నెఱింగించిన విని యారాజు వారిం గౌగలించుకొని ప్రహర్ష సాగరంబున మునింగెను. రతియు అతిశయమగు విస్మయముతో వారి పాదంబుల కొరగి హృదయపరితాప మెఱింగించెను. ధర్మరతి మందహాసము గావించుచు నీశ్లోకము చదివినది.

శ్లో. వనె రణె శత్రుజలాగ్ని మధ్యె మహార్ణవే పర్వతమస్తకె వా,
సుప్తంప్రమత్తం విషమస్థితం వా రక్షంతి పుణ్యాని పురాకృతాని.

మీపూర్వకృత పుణ్యమే మిమ్ము రక్షించినది. అని పలికి మఱియు నిట్లనియె. మీరు ప్రకృతి నిరతులుగారా? సర్వము స్వశక్తి చేతనే నడుచునని చెప్పుచుండువారె! ఇప్పుడామాట లేమైనవి. ఇప్పుడైన పెద్దల మాటలయందు విశ్వాసముంచుదురా? అని పలికిన నామె వెఱ్ఱిదానిగా దలంచి అందులకేమియు నుత్తరమిచ్చిరికారు.

అప్పుడు సుకుమారుడు శోకగద్గద కంఠుడై మహారాజా! విశోకుడు మిమ్ము బురిసంది లేవగొట్టెనా? మంత్రులెవ్వరును సహాయము చేయలేదా? అయ్యో! యీయాడువాండ్రతో గూడికొని విపినంబున నెట్టికష్టముల గావించితిరి. అచ్చట వృత్తాంతము మరల నొడువుడు కర్తవ్యమాలోచింతమని పలికిన విని చంద్రగుప్తుడు కన్నీరుగార విశోకుడు మనపై నెప్పుడు సిసుబారియేయున్న వాడుగదా? సైన్యాధిక్యము దలంచియు మీశౌర్యముదలంచియు నివురుగప్పిన నిప్పువలె నణగియున్నాడు. సైన్యమంతయుదీసికొని మీయిరువురును చకవర్తికి సహాయముపోయి మకిసిరనువార్త వినినతోడనే పయ్యెరకు రవులుకొను నగ్నివలె విజృంభించి సేనలతో వచ్చి పట్టణము చుట్టవేసెను. మంత్రులు మీకు బలాయనమే మానరక్షణము అని నాకుదెలియజేసిరి. యుద్ధముసేయుటకు సేనలులేవుగదా? విశోకుడు గడు దుర్మార్గుడు స్త్రీలచెరబట్టగలడు అని బెగడుజెంది కట్టుగుడ్డలతో గోటవిడిచి మానుదారిబొరివోలవచ్చితిమి. నాకోడలు పుట్టినింటకడ నుండుటచే నికాయాపద దప్పినది. మేము మావృత్తము అడవులంబడి యాకలములబడినచు డిబుగుచుంటిమి రాజ్యమయినం బోవుగాక మీరు గనంబడితిరి. ఇదియు పదివేలు. ఇంకొకచో నాశ్రయము గల్పించుకొని తపంబుగావింతము. ఇంటికి బోవలనని పలికిన ధర్మరతి పరమానంద భరితస్వాంతయై యదియే వకర్తవ్యమని చెప్పినది.

సుకుమారుండు మీసముపైఁ జేయివైచుచు నేమీ యనఁదలఁచవలె శత్రువులకోడి మనమీవిపినముల వసింపవమా! యెంతమాట బలికితిరి. చతురుపాయముల వినియోగించి యెట్లో రాజ్యము సంపాదింపక విడుతుమా వదుఁడు. పదుఁడు ప్రచ్ఛన్నముగా నగర మునఁ దిరిగి మర్మముల నరసి సమయమెఱిఁగి వైరిం బరిభవింతమని చెప్పిన నామాటఁ గుశుఁడును రతియు బలపరచిరి.

ఆమాటవిని రాజు అయ్యో మనకు బలములులేవు ఆయుధసాధనములు శూన్యము ధనహీనులము శత్రువుదుర్గముల గట్టిపరచికొని యాక్రమించియుండెను. మనలందెలిసె నేని బలవంతమున జంపింపకమానఁడు. అంతయేలవచ్చె. వనంబులఁ దపంబుసేసికొని సుఖంబుగఁగాలము గడుపరాదా! అనిచెప్పిన విని కుశుఁడు తండ్రినాక్షేపించుచు నిట్ల నియె

మాతల్లి వేదాంతలను నేర్పను వచ్చినదికాఁబోలు వనవాసక్లేశము లనుభవించి తొల్లి పాండుసుతులు రాజ్యము సంపాదించుకొనలేదా? మాకుబలము లేకున్న బంధు వుల నాశ్రయించి సేనలంగూర్చుకొందుము. మిత్రుల నాశ్రయింతుము అని చెప్పి తండ్రి నొప్పించెను. క్రమంబున నరణ్యములుదాటి పర్వతముల నతిక్రమించి యొక నాఁడు వేకువజామునఁ దమరాజధానికింబోయి మారువేషముతో వికటదంతుండను పురోహితునియింటికిబోయి తమ్మెఱింగించి కొన్నిదినములు మీయింట వసింతుము తావిమ్మని కోరికొనిరి.

# వికటదంతుని కథ

వికటదంతుడను బ్రాహ్మణుఁడు కడుదుర్మార్గుఁడు. కృతఘ్నుఁడు. రాజువలన ననేకదానములంది గొప్పవైభవముతో నొప్పుచుండియుఁ గ్రొత్తరాజు నాశ్రయించి యున్నకతంబున నిట్లనియె.

మిమ్ము నాయింట దాచితినేని విరోధునికిఁ దెలియక మానదు ఎఱింగిన భార్యా పుత్రాదులతో నన్నతఁడు నాశనముచేయకమానఁడు తనకుమాలినధర్మముండదుగదా? మీపుణ్యము. మీరు మాయింట నుండవీలులేదు మఱియొకచోటికిం బొండని యుత్తరము జెప్పెను.

అమాట విని కుశుఁడు నీవు మావలన ననేకోపకారములు పొందితివి. ఈ మాత్రము సదుపాయము చేయలేవా? నీకేమియు భయము రానీయము. పదిదినములు చోటిమ్ము నీమేలు మరువమని యెంతబ్రతిమాలినను నాబ్రాహ్మణుఁడు అనుమతింప లేదు. వేగ మవ్వలికిఁ బొండని తొందరపెట్టెను.

వానికృతఘ్నతకు మిక్కిలి యక్కజమందుచు వారు మఱియొక మిత్రునిం టికింబోయి తమ్మెఱింగించి కొన్నిదినములు నిలువనెలవిమ్మని కోరికొనిరి.

ఆవైశ్యుఁడు వానియెడఁ గతజ్ఞతాపూర్వకముగా వారిస్థితినిగురించి పరితపించుచుఁ దన యింట దాచిచ్చి రహస్యము బయలుపడనీయక కాపాడుచుండెను.

చంద్రగుప్తుఁడు తన కత్యంత ప్రియమిత్రుఁడైన వజ్రదత్తుని కొకజాబు వ్రాసి యావైశ్యునిమూలముగ నతనియొద్ద కనిపెను. విశోకునిచే నోడింపఁబడి మేము ప్రచ్ఛన్నముగా నీనగరమున వసియించియున్నవారము. మాకుఁ గొన్ని సాధనములును సేనలుం బంపితివేని వీనిం బరిమార్చి రాజ్యము మేము గైకొందుము. దీనదశ నుంటి యున్న మాకిపాటియుపకారము జేయవలయునని యాజాబునందున్నది.

ఈలోపల వికటదంతుఁడు విశోకునొద్దకుఁ బోయి చంద్రగుప్తుఁడు భార్యాపుత్రులతో వచ్చి ప్రచ్ఛన్నముగా నీయూరఁ బ్రవేశించి యున్నవాఁడు. నన్నుఁ దాపీయమని యడిగిన నిచ్చితినిగాను. ఎంత ప్రచ్ఛన్నముగా వసియించి యున్నఁవాడు. నీయంతరములు వెదకుచుండును. మీకు హితుఁడగాన నింతజెప్పితినని యెఱింగించిన నతఁడు అదియుచు, వానిజాడ దెలిసికొనుటకుఁ బెక్కండ్రురాజపురుషుల గూఢచారుల నియోగించెను.

ఒకగూఢచారుఁడెట్లో జాడఁగనిపెట్టి వైశ్యగృహ సంస్థితులగు వారియుదంతయు తెలిసికొని విశోకునికిఁ దెలియజేసెను అతండు దండనాథపురస్సరముగాఁ బెక్కండ్ర దూతలనంపి హఠాత్తుగా వారినందరం బట్టుకొని నిగళములు దగిలించి కారాగారంబునఁ బడవేయించెను.

అని యెఱింగించి...

# 141 వ మజిలీ.

# సూర్యవర్మ కథ

ఆహా! దైవము ధర్మమునందు వసియింపఁడా? దైవమే వచ్చి మనకుఁ దోడ్పడి మనశత్రువగు సూర్యవర్మం గడతేర్చెను. అని దేవవర్మ యల్లునితోఁ గూతురితో ముచ్చటించుటయు యమున యమ్మహాభూతస్వరూపుండైన పరమేశ్వరుండు చక్రవర్తిస్థానంబున మఱి యెవ్వరినో నిలిపెనని చెప్పుకొనుచున్నవారు మీకేమైన వర్తమానము దెలిసినదా? వార్తవచ్చినదా అని అడిగిన నది కింవదంతియేకాని నిజమైన వార్త దెలియదని అల్లుఁడు జెప్పెను.

ఆమాటలోనే యొకదూతవచ్చి వాకిట నిలిచి చక్రవర్తిసందేశ పత్రిక లోపలి కనిపెను. అదివిప్పి చదువ నిట్లున్నది.

దేవయజ్ఞాగ్రహార కాపురస్థుఁడగు నగ్నివర్మకూఁతురు సురన అల్లునిపై

తెచ్చిన అభియోగములో నీవతనియందుఁగల పక్షపాతంబున వానిని శిక్షింపక విడిచి యల్లునిఁ జేసికొంటివనియు నందులకై అతండు సూర్యవర్మయొద్ద మరలఁ దగవు చేయక నీయల్లుని నపరాధివోలె సంకెళులు దగిలించి పంపమని మీకు నాజ్ఞాపత్రికలు వ్రాయగా దిరస్కరించినందులకుగాను పెద్దయుద్ధము జరిగినదిగదా? అందు సూర్యవర్మ నిహతుండయ్యెను. వానిస్థానమందు నేను రాజుగావచ్చి పీఠ మెక్కితిని. ఇప్పుడా బ్రాహ్మణుఁడు వచ్చి అయ్యభియోగము నన్ను విమర్శింపుమని కోరుచున్నాడు. ఇందులగుఱించి మీకు యథార్థము తెలిసినట్లు మీరు వ్రాసిన పత్రికలలో నున్నది ఇప్పుడు మఱియొకసభ జేయుచుంటిని. ఆసభకు సామంతరాజులనెల్ల రప్పించుచున్నాను. అందు రాజులలో రాజులకుఁగలిగిన తగవులను విమర్శించి యందఱి యభిప్రాయములం గైకొని న్యాయమెట్లో యట్లు కావించువాఁడ ఇందులకుఁ మనలోనునకు విరోధ మవసరములేదు. కావున నాసభకు మీరును, మీయల్లుఁడును దయచేయవలయును స్త్రీసహితముగా రావచ్చును. అందరకును దగినబస లేర్పరుపఁబడి యున్నవి. మీమీ బిరుదములతో, వాహనంబులతో రావచ్చును.

అనియున్నపత్రిక జదివికొని, యాహా? క్రొత్తచక్రవర్తి యెంత మంచివాఁడు. ఎంతన్యాయవేత్త. ఎట్టి వినయశీలుఁడు. అని పొగడుచు దేవవర్మ యమునతో నీవు గూడ నాసభకురమ్ము ఆమహాసభలో సురసయొక్క యౌచిత్యము దెలియజేయుదము అనుటయు నామె యంగీకరించినది యల్లుఁడును సమ్మోదించి సభనాఁటికి బాటలీపురంబున కఱిగి యందుఁ దమకై యేర్పరచిన నెలవున వసియించెను.

మఱియు నతని యధికారముక్రింద సామంతరాజులెల్లఁ దమతమ సేనలతో వాహనములతో మంత్రులతో వచ్చి నగర మలంకరించిరి. వజ్రసత్త్వుఁడు విశోకునిచేఁ జంద్రగుప్తాదులు క్రమముగా బద్ధులై చెరసాలం బెట్టఁబడిరని వైశ్యునిచే విని యాయన్యాయ మాసభలో విమర్శింపుఁడని చక్రవర్తికిఁ బత్రికాముఖంబునం దెలియఁజేసెను. దానంజేసి చక్రవర్తి చంద్రగుప్తాదులతో నాసభకురమ్మని విశోకుని కాజ్ఞాపత్రిక బంపియున్నకతంబున నావిశోకుఁడు చింతావ్యాకులచిత్తుడై వారితోఁగూడ నాసభనాఁటి కాపీటికి జనుదెంచెను.

మఱియుఁ గొందరురాజులు తమలోఁ దమకుగల తగవులన్నియు నాసభలో విమర్శింపఁబడునని సంతసించుచుఁ దగిన సన్నాహముతో నానగరమున కరుదెంచిరి.

నిరూపిత దివసంబున సమున్నతవిశాలంబగు సభాభవనంబునఁ జక్రవర్తి పీఠములకుముంగల రెండుశ్రేణులుగా వేయఁబడిన పీఠములపై సామంతరాజులు తమ తమ యధికారము ననుసరించి తారతమ్యముగాఁ గూర్చుండిరి. ఆపీఠముల వెనుకటి పీఠములపై వారికుమారులు, బంధువులు, మిత్రులు గూర్చుండిరి. మఱియుఁ బండితులు హితులు పురోహితులు లోనగువారు సభ నలంకరించిరి. చక్రవర్తియు భార్యయు వచ్చి పీఠ మెక్కినతోడనే సామంతులెల్ల లేచి కరతాళములు వాయించుచు జయజయ

ధ్యానములు గావించిరి. చక్రవర్తి వారినెల్లఁగూర్చుండనియోగించి తాను సింహాసన మలంకరించెను.

అప్పుడు ప్రధాని చక్రవర్తియెదుట దాపుననున్న పీఠప్రాంతమందు నిలువంబడి సామాంతరాజుల పేరులు జదువుచుండ వచ్చినవారెల్ల జేతు లెత్తుచుండిరి. చంద్రగుప్తుఁడు అని చదువువరకుఁ బ్రతివచనము వినంబడమిఁ జక్రవర్తి శంకించుచు, నాచంద్రగుప్తుఁ డేమిటికి సభకు రాలేదు? అతనిపీఠము శూన్యమై యున్న దేమి? అని యడిగెను. అప్పుడు విశోకునికి గాళ్ళు గజగజ వడకుచున్నవి.

వజ్రదత్తుఁడు లేచి మహారాజా! ఆరాజు నాకు మిత్రుఁడు విశోకుఁడనురాజు చంద్రగుప్తు నన్యాయముగాఁ రాజ్యమపహరించి చెరసాలం బెట్టెనని యిదివరకే దేవరకు విజ్ఞాపనపత్రిక బంపికొని యుంటిని. ఈమహాసభలో నావిషయము విమర్శింతువని సెలవిచ్చితిరి. ఆ రాజు బద్ధుడై యిప్పటికిఁ దీసికొనిరాఁబడెను. ఆ తగవే ముందు విమర్శింపవలయు. మహాప్రభూ! అని చెప్పికొనఁగాఁ జక్రవర్తి కన్ను లెఱ్ఱజేసి, విశోకుఁ డెందున్న వాఁడు? అని కేక పెట్టించెను.

విశోకుఁడు పీఠమువిడిచి నిలువంబడి, నేను మహారాజా! అని ప్రతివచనమిచ్చెను. చక్రవర్తి యతని బీఠముదాపునకురమ్మని నీవేమిటికిఁ జంద్రగుప్తుఁ జెరసాలం బెట్టించితివని అడిగెను. రాజధర్మమున నతని నోడించి రాజ్యము గైకొంటి శత్రువు ప్రబలుడని చెరసాలం బెట్టించితినని యుత్తరము జెప్పెను.

అప్పుడు చక్రవర్తి సోపహాసముగా విశోకా! ఇప్పుడు నేను నీకంటె నధికుండనై యుంటిని నిన్నుఁ జెరసాలం బెట్టించి నీరాజ్యంబు లాగికొనిన నీరాజులందరు సమ్మతింతురేమో యడుగుము అది రాజ ధర్మమేమో తెలిసికొనుము. అనుటయు నామాటవిని అందున్నరాజులెల్ల నతఁడు అన్యాయముజేసెనేని కేకలు పెట్టిరి.

అప్పుడు విశోకుఁడు మోమున విన్నదనంబుదోపఁ జేతులునలుపుచుఁ చిత్తము. చిత్తము. తప్పుజేసితి రక్షింపుమని వేడికొనియెను. చక్రవర్తి, నీతప్పు పిమ్మట విమర్శింతుము నీవుపోయి యాచంద్రగుప్తుని సపరివారముగా విముక్తుంజేసి యిప్పటికిఁ దీసికొనిరమ్ము. పొమ్ము. అతఁడు వచ్చుదనుక నేమియు విమర్శింపవలనుకాదు. అని పలికినతోడనే విశోకుఁడు పరుగున బోయి యాన్నపతి జామాతృ సుత సహితముగా నిగళములు విప్పించి పాదంబులంబడి వేడికొనుచు నాసభకుఁ దీసికొనివచ్చెను.

చంద్రగుప్తుఁడు చక్రవర్తికి నమస్కరించుచుఁ దన పీఠము మ్రోల నిలువఁబడి మహారాజా! నాసుతుఁడు కుశుఁడును, అల్లుఁడు సుకుమారుఁడు సైన్యములతో వెనుకటి చక్రవర్తికి సంగరమున సహాయమువోయి అందు బ్రాహ్మరాక్షసునిచే జంపఁబడినవార లెరిసి కొని యీ క్రూరుఁడు విశోకుఁడు నన్నసహాయునిగాఁ నెంచి దుఃఖ సముద్రములో మునిఁగియున్న సమయంబున నాపట్టణము ముట్టడించి నన్నద

వులపాలు గావించెను. దైవ వశంబున నాకుమారుఁడును నల్లుఁడును, బ్రతికి అడవిలో మాకెదురుపడిరి. మేము తిరుగ మానగరము జేరుకొని యొక వైశ్యునియింటిలో నుండగా వికటదంతుని మూలమునఁ దెలిసికొని చెరసాలం బెట్టించి చిక్కులఁ బెట్టుచున్నాఁడురి అని తన వృత్తాంతమంతయు నారాజులెల్ల వినఁ జక్రవర్తికిఁ దెలియ జేసెను.

అపుఁడు చక్రవర్తి చంద్రగుప్తుని దాపునకు రప్పించుకొని రాజా! నీకు బిడ్డ లెందరు?

చంద్రగుప్తుడు...ఇద్దరు మగవాండ్రు, యిద్దరు ఆడువాండ్రు.

చక్రవర్తి...వారి పేరులేమి?

చంద్ర...లవుఁడు, కుశుఁడుమగవారు. రతి విరతులాడువాండ్రు.

చక్ర...వారందరికి వివాహము గావించితివా!

చంద్ర...చేసితిని.

చక్ర...నీయల్లుం డెవ్వరు?

చంద్ర...పెద్దవాఁడీసుకుమారుఁడు రెండవకూఁతుమ్న నల్లుఁడు మాయొద్ద లేరు. దేశాంతరం మరిగిరి.

చక్ర...అల్లుఁడే రాజకుమారుఁడు.

చంద్ర...రాజపుత్రుఁడు కాడు. సామాన్యుఁడే.

చక్ర...సామాన్యుఁడనఁగా సామంతుఁడా యేమి?

చంద్ర...కాడు ఒక జంగమదేవర.

చక్ర...శివశివా! అదియేమి యన్యాయము. ఆ జంగమదేవరకిచ్చితివేమి?

చంద్ర...అందులకొక కారణమున్నది దేవా! (అని యావృత్తాంతమంతయు నెఱింగించెను.)

రాజులందరు విస్మయమునజెందిరి. పెద్దకుమారుఁడు విరక్తిజెంది దేశముల పాలై పోయెనని చెప్పెను. చక్రవర్తి, సరే, నీ చరిత్రము పిమ్మట విమర్శింతుము. నీపీఠముపైఁ గూర్చుండుము. అని నియమించెను. అల్లుఁడును. కొడుకును ఆపీఠమును జేరియున్న పీఠములపైఁ గూర్చుండిరి, రతియు, ధర్మరతియుఁ జక్రవర్తి యానతి వడువున నాసభలోనే యొకమూల స్త్రీలకు నిరూపింపఁబడినగదిలో వచ్చి కూర్చుండిరి.

అప్పుడు చక్రవర్తి అగ్నివర్మను, సురసను, దేవవర్మను, అల్లుని బిలిపించి సీతముదాపునకు రప్పించుకొని వారువారుజెప్పిన సాక్ష్యములును మాటలును వ్రాసికొని వెనుక వ్రాసినవానితో సంప్రతించి పరస్పరభేదముల నిరూపించుచు సామంతరాజుల నుద్దేశించి యిట్లనియె. ఓమహామతులారా! మీరందరు వీరిచెప్పిన మాటలన్నియును వింటిరిగదా! గ్రామాధికారియు మండలాధిపతియు దేవవర్మయు నీయల్లుని నిరపరాధిగా నెంచిరి. సురసయందే తప్పున్నదని నిశ్చయించిరి. అందులకుఁ దగిన సాక్ష్యమేమియుఁ గనంబడదు. దేవవర్మకూఁతురు యమున తండ్రికి గుప్తముగానల్లుని సురస ప్రార్థించిన విషయము జూపినట్లుగాఁ జెప్పుచున్నారు.

ఇది యొక్కటమే సురస యపరాధనియని తెలియఁజేయు చున్నది. అగ్నివర్మ యల్లునివరించి యమున యిట్టి కృత్యఁజేయుచున్నదని చెప్పుచున్నాఁడు. కావున నిందలి నిజానిజంబులు మీరే విమర్శించి మీకుఁదోచిన సంగతులు రేపు చెప్ప వలయునని యానతిచ్చి చక్రవర్తి యంతటితో సభచాలించెను.

అందరును లేచి తమతమ నెలవులకుం బోయి యావిషయమే విమర్శించుచు దేవవర్మయొద్దకు వచ్చి తమకు దోచిన విషయముల నడుగుచు నగ్నివర్మను శంకించుచుఁ బలుదెరంగులఁ దలంచుచు నా రాత్రి వేగించిరి,

మరునాఁడు యథాకాలమునకు నృపతులందఱు సభనిండించిరి. చక్రవర్తి భార్యతోఁగూడ సింహాసన మలంకరించినతోడనే రాజులందఱులేచి నమస్కరించిరి. పిమ్మటఁ జక్రవర్తి లేచి నిలువంబడి ఓమహాశయులారా! రాత్రి చక్కఁగా విమర్శించి యుందురు. మీకుఁ దోచిన న్యాయంబుల జెప్పుఁడని యడిగిన నేమనిన నేమి యపరాధ మోయని భయపడుచుఁ దొలుత నెవ్వరును మాటాడిరికారు.

అప్పుడు వజ్రదత్తుఁడు లేచి మహారాజా! దేవవర్మ యబద్ధమాడువాడుకాడు. తాను గన్నులారఁ జూచితిననియుఁ జెవులారావింటిననియుం జెప్పుచున్నాఁడు. అతని మాట లేల నమ్మఁగూడదు?

అతండు బ్రాహ్మణపక్షపాతియైనట్లు మొదట గ్రామాధికారి పైన మండలాధిపతిపైనను వ్రాసిన వ్రాతలే చెప్పుచున్నవి. తనమనసునకు నచ్చినంగాని యట్టితీరుపు చెప్పఁడు. కావున సురసయే దోషురాలని నాకుఁదోచినదని చెప్పెను. చక్రవర్తి యభిప్రాయమెట్లున్నదో యట్లు చెప్పవలయునని కొందఱు తలంచిరికాని యతనిహృదయ మెవ్వరికిం దొరకినదికాదు వజ్రదత్తుఁ డేమియో తెగించి చెప్పెను. కావున నతనితో నేకీభవించితిమని పెక్కండ్రుచెప్పిరి.

దేవవర్మయందు వైరముగల మఱికొందరు రాజులు దేవవర్మకు నల్లునియందుఁ బక్షపాతముండక మానదు కావున నతనిమాటలు మన్నింపవలసినదికాదు ఇతరసాక్ష్యము లేదు. సురసదే న్యాయము అల్లుఁడే యపరాధియని చెప్పిరి.

అప్పుడు చక్రవర్తి వజ్రదత్తుంజూచి నీవు లెస్సగాఁ బలికితివి గాని నీకు సంతతి కలదా! యని యడిగిన నతండు మొగమున వెల్లదనంబు దోప మహారాజా! కలిగినను లేనివాఁడనైతిని. జంగమదాసను కొమరుఁడుదయించెను. వాఁడు గురుతిరస్కారంబుజేసి వెఱ్ఱివాఁడై దేశముల పాలై తిరుగుచున్నాఁడు. దేశమంతయు వెదకించితి ఎందును వానిజాడ గనఁబడలేదని తనకథ యెఱింగించెను.

పిమ్మట, చక్రవర్తి పీఠమునుండి లేచి యోభూపతులారా? ఇంతదనుక మీమీ చరిత్రము లన్నియుం జెప్పితిరిగదా? నేనెవ్వఁడనో యెట్లుమీకుఁ జక్రవర్తినైతినో మీరునుం దెలిసికొనఁ దగినదియేకదా వినుండు. భగవంతుని విలాసితములు కడువిచిత్రములు తృణమును మేరువునుగా, మేరువును తృణముగాఁ జేయుచుండును.

శ్లో॥ మజ్జత్వంభసి యాతుమేరుశిఖరం శత్రూన్ జయత్వాహవే
వాణిజ్యం కృషిసేవనాది సకలా విద్యాః కలాః శిక్షతాం
ఆకాశం విపులం ప్రయాతు ఖగవత్కృత్వా ప్రయత్నం పరం
నాభావ్యం భవతీహ భాగ్యవశతో భావస్యనాశః కుతః॥

సముద్రమున మునింగినను మేరుశిఖర మెక్కినను శత్రువుల జయించినను వర్తకము జేసినను వ్యవసాయరతుండైనను సర్వవిద్యలు నభ్యసించినను పక్షివలె నాకాశములో నెగిరినను రానియర్థంబు లభింపనేరదు. పూర్వపుణ్యము మంచిదైయెవడో అడవిలోనున్న బ్రయత్నమేమియుం జేయకపోయినను దైవము నోటి కందిచ్చును. ఇందులకు నాచరిత్రమే దృష్టాంతము వినుండు.

నేసి వజ్రదత్తుని కుమారుండ. ఆయన జెప్పిన వడువున జంగమదేవర వరంబునం జనియించితిని. యౌవన మదంబునం దండ్రి చెప్పిన చొప్పునం జేయక యాజంగమదేవరం దిరస్కరించి శాపగ్రస్తుండనై ముష్టియెత్తుకొనుచు దేశాటనము చేయుచుంటిని. అట్లున్నను నా చంద్రగుప్తుడు కనిష్ఠపుత్రిని విరతిని నాకిచ్చి పెండ్లి చేసెను. చూచితిరా. దైవమహిమ.

నేనా విరతి మొగము విరతి నామొగము జూచి యెఱుంగము. నేను బోడి యల్లుండని బావయనియుం జెప్పికొనుటతప్పు గానెంచిమా యిద్దరిని నాబుద్ధిమంతు లిద్దరు నొక యర్ధరాత్రంబునం బరిజనులచే నూరు దాటించి యడవిలో విడిపింపంజేసిరి. అప్పుడు మే మొకరి నొకరు బలకరించుకొనలేదు. నాకు మతిపోవుటచే వెఱ్ఱివాండుం బలె నా అబలవెంటం బోవుచుంటిని.

పోవంబోవ దన్మహారణ్యములో నొక పర్వతప్రాంతమునం భంకవేగుండను భూతరాజు వసియించు చోటికిం భగవంతుండు లాగికొనిపోయెను మేమా చెట్టుం గిందం బండుకొనియుండగా నాభూతదంపతులువచ్చి రాత్రిపైం గూర్చుండి యాహారము దొరకక పరితపించుచు నీ సురసకథ జెప్పికొనిరంట.

పిశాచభాష గురుతెఱింగిన విరతి వారి పరిదేవనమువిని తన్నుం భక్షింపుమని వారియెదుటికిం బోయి కోరినది. ఆభూతదంపతు లామెమాటవిని వెరగుపడుచు నీవెవ్వతెవు? ఇచ్చటి కెట్లువచ్చితివని అడిగిరి. విరతి జరిగిన తనవృత్తాంతమంతయు జెప్పినది భూతపత్నికిం జాందయగలిగినది. దాపువనే చెట్టు క్రింద నిద్రించుచున్న నాయొద్దకు వచ్చి యాభూతకాంత నావృత్తాంత మడిగి తెలిసికొని జాలిజెంది మాకత్యం తైశ్వర్యము గలిగింపుమని తనభర్తం బ్రార్థించినది.

అప్పుడా భూతరాజుసూర్యవర్మకు దేవవర్మకు జరుగుచున్న రాత్రియుద్ధములో సేనలతో గూడ రాజుల బెక్కండ్ర రూపుమాపి సూర్యవర్మం జంపి తత్కళేబరముల గుదెంగావైచి తన నెంపునకుం దీసికొని యారాత్రి భుజింపుచుండెను.

చంద్రగుప్తుని కుమారుండు కుసుని నల్లుడుసుకుమారుని నొకేంంకెవైచి యొక

చెట్టుకొమ్మకు వ్రేలాడవైచి మిగిలిన శవముల దినుచున్న సమయంబున విరతి వారి
జీవములతో నున్నవారిగా దలంచి మెల్లనఁ బోయి భూతరాజునకుఁ దెలియకుండ వారి
పాదములగట్టులు విప్పి యవ్వలకు సాగనంపినది వారెవ్వరో యెఱుఁగదు వారువెళ్ళు
నప్పుడొక యుంగరమా విరతికి గురుతుగా నిచ్చిపోయిరి. ఇదియే యాయుంగరము.
అని సభ్యులకడ యిచ్చెను వానింజూచి యందఱు విస్మయ మభినయించుచున్నారు.
అమ్మరునాఁడే యాభూతరాజు మా యిద్దరిని తన భుజముపై నెక్కించుకొని వచ్చి
యీ సింహాసనమునఁ గూరుచుండఁబెట్టి చక్రవర్తినని చాటించి తన నివాసమునకు
బోయెను.

భూతపత్ని నావృత్తాంతమడిగినప్పుడే నాకంతయుస్ఫురించినది. మఱి యథాగ
తము వచ్చినది. మునుపుగలిగిన గరువ మంతయు నటమటమై పోయినది. నాఁటి
సుతనే నీరాజ్యము పాలించుచుంటిని చంద్రగుప్తుఁడు నాకు మామగారు సుకుమా
రుఁడు తోడియల్లుఁడు రతి వదినగారు ధర్మరతిం దిరస్కరించి కామక్రోధాదుల
మనుష్యుని కవశ్యముండవలసినదనియుఁ బురుషకార్యమె ప్రధానమనియు వాదించు
టచే నిట్టి యిడుములం బడిరి.

అల్పుఁడన చంద్రగుప్తుని పెద్దకుమారుఁడు లవుఁడు లవశబ్దమున కల్పార్థ
మున్నది కావున నట్టిపేరు పెట్టుకొనియెను. అతఁడు కడు మంచివాఁడు. అంతర్ము
ఖుఁడు సురస వానిని వరించినది అంగీకరింపమింజేసి యెదురు వానినే అపరాధిగాఁ
జెప్పినది. స్త్రీలెట్టి ఘోరకృత్యములకైన సాహసింతురు యమున స్త్రీయే కావున
నాగుట్టు గ్రహించినది.

వారిమూలముననే కదా యీ ఘోర సంగ్రామము జరిగినది. దేవవర్మ కడు
ధర్మాత్ముఁడు ధర్మము జయింపకపోవునా! అధర్మమెప్పటికి నిలువదు. విశోకుఁ
డన్యాయమార్గవర్తి వాఁడు రాజ్యార్హుఁడుకాఁడు. రాజు ప్రజలకు దైవమువంటి
వాఁడు. వానియందు దుర్గుణము లేమియు నుండఁగూడదు వికటదంతుడు రాజ పురో
హితుఁడై కృతఘ్నత్వమున నతని రహస్యము బయలుపరచెను. వాని లోకములో
నుంచఁదగినదికాదు. కావున మీరెల్లరు సత్యమునకు ధర్మమునకు బద్ధులై పూర్వాచార
ముల మన్నించుచు రాజ్యములు సేసినచో నుభయ లోకములయందు సౌఖ్యముల
నందుదురు. ఇదియే నా వృత్తాంతము అని కన్నుల నానందబాష్పములు గ్రమ్మ
నుపన్యసించి పీఠముదిగ్గ నురికిఁ దండ్రియగు వ్రజదత్తునకు జంద్రగుప్తునికి నమ
స్కారములు గావించి బావలనాదరించి బంధువుల గుర్తించి యానంద సముద్రములో
నోలలాడెను.

అప్పుడు కుశుఁడును సుకుమారుఁడు లజ్జావనతముఖులైవారు గావించిన
అక్రిమమునకు వగచుచుండిరి. లవుఁడు తండ్రికి నమస్కరింపుచు జనకా! మాత
మ్ముడు నాస్తికుఁడు ఇప్పటికైన బుద్ధివచ్చినదేమో యడుగుఁడు, నాఁడు నాతో

నక్రమవాదము గావించెను నాకేమి కొదవ వచ్చినది. విరతి సుగతుం బెండ్లియాడి నది. అతండు చక్రవర్తియయ్యెను వారిద్దరిని రహస్యముగా నడవికిఁ ద్రోయించెను. అదియే వారి కుపకారమైనది పరమేశ్వరుని విలాసము లెవ్వరు దెలిసికొనఁగలరు? అని యెత్తిపొడిచిన విని చంద్రగుప్తుడు లవునాలింగనము జేసికొని బాబూ మేమందరము జ్ఞాన లవశూన్యులమైతిమి నీవును విరతియు మీతల్లి యుజ్ఞానియుక్తులై వైభవంబు బడసితిరి. మీ మాటలయందిప్పటికి నమ్మకము గలిగినది. నీవింటికివచ్చి రాజ్యము గావించుకొనుమని బోధించిన నతఁడు తండ్రీ నన్ను కుశుఁడు రాజ్యలోభం బున నగరము వెడలఁగొట్టెను అందులకు నాకించుకయు నీసులేదు మామగారి రాజ్యము నాకుఁగలదు. కుశునికే పట్టాభిషేకము గావింపుఁడని బోధించెను.

అప్పుడు రాజులందఱు సుగతుని స్తుతియించుచు నతని యనుమతి వడసి తమతమ నెలవులకుంబోయిరి. సుగతుఁడు విరతితోఁగూడ చక్రవర్తియై న్యాయం బునఁ బ్రజలం బాలించెను. కుశలవులు దండ్రి యనుమతిని వేరియొక రాజ్యమునకు నధికారులై పాలించిరి.

చంద్రగుప్త వసుమతిని గుహుఁడింటికి బోయిన వెంటనే పురోహితుండైన వికటదంతుని నడివీధి మంటపములో నిలువంబెట్టి యావీధిని వచ్చుఁబోవువారిచేత వాని మీఁద నుమ్మివేయునట్లు నియమించెను. కృతఘ్నునకు వేరొకనిష్కృతిలేదుగదా? ఆపురోహితుండు కాలధర్మము నొందిన పిమ్మట వానిరూపము శిలయందు జెక్కించి యానడివీధిలో నిలిపి యట్లె యుమ్మివేయించుచుండెను. నీవుచూచినది వికటదంతుని రూపము అతండు కృతఘ్నుఁడై యట్టి యవమానమునకుఁ బాత్రుండయ్యెఁ దెలిసి నదియా అని అడిగిన గొల్లవాఁడు స్వామీ! తెలిసినది. ఇందలి నీతి లోకులకుబుద్ధిజెప్పు చున్నది. వినుండు కుశుఁడును రతియు లవవిరతుల నాక్షేపించుటచే నత్యంతావమానము జెంది వారిచేతనే కష్టవిముక్తి వడసిరి. కుశుఁడు దుర్మంత్రిముజేసి సుగతునితో విరతి నడవుల పాలుచేసెను. అదియేవారి కుపకారమై భూతదంపతులదర్శనలాభంబున మహారాజ్యవైభవము లభింపఁజేసినది. మంచిదినములలో నపకారముజేసినను నుపకార మగుననుసామెత దీన దృఢ మగుచున్నదికదా? దేవవర్మ ధర్మమునే నమ్మి పాలించు చుండుటచే బ్రబలశత్రువు లతనిమీఁదకువచ్చి యగ్గిబడిన మిడుతవలె మ్రండిపోయిరి. రతివిరతి మూలముననే ధర్మమతియైనది. అన్ని దోషంబుల కంటె పెద్దదియగు కృత ఘ్నదోషము వికటదంతుని చిరకాలము బాధించుచున్నది. ఏపాపమునకైన నిష్కృతియున్నది. కాని కృతఘ్నునికి నిష్కృతి లేదని పురాణములు ఘోషింపు చున్నవి.

శ్లో॥ మిత్రద్రోహీ కృతఘ్నశ్చ నృశంసశ్చ నరాధమః।
క్రవ్యాదైః క్రిమిభిశ్చాన్యైర్నభుజ్యంతేహితాదృశాః॥

కం. వినుమిత్రి ద్రోహికృత
ఘ్నుని ఘాతుకు వేనిమాంసకోశంబు లహా!
దినవంట క్రవ్యాదములై
చనుకీటక కాకశునక జంబుకములిలన్.

ఇన్ని నీతులు కథవలన దెలిసినవి. అని చెప్పిన సంతసించుచు వాఁడు అయ్యవారికి నమస్కరించెను.

గురుశిష్యు డా నా డందు వసించి మఱునాఁడు తదనంతరావసథంబు జేరిరి.

చ. అమితమతిప్రభావ సుగుణాన్విత నాయక నాయకీ కథా
క్రమ సుమనోహరంబయి ప్రకాశిలు సప్తమభాగమార్య స
త్తముల కృపన్ రచించి విదితం బొనరించితి లోగనాద్రి వ
స్త్వమృత మయూఖనంఖ్యనగు నట్టి శకంబున రౌద్రియన్‌సమన్.

క. జగదీశ సర్వమంగళ
త్రిగుణాతీత ప్రభావ దేవకిరీట
స్థగితమణి ఘృణిలసత్ప ద
నిగ మాంత స్తుత్య నిత్య నిర్మలతేజా!

క. జలదము లతి వర్షింపఁగ
నిల సస్యసమృద్ధమై ఫలించుతసుఖులై
వెలయుదురు గాక ప్రజలీ
తుల బాధలులేక ధనతతులఁ దులదూగగన్.

శ్లో. గృహేకించిన్నేతి ప్రవదతి:కళత్రం ప్రతిదినం
తమేనార్ధం భ్రూతెన్నపతి రపియత్నె నమహతా
అధీతె వేదాంతశ్రుతి రపితనేవార్థ మదవతీ
నిరాలంబో లంబోదర జననికం యామి శరణం॥

గద్య. ఇది శ్రీమద్విశ్వనాథసదను కంపాసంపాదిత కవితా
విచిత్రాత్రేయముని సుత్రామ గోత్రపవిత్ర మధిరకుల
కంశజలనిధీ రాకాకుముదమిత్ర లక్ష్మీ నారా
యణ పౌత్ర కొండయార్యపుత్ర సుకవిజ
నాభిరంక్షిత సుబ్బనదీక్షితకవి విర
చితంబగు కాశీయాత్రా
చరిత్రంబున సప్తమభాగము.
శ్రీ విశ్వనాథార్పణమస్తు.




శ్రీరాఘవేంద్రా ప్రింటింగ్‌వర్క్సు, విజయవాడ-1, ఫోన్‌నెం: 68891.

